సీ. పద్మాప్తగతి వహింపఁగలాఁడు గావున, మొనసి పద్మాప్తాభిముఖ్య మూని
మకరసంగతి మీఁద మనుఁ గాన మకరభీకరజలాకరతరంగముల నాని
ఘనవిభావసుసమగ్రత ముందరికిఁ గాంచ, ఘనవిభావసుమధ్యగత్వ మొంది
యతనువర్ధనమైత్రి నలరఁ బోయెడుఁ గాన, యతనువర్ధనవృత్తి యవధరించి
తే. ఘోరతపములు సేసిమిక్కుటపుమహిమ, లవధరించినమునులు ప్రియాసమనుచు
వర్ణనలొనర్పఁ ద్రిసహస్రవత్సరములు, దపముగావించె విశ్రవస్తనుభవుండు.
వ. అంత. 220
సీ. ద్వాదశద్వాదశాత్మకకిరీటమణిప్రకాండదీధితులు లేయెండ గాయ
భాషాబ్జపత్త్రదృక్ప్రత్తాతపత్రముల్, స్థిరశరచ్చంద్రచంద్రికల నీన
సురనదీతటిదురుస్ఫురణతోఁ దనతనూ, వరరుచుల్ బంగారువాన గురియఁ
బ్రగుణాగమశ్రీలఁ దగుఋషుల్ గిసలయో, జ్జ్వలజటాగ్రములనంజలులు దాల్ప
తే. గగురుపాటును వడఁకును గానిపింప, నెల్లసుమనోవితానంబు నెనసి కొల్వ
మంచుజిగిపట్టి పొగడ విరించునుండు, గరుణఁబొలస్త్యజునకు సాక్షాత్కరించె.
క. వెన్నిధివలెఁ దన కిటువలె, సన్నిధిసేసినకడానిచాయలజేజే
మన్నెదొరపెద్దఁ జూచి ప్రపన్నమతిం లేచి మ్రొక్కి భయభక్తులతోన్.

వైశ్రవణునకు బ్రహ్మ ప్రత్యక్షంబై వరంబు లిచ్చుట.

పంచచామరము. హరామరాగ్రణిస్తుతావ్యయప్రభావభాస్వరా
స్వరాదినైకలోకసృష్టిశాసనక్రియాదరా
దరాబ్జహీరహారభాస్యుదారదార ధీపరా
పరాఖ్యమంత్రభృన్మనోబ్జపద్మినీమనోహరా. 233
క. అని తనుఁ బొగడినమునుముని, వినయమునకు మెచ్చి నలువ వేఁడుము వత్సా
నిను మెచ్చితి వర మిచ్చెద, నని వచ్చితి ననఁ బులస్త్యజాత్మజుఁ డనియెన్.
తే. లోకపతి వైననిన్ను నే లోకపాలకత్వమును హైమగర్భతఁ గన్న నిన్ను
బహుధనాధీశ్వరత్వంబుఁ బ్రార్థనంబు, సేయుచున్నాఁడఁ గట్టడ సేయవయ్య.
ఉ. కామితదాయి వైననినుఁ గన్గొనినంత ననంతలోకలో
కామితచింతితార్థము లగారె లభించవె యంచు వేఁడిన
న్గామరచూలి వల్కె ధననాథపదంబు దిగీశ్వరత్వముం
నే ముద మంది నీకె కరుణించితి దేవతలెల్ల మెలనన్. 226
క. ప్రాగపరదక్షిణములకు, నీగిరిరిపువరుణయముల సృజియించి యుదగ్
భాగమున కొకనిఁ దలఁపం, గాఁ గలిగితి వీవు మేముకౌతుక మొందన్. 227
ఉ. పాలితసత్యధర్మ మగుబ్రహ్మకులంబునఁ బుట్టినట్టినం
నాలవవానిఁ జేయఁ దగునా యనఁ బోకు దిగీశ్వరాళిలో
నాలవవాఁడవై బహుధనస్థుఁడవై మను మంచు మన్ననిం

లాలన సేసి ధాత యొకసర్వవిమాన మొసంగి వెండియున్. 228

ఆ. పుష్పకాఖ్య మిది యపూర్వయానము దివ్య, పుష్పకాయమానపూజ్యమాన
మీవిమాన మెక్కి యెల్లవేల్పులలోన, నీవి మాన కలరు మింక ననుచు.

ధనదుండు దండ్రియనుజ్ఞ వలన లంకం జేరుట.

మ. సవిశేషాదరభాష లాడి యజుఁడుం జన్నన్ ధనేశుండు వి
శ్రవుఁ జేరం జని మ్రొక్కి తండ్రి భవదాజ్ఞన్ బ్రహ్మ మెప్పించి యి
ష్టవరంబుల్ గొని వచ్చితిం దగునివాసం బాయజున్ వేఁడ నై
తి వినూత్నస్థల మెయ్యది యెందు నిలుతుం దెల్లంబుగాఁ దెల్పవే. 230

ఆ. ఈతిబాధ లేక యింతైనఁ బగవారి, చేతిబాధ లేక చెలువు గలుగు
నట్టిగీము వలయు నానతి యిమ్మన్నఁ, బట్టిమోముఁ జూచి పలికె గురుఁడు.

మ. కల దీదక్షిణవార్ధిమధ్యమున లంకానామదివ్యత్పురం
బలఘుప్రాక్తటినీవిటోత్కరమణాధుర్యావార్యహర్యశ్వర
థ్యలసత్కూరఖురాగ్రసౌధగతపంకాలేపసంక్షాళనా
కలితాకాశతరంగిణీతరళరంగత్తుంగభంగాఢ్య మై.

సీ. కనకకుంభప్రభాకలన బాలార్కవిభ్రమముఁ జూపెడుగోపురములు గలుగ
భర్మభూమిధరంబు పలురూపులాయెనో, యనమించునర్మ్యహర్మ్యములు గలుగ
హీరకాంతులచేతఁ దారకావళిఁ గేరు, లసమానలీలాచలములు గలుగ
నగరీందిరాదేవి నడుముఁ బూనినకాంచి, గొమరు గాంచినపైఁడికోటగలుగ

తే. భూరివైదూర్యతోరణస్ఫురితవిపణి, మార్గములు గల్గ స్వర్గసామ్యముగ విశ్వ
కర్మ నిర్మించె నిర్మాణకౌశలమున, రాక్షసార్థంబు మున్నప్పురము గుమార.

క. ముందు ముకుందునిభయమున, నందు నిలువ వెఱచి దైత్యు లందఱు సుతలం
బొందిరి నిర్భయపద మది, సెంది సుఖంపు మని తండ్రి సెల విచ్చుటయున్.

సీ. ఉపవనీరమ మారుతోత్పతత్కుసుమరా, జీకైతవంబున సేస లిడఁగఁ
బ్రాకారలక్ష్మి వరజపుత్తాలతళుకుచేఁ, దనమేన మంచిగందంబుఁ బూయ
భర్మగోపురచరత్పారావతద్విజ, శ్రేణి పల్కులనె యాశీర్వదింప
రాజమార్గచిరత్నరత్నసౌధశ్రీలు, గడురక్తిఁ గుంకుమగాన్క సేయఁ

తే. కేళిభూభృత్పరంపరల్ కేతనాంశు, కాప్తిఁ బావడ లూన ముక్తాశ్మధామ
లలితరుచిధూతచంద్రకలంక లంకఁ రాజసమునఁ బ్రవేశించె రాజరాజు. 235

మ. ధనదుం డీగతి లంకఁ జేరి సురగంధర్వాప్సరస్సేవ్యుఁ డై
తనయాజ్ఞోన్నతి నైరృతుల్ భయముఁ జెందం దత్పురం బేలుచున్
జనయిత్రిన్ జనకుం గనుంగొనఁగ నిచ్చల్ పుష్పకారూఢుఁ డై
చనుచుం గ్రమ్మఱుచున్ సుఖంచె నతులైశ్వర్యం బవార్యంబుగన్. 236

తే. అని యదంభవచోనిగుంభనలఁ గుంభ, సంభవుండు పులస్త్యవంశక్రమంబు

గొంత దెలిపిన విని శ్రీరఘుప్రవీరుఁ డిట్లను నాశ్చర్యధుర్యుఁ డగుచు.

రాక్షసవంశోత్పత్తిక్రమము.

శా. ఓవింధ్యాచలగర్వనిర్హరణయోగోద్యోగ పూర్వంబు లం
కావాసంబు సురారినాథులనికాయ్యం బంచు మీ రానతీఁ
గా విన్నప్పటినుండి చిత్రరసశంకాసంకులం బయ్యె మ
ద్భావం బంతకు మున్న తాదృశబలుల్ దైతేయు లెవ్వారొకో. 238

ఉ. ఆది పులస్త్యవంశభవు లాసురముఖ్యు లనంగ వింటి నే
తాదృశరాక్షసాధికులు దానవు లంతకు మున్నె లంకలోఁ
బాదుక యుండు రం చిపుడు పల్కితి రీదశకంధరప్రహ
స్తాదులకంటె వీరవరులైన సురారులు వార లెవ్వరో. 239

ఉ. వారికి వంశకర్త యగువారి తెఱంగులు వారిపేరులున్
వారిబలోన్నతుల్ పిదప వారు ముకుందున కోడి లంకకుం
జేరక పోవుటల్ జటిలశేఖర తెల్పుము విస్తరించి నీ
చారుసుధారసోపమవచఃకలనం జెవు లింపుఁ జెందెడిన్. 240

ఉ. భానునిచే మహాతమము వాయు తెఱంగునఁ బాయు మాదృశా
జ్ఞానము మిమ్ముబోఁటిబుధచంద్రులచే నని జానకీబహిః
ప్రాణము రామభూవిభుఁడు ప్రశ్న మొనర్ప దరస్మితంబుతోఁ
దా ననియెం దథావిధకథావిదుఁ డమ్ముని సమ్మదమ్మునన్. 241

మ. రవివంశోత్తమ సంశయం బయినచోఁ బ్రశ్నంబు గావింప నే
ర్తు వినన్ నేర్తువు సావధానముగ నీ స్తోత్రంబు సేయంగ మా
కు వశంబే పరమేష్ఠినుండియును రక్షోవంశ మాద్యంతమున్
వివరింతున్ విను మం చగస్త్యుఁ డనుఁ బ్రావృట్కాలమేఘార్భటిన్. 242

మ. హరినాభీకుహరారవిందమకరందానందనేందిందిరం
బు రహిన్ మించి విరించి యంచితతపస్స్ఫూర్తిన్ జగత్సృష్టిపై
ఖురిఁ బ్రాపించి మహాజలంబు దొలుతం గల్పించి తద్రక్షణా
కరకాంతిన్ సృజియించె సత్త్వముల సంకల్పం బనల్పంబుగన్. 243

శా. ఆసత్త్వంబులు క్షుత్తృడాతురత బ్రహ్మం జేరఁగా వచ్చి వి
శ్వాసంబుల్ గనిపించ నేమి యొనరింపన్ మమ్ముఁ బుట్టించితే
యోసామీ యిపు డేమి సేయుదుము నా నుత్క్రీశుఁడున్ నవ్వుతో
మీసామర్థ్యముఁ జూత మిజ్జలము నెమ్మిం బ్రోవుఁడీ నావుడున్. 244

మ. జలసంరక్ష యొనర్తు మంచుఁ జని యాసత్త్వావళుల్ క్షుత్తృడా
విలభావంబు సహింప కంబుహృతి గావించంగ నుంకించి యం
చల బ్రహ్మం గని కొంచి కొన్ని యనె జక్షామేతిధాత్వర్థవా

క్కలనన్ నీళ్ల వసించుకొన్ని యనె రక్షామేతివాగ్వైఖరిన్. 245

తే. అపుడు పరమేష్ఠి జక్షింతుమని పలికిన, జంతువులు యక్షులగుచుఁ బ్రశస్తిఁ జెందుఁ
డని యొరక్షింతుమని పల్కినట్టివారి, రాక్షసులు గండనుచుఁ బల్కె రఘువరేణ్య.

## హేతిప్రహేతులవృత్తాంతము.

ఆ. రామ యట్టియక్షరాక్షసకోటిలో, నెంచఁ దగినవీరు లిద్దఱైరి
యెవ్వ రన లయాగ్నిహేతిఁ బోలిన హేతి, హస్తదీప్రహేతి యగు ప్రహేతి.

క. ఖేటప్రతివీరులు మధు, కైటభనిభవిక్రమప్రకారులు పటుబా
హాటోపపేటు లాదిని, శాటులు హేతిప్రహేతు లద్భుతహేతుల్. 248

క. వారలయందుఁ బ్రహేతి యు, దారుఁడు కామాదిరిపువిదారుఁడు శ్రితమం
దారుఁడు గుణానందితబృం, దారుం డనపేక్షితార్థదారుం డయ్యెన్. 249

మ. భయదూరుం డలహేతి తాత వనుపన్ భార్యాకుమారస్పృహా
భయసంగాత్మకుఁ డౌటఁ గాలభగినిన్ భద్రేభకుంభస్తనిన్
భయ యన్దానిఁ బరిగ్రహించె దశదిగ్భాగస్ఫురన్మల్లికా
భయశశిపాండురమౌక్తికప్రతతి వైపై సేస గావింపఁగన్. 250

క. ఆశాతోదరి విద్యుత్కేశుని సంధ్యాబ్దనికటదీపితవిద్యు
త్కేశునిఁ దేజశ్శోచి, ష్కేశునిఁ గనె హేతి ప్రీతి చెన్నువహింపన్. 251

శా. విద్యుత్కేశుఁడు తోయగాంబుజముఖీవిన్ దాత్మకీర్త్యున్నతిన్
విద్యాభ్యాసివివేకమున్ బలె మహావిజ్ఞానివైరాగ్యమ
ట్లుద్యోగస్థునికల్మిలీల హఠయోగాభ్యాసియాయుర్గతిన్
ఖద్యోతద్యుతి వృద్ధిఁ బొందెఁ బిత్రురక్షుం జేసి నానాఁటికిన్. 252

మ. నవవర్షాగమజృంభితాంబుదముచందానన్ మధుస్ఫూర్జితా
టవిలీలం బటుయౌవనస్ఫురదవష్టంభంబునం బుత్రకుం
డు విజృంభించినరీతి హేతి గని సుశ్లాఘ్యప్రీతిఁ బ్రాపించి వా
నివయోరూపనిరూఢికిం దగినకన్నెం గాంక్ష గావింపఁగన్. 253

సీ. కమనీయకమలకోశములతో సమములై, కులుకుగుబ్బ మెఱుంగుగుబ్బ లమర
నసమాననీలోత్పలసమానరుచు లొంది, కలికిసోయగపువాల్గన్ను లలర
శ్రీనందనస్యందనానఁ దనరథాంగ, పటిమవిస్తృతనితంబము రహింపఁ
గంజరాగము మీఱుసంజకెంజిగి తీరు, వహియించి కెమ్మోవి వన్నె మిగుల

తే. నిరులసరులను బెన్నెఱు లిరవుకొనఁగఁ, దారకస్ఫూర్తి గన నఖోదారకాంతి
సంధ్యవలె మించు సంధ్యాత్మజాలలామఁ, బ్రియకుమారునకా హేతి పెండ్లి సేసె.

శా. ఆ తత్కాలంబునఁ జారుగాత్రి యగు సంధ్యాపుత్రిఁ బ్రాపించి వి
ద్యుత్కేశుండు శచీసమేతుఁ డగు నింద్రున్ రోహిణీయుక్తుఁ డౌ
సత్కాంతున్ గిరిజావిలోలుఁ డగు పశ్యత్ఫాలునిం బోలి య

త్యుత్కంఠోత్థరతిక్రియన్ మదనదేవప్రాప్తిఁ గావింపఁగన్. 255

ఉ. నీలపయోదయుక్చపలనీటున నాథునిఁ గూడి యొప్పునా
సాలకటంకటాయువతి స్వాతిగతాంబుదవృష్టి శుక్తియుం
బోలె నిజేశుతేజమున భూరితరంబుగ నంత గర్భముం
దాలిచి మందరాచలనితంబమునం దురుసాహసంబునన్. 256

మ. పరు లెవ్వారును గాన కుండ నిజగర్భస్థార్భకుం దద్ధరా
ధరమధ్యంబున డించి వహ్నిజనితోద్యద్గర్భభారంబు మున్
శరముం జేర్చినగంగఁ బోలి సురతేచ్ఛాలోలయై జీవితే
శ్వరుఁ జేరం జనెఁ బాప మెంచరు గదా చానల్ రఘుగ్రామణీ. 257

శా. ఆసంధ్యాతనయావిసృష్టశిశు వాస్యాంతస్స్ఫురన్ముష్టియై
యాసన్నక్షితిభృద్గుహల్ బదులు మ్రోయం గాలజీమూతగ
ర్జాసామ్యధ్వని రోదనంబు ఘటియింపన్ సాగె సింహాదినా
నాసత్త్వంబులు దద్ధ్వనిన్ బెదరి చెంతం జేర లే కేఁగఁగన్. 258

వ. అప్పుడు. 259

సీ. బలుకెంజడలతోడఁ దెలిగన్నెరులవన్నె, గలక్రొన్నెలవతంసకంబుతోడ
వలుఁదశూలముతోడ నలినుబ్బునలనుబ్బు, వెలిద్రొబ్బుగరళభృద్గళముతోడ
గిబ్బతత్తడితోడ గిరిరాజుహరిరాజుఁ, గరిరాజు నగుమేనికాంతితోడఁ
బునుకకంచముతోడ ననతూపులనయేపు, గననోపుదారబూదిమినుకుతోడఁ
తే. బ్రమథతతితోడఁ బార్వతీప్రమదతోడఁ, గరిముఖాదికుమారవర్గంబుతోడ
శివుఁడు మంథానగిరితుంగశృంగవీథిఁ, జెలువుమీఱంగ స్వారి వేంచేయునపుడు.

సుకేశుం డనురాక్షసునివృత్తాంతము.

క. వాపోయెడుసంధ్యాతన, యాపత్యముదిక్కుఁ జూచె నభవుఁడు గారు
ణ్యాపారసుధాపూరన, వ్యాపారకటాక్షవీక్షణాతిశయమునన్. 261

క. అంగజహరుఁ గని ప్రియ మెన, యంగ జగజ్జనని గిరిజ యవధారహిరా
డంగద యీపసిపాపని, యంగదఁ బాయంగఁ జేయ నర్హం బనినన్. 262

మ. ప్రియురా లాడినమాట దాఁటక పురస్త్రీచిత్రకక్షాళనా
క్షయదుగ్ధశరుండు శంభుఁడు దయాంచద్బుద్ధిఁ దద్బాలుఁ జూ
చి యమర్త్యత్వము మాతృసన్నిభవయశ్శ్రీస్ఫూర్తియున్ విశ్వది
గ్జయతేజంబు సభశ్చరత్పురముఁ గల్గంగా వరం బిచ్చినన్. 263

శా. శ్రీగౌరీజలజాయతాక్షి పలలాశిశ్రేణికిం గూర్మి స
ద్యోగర్భాతిశయప్రసూతులును సద్యోయౌవనప్రాప్తి స
ద్యోగాఢప్రతిభాపరాక్రమజయోద్యోగంబు లిచ్చెన్ లస
ద్యోగారూఢమనఃప్రసన్నుఁ డగుకాంతుం డట్టు లౌఁ గా కనన్. 264

క. దేవికి వేడుక యవు నని, దేవరయును వరము లొసఁగ దేవరఁ గనుచున్
దేవియు పాటికి బేటికి, దీపింపఁగ దైత్యశిశువు తేజము నొందెన్. 265

చ. జనని సుఖంబె కోరి కని శైలతటంబునఁ బాఱ వైచి పో
యినశిశు వేడ వానికి యతీంద్రులకుం గన రానివేలుపుల్
గనఁబడి కోర నేరఁ డని గాఢవరంబు లొసంగు శేడ య
ద్దనుజునిపూర్వజన్మసుకృతం బెటువంటిదొ కాక రాఘవా. 266

ఉ. ధారుణిలో నరక్షితుఁడె దైవసురక్షితుఁ డందు రార్య లా
వా రది యట్లు లుండె రఘువంశసుధాంబుధిచంద్ర వింటివే
యారజనీచరార్భకుఁడు నంత సుకేశుఁ డనం బ్రసిద్ధుఁడై
గౌరియు శంభుఁడుం బనుపఁగా శివదత్తపురానువర్తియై. 267

సీ. జలజాతరాగమండలపిచండిలమండ, లావిష్ణుఁ డగుభాను ననుకరించి
తపనీయదివ్యరత్నవిమానసంచరి,ష్ణుత నిర్వహించుజిష్ణుని హసించి
బహుయోజనాయతప్రథమానరథమెక్కి, చరియించుపూర్ణిమాచంద్రుఁ దెగడి
కనకాచలాంగసంగతపతంగపతంగ,వాహనుం డగువిష్ణు వైఖరి నగి

తే. గగనబహుపాద్ధరారుహాగ్రము స్వకీయ,పురమణీదీప్రవప్రగోపురవిభామ
తల్లికావల్లికాశ్రేణు లల్లికొన సు,కేశుఁ డలరారె నంబరకేశుకరుణ. 268

క. ఆమనుజాశిస్తోమల,లాముని కీర్తిప్రతాపలావణ్యంబుల్
గ్రామణి యనుగంధర్వ, గ్రామణి దిలకించి కౌతుకం బలరారన్. 269

సీ. వేణికారుచిఁ గృష్ణవిభవంబు వహియించి, ముఖదీప్తిఁ బూర్ణసోముని గ్రహించి
తనుకాంతిఁ గనకగర్భనిరూఢిఁ బ్రాపించి, స్తనలీల గిరిజాతఘనతఁ గాంచి
వరనాభిగతి దేవవల్లభోన్నతి నొంది, మధ్యరీతి ననంగమహిమఁ జెంది
కటితటస్ఫురణఁ జక్రహితాభ్యుదయ మాని, నడలచే శిఖివాహనటన మూని

తే. సౌరభంబున సుమనఃప్రసక్తి మీఱి, యఖిలసుమనోగుణంబుల నతిశయించు
దేవవతి యనుతనకన్యఁ దెచ్చి యిచ్చె, నలసుకేశాఖ్యునకు భానుకులవరేణ్య.

శా. రక్షోరాజ్యరమావధూటి యనఁగా రంజిల్లునప్పద్మప
త్త్రాక్షిం బెండిలి యై సుకేశుఁ డధనుం డర్థంబుఁ బ్రాపించిన
ట్లక్షీణస్పృహ మించె నద్దివిజకన్యారత్నమున్ నిర్జరా
ధ్యక్షుం జెందుపులోమజం దెగడె దివ్యద్భోగభాగ్యోన్నతిన్. 271

చ. కరియుఁ గరేణువుం బెనఁగు కైవడి నిచ్చలు హెచ్చుమచ్చికల్
దొరసి సుఖించువారలకుఁ దోడనె పుట్టిరి పావకత్రయ
స్ఫురణఁ ద్రిలోకసంగతిఁ ద్రిపూరుషమంత్రగతిం ద్రినేత్రువై
ఖరిఁ ద్రిగుణంబులున్ బలెఁ ద్రికాలములట్టుల మువ్వు రాత్మజుల్. 272

మాల్యవదాదిరాక్షసుల చరిత్రము.

మ. వియదంభోమరుదున్నతిన్ వెలయునవ్వీరత్రయిన్ సద్వ్రా
జియశోనిర్మలమాల్యవంతుఁ డన మించెన్ మాల్యవంతుండు ద్వి
ట్చ్ఛయసంపత్కసుమాలి నాఁ దదనుజాంచత్ఖ్యాతిఁ గాంచెన్ సుమా
లియుఁ దేజోవిజితాంశుమాలి యయి పొల్చెన్ మాలి తద్భ్రాతృతన్. 273
శా. ఆరక్షస్త్రితయం బుపేక్షితమహావ్యాధిత్రయంబున్బలెం
దారుణ్యంబు వహించి తండ్రికరణిం గాదా నెంతయున్ దేవతా
కారుణ్యంబులఁ గామితంబులు గనంగా నెంచి యంచత్తపః
ప్రారంభంబు వహించి కాంచనగిరిప్రత్యంతశైలస్థమై. 274
శా. కీలాలం బని నీరు గ్రోలరహి స్రుక్కించెం బలాశంబు లం
చాలోకించుట మానెఁ బర్ణముల మాధ్వాఖ్యం బ్రవర్తించఁగాఁ
జాలించెన్ విరితేనె చాయ దొరయం గ జన్నన్ రవిద్రోహదు
శ్శీలం బౌ నని రాక్షసత్రయి విసర్జించెం దరుచ్ఛాయయున్. 275
మ. అతిలోకం బగుతాల్మితోఁ దపము లిట్లా రాక్షసుల్ సల్పఁగా
యతిలోకం బరు దందె నంతటఁ దదీయప్రాంచితాచారసూ
నృతసంభావ్యమహాతపోజనితవహ్నిజ్వాలికామాలికా
హతి ముల్లోకములుం దపింపఁ గని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁడై. 276

మాల్యవదాదులకుఁ బ్రత్యక్షమై బ్రహ్మ వరంబు లొసంగుట.

సీ. పలలభోజనతపోనలమువేఁడిమి నంచ, తేజిబంగరుఱెక్క దేజరిల్ల
దోషాచరతపోగ్నిధూమాళి భారతీ,ధవళాక్షికొప్పుపూదండ లాన
దనుజత్రయీతపోదమునస్ఫులింగము,ల్మహనీయమకుటాగ్రమణులనొరయ
దైత్యమూర్ధన్యమూర్ధజతపశ్శిఖిశిఖా,చయముచే సావిత్రిమయి సెమర్ప
తే. సుగ్రనిష్ఠాగరిష్ఠులై యుగ్రమహిమ, నుగ్రతపములు గావించుచున్న రాక్ష
సాగ్రణుల చెంతకరుదెంచి యట్టు కాంచి, వెఱఁగుమించివిరించిదీవించి యనియె.
ఉ. ఇంకఁ బ్రయాస మొంద వలదే మిము మెచ్చితిఁ గోర్కు లిచ్చెదన్
శంకఁ దొఱంగి లెం డసురశంకరులార యటంచు భారతీ
పంకజలోచనాకచవిభాసుర కేసరవాసనాగతా
హంకరణాళిఝంకరణహారిమృదూక్తుల నాన తిచ్చినన్. 278
మ. అమృతాంభోధితరంగఘుంఘుమరవప్రోద్యత్తన్మృదూక్తిన్ గత
శ్రములై కన్నులు విచ్చి రాక్షసులు సాక్షాత్కారమై యున్నబ్ర
హ్మముఖాంభోజముఁ జూచి లేచి భయకంపావాప్తి సాష్టాంగదం
డము లర్పించి నుతించి రిట్లని లలాటన్యస్తహస్తాబ్జులై. 279
మ. పురుషుం డంచుఁ బరేశ్వరుం డనుచు వేల్పుం బెద్ద యంచున్ మహే.

శ్వరుఁ డంచుం బరమాత్ముఁ డంచు శ్రుతిశాస్త్రజ్ఞానసారీణు లే
ర్పఱుపం జాలక పెక్కుభేదముల నేకభవ్యాత్మ నూహింతు రా
పరమేశున్ నిన్నుఁ గొల్తు మేము శుభముల్ ప్రాపింప నశ్రాంతమున్. 280

శా. ఆశాస్యంబులు నీవలెన్ నతుల కీయం జాలుజేజే గలాఁ
డే శశ్వత్కృప మాయెడన్ నిలిపి తండ్రి ప్రోచెదేనిన్ సమ
స్తాశాధీశజయప్రతాపములు దీర్ఘాయుస్సదారోగ్యవి
ద్యాశాలిప్రతిభల్ పరస్పరహితత్వంబుం బ్రసాదింపవే. 281

క. ప్రభవిష్ణుల మై యెందును, నభివృద్ధి వహింతు మనుచుఁ బ్రార్థించినఁ బ
ద్మభవుం డాదరమున న,య్యభిమతము లొసంగి చనియె నాత్మీయులతోన్.

వ. అంత. 283

మాల్యవదాదులు లోకంబుల బాధించుట.

శా. భాషానాథవరప్రదానవిలసద్బాహాబలాటోపులై
దోషాటాధిపతుల్ మదాంధత సుధాంధోముఖ్యులన్ గెల్చి త
ద్యోషారత్నములన్ గ్రహించి మునులం దూలించి సాధ్యాదులన్
రోషాగ్నిం దపియింపఁ జేసి సురవైరుల్ మెచ్చ వర్తించినన్. 284

సీ. పట్టు గానక బయల్ వట్టి రాదిత్యులు, ఖచరులత్రోవలు గట్టువడియె
దీనులై గరుడులు దెస సెడి పాఱిరి, తుషితులు బడలికతోఁ దిరిగిరి
వసువులు పేదలవలె గాసిచెందిరి, గమిఁ బాసి రుద్రులు గాడుపడిరి
యడ్డగింపులకు లోనైరి మరుత్తులు, చేరిరి గిరిగుహల్ సిద్ధవర్గ

తే. లోడి గంధర్వులూడనిబాడిరచ్చ,రలకుఁ జెఱ లుప్పతిలె మహారాజికులకుఁ
గలిగెఁ దలగంప దింపనివలసపాటు, రాక్షసులు సేయురాయిడి రఘువరేణ్య.

క. నిరయగతులైనప్రాణుల, కరణిన్ రక్షకుని నొకనిఁ గనక సుకేశా
సురసుతబాధితభువనాం, తరగతు లాపదలఁ బడిరి తత్కాలమునన్. 286

శా. ఆరాత్రించరశేఖరుల్ ముగురు నిట్లాదిత్యహృద్భీకర
స్వైరస్ఫారవిహారులై తమకు భూస్వర్గంబులీలన్ మనో
హారం బౌనగరం బొనర్చుటకుఁ గా నర్థించి శిల్పప్రభా
ధౌరేయుం డగువిశ్వకర్మఁ దలఁపం దద్ధన్యుఁ డేతెంచినన్. 287

ఉ. మాల్యవదాదు లిట్లని రమర్త్యులకల్మియు బల్మి గీర్తిబా
హుళ్య మొఱంగి వారికి యథోచితగేహము లీ వొనర్పఁ బ్రా
బల్యముఁ జెందె నీచతురభావము దిక్కుల నోయిశిల్పకౌ
శల్యనిధాన మాకు నిఁక సద్గృహముల్ రచియింపఁ గాఁ దగున్. 288

మ. హిమవత్పర్వతశాఖిమీఁద నయినన్ హేమాద్రిపై నైన మం
థమహీధ్రాగ్రణిమీఁద నైనఁ గలధౌతక్షోణిభృచ్ఛృంగతుం

గమణీగోపురసౌధయూథములు గల్గన్ మాకు నిర్మింపు గే
హము లంచుఁ బచియింప నయ్యమరశిల్పాచార్యవర్యుం డనున్. 289

విశ్వకర్మ వలన నెఱింగి మాల్యవదాదులు లంకఁ జేరుట.

ఉ. దక్షిణవారిరాశితటధారుణి భాసుర మౌఁ ద్రికూటనా
మక్షితిభృద్వరేణ్య మసమానమణీమయసానుసంపదన్
దక్షిణదిక్త్రికూట మనఁ దద్గిరిశృంగమునం దొనర్చితిన్
రాక్షసులార ము న్నొకపురం బసురేంద్రునియాజ్ఞ వెంపునన్. 290

వ. అదియును షష్టియోజనవిస్తీర్ణంబును శతయోజనాయతంబును వినిర్మలముక్తాఫ లనిర్మితనర్మహర్మ్యచ్ఛవిచ్ఛటాధవళితహరిదశ్వహరిత్తురంగంబు నుత్తుంగగోపు రోపరిద్వారాంతరస్థాపితకాంచనపాంచాలికాబాలికాస్తనాంతరక్షౌమపటోత్త రీయాయితవియత్తటినీతరంగంబును వాసవకృతత్రాసనిరాశార్థవనరాశిసమానీత కలధౌతగిరిపోతతులితలలితమణిమయక్రీడాచలవిరాజమానంబును నిజవైభవా ధఃకృతసమగ్రసౌభాగ్యలక్ష్మీప్రార్థనానిమిత్తసమాగతభోగవతీపురవ్యంజకపరిఖా యితాంభోధిగతాత్మప్రతిబింబంబును శతకోటిశివాలయనీలప్రాకారజాలప్రభా భిధము ధాభ్రమరసముదయారుణకమలాయితకమలహితమండలంబును నాయ కోచితమరకతమణిమయఘననివసనకనకవసనగగనలక్ష్మీప్రకల్పితపుష్పోపహారా యితతారాప్రతానంబును వనపవనచలితలతాప్రతానపతత్ప్రసూన పరిమళ మిళితపరాగవాసితాజాండకరండంబును సమస్తవస్తువిశేషంబులకు జన్మనివా సంబు నఖిలవిభవలక్ష్మీవిలాసంబులకు వీడుపట్టునై కనుపట్టునట్టుగాఁ గంకాది శకునదుష్ప్రవేశంబును దంకాగ్రవిచ్ఛిన్నచతుర్దిశావకాశంబును నగుత్రికూట శిఖరిశిఖరప్రదేశంబున స్వర్గలోకవస్వోకసారాదిదిక్పాలపురంబులు నిర్మించియా టి తేటిసశిల్పనైపుణ్యంబు మెఱసి నిర్మించిన యాలంకాపురంబు మీకాఁపు రంబునకుఁ దగు నందు నిలువుం డని వొడియు విశ్వకర్మ వారలం గనుంగొని.

శా. లంకాదుర్గముఁ జెంది శాత్రవులకున్ లక్షింపఁగా రాక ని
శ్శంకఖ్యాతి గనం గలా రని గణించెన్ శిల్పసమ్రాట్సుధా
సంకాశోక్తుల నుత్సహించి బహురక్షశ్శ్రేణితో దోర్బలా
హంకారంబునఁ జేరి రప్పురి నిశాటాధ్యక్షు లొక్కుమ్మడిన్. 292

మాల్యవదాదులు వివాహమై పుత్త్రులం గాంచుట.

శా. ఆలేఖద్విషదగ్రగణ్యులభుజాహంకారతేజోవయ
శ్శ్రీ లెల్లం దిలకించి నర్మద యనం జెల్వొందుగంధర్వి సు
శ్రీలావణ్యగుణాభిజాత్యముల హ్రీశ్రీకీర్తులం బోల్పనౌ
స్త్రీలన్ ముగ్వుర నిచ్చె నాత్మసుతలన్ జ్యేష్ఠానుపూర్వంబుగన్. 293

తే. నర్మద వళిప్రహాసితమహోర్మికలిత, నర్మద సుపర్వసతియయ్యె దుర్మదులకు

నసురులకు నెట్లొసంగెఁ గన్యకల ననఘ, కలిమిగుణమట్టి దిక్ష్వాకుకులవరేణ్యా.

చ. మరుఁడు త్రిలోకమోహకరమాత్రనిగుంభితమార్గణత్రయుం
దరుణులు గా నొనర్చి భువనత్రయభీకరరాక్షసత్రయి
న్మరులున ముంప నంపెనొ యనం దగునజ్జవరాండ్ర ముప్పురం
బరిణయమై యమర్త్యలక్రమంబున వారు సుఖించి రెంతయున్. 295

వ. అంత. 296

క. సుందరి యనునిజసుందరి,యందుఁ గనియె మాల్యవంతుఁ డాత్మజ నొకతె
నందనుల నేడుగుర విను, మందఱనామములు దశరథాత్మజతిలకా. 297

మ. అనిశక్రోధుఁడు వజ్రముష్టియు విరూపాక్షాఖ్యుఁడున్ దుర్ముఖుం
డును సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁ డనువాఁడున్ మత్తుఁ డున్మత్తసుం
డనలానామకుమారియుం బొడమినన్ హర్షించె నమ్మాల్యవ
న్మనుజాశీంద్రుఁడు పుత్త్రవంతుఁడును సంపన్నుండు నై రాఘవా. 298

క. కేతుమతి దృజ్మిషాంగజ, కేతుమతి సుమాలిసతి శుకీవాణి తనూ
జాతలఁ దనుజాతులఁ గనె, సీతాధిప వారిపేళ్లు చెప్పెద వినుమా. 299

వ. సుప్రహస్తుం డనం దగు ప్రహస్తుండును రణస్థలాకంపనుం డగునకంపనుండును
సురవికటుం డగువికటుండును విధ్వస్తశత్రురథవ్యస్తశకటీముఖుం డగుశకటీ
ముఖుండునుం బరుషరుషానలధూమ్రాక్షుం డగుధూమ్రాక్షుండును నుద్దండ
భుజాదండుం డగుదండుండుం జతురంగబలాక్రాంతసుపార్శ్వుం డనం దగు
సుపార్శ్వుండు నశనిసంహ్రాది యగుసంహ్రాదియుం దనుప్రభాప్రహసితోద్దీప్ర
ఘనుం డగుప్రఘనుండును మాగధీభూతసురస్తవనశ్రవణసముద్భాసకర్ణుండగు
భాసకర్ణుండునుం బుట్టి దిట్టతనంబుం జేపట్టి రట్టడిపీరులకుఁ దోఁబుట్టువు లై
రాకయుం బుష్పోత్కటయుం గైకసియుం గుంభీనసయు ననం దగుకన్నెలు
చెన్ను వహించి రంత. 300

మ. వసుధావ్యాపశమాంబుదప్రతిమదీర్వ్యగ్గాత్రుఁ డమ్మాలియు
న్వసుదారిద్ర్యయుతుండు పెన్నిధులఁ జెందం గోరుచందంబునన్
వసుధాభామినిఁ గూడి శౌర్యనిధులన్ వాంఛించి విద్విడ్విభా
వసుదాయాదులఁ గాంచెఁ బుత్త్రులఁ జతుర్వారాశిసంకాశులన్. 301

క. నరసుం డనలుఁడు ననిలుఁడు, హరుఁడున్ సంపాతి యనఁగ నల్లనలువురుం
బురుషార్థంబులవలె నొప్పిరి రాఘవ వారె కద విభీషణుమంత్రుల్. 302

మ. ఇటు లమ్మాల్యవదాదు లాత్మజులతో నింద్రాదిదిక్పాలకో
త్కటసంపద్గరిమంబుతోఁ ద్రిభువనత్రాసప్రదోద్యద్భటో
ద్భటధాటీఘటితార్భటీపటిమతోఁ దా రందఱుం గూడి ము
న్పటిలీలన్ గరుడోరగామరమునీంద్రశ్రేణి బాధింపఁగన్. 303

సురలు మునులు శివునిపాలి కరిగి యసురులం బరిమార్ప వేఁడుట.

ఉ. వారియుపద్రవంబున నివారితవైభవులై సమస్తబృం
దారకులుఁ వసింపఁ దగుతా విఁక నెయ్యది యేది త్రోవ యే
వారికి విన్నవింపుదము వైరులరా యని చింతఁ జేసి యి
బ్బారి పురాపహారి యెడఁ బాపఁ గలాఁ డని నిశ్చితాత్ములై. 304

తే. శ్వేతరుచిభూతిఁ దగిభవ్యశృంగకలనఁ, దనరిగజముఖసంయుక్తిఁ గనియనంత
పాదకటకాప్తి నెంతయు బాగు మీఱి, శివునివలె నున్నకైలాసశిఖరిఁ జేరి.

సీ. అహిరాజభూషణుం డైనయీవేల్పుమా, యహిభయం బేరీతి నడఁచు ననక
యెపుడుఁ గుత్తుక విషం బిడుకొనిమాటాడు, నితనిమాటలు నమ్ము టెట్టు లనక
తనవారితనముతోఁ గనుఁ బుణ్యజనుల నీ, యనపుణ్యజనవైరి యానె యనక
త్ర్యంబకుం డితఁ డనేకాంబకుల్ దేవతా, రిపు లెట్టు వారి నిర్జించు ననక

తే. యలసుకేశకుమారసంహారమునకు, నెట్టు లొడఁబడు నితఁ డనకేంద్రముఖ్యు
లటుల యాపన్నులై భద్రవటమునీడ, నిందుకొలువున్న పార్వతీనేతఁ గనిరి.

క. కనివినయము భయమును బెనఁ, గొనఁ గరములు మొగిచి శివునకును బహుసాష్టాం
గనమస్కృతు లొనరిచి యిట్లని పొగడిరి మునులఁ గూడి యమరేంద్రముఖుల్.

మత్తేభగర్భితసీసము.

అ (భవకందర్పమదాపహానలదృశా, పద్మారికోటిప్రభా) జోహారు
సు (కవిసంస్తుత్యరజోగుణేతరమతీ, గౌరీవధూనాయకా) జోహారు
ప్ర (భవకుంభీంద్రవిభంజనక్రమహరీ, బ్రహ్మాదిదేవాధిపా) జోహారు
త్రి (భువనాధీశ్వర దేవసంయమిమనసి, పూజావిధేయాత్మకా) జోహారు

తే. చంద్రశకలశిరోవతంసక జోహారు, సురధరాధరకోదండధర జోహారు
శరధికన్యామనోహరశర జోహారు, ప్రణతరక్షావిచక్షణేక్షణ జోహారు. 308

చ రతిపతివైరి శంకర పరాకు సుకేశసురారినందన
త్రితయముచేతిబాధ నతిదీనుల మై గతి మాలి లోకసం
తతులకు దిక్కు నీ వగుటఁ దావకపాదము లాశ్రయింప వ
చ్చితిమి దయాప్రసక్తి మముఁ జేకొని విన్నప మాదరింపవే. 309

ఉ. కాలిచి రాశ్రమావళులఁ గార్ముకముక్తశరాగ్నికీలలం
బ్రోలిచి రెల్లదేవతల భీరులఁ జేసిరి సిద్ధముఖ్యులం
దాలిచి రుగ్రరూపములు దైవగృహాంతరగోపురాదులం
గూలిచి రేమి చెప్పఁగము క్రూరసురారులచెయ్వు లీశ్వరా. 310

సీ. పద్మాసనస్థులై ప్రణవంబు నొడువుచు, ముక్కుఁ బట్టఁగఁ బాసె మునివరులకు
నేపట్లనైన స్వాహాపూర్వముగ హవ్య, మగ్ని వేల్వఁగఁ బాసె యజ్వలకును
హవిరన్నకాంక్ష నేసవనకర్తృగృహంబు, దేఱి చూడఁగఁ బాసె దేవతలకు

గుహలలో నొంటిగాఁ గూర్చుండి నీపాద, చింత సేయఁగఁబాసెఁ సిద్ధులకును
తే. జేరి గురుకులవాసంబుఁ జేసి శ్రుతులఁ, జదువుకొనఁబాసెఁ బ్రహ్మచారులకును
బార్వతీనాథ మాల్యవత్ప్రముఖదైత్య, శేఖరులు సేయునాజ్ఞానిశేషమునను.
ఉ. ఏమె యజాచ్యుతేశ్వరుల మేమె దినేశహుతాశనక్షపా
కాముల మేమె యింద్రయమకంధివరేణ్యుల మంచు భీమసం
గ్రామకుతూహలంబున జగత్త్రయముల్ బడలించురాక్షస
గ్రామణులన్ హరించి మముఁ గావఁగదే శివ యంచు మ్రొక్కినన్. 312
శా. ఆముక్కంటి దరస్మితంబున సుపర్వాధీశులం జూచి మీ
తో మోమోటము లేక తెల్పెద నవధ్యుల్ రాక్షసుల్ వారలన్
నే మర్దింపఁగ నోప వారిఁ గెడపన్ నేర్చున్ ముకుందుండు మీ
రీమంత్రం బెద నమ్మి శౌరిఁ గనఁ బొం డిష్టార్థముల్ సేకుఱున్. 313
క. దితిజాహితుచేఁ దక్కఁగ, నితరులచేఁ జెడరు వార లిది నిజ మని య
య్యతనుహరుం డాడిన నా, శ్రితహిత మొనరింప మీకె చెల్లు నటంచున్.

ఇంద్రాదులు విష్ణువుకడ కేఁగుట.

శా. ఆకైలాసనివాసు వీడుకొని కార్యైకాతురత్వంబునం
బాకార్యాదులు వ్రాయి బాడబశిఖాప్రజ్వాలికాసంగతిం
బైకిం బొంగుచు ఫేనమాలికలతోఁ బల్మోఁతయుం గన్నక్షీ
రాకూపారముఁ జేరి తజ్జలధిమధ్యద్వీపదేశంబునన్. 315
సీ. కడలిరాయఁడు మిన్నగలమిన్నగమి డాఁప, ఘటియించుబంగారుకణఁజమనఁగ
జలధిమధ్యమునందుజనియించినసహస్ర, పత్త్రశోభితహైమపద్మ మనఁగఁ
దెలిదీవిపుడమిముద్దులగుమ్మ నిజవల, గ్నమునఁ బూనుసువర్ణఘంట యనఁగఁ
బాథోధిసుతవీడు పట్టుచొక్కపుగుడా, రంపుహాఁబట్టుసరాతి యనఁగ
తే. నలువమీఱినవైకుంఠనగరిపసిఁడి, కోటఁ బొడగాంచి మ్రొక్కుచుగోపురంబు
దఱియఁజొచ్చి మహోన్నతగరుడకేతు, రాజి నలరారుహరిహజారంబుఁ జేరి.
చ. తెలిమగరాతికంబములఁ దీఱినబంగరుకీలుబొమ్మగుం
ఫులకు మెఱుంగుఁగొప్పుసాలపుల్ మొలపించెడుకప్పురాలలో
పలఁ గలకల్వచప్పరపువన్నెలఁ జెన్నగునొక్కమేడలో
నలరుచు నేకతంబ కొలువైనహరిన్ విని రాదిశాధిపుల్. 317
క. విని సమయ మానొ కాదో, యని యించుక నిలిచి యచట నవసరపుఁజెలిం
గని స్వామికి మాయాగతి, వినిపించం దగు నటంచు వేఁడిన నదియున్. 318
సీ. తిలకంబు దిద్ది దిట్టతిఁ జూడుఁ డనురమా, సుదతిచెక్కుల నీడఁ జూచువాని
మొనపంటమడుపువేఁడినసీళయొనఁగనం, దుచుఁ జుఱుక్కనమోవినొక్కువానిఁ
దనచిన్నెలకును జక్కనిమొగం బటు వెట్టు, కొనినభూసతి వేఁడుకొనెడువాని

వారియింతులకు మఱువాదు తాన ఘటించి, నలి రేఁగి పోరాడ నవ్వువాని
తే. నిచ్చఁ బరిపూర్ణకాముఁడై హెచ్చువాని
నచ్యుతునిఁ గాంచి మ్రొక్కి యింద్రాదిసురులు
దేవ యరుదెంచినా రంచుఁ దెలిపినంత
శీఘ్రమునఁ దోడి తెమ్మని సెల వొసంగె. 319
క. ఆవిశ్వంభరుననుమతి, దౌవారికు లేఁగి పనుపఁ దత్పరమతులై
దేవతలు సన్నిధికిఁ జని, సేవించిరి శుక్రశిష్యజిష్ణు విష్ణున్. 320
వ. ఈచందంబున శంఖచక్రగదాశార్ఙ్గనందకధరుండును భక్తజనానందకరుండును నగునద్దయాకరునకు నభివందనంబు లొనర్చి బృందారకు లిట్లని యభినందించిరి.

దేవతలు మాల్యవదాదిరాక్షసోపద్రవమును విష్ణువుతో విన్నవించుట.

సీ. దండంబు శార్ఙ్గకోదండోగ్రకాండప్ర, కాండఖండితదైత్యకాండ నీకు
జోహారు మదగజద్రోహిగ్రహావహ, గ్రాహచ్ఛిదాహవప్రోత్సాహ నీకు
వందనం బరవిందమందిరామందిర, త్సుందరోరస్స్థలాలింద నీకు
జేజే హరాజాదిరాజీవపూజాస, మాజోచితాంఘ్రిపంకేజ నీకు
తే. బహుళనమస్కారములు చక్రపాణి నీకు, నైకసాష్టాంగములు జగన్నాథ నీకుఁ
బ్రణతిశతములు సురసార్వభౌమ నీక, నంతసేవాంజలులు సదానంద నీకు.
ఉ. దానవవీరవైరి యవధారు సుకేశతనూభవుల్ మహో
గ్రానలదీప్తవిగ్రహు లుదగ్రులు ముువ్వురుఁ గూడి లోకసం
తానము గాసి చేసెదరు తద్వ్యథ నోరువ లేక మిక్కిలిన్
దీనతఁ జెంది యిం దరుగుదెంచితి మాపదఁ బాపవే కృపన్. 323
సీ. ఖపురభేదియు నంతకచ్ఛేది యన మించు, హరుభుజావైభవం బనఁగ నెంత
దరముతో జడవృత్తిఁ బొల్చి యరూపుఁడౌ, శార్ఙ్గకోదండునిసత్త్వమెంత
చోరుచే నపహృతశ్రుతియై యజాఖ్యుఁ గా, స్పదమైన వేల్పురాజసమ దెంత
పాకాపహృతియు జంభవిఘాతి మొనరించి, యలరువృద్ధశ్రవుబలిమి యెంత
తే. యితరసుమనోగణములయహీనసమర, కర్కశత్వము దెంతని గణుతిసేయ
రసురముఖ్యులు బామె బ్రహ్మాదిదేవ, వరుల నిందఱుమించినవార మనుచు.
సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన, దివిజారివరుల కాయువులు నిండు
బలురయంబున నీవు బాణముల్ వఱపిన, వినుతసైనికులప్రాణములు వఱచుఁ
గడిమిమై నీవు చక్రముఁ గేల నంటిన, రాక్షసగుప్తచక్రము గలంగు
నలి రేఁగి పాంచజన్యము నీవు పూరింప, నహితజన్యములు జన్యములు మాను
తే. గరుడవాహన మెక్కి లోకములు వొగడ, నందకముఁ బూని కలనికి నడచితేనిఁ
గొంచకెవ్వాఁడు నిన్నెదిరించువాఁడు, తామసము సేయ నేల రావే ముకుంద.

విష్ణువు సురల కభయం బొసంగుట.

వ. అని యాపన్నులయి విన్నవించినవేల్పుమన్నదొరలయెడం బ్రసన్నుండయి
యెన్నుం డిట్లని యానతిచ్చె. 326

చ. ఎఱుఁగుదు మున్ను సుకేశుఁడు మహేశుకృపన్ విభవాభిరాముఁడై
యెఱుఁగుదు వానిపుత్త్రకులు హీనవరంబులు బ్రహ్మ యియ్యఁగా
మెఱసి జగత్త్రయంబునకు మీఱును బాధకులౌట సర్వమే
నెఱుఁగుదు వేల్పులార వెతలింకకుఁ డింక జయింతు వారలన్. 327

శా. పూర్వాదిత్యమహావిలాసము లయంబుం జెంద నస్తద్ధను
ర్నాశ్వీటఁకృతిగర్జ హెచ్చ సుమనోమ్లానిత్వముల్ మాన మ
ద్దుర్వారాశుగవృష్టి మించి యిఁకఁ దద్దుష్టోద్యమగ్రీష్మత
ప్తోర్వీతాపముఁ బాపు నేఁగుఁ డన వారిరుత్సాహముం బొందుచున్. 328

తే. ఇందిరానాథవదనారవిందగళిద, మందమధురవచోమకరందబిందు
బృందతుందిలసుమనోమిళిందులై పు,రందరాదులు సెందిరిమందిరముల.

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని రాఘవుఁ డవల నెట్టివృత్తి మెలఁగి ర
ద్దనుజులుహరి వారలతోఁ, నని యెటువలెఁ జేసెఁ దెల్పుఁడనియడుగుటయున్.

శా. హేలాగోపితగోపికాంశుక శుకప్రేక్షాపయోధిస్ఫుర
త్ప్రాలేయాంశుయశోధురంధర ధరప్రత్యర్థిముక్తాంబుదా
భీలప్రస్తరవర్ష వారణ రణస్ఫీతామృతాంధోద్విష
జ్జాలవ్యాళభిదాఖగోత్తమ తమస్సంఛేది తేజోనిధీ. 331

క. యతికువలయహిమకర కర, భృతనందకచక్ర చక్రమహితఘృణిమణిభా
సితవత్స వత్సదనుజా,యతమారుతభుజగ జగదుదంచితనియతీ. 332

భుజంగప్రయాతము.

నిశాంతస్ఫురత్పాండునీరేజనేత్రా, నిశాంతజ్జగద్వందనీయాబ్జమిత్రా
యశోదానదాక్షిణ్యహారిత్వధుర్యా, యశోదామనోరంజకాశ్చర్యచర్యా. 333

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదిత చతుర్విధానవద్య
కవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణివైభ
వాధరీకృతరాజరాజ రాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధర ధరాధిప
సభాంతరస్తవనీయనయకళాయుగంధర బంధురమనీషావిశేషమంథానవసుంధ
రాధరశోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటి
వంశపయఃపారావారపరిపూర్ణసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞాన
విభవవిజితసనందన విష్ణుమాయావిలాసాభిధానయక్షగాననిర్మాణప్రవీణతానిధాన
పాపరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబు
నందుఁ బ్రథమాశ్వాసము.





శ్రీ

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీమదుత్తరరామాయణము

## ద్వితీయాశ్వాసము.



రాధామధురసుధా
ధారాధరలోల కామితప్రదశీలా
శౌరిశ్రీజితనవ
ధారాధరజాల శ్రీమదనగోపాలా. 1

మాల్యవదాదులమంత్రాలోచనము.

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి చంద్రుఁడిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
జానకీనాథ సురలిట్లు శార్ఙ్గిచేత, నభయదానంబుఁ గొని వేడ్కనరిగినంత.

శా. ఆవృత్తాంతము వేగరుల్ దెలుపఁగా నాలించి యమ్మాల్యవ
ద్దేవద్వేషి నిజానుజద్వయము నెంతేఁ గూర్మి రప్పించి మం
త్రావాసంబున నుండి యిట్లనియె శోకాంతంబుగా శేముషీ
ప్రావీణ్యంబును గార్యతత్పరత సౌభ్రాత్రంబుఁ గాన్పింపఁగన్. 3

ఉ. వింటిరె తమ్ములార యొకవింత వినంబడె మొన్న యేమొ ము
క్కంటిఁ గనంగ నెల్లదెలుకంటిదొరల్ మును వేఁగి మ్రొక్కి మీ
బంటుల మమ్ము నొంచెదరు బాధలఁ బెట్టి సుకేశపుత్త్రు ల
క్కంటకులన్ వధించి యికఁ గావఁగదే శివ యంచు వేఁడినన్. 4

చ. కరచలనంబు మస్తకవికంపనముం గనిపింప వారితో
హరుఁ డపు డానతిచ్చెనఁట యాయసురేంద్రులు మాకజయ్యులా
హరి యగునే జయించుఁ జనుఁ డాయనయొద్ద కటంచు నట్లసు
స్థిరమతి వార లేఁగిరఁట శీఘ్రముగా నసురారిపాలికిన్. 5

చ. హరునకుఁ దెల్పినట్లు మనయాగడముల్ హరితోడఁ దెల్ప నా
హరి వెతలేల శాత్రవచయంబు వధించెదఁ గొంచ కింక మీ
యిరవుల నుండుఁ డంచభయ మిచ్చి ప్రియంబున వీడుకొల్పఁగా
సరసముఁ జెంది వచ్చిరఁట యండజు ముందటిలీల గుంపులై. 6

చ. అమరులపాలివాఁడు హరి యాయన యిచ్చినబాస దప్పఁడే
క్రమమున నైన గెల్చు మనగర్వము లింతకుఁ దెచ్చె నెప్పు స

క్రమమె యొనర్త మేబలులఁ గైకొన నెంతటివారి నాదరిం
పము బలవద్విరోధము శుభం బొనరించునె యెంతవారికిన్. 7

క. హీనునితోఁ దగు రణము స, మానునితోఁ జేయఁ దగు సమాధానము సం
ధానరణంబులు దగ వస, మానునితోఁ బొలఁగి కొలిచి మనుటయె యొప్పున్.

మ. నడుమంత్రంబున బల్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డె
క్కుడువారిం దొడరంగఁ బోయి మడియున్ ఘోరానలజ్వాలలోఁ
బడి నీఱౌ శలభంబులీల సహజభ్రాజిష్ణుశౌర్యుండు ని
ల్కడభావంబున నుండుఁ గయ్యమునకుం గాల్ద్రివ్వఁ డేపట్టునన్. 9

క. తనబలము నెదిరిబలమును, గనుఁగొనక హితోపదేశకర్తలపలుకుల్
వినక కుజనుండు సాహస, మునఁ జెడు బలుగాడ్పుఁ దొడరు బూరుగులీలన్.

ఉ. కావున దేవతార్థముగఁ గయ్యము సేయఁగ వచ్చువిష్ణుపైఁ
బోవుట పాడిగా దతఁడు పుణ్యజనప్రియుఁ డాశ్రయించినం
గావక పోవఁ డిప్పు డనకార్యము కయ్యము నెయ్య మొప్పు స
ద్భావముతో ముకుందునకె భక్తుల మైన నసాధ్య మున్నదే. 11

క. రాక్షసులు సేరినను హరి, రక్షించునె యనఁగ వలదు ప్రహ్లాదాదుల్
రాక్షసులు గారొ వారల, రక్షింపఁడొ మీ రెఱుంగరా హరిమహిమల్. 12

సీ. ప్రళయాబ్ధి మోఁకాలిబంటిగాఁ జరియించు, మధుకైటభులఁ బట్టి మట్టువెట్టెఁ
జాఁపచుట్టుగ ధరాచక్రంబుఁ జుట్టి కొం, పోవు హిరణ్యాక్షుఁ బొడవడంచెఁ
ద్రైలోక్యనాథుఁ డై తన కీడుజోడును, గాంచకున్న హిరణ్యకశిపుఁ ద్రుంచెఁ
జదువులదొంగయై జలరాశి డాఁగిన, కపటహయగ్రీవుఁ గడిమిఁ జెఱిచె

తే. నముచివధియించె సంహ్రాదు నాయు నొంచె, గెలిచె శుంభనిశుంభులఁ గలసహస్ర
కవచుఁ దెగటార్చెఁ బరిమార్చెఁ గాలనేమిఁ, దర మె విష్ణునితోఁ బోరఁ దమ్ములార.

ఉ. వారలకంటె నెక్కుడగు వారమె విష్ణునితోడఁ బోర ని
ష్కారణ మల్గఁ డాయన నిజంబుగ నేరము లేక శౌరియం
దారయ దోష మేమి మనయందఱదోషమె తన్మనోంబుజం
బీరస మొందఁ జేసె నిది యెంచి యొనర్పఁ దగు మీఁదికార్యముల్. 14

తే. అని హితం బెఱిఁగించిన యన్నమాట, లాసుమాలియుమాలి యునాలకించి
నీతిఁ దెలిసియుఁ దెలియక నీతిమాలి, యుద్ధమును గూడి యతనితో నిట్టులనిరి.

శా. ఇష్టైశ్వర్యయుతంబు నీనెలవు నీ యిచ్ఛావశం బాయు వు
త్కృష్టప్రాభవశాలి వంచితతపోధిక్యంబు నీసొమ్ము సి
శిష్టాచారము మేలుబంతి పలలాశిశ్రేణికిన్ శాత్రవా
నిష్టోత్సాహనిదాన నీకుఁ దగునే నేఁ డింత చింతింపఁగన్. 16

మ. విశిఖోత్తుంగతరంగఘుంఘుమరవ్రాతోద్వేలంబు దుర్వారవీ
రశతాంబూద్భటసంకులంబు సముదగ్రచ్ఛత్ర ఫేనావృతం
బు శతాంగాద్రియుతంబు నాసురబలాంభోరాశి నీబాడబా
గ్నిశరజ్వాలల నింకె నెవ్వ రెదు రింకన్ నీకు దైత్యాగ్రణీ. 17

మ. బలవంతుల్ భవదీయపుత్త్రకులు నీభ్రాతల్ త్రిలోకైకవీ
రులు నిన్ మృత్యువుఁ దేఱి చూడ వెఱచుం గ్రుద్ధాచ్యుతాంభోజగ
ర్భులు నీపే రనిసం దలంకుదురు భీరుత్వంబు నీ కేల నిన్
దెలియం జాలక యాన తిచ్చెదవు దైతేయాన్వయగ్రామణీ. 18

తే. అస్మదాదులు సేయురాయడి సుపర్వు
లచ్యుతునితోడఁ దెలిపినా రనియె భయముఁ
జెందెదవుగాని మనలను జెఱుప నింత
కెత్తుకొని రని యలుగ వదేమి యధిప. 19

మ. అరులం జంపు మటంచుఁ బంద లయి యాదిత్యు లార్తిన్ గణిం
చిరి యో సర్వసమానుఁడైన హరి ద్వేషిత్వంబుఁ దాఁ బూని యే
కరణిం గయ్యము సేయ వచ్చు మనతోఁ గ్రౌర్యంబు గౌటిల్య మా
హరికిం గల్గిన మాదృశుం డతఁడు గాఁ గాధిక్య మే మారయన్. 20

తే. సహజమాత్సర్యమున దేవసమితితోడ, మనము దొడరినహరి యేల మచ్చరించు
నతఁడె నిష్కారణద్వేషి యయ్యె నేని, సంధికార్యంబు వొసఁగు నే సరసగతిని.

తే. వనజనాభుఁడు గనిపి చుకొను నటంచు, వెఱచిన గతు రవైఁగిన్క విడువవలెనె
యేటియోజన బలవంతుఁ డీహరి యని, యిపుడు శరణన్న నవ్వ రే యెవ్వ రేని.

తే. వెన్నునకు నస్మదాదులు మిన్నఁడైన, నపకృతి యొనర్ప మతఁ డెన్నఁడైన మనకుఁ
జేయఁ డపకృతి వేల్పులు సేసి రింత, వేలుపులమీఁద నిఁక దండు వెడలవలయు.

చ. త్రిదశులతోడఁ గయ్య మొనరించి రమాపతి యస్మదాదులం
గదిసి రణం బొనర్చినను గాఁ దన వచ్చునె యంతభాగ్య ము
న్నదె యెట్లైన మంచిది రణం బొనరింతము వేదశాస్త్రముల్
సదివితి మీవు లిచ్చితిమి జన్మము లూనితి మైహికంబునన్. 24

తే. అన్న నీమాట జవదాఁటి యాడితిమని
యలుక సేయక ప్రతివాదములు క్షమించి
యనుమతి యొసంగు మిపుడె మదాంధు లగుసు
ధాంధుల జయించి వచ్చెద మనుచుఁ బలికి. 25

మాల్యవదాదు లమరపురిపై దండెత్తుట.

క. సేనాధిపతుల రమ్మని, దానవపతి యమరరాజధానిపయిఁ జనం
బూనినవాఁ డిప్పుడె మన, సేనల రప్పింపుఁ డనుచు సెల విచ్చుటయున్. 26

భుజంగప్రయాతము.

దణా పెద్దయార్భట్ సుధాభుగ్విరోధ్యగ్రణీసేనల్ మించె గంభీరభేరీ
ధణంధాణముల్ దేవధానీవసద్గర్భిణీగర్భగభ్రూణభేదంబు గాఁగన్. 27

సీ. తననిర్ఝరాచలత్వమున కుల్కె సురాద్రి, వాపోవుగతిఁ బ్రతిధ్వను లొసంగఁ
దన కింక నెద్ది జీవన మంచు వారాశి, గలఁగెనా జలము పంకిలము గాఁగఁ
దనమేను గరుపారఁ దమి మీఱి శశిధారి, వడఁకుగుబ్బలికన్నె వడఁకుఁ దీర్ప
దనకోర్కు లీడేఱెనను చొక్కుపరువుతోఁ, గలహభోజి ముకుందు కడకుఁ బఱవఁ
తే. జెవులలో వ్రేళ్లు లునిచి రాజీవగర్భుఁ, డిచ్చ నేమియు నన లేక ఱిచ్చపడఁగ
మించి ప్రస్థానభేరి వేయించి దండు, వెడలి రసురులు జేజేలపీటిమీఁద. 28

సీ. సౌందర్యకృతమేరుమందరాచలనింద, నము లౌ మహాస్యందనములమీఁద
భూరిదానోదకాపూర్ణబంధురకంధ. రము లైనమదసింధురములమీఁద
స్వజవమానసగంధవాహవాహసబాంధ, వము లైనఘనసైంధవములమీఁదఁ
బ్రతిపక్షకుంభికుంభచ్ఛిదారంభరం, హము లైనఘోరసింహములమీఁద
తే. శరభచమరీమృగవ్యాఘ్రశల్యభల్ల, కాసరవరాహఖడ్గపుంగవఖరోష్ట్ర
విహగఫణికూర్మమకరాదివివిధవాహ, వారములమీఁద దైతేయవీరు లెక్కి.

సీ. మధ్యందినాదిత్యమండలోగ్రాంశుపా, ణింధమాయుధదీప్తి నింగి మ్రింగ
గాఢసర్వాంగీణకవచవజ్రచ్ఛటా, చ్ఛాయ లాశాకుడ్యచర్చ లొసఁగ
వీరపాణప్రక్రియారక్తదృగ్దృశ్య, విభఖదిరాంగారవృష్టి గురియఁ
బ్రళయకాలాభ్రగర్జావదావదనిష్ఠు, రాట్టహాసములు బ్రహ్మాండ మగల
తే. దేవలోకజిగీషచేఁ ద్రిపురహంతు, కామకామాంతకోద్భటాకారు లగుచు
లంక విడిచి మనోవీథిశంక విడిచి, యసురు లుత్సాహములు గ్రాల నరుగువేళ.

శా. ఆలంకాపురిలో వినంబడె సృగాలారావముల్ భూతవే
తాళక్రూరతరాట్టహాసములు మిథ్యాదుర్విలాపంబు ల
వ్వేళన్ వేలయు దాఁటి నద్దెసలఁ బర్వెన్ నాగరోల్లోలక
ల్లోలశ్రేణి చలించె క్షోణి నుడుపాళుల్ రాలె వ్రీలెన్ గిరుల్. 31

శా. రక్షస్సైన్యములోఁ గబంధములు గృధ్రంబుల్ నటించెం ద్రిలో
కక్షోభంబుగ మేఘముల్ గురిసె నిర్ఘాతాస్థిమాంసాస్రముల్
పక్షక్షేపము లొప్ప నిప్పుకలు గూబల్ చూపులన్ రాల్చెఁ బ
ద్మాక్షుం డిప్పుడె మిమ్ము గెల్చు నను పల్కాకాశభూతం బనెన్. 32

శా. ప్రీతిన్ సూరెల నశ్వినీసుతులు రాఁ బెం పొందనింద్రున్ బలెన్
భ్రాతల్ గొల్వఁగ మాల్యవంతుఁ డపు డాభామాంతరిక్షోదితో
త్పాతంబుల్ దిలకించి దైవకృతముం దప్పింప రా దంచు ని

ర్భీతిన్ సైన్యముఖంబునన్ నడచె నీరేజాక్షుపై దుస్సహాన్. 33

ఉ. మాల్యవదాసురుం డిటుల మాల్యవదాఖ్యనగంబులీల నై
శ్చల్యముతో ననేకదివిషద్రిపుసంగతుఁడై పటీరనై
ర్మల్యలసద్యశోధనసమన్వితదాత ధనార్థికోటిలోఁ
గల్యతఁ గన్నకైవడిఁ బ్రకాశిలె శత్రులు భీతి నొందఁగన్. 34

ఆ. విభునిశౌర్య ధైర్య విక్రమోన్నతిసాహ,సములు సూచి సకలసైనికులును
భయము మాలి మాలిపనుపున మృత్యువ,శాత్ములగుచు నడచి రమరపురికి.

చ. దనుజవరూథినీసలలితత్వరితాశ్వఖురాహతోర్వరా
జనితపరాగ మింద్రపురిచక్కటికిం జను టొప్పె మీపురం
బున కదె దాడిగా దనుజముఖ్యులు వచ్చెద రేడ కైనఁ బొం
డని మునుమున్నె ధాత్రి యమరాళికిఁ దెల్పఁగ నేఁగెనో యనన్. 36

మ. సురదంతావళదానగంధలహరిన్ సొంపొందుసారాసగాం
బురుహాళిందమిళిందబృందము సుహామోదంబునం బైకొనెం
జరనీలాచలభాసురాసురబల స్తంబేరమోద్యత్కటాం
తరచంచన్మద మాహరింప రిపులన్నన్ సైఁప రెవ్వారలున్. 37

ఉ. భ్రాంతలవీటి కీగతి సుపాధి విరోధు లొనర్పఁ జూడఁ బా
లైతి నటంచు విన్నయినట్టిక్రమంబునఁ గాంతి మాసి ఖ
ద్యోతుఁడు వీరరాక్షసభటోద్భటపాణికృపాణదీధితి
వ్రాతము గప్పినం గనె విపన్నత యుద్ధపువేళ్ళకై వడిన్. 38

వ. తత్సమయంబున. 39

విష్ణువు వచ్చి మాల్యవదాదులతో యుద్ధము సేయుట.

ఉ. అసురరాడ్భయానకజయానకనాదము లాలకించెనో
వాసవదూత వేఁయి యిదె వచ్చిరి దైత్యులు నా నెఱింగెనో
తా సకలాత్ముఁ డౌట విభుఁ డంతం గనెనో తెలియంగరాదు ల
క్ష్మీసరసోక్తులం దనివిఁ జెంది ముకుందుఁడు లేచెఁ జెచ్చెరన్. 40

వ. ఈప్రకారంబున క్షీరాబ్ధికుమారితోడివిహారంబు సాలించి దనుజసంహారంబు
నందు డెందంబు గీలించి సురబృందంబుమే లెంచి మహాత్సాహంబున. 41

సీ. వనజమోహమునఁ జేరినభాస్కరుఁడో నాఁగ, శయకుశేశయమునఁ జక్రమమరఁ
గరికరంబున సితాంబురుహంబు దగులీల, నొకకేల నంబుజం బొప్పమీఱ
నంజనాచలముపై నరుణాతపమువెంచు,రహి మేనఁ గనకాంబరము దనర్పఁ
దోలు వేల్పు రాయతి కమలచెక్కడపుగండ, పెండెంబు డాకాల దండిఁ జూప

తే. శార్ఙ్గతూణగదాఖడ్గసహితమహిత, గారుడస్కంధ మెక్కి బంగరపుగట్టు
తుదను గనుపట్టునీలతోయదము ననఁగ, శాత్రవజిగీష నరుదెంచెఁ జక్రధరుఁడు.

వ. తత్సమయంబున. 43

సీ. తూలఖండములట్లు తునుకలై పాథోధరములు కోదండటంకారమున నెఱసె
సపత్త్రములలీల శైలముల్ దిరిగెఁ బ్రతి, ధ్వనులతో నొండొంటిఁ దాఁకులాడె
శరనిధుల్ లోఁతుసూపరసాతలముదోఁపఁ, జిలువరాచెలులకుం జెలుచలించెఁ
గులశైలచలనంబువలన భారము మోవ, బెదరి దిక్కరులు గీపెట్టసాగ

తే. విఱిగి పెళపెళధరఁ గూలెవిపినతరులు, గ్రహవిభుని తేరిహయములపగ్గములువదలెఁ
బ్రళయఝంఝానిలాభీలపక్షిరాజ, పక్షవిక్షేపజాతప్రభంజనమున. 44

క. పక్షీంద్రపక్షహతదీ, ప్రక్షోణీరేణుపటలి ప్రతిపక్షచమూ
రక్షోవీక్షుల కప్ర,త్యక్షము గావించె భువనమంతయు సధిపా. 45

చ. హరిశరపంక్తికంటె మును పగ్గరుడోగ్రగరున్మరుత్పరం
పరలు విరోధిసైన్యములపైఁ జనఁ గూలె ధ్వజాతపత్రచా
మరసుభటప్రకాండభుజమండలమండితమండలాగ్రముల్
గరులు హరుల్ రథంబులును గాడ్పడెఁ జేష్టడె రెల్లసైనికుల్. 46

చ. అమరులు పుష్పవృష్టి గురియన్ దివిఁ దుంబురునారదాదిగా
నములు రహింప సేవకజనంబులు గొల్వఁగఁ జారణస్తుతుల్
ప్రమద మొనర్ప వచ్చి రిపుభంజనుఁ డాహరి యొత్తె రుక్సమూ
హమథితరాజమున్ రవధుతారిసమాజము శంఖరాజమున్. 47

చ. అదిరి కడున్ సురారిభటు లాజయశంఖరవంబు వీనులం
గదిసిన గుండియల్ పగులఁ గంపముతోఁ దల లెత్తి కాంచన
చ్ఛదరుచి మించునగ్గరుడుఁ జక్కఁ గనుంగొన లేక భీతులై
యదె యిదె వాఁడె వీఁడె హరి యంచుఁ జలించఁగ సైనికాగ్రణుల్. 48

ఉ. గర్వముతో సుపర్వులకుఁ గానని సేయఁగ వచ్చితే యిదే
సర్వసమానలక్షణము సాలు హరీ నిలు పోకు మంచహం
పూర్వికతో గదాపరశుముద్గరతోమరపాణులై మహా
పర్వతరాజమున్ మశకపంక్తులయ ట్లెదిరించి రొక్కటన్. 49

సీ. వర్షాబ్దగతి నంపవాన దైత్యులు ముంప, నచలుఁడై హరి యంజనాద్రిఁ దెగడె
శలభసంహతిలీల శత్రులొక్కట మీఱఁ, గేదారగతి నొందెఁ గేశవుండు
మశకపంక్తులయట్లు మార్తు రుద్ధతిఁ జూపఁ, గట్టుఁదాలుపు జెట్టిబెట్టుఁ జెందె
మకరవైఖరి వైరినికరంబు చెలరేఁగ, వనజనాభుఁడు వార్ధినపహి వహించెఁ

తే. బూర్వదివిజులు దివిజులఁ బోల్కి నిగుడ, నయ్యనంతుఁ డనంతాభ నతిశయిల్లె
దొరయుమధుమక్షికలవీకఁ బరులు దాఁకఁ, దేనె పెరదారి మధువైరి గానిపించె.

శా. రక్షోరాజధనుర్విముక్తశతధారస్ఫారహ్రాద్వాయువే
గాక్షీణాస్త్రపరంపరల్ నిగిడి కీలాభీలతన్ వచ్చు ప

ద్రాక్షుం జొచ్చి యడంగె నొక్కటఁ దదీ।యాంగంబునం బద్మగ
ర్భక్షీణావసరంబునన్ భువనముల్ । ప్రాపించి లో నారహిన్. 51

వ. అప్పుడు. 52

సీ. పలునగంబులు వజ్ర।పాణి మార్కొనులీల, రథికసారథులతో ।రథము లడరె
హరినీలశిఖరిఁ గో।రాడఁ దార్కొనుజాడ, నిజయూథపులతోడ।గజము లడరెఁ
బక్షితార్క్ష్యవ్రాత సహిం।పనిచందమున నాశ్విక శ్రేణితోఁ దురం।గమము లడరెఁ
గదనమం దెట్టులైన।నిదియె దిక్కనురీతి, హరిపదంబున భటో।త్కరము లడరె

తే. నడరినప్పుడె రథికదో।రథికధన్వ, శింజినీఘోషములును హ।స్తిపకహుంక
రణము లాశ్వికధిక్కార।రవములుగ్ర, భటకహకహార్భటులు ది।శాపటలినెరసె.

శా. ఆనక్తంచరశేఖరుల్ గురియుది।వ్యాస్త్రప్రవర్షంబులున్
నానాశస్త్రపరంపరల్ పయిపయిన్ । నారాయణుం గ్రమ్మినం
దా నుచ్ఛ్వాసము లేనియట్లొక ముహూ।ర్తం బయ్యెడం గన్పడెం
బ్రాణాయామపరాయణుం డయినవి।ప్రగ్రామణిం బోలుచున్. 54

క. మీనసమూహము పొరల మ,హానీరధిఁ గలఁగనట్లు । హరి యుక్కు రక్ష
స్సేనాధిపనానాస్త్ర వి,తానములకుఁ గలఁగ కుగ్ర।తరకోపమునన్. 55

మ. అతిశీఘ్రంబున శార్ఙ్గ మెక్కిడి గుణం । బాభీలతం దీటుచున్
శతధారాగ్రములై మనోజవములై । సంవర్తకాలానలా
ద్భుతకీలాభములై తనర్చుశరముల్ । దోరంబుగా నేసినన్
శతశఃఖండములైరి రాక్షసవరుల్ । సంగ్రామరంగంబునన్. 56

క. శృతిదాఁక శరము లరిఁ బో,సి తిగిచి హరి యేయ నసుర।సేనలఁ బడియెం
జతురంగంబులు దిలశ,శ్శతశఃకణశస్సహస్ర।శఃఖండములై. 57

ఉ. వాయువుచేఁ బ్రభూత మగు।వానవలెన్ నిజశార్ఙ్గముక్త మా
సాయకజాత మద్దనుజ।సైన్యము ముంచిన నుత్సహించి నా
రాయణుఁ డొత్తె నప్పుడు యు।గాంతపయోధరఘర్షణోదిత
స్ఫాయదభంగురాశనిని।భధ్వనిధుర్యము శంఖవర్యమున్. 58

శా. ఆనారాయణశంఖరాజరవ మి।ట్లత్యుగ్రమై విద్విష
త్సేనాధీశులవీనులన్ దొరయ భీ।తిం జెంది సింహం బర
ణ్యానిన్ గర్జిల నేనుఁగుల్ బెగడున।ట్లందంద మూర్ఛిల్లుచున్
దీనత్వంబునఁ ద్రెళ్లుచున్ నలుగడల్ । దృష్టించుచున్ స్రుక్కఁగన్. 59

చ. గతులకుఁ బాసె నశ్వములు । గంధగజంబులు మూర్ఛిలెన్ రథ
ప్రతతులతోఁ బ్రవ గట్టువడె । బన్నముఁ జెందెఁ బదాతిజాతి య
ద్భుతవిజయాంబుజధ్వనికిఁ । దోడుగఁ గేశవుఁ డార్చి సంగర
క్షితి యద్రువన్ దిశాకరులు । చేడ్పడ శార్ఙ్గగుణంబు దీటినన్. 60

వ. వెండియు నక్కుండలీశశయనుండు గుండలీకృతకోదండమండితకరుం డయిగండు
మిగిలి చండతరాఖండలమండలాగ్రనిభాఖండకాండమండలాగ్రంబులం గొండ
లవలె దండి గలచండరాక్షసులగుండెలం బగిలించుచుం గుండల నగలించుచుం
గోదండంబుల ఖండించుచు దోర్దండంబులం దుండించుచు జోళ్లం జించుచుం
గాళ్లం ద్రుంచుచుం బ్రక్కలం గ్రొచ్చుచుం డొక్కల వ్రచ్చుచు నెమ్ముల
రాల్చుచుం గొమ్ములఁ జీల్చుచు ఛత్త్రంబుల ఛేదించుచు గాత్రంబుల భేదించుచు
మెడలం ద్రెంచుచుం దొడల నొంచుచుం జేతికత్తులం ద్రోయుచు భీతచిత్తులం
జేయుచుం గపాలంబుల నాస్ఫోటించుచుం గపోలంబుల నుత్పాటించుచు నరం
బుల వదలించుచు శిరంబుల విదలించుచు భూషణంబుల నులుపుచు దూషణం
బుల సలుపుచు ధైర్యంబుల నెంచుచు శౌర్యంబుల నడంచుచు ధ్వజంబులం
జెడఁగొట్టుచు గజంబులం బడఁబెట్టుచుం దొండంబులఁ గోయుచు గండంబుల
వ్రేయుచుం దేరుల కరుగుచు సూరెలఁ దిరుగుచు భీతులవడదీర్చుచు సూతులఁ
గడతేర్చుచు యోధలఁ గట్టుచు బాధలఁబెట్టుచు బిరుదులం బాపుచుం గఱదలం
జూపుచు నెక్కడఁ జూచినం దాన యై చుట్టుఁ గైదువుం బట్టకయె దిట్టతనం
బుతో బెట్టిదంబుఁ గనిపించు నెడం బ్రళయోద్దండమార్తండమండలంబుననుండి
నలుగడల నిండికొనుకరమండలంబులమెండున నజాండోపరితరంగమాలివలనం
దుఱంగలించునభంగతరోత్తుంగతరంగమాలికల తెఱంగునమహాగరుత్పరీతగిరిగు
హాకుహరసరణిం బఱతెంచు కాలసర్పంబుల దర్పంబునం గప్పు జిగి దలిర్పు నుప్ప
రంబునం గప్పుకొని మిగుల మెఱయు కారుమొగిళులవలన దిగునగణితజలధారల
తీరునం దద్విశిఖంబు లసంఖ్యాతంబు లయి నిశాటులశరీరంబులు శోషింపం
జేయుచు నమృతాశనవైరులలోఁబఱచిముంచుచుం జక్రిదూషకులమర్మంబులు
నాఁటుచు ఘనవిపక్షులశిరంబులపయిఁ దొరఁగుచు మఱియు నరిదిగా నరిపుండ
రీకంబులు ఖండించుచుం గౌశికప్రతోషకరంబు లై పరవాహినులయు బ్బడం
చుచు నత్యంతసంతాపకరంబు లయి యెదిరించినవారి కమృతపదంబుఁ జూపుచు
గరుత్పరంపరాపరిణద్ధంబు లై రుధిరంబు వెడలించుచు నప్రదీప్రశిఖిశిఖాప్రతీ
పంబులయి ప్రతిపక్షబలంబులపయిం బ్రవహించునప్పుడు పద్మనాభుండు భద్రేభ
వరదుండు మీ రతనిధర్మంబున మెలంగుచుండియు మమ్ము నొంచవచ్చుట మేర
గా దని వారించుతీరున సంచలత్కరంబులయి ఘీంకరణంబు లొనర్చుచుం దదభి
ముఖంబుగ్గా శరణాగతరీతిం బడుగంధసింధురంబులకు హరి సారూప్యం బొసం
గెనో యన నూతనక్షతధారాపూరంబులు గెంబట్టుఁబుట్టంబులుగాఁ గరాగ్ర
పరిసరపతద్రథచక్రంబులు చక్రంబులుగా విమతవిగతవిజయశంఖంబులు
దాలిశంఖంబులుగాఁ గ్రిందఁ బడినవీరయోధబాహుకాండంబులు శయనీకృత
బిలేశయప్రకాండంబులుగాఁ జెలు వొంద నందుఁ గ్రందు సేయుచు భూత

ప్రేతవేతాళకూశ్మాండబ్రహ్మరాక్షసపిశాచశాకినీడాకినీగణంబులు దేవాసురగణంబులవలె ద్వివిధంబులయి యాయుధాస్థిభూషణరజస్సికతాతలంబుననిలిచి మహాసింధురబంధురకబంధమంథాచలంబు నడుమ నిడుదనరంబులు నూఱాఱు లొక్కటి సేసి గట్టిగాఁ జుట్టి యిరుదెగలవా రిరుదెసలం బట్టి శోణితాంబుధి మథించుచుఁ దన్మధ్యంబుననుండి శాకినీభూతంబు పొడవుగా నెత్తినముత్యాలగొడుగు గ్రొత్తగాఁ బొడమినచంద్రుం డనియును బ్రచ్ఛన్నంబు గా మునింగి యుండి బయలుదేఱినమోహినీభూతంబు లచ్చర లనియు నంగహీనంబుగాని మత్తమాతంగశవంబునకు వెండియు రెండుకొమ్ము లిడి ప్రేతావేశంబునఁ బఱతేరనదియే చతుర్దంతదంతావళం బనియును శ్వేతాశ్వశవం బుచ్చైశ్శ్రవం బనియును విచిత్రవర్ణపతాకాకీర్ణపటచ్ఛత్త్రచామరశకలావికల రథస్తంభజాతంబు పారిజాతం బనియుఁ గమనీయసౌందర్యలీలఁ బయలుపడినకామిని యిందిరాకామినియనియును బ్రహ్మరక్షోధన్వంతరిస్థూలకపాలకలశంబునం దెచ్చినతరస తైలంబమృతరసం బనియును నిబంధించి తదర్థంబుగా నిరుదెసలపెద్దలును సన్నద్ధులై పెద్దయుం బ్రొద్దు యుద్ధంబు సేయుకోలాహలంబు గౌతూహలంబు గల్పింపఁగా వరించివిరించిపట్టి విపంచిపట్టి బెట్టుగా బొట్టగీతంబులం దలపెట్టినట్టియెడ నజ్జగజెట్టి మహారణ్యంబు సొచ్చినకార్చిచ్చు పెచ్చునం బ్రళయసముద్రంబు దొరసినసంకర్షణాగ్నిబింకంబున మేఘజాలంబుపయి నడరినఝంఝూనిలంబువేగంబున నంధతమసంబుపయి నొలసినమధ్యందినసూర్యశౌర్యంబున నవార్యక్రౌర్యంబుఁ జూపినయాపురుషోత్తముదాపున నిలువనోపక కకావికలై భేరుండంబునకుం బాఱు శరభంబులరభసంబున శరభంబునకులుకుకొదవసింగములభంగంబునఁ గొదమసింగంబున కుఱుకుమత్తమాతంగంబులఘుటలయటులమత్తమాతంగంబునకుం బఱచువ్యాఘ్రంబులశీఘ్రంబున వ్యాఘ్రంబునకు వెఱచుకురంగంబులతెఱంగున నిలిచినచో నిలువక యొండొరులం బిలువక తిరిగిచూడక పడినకత్తులెత్తఁ జేతు లాడక హతశేషులై నదోషాచరులు విముఖులై లంకాభిముఖు లయి పఱచి రయ్యెడ. 61

క. పాఱెడిరిపుల రణస్థలిఁ, బాఱెడిబహురుధిరనదులఁ బ్రతిబలములపైఁ
బాఱెడిశరములఁ గని సొం,పారెడిమది శంఖ మొత్తె హరి యవ్వేళన్. 62

మ. హరిచే నొచ్చి సదైన్యమై పఱచుసైన్యంబుఁ జయోత్సాహినా
హరి నీక్షించి సుమాలి రోషవివశుండై చండకాండంబులఁ
హరిశాతాశుగవృష్టి మాన్చి రవి నీహారచ్ఛటల్ గప్పువై
ఖరి మైఁ దూపుల ముంచి దిక్కు లద్రువంగాఁ బేర్చి పెల్లార్చినన్. 63

శా. ప్రావృట్కాలఘనార్భటుల్ విని శిఖివ్రాతంబు లేతెంచున
ట్లావీరాగ్రణిసింహగర్జ విని ముక్తాపన్నులై చన్నయ:

ద్దేవ ద్వేషులు గ్రమ్మఱన్ మరలి బుద్ధిస్థైర్యశౌర్యాఢ్యులై
గోవిందున్ వెనఁ దాఁకి మున్నుటివలెన్ ఘోరంబుగాఁ బోరఁగన్. 64
చ. అపుడు సుమాలి హేమకవచావృతుఁడై సతటిద్ఘనాంబుతో
నుపమకు వచ్చి రత్నకటకోజ్జ్వల మౌకర మెత్తి యుత్కట
ద్విపమువలెన్ ముకుందుఁ బఱతెమ్మని పిల్చుచుఁ గేక వేయుచున్
విపులశతాంగమున్ మెఱయ వేచని మార్కొని విక్రమించినన్. 65
మ. సరసీజాక్షుఁడు మందహాసము దనర్పం బ్రోల్లసత్కుండల
స్ఫురితం బై నతదీయసూతుశిర మచ్చోఁ ద్రుంచి యజ్ఞోదుమై
శరసంఘంబులు నించి యార్చిన రథాశ్వంబుల్ నిజక్షత్తలే
మి రథం బీడ్చుక యేఁగెఁ దత్సమరభూమిం బాసి యుద్భ్రాంతిమై. 66
వ. ఈక్రమంబున. 67

—●●◆◀ విష్ణువు మాలిం జంపుట. ▶◆●●—

ఉ. భ్రాంతములై రథాశ్వములు వాఱ సుమాలియు నిల్వ లేక యు
ద్భ్రాంతి వహించె నింద్రియపరంపర నిల్వనిభ్రాంతచిత్తున
ట్లంతఁ బరాఙ్ముఖుం డయినయన్నఁ గనుంగొని మాలి వచ్చి శ్రీ
కాంతునిఁ దాఁకె యుద్ధకుతుకంబున హైమరథాధిరూఢుఁడై. 68
వ. ఇవ్విధంబునం బ్రతాపజితాంశుమాలి యగుమాలి వనమాలిం దాఁకి మహా
సాహసంబున. 69
మ. ఘనకోదండగుణారవంబు దశదిగ్భాగంబులన్ నిండఁ గాం
చనపుంఖాంచితబాణముల్ దొడిగి లక్ష్యం బై నశ్రీవత్సలాం
ఛనువక్షంబునఁ దూఱ నేయ నవి శ్రీకంచంబుం బ్రవేశించుచుం
ననికాయంబులలీలఁ జొచ్చి చన నిచ్చం గుందె దేవౌఘముల్. 70
ఉ. మాలిధనుర్విముక్తశితమార్గణముల్ శతకోటికోటు ల
వ్వేళ నిజాంగమున్ దొరసి వేదన సేయఁగ ధైర్యసంపదం
దాళెఁ బయోజనాభుఁడు రణంబున నింద్రియజేత యాధులం
దాలిమిమై సహించినవిధంబున రామనృపాల వింటివే. 71
క. ఈక్రమమున మాలిభుజావిక్రమమున నొచ్చి మెచ్చి విష్ణుఁడు శార్ఙ్గ
వక్రజ్యారవ మఖిలాశాక్రోడము లావరింప సంరంభమునన్. 72
చ. కులిశసముజ్జ్వలద్విశిఖకోటుల మాలి శరాళిఁ ద్రుంచి త
జ్జలదనిభాంగముం గదియ శార్ఙ్గి మెఱుంగులఁ బోలువాలుఁదూ
పులు సిగిడింపఁగా నవియుఁ బోయి తదీయశరీరరక్తమున్
బలువిడిఁ గ్రోలె ము న్నమృతపానము సేయుసురౌఘమున్బలెన్. 73

చ. మద మిటు లార్చి పేర్చి వనమాలి చలంబున మాలిమౌళి ప
ల్చిదురుపలై ధరం గలయఁజేసి శరాసముఁ ద్రుంచి టెక్కెముం
బ్రదరముపా లొనర్చి హయపాటనముల్ ఘటియించి సూతునిం
దుదిఁ గనఁజేయ వాఁడు విరథుం డయి చండతరాగ్రహంబునన్. 74

మ. గదఁ గేలం గొని శృంగవద్గిరిరహిన్ గ్రావంబుపై నుండి యు
న్నద మై కేసరిడిగ్గులీల రథ మంతన్ డిగ్గి పల్మాఱు న
గ్గదఁ జక్రాకృతిఁ ద్రిప్పుచుం గదిసి నాగద్వేషిమూర్ధంబు బి
ట్టదరం గొట్టె మహాద్రి వజ్రహతి వ్రయ్యం జేయుజిష్ణున్ బలెన్. 75

ఉ. మాలిగదాహతిం బిలుకుమాలి విహంగమమౌళి ధైర్యముం
దూలి పయోధి మున్ తిరుగుతోరపుగట్టువలెం జలించి య
వ్వేళఁ బరాఙ్ముఖుం డయిన వెన్నుఁడు నివ్వెఱ నొందె నందున్
మే లని యార్చి రాసురులు మింట సుపర్వులు పిచ్చలింపఁగన్. 76

వ. అప్పుడు. 77

చ. గరుడుపరాఙ్ముఖత్వమును గర్వితులై రిపు లార్చుపేర్మియున్
సురలభయాకులస్థితియుఁ జూచి యిదేమి ఖగేంద్ర యంచు శ్రీ
హరి దనహస్తపద్మమున నాతనిమస్తము సంస్పృశించి యా
తురత హరించి శాత్రవు నెదుర్కొనఁ జేసి పరాక్రమంబునన్. 78

ఉ. కేలిసుదర్శనాయుధముఁ గేశవుఁ డంప యుగాంతపావకా
భీలమహాస్ఫులింగచయభీషణకీలకరాళ మై లయో
ద్వేలఘనాఘనోద్గళితదీర్ఘతరాశనిభూరిఘోష మై
మాలిశిరంబుఁ ద్రుంచె క్షణమాత్రములో దివి వేల్పు లుబ్బఁగన్. 79

వ. అంత. 80

క. చక్రాహతి నీక్రమమున, నాక్రవ్యాదోత్తమోత్తమాంగము దెగి భూ
చక్రము గ్రక్కదలం బడె, శక్రశతారచ్ఛితోగ్రశైలములీలన్. 81

శా. ఈలీలన్ హరి మాలిఁ ద్రుంచుటయు దేవేంద్రాదిదిక్పాలకుల్
సాలన్ సంతస మంది దివ్యసుమవర్షంబుల్ ప్రవర్షించి ర
వ్వేళన్ వానివధంబుఁ గన్నులెదుటన్ వీక్షించి శోకానల
జ్వాలల్ గ్రాలఁ దదగ్రజుల్ వగచుచున్ సైన్యంబుతోఁ బాఱఁగన్. 82

శా. లంకామార్గము వట్టినట్టిరిపులన్ లక్షించి తార్క్ష్యుండు సా
హంకారస్థితి వెంబడిం బడి స్వపక్షాభీలవాతంబు న
ల్వంకల్ దార్కొనఁ జేయఁ దూలములలీలన్ వార లుద్విగ్నులై
బింకం బేది చనంగఁ గేశవుఁడు గంభీరాట్టహాసంబునన్. 83

మహాస్రగ్ధర. బెదరించున్ బెట్టు మించుం బెనుశరములచే భీకరస్ఫూర్తిముంచుం

గుదియించుం గోపగించున్ గురుముసలములం గొట్టి బాధించు వంచున్
గద నొంచున్ గండడంచున్ ఘనపరిఘములన్ ఖడ్గముం గై ధరించున్
విదళించున్ వెంబడించున్ వినువ కసురలన్ విష్ణుఁ డీరీతిఁ ద్రుంచున్. 84

వ. అప్పుడు. 85

మ. జహదస్త్రంబు లుఠత్తురంగముఁ బతచ్ఛత్త్రధ్వజంబున్ క్షిప
ద్బృహచ్ఛీర్షంబు నటత్కబంధము గళద్రక్తంబు ధావద్భటం
బు హసద్భూతము విస్రవచ్ఛ్రమపయఃపూరంబునై యిందిరా
గృహిచే శత్రుబలంబు వెంపుసెడి పాఱెన్ దక్షిణాశాగతిన్. 86

క. హరి వెనువెంటం దగిలిన, కరినివహముచందమునఁ గకావిక లగుచున్
హరి వెనుదగిలినఁ బఱచిరి, కరినివహముతోడ రిపులు కాకుత్స్థమణీ. 87

తే. ప్రళయఝంఝూసమీరంబువలనఁ జెదరి, పఱచు కాలాభ్రములలీలఁ బద్మనాభ
శార్ఙ్గకోదండనిర్ముక్తసాయకోగ్ర, పవనహతి దైత్యసంఘముల్ పఱచెనపుడు.

చ. గరుడతురంగనందకవిఖండితదానవరాట్తనుచ్యుతా
భరణరుచుల్ దిగంతములఁ బర్వె ఘనాఘనకోటినుండి భా
సురగతి మించుమించు లన క్షోణిపయిన్ హరి గుంకుమాంబువుల్
గురియుతెఱంగునం దొరఁగెఁ గ్రొత్తగ నెత్తురుటేఱు లత్తఱిన్. 89

మ. ఘనదైతేయఘనాఘనప్రచయ మాకాశంబునం దాజనా
ర్దనపర్జన్యనియుక్తిఁ జెంది రణవర్షావేళ వర్షించె నూ
తనకీలాలము హారమౌక్తికలసద్వర్షోపలవ్యాప్తి భూ
తనికాయం బనుచాతకప్రతతి కుత్సాహంబుఁ గల్పించుచున్. 90

వ. ఈక్రమంబున. 91

మ. గమకంబుల్ సెడి కైదువుల్ విడిచి యంగంబుల్ సెమర్పన్ నిరూ
ఢమహాప్రాణభయంబునం దలలు వీడన్ రక్తముల్ గ్రక్కుచున్
విముఖత్వంబునఁ బాఱురాత్రిచరులన్ వెన్నాడి మున్నాడి వి
క్రమముం జూపుత్రివిక్రమున్ మరలి చక్కం జూచి రోషంబునన్. 92

మాల్యవదాదులు యుద్ధంబున నోడి లంక విడిచి రసాతలంబు సేరుట.

చ. రణనయవేది యద్భుతపరాక్రమవంతుఁడు మాల్యవంతుఁ డా
క్షణమున వేల దాఁటి చనుసంద్రములీల స్వకీయవాహినీ
గణముఁ గ్రమించి యాహరిముఖాముఖికిం జని ప్రజ్వలత్క్రుధా
రుణనయనంబులన్ మిడుఁగుఱులు సెదరం దల యూఁచి యిట్లనున్. 93

ఉ. ఒప్పునె నీకు మాధవ యహో రణధర్మము వీరధర్మముం
దప్పి భయార్తులై పఱచుదైత్యుల వెన్కొని హింస సేయఁగా
నిప్పని హీనుఁడైన ఘటియించునె భీతులఁ ద్రుంచువానికిం

చెప్పెడి దేమి కీర్తియును క్షేమము స్వర్గముఁ గల్గ నేర్చునే. 94

చ. సమరపరాఙ్ముఖుం దొడరి చంపినవాఁ డెటువంటిమంచిపు
ణ్యము లొనరించినం బొరయఁ డంద్రు దివం బది యట్టు లుండెఁ గ
య్యము ఘటియింప నంతప్రియ మైనను నే నిదె యున్నవాఁడఁ జూ
పుము భుజశౌర్య మీవెఱచిపోయెడిదైత్యులఁ దాఁక నేటికిన్. 95

క. అని పలికి మాల్యవంతం, బనుశైలములీల నిశ్చలాత్ముం డై ని
ల్చినమాల్యవంతుఁ గనుఁగొని, కనుఁగొనఁ గెంజాయ దొలుకఁగా హరిపలికెన్.

ఉ. ఓయినిశాచరప్రవర యొప్పుగ నిప్పుడు పల్కినీరణ
న్యాయము లెందుఁ బోయె సురనాథులఁ దోలెడుచోటఁ జాలుఁ బో
న్యాయముచేతఁ గాదె జయ మందుట మీరు జగం బెఱుంగదే
న్యాయము మేము దప్ప మొక నాఁటికి దెట్లన విన్ము తెల్పెదన్. 97

ఉ. మున్ను విధాత మీకు వరముల్ గరుణించుటఁజేసి త్రోయ రా
కిన్నిదినంబు లేను క్షమియించితి వేల్పులు మాకుఁ బ్రాణముల్
విన్నఁదనంబు వారి కొదవించినమిమ్ము రసాతలంబునన్
మిన్నక తూఱినన్ వెఱచి మి న్నిఁకఁ బ్రాఁకినఁ బట్టి చంపుదున్. 98

మ. అమరుల్ మీవలనన్ భయార్తు లయి నన్నర్థించినన్ దైత్యులన్
సమరక్షోణి జయింతుఁ బొం డని ప్రతిజ్ఞాపూర్వకాభీతిదా
నము మున్నిచ్చితి భీతి నున్న శరణన్నన్ వందినన్ వ్రాలినన్
మిము ఖండింపక పోవ నన్న నతఁడున్ మే లంచుఁ బెల్లార్చుచున్. 99

చ. కనుఁగవ గొప్పనిప్పు లొలుకం బటురోషరసారుణాబ్జలో
చనుఁ డగువిష్ణుమీఁద నొకశక్తి మహాభుజశక్తిఁ బూన్చి వై
చిన నది ఘంటికల్ రొదలు సేయఁగ మంటలు మింట నంటఁగాఁ
జని హరిఱొమ్మునన్ మెఱసెఁ జారుఘనస్థితచంచలాద్యుతిన్. 100

మ. దనుజారాతియు నంతఁ బేరురమునం దళ్కొత్తుతద్ఘోరసా
ధనముం గ్రమ్మఱఁ బూని శాత్రవునిమీఁదన్ వైవ సేనాని పం
చినశక్తిన్బలె మాల్యవంతునెదఁ జొచ్చెన్ వ్రచ్చి దానన్ మహా
శనిపాతంబునఁ గూలునీలగిరియోజన్ వ్రాలె వాఁ డుర్వరన్. 101

చ. తొడిగినజోడు వ్రయ్యలుగఁ దోరపునెత్తుటఁ దోఁగి యాగతిం
బడి మఱి కొంతసేపునకుఁ బైకొనుశ్రాంతి దొఱంగి స్వస్థుఁ డై
యడరి నిశాచరాగ్రణి మహాగిరిపోలిక సుస్థిరాకృతిం
దడఁబడ కేఁగుదెంచి హరిఁ దార్కొని మార్కొని విక్రమంబునన్. 102

మ. రటదత్యుజ్జ్వలకింకిణీశతసహస్రస్ఫారకాష్ఠాయస
స్ఫుటశాతోత్కటకంటకప్రకటమై పొల్పొందుశూలంబు మి

క్కుటపుం దెంపునఁ బూని కేశవునివక్షోదేశముం గ్రుమ్మి యం
తటఁ బోకద్దివిజారి ముష్టినిహతిం దాటించె రోషంబునన్. 103

ఉ. ఆతనిసాహసంబునకు నచ్చెరు వందె వియచ్చరవ్రజం
బాతఁడె మేలుమే లనుచు నార్చిరి దైత్యులు మాల్యవంతుఁ డీ
రీతి ముకుందు నొంచి యరరే నిలు మంచు ఖగేంద్రుమోము ని
ర్ఘాతముఁ బోలుముష్టిహతి ఘట్టన సేసి పరాక్రమించినన్. 104

ఉ. పక్షికులేంద్రుఁ డల్గి నిజపక్షపరంపరఁ బుట్టుగాడ్పునన్
రాక్షసరాజసైనికుల రాయిడిఁ జేసినఁ బండుటాకుల
ట్లక్షమతన్ క్షణం బయిన నచ్చట నిల్వఁగ లేక బెండులై
దక్షిణవార్ధిలోఁ బడిరి దైవవశంబున లంక త్రోవగన్. 105

వ. అంత. 106

మ. వినతానందనపక్షమారుతహతిన్ విభ్రాంతుఁ డై మాల్యవ
ద్దనుజేంద్రుం డట నిల్వఁ గూడక యె సోదర్యాప్తమిత్రంబుగాఁ
జనియెన్ లంకకు సిగ్గుతో నిటులు కంజాతాక్షుచేఁ బెక్కుమా
ర్గనిలో నొచ్చి రసాతలస్థు లయి రయ్యా దానవుల్ రాఘవా. 107

తే. వెలయ సాలకటంకటకులమువార, లధికు లమ్మాల్యవన్ముఖ్యు లాహవమున
రామ నీచేత హతులైన రావణాది,దనుజవరులు పులస్త్యగోత్రంబువారు. 108

తే. రావణాదులకంటె నిర్వక్రవిక్ర,మక్రమంబున ఘను లైన మాల్యవన్ము
ఖాసురగ్రామణుల గెల్వ హరికిఁ దక్క,నలవియె తదన్యులకు భానుకులవరేణ్య.

చ. హరి హరి యంచు మే మనఁగ నన్యువలెన్ విన నేల నీవె శ్రీ
హరి విభు డాలకించినమహాత్త్వము నీయది శంఖచక్రముల్
గరములఁ బూన కిద్దివిజకంటకులం బొలియింప మానుష
స్ఫురణ జనించినాఁడవు ప్రబోధనిధుల్ నినుఁ గందు రాత్మలన్. 110

ఉ. దుర్మతు లెచ్చి సాధులకు ద్రోహము సేయు నెడన్ జగంబునన్
ధర్మము దప్పునప్పు డవతారము లెత్తి విశిష్టరక్షణల్
గూర్మి నొనర్చి దుష్టజనకోటి హరింతువు రావణాదిదు
ష్కర్మపరామరారిగిరిశంబకరా రఘువంశశేఖరా. 111

మ అలపౌలస్త్యులకంటె వీరు లగుపూర్వాదిత్యులన్ లంక వా
రలు ప్రాపించుట శౌరిపై రమున వీరత్వంబు దీఱన్ రసా
తల మా భీరులు సేరుటం దెలిపితిం దర్వాతివృత్తాంతముం
దెలియం జెప్పెద నాలకింపుము కథాధీనావధానుండ వై. 112

వ. అని కలశజుండు మున్ను తన్ను రఘువీరుం డడిగిన ప్రశ్నంబునకు నిటులు సదు
త్తరం బొసంగినవాఁ డై మఱియు ని ట్లనియె. 113

సుమాలినిర్దేశముచే కైకసి విశ్రవునాశ్రమంబు సేరి యతని వరించుట.

సీ. అమరలోకముజోక నాలోకనీయమై, యేలోకము సమృద్ధి నింపొనర్చుఁ
గమలాప్తకమలారికాంతు లొందక యెయ్యే,స్థలము రత్నప్రకాశముల వెలుఁగు
బలినిశాచరసార్వభౌమునాజ్ఞావిశే,షమున నేభువనంబు సౌఖ్యముఁ గను
భోగవత్యాపగాంభోజగంధాని,లవ్యాప్తి నేనెలవు పావనతఁ జెందు
తే. హాటకేశ్వరసేవాగతాగతాహి,కన్యకానూపురార్భటిఁ గర్ణసుఖ మొ
సంగు నేపద మట్టిరసాతలమున,నుండి యంత సుమాలి దా నొక్కనాఁడు.
మ. ధరణీలోకవిలోకనోత్సవ మెదం దాకొన్న స్వర్ణాద్రితుం
గరథస్థుం డయి పుత్త్రి కైకసి నిజాంకం బెక్క రాఁ జంచలా
స్ఫురితం బై తగునీలమేఘమునరీతిన్ భూపాలసద్గాత్రుఁ డై
సరిదంభోధివనప్రదేశముల సంచారంబుఁ గావింపఁగన్. 115

లయగ్రాహి.
చారుపదనూపురములారభటిమీఱ మణిహారములు చన్గవలఁ దాఁపసిల మేలో
య్యారములనచ్చరలు పేరణినటింప వరచారణులు దేవ యవధారని జగైకె
వారము ఘటింపఁ బలుమాఱు వెలిచామరము సూరెల వియచ్చరకుమా
రికలు వీవం
బేరుగలపుష్పకముపై రుచిరలీలగురుఁ జేరఁజనుధీరునిఁ గుబేరుఁ బొడగాంచెన్.

ఉ. కాంచి సుమాలి వెండియు నెగాదిగఁ జూచి కళానిరూఢి నూ
హించుఁగ వీనిఁ బోలఁ గలఁడే యల రేదొర యిట్టిపుత్త్రునిం
గాంచినవిశ్రవోమునిది గా మఱి భాగ్య మయా రె రాక్షసుల్
గాంచ రె సౌఖ్య మీదృశునిఁ గైకసి విశ్రవుఁ జేరి కాంచినన్. 117
మ. అని రక్షోహితకార్యకాంక్షి యగునయ్యాదిత్యవిద్వేషి యో
జనఁ గావించి విముక్తపద్మ యగుశ్రీచందాన నిం పొందునం
దనమో మాదరపూరితేక్షణములన్ దర్శించి వంశంబు మ
న్పునుపాయం బొక టే గణింతు విను మంచుం గూర్మితో ని ట్లనున్. 118
ఉ. మానిని యీమణీమయవిమానముపైఁ జనువాఁడు విశ్రవో
మానికుమారుఁ డీశ్వరసఖానుఁ డుదగ్దిశ యేలు నెప్పుడున్
వీని జయించుపాటిరణవీరులు గల్గుదు రమ్మహామునీ
శానునిభార్యవై యతని సాధుమతిన్ భజియించి తేనియున్. 119
సీ. దౌహిత్రకులముచేఁ దమకు మేలగునంచుఁ,బితృదేవతలుమనఃప్రియముఁ గందు
రాఁడుబిడ్డయు నల్లుఁడని వేడుకలు సేయఁ,గలిగెఁగా యనితల్లి యెలమిఁ బొందుఁ
గన్యకాదానాభిగణ్యపుణ్యఫలంబు, దనకుఁ జేకుఱె నంచు జనకుఁ డలరు
వరుసతో భోగించి వరము లీయఁ దలంచి, యనలేందుగంధర్వులాశ్రయింతు

తే. రాత్మజామణి జనియించె నన్నమాత్ర, నట్టి కన్య యసామాన్య యని యెఱింగి
కులవయోరూపశీలభంగులకుఁ దగిన, విభు వెదకి పెండ్లి గావించి వెలయు గురుఁడు.

మ. తనుజామాత్రవు గావు వంశమున సౌందర్యంబునన్ సద్గుణం
బున శ్రీదేవికి సాటి సేయఁ దగు నిన్ బూఁబోఁడి మావాని కి
మ్మని యేబంధుఁడు వేఁడఁగా వెఱచుఁ బ్రత్యాఖ్యానశంకాప్తి జ
వ్వని వైనన్ దినముల్ గ్రమింపఁబడె నుద్వాహార్హునిం గానమిన్. 121

చ. కమలదళాక్షి కూఁతు నిలఁ గాంచుట మేలగు నైన నొక్కచ
క్షుమున విచారహేతు వని కాంచెద నెట్లగు నన్నుఁ దల్లి వం
శము గురునన్వయంబు పతిసంతతి గన్య దురాత్మ యైన నొ
ప్పమి యపకీర్తియున్ సకలబాంధవనిందయు నొందుఁ గావునన్. 122

ఉ. దీని వరించు వీఁ డనుచు దేవుఁ డెఱుంగును లేకెఱుంగఁడో
కాని తదన్యుఁ డెట్లెఱుఁగుఁ గాన యెఱుంగ నితండు నీవిభుం
డౌ నని తల్లి నీవలన నన్వయ మొప్పఁ బ్రసిద్ధిఁ గాంచు నం
చేనును నెల్లబాంధవులు నెన్నుదు మిప్పని దీర్పవే యనన్. 123

ఉ. కమ్మలడాలు చెక్కుల ధగద్ధగ లీన మొగంబు వాంచి కా
ని మ్మని లేచి సిగ్గు మది హెచ్చిల మ్రొక్కినఁ దండ్రి యెత్తి మా
యమ్మ సుపుత్త్రులం గని శుభాన్విత వై మను మిమ్మహామునిన్
సమ్మతిఁ గొల్చి నీ వని ప్రసన్నత దీవన లిచ్చి పంచినన్. 124

సీ. నఖరుచుల్ చరణారుణచ్ఛాయలను గూడి, యలరుకుంకుమగంధ మవనికొసఁగ
రమణీయమణినూపురధ్వనుల్ శుచిపక్షు, లగుద్విజాతులపల్కు లనుసరింప
సొగసువాలుమెఱుంగుఁజూపు లాశావీథి, కలఁ గల్వవిరిమేలుకట్లమర్పఁ
గరపల్లవశ్రీలు గంకణారవముచేఁ, గోయిలయెలనాగగుంపుఁ బిలువఁ
తే. గాంచికాఘంటికలు మ్రోయ నంచితోరు, కదళికలుమీఱ ఘనకుచకనకకలశ
యుగనిగన్నిగలొలుక నయ్యువిదశోభ, నాకృతిని జేరెఁ బౌలస్త్యునాశ్రమంబు.

క. కాంచనపాంచాలికవలె, మించినయక్కాంచనాంగి మెయిజిగి పయి వ్యా
పించం గాంచినతరువులు, గాంచనతరువుల తెఱంగుఁ గైకొన నచటన్. 126

క. సాయమున మరునికెందొగ, సాయక మన రమణి యిటులు చని హోమంబుం
జేయుచు రెండవస్వాహా, నాయకుఁ డనఁ దగుపులస్త్యునందనుఁ జేరెన్. 127

ఉ. చూచి మరీచిమాలిరుచిఁ జొక్కెడుపద్మినిలీల రక్తితో
నా చెలి యిచ్చ మెచ్చుకొని యాతనిమోముల నతాననాబ్జసం
సూచితలజ్జ యై నిలిచి క్షోణిఁ బదాగ్రమునన్ లిఖించుచున్
వేచినయంత హోమవిధి విశ్రవుఁడున్ నెఱవేర్చి ముందటన్. 128

సీ. తెలివి యాచేరలం దేసికన్నులదాని, మొలకనవ్వులముద్దుమోముదాని

వెలయ సందెఁడుతల వెండ్రుకల్ గలదానిఁ, బస మించు నెలవంక నొసలిదానిఁ
గమ్మడా లోరయు బంగారుఁజెక్కులదానిఁ, దావిపీడెపుఁగావి మోవిదాని
నుబ్బుసిబ్బెపుగబ్బి గుబ్బచన్నులదానిఁ, బిడికిట నడఁగు నెన్నడుముదాని
తే. మెఱుఁగువలె దళ్కుతళుకను మేనిదానిఁ, గన్నెప్రాయంబుచేవన్నె గన్నదానిఁ
దోరపుఁబిఱుందుదానిఁ బెంపొడలదాని, సొగసునడదానినక్కన్నెఁ జూచె నతఁడు.
ఉ. చూచి సవిస్మయాత్ముఁ డగుచున్ ముని యెవ్వతె వేమి నీదు పే
రేచెలి లేక యొంటి యిట కేటికి వచ్చితి వెవ్వరైనఁ బ్రే
రేచిరొ నీవె వేడ్కఁ జరించెదొ కల్గినమాట గల్గిన
ట్లోచెలి చెల్పు మన్న నదియుం గరముల్ ముకుళించి యిట్లనున్. 130
మ. కరుణాసాగర నే సుమాలి యనురక్షస్స్వామిగారాపుఁగూఁ
తురఁ బుష్పోత్కటచెల్లెలన్ రహిం వహింతుం గైకసీసంజ్ఞచే
గురునిర్దేశమునన్ భవచ్చరణముల్ గొల్వం గదా వచ్చితిం
బరికింపం దగు నామనోరథము మీభవ్యప్రభావంబునన్. 131
వ. అని పలికినయచ్చిలుకలకొలికిపలుకులు విని తనమనోదృష్టి నది వచ్చినరాక యెఱింగి సుగుణాభినందనుం డగుపులస్త్యనందనుం డిట్లనియె. 132

కైకసి విశ్రవువలన దశగ్రీవాదులం గనుట.

మ. కలకంఠీమణి నీమనోరథము నేఁ గంటిన్ సుతాపేక్ష నిం
దులకున్ వచ్చితి వైన సంజకడ నన్నుం జేరి మాటాడుటన్
ఖలు లౌరాక్షసు లుద్భవించెదరు నీగర్భంబునన్ నావుడుం
జెలి భీతిల్లి వినీతి మ్రొక్కి వచియించెన్ విశ్రవోబ్రహ్మతోన్. 133
మ. అనఘా మూఁడవబ్రహ్మవై విబుధలోకారాధ్యశీలుండ వై
మనునీతేజమునన్ జనించినసుతుల్ మాంసాశు లై దుష్టవ
ర్తను లై సాధువిరోధు లై మెలఁగు టర్హంబె గుణస్ఫూర్తిచే
నినుఁ బోల్పం దగుసత్కుమారకుల మన్నింపం గదే నావుడున్. 134
మ. అలపౌలస్త్యుఁడు గ్రమ్మఱం బలికెఁ గన్యాం గాలదోషంబు పె
ద్దలకే కాదు విధాత కైన వశమే తప్పింప నిం కేల చిం
తిల నీపుత్త్రులయందు మేటి యనఁగా దీపించు విద్యాగరి
ష్ఠులలో శ్రేష్ఠుఁడు బ్రహ్మనిష్ఠుఁడు గనిష్ఠుం డిందుబింబాననా. 135
క. ననుఁ బోలు బ్రహ్మనిష్ఠుల, నినుఁ బోలుఁ బ్రతాపరుచుల నెనఘువినీతిన్
నినుఁ బోలు నక్కుమారుఁడు, మను నాతనివలనఁ గులము మనికితమేలా.
వ. అని భవిష్యదర్థంబు వివరించి విరించిపౌత్త్రుండు పుత్త్రకాంక్ష లాచరించి తను వరించి మరులుసం దీనరించినయక్కన్యకు గర్భాధానంబుం బ్రసాదించిన. 137
సీ. మేరుశృంగములపై మేఘముల్ డిగురేఖ, నాతిచూచుకములు నల్లనయ్యె

దౌహృదశ్రీ నిల్చుధవళాంబుజముపోల్కిఁ, వెలిఁగంటి నెమ్మోము దెల్లనయ్యెఁ
గృశదైత్యజాతి వర్ధిలు నిటు లనురీతిఁ, గలకంఠి లేఁగౌను బలిత మయ్యె
గర్భగార్భకతనూకాంతి బైలగులీల, విమలాంగినూఁగారు విపులమయ్యె
తే. నలరుఁబోఁడికి నొకయడుగామ డయ్యెఁ, గీరవాణికిఁ జిట్టుముల్ దోర మయ్యె
నబ్జపాణికి మంటిపైనాసయయ్యె, సైకతశ్రోణికిఁ బ్రసూతిసమయమయ్యె.
క. భువనములు దలఁక మునులును, దివిజు లడల ఘనదుగుండె దిగ్గు మనఁగ గా
హువు శని మొదలగుదుర్గ్రహనివహము నికటస్థలమున నిలిచినవేళన్. 139
సీ. పిడుగుఁజప్పుడుతోడ బెడఁగు జేగుఱునిండు, ఛాయ దేఱెడుదశాస్యములతోడ
నిడుదకోఱలతోడ నెరయఁ గాటుకరాశి, యైనట్టి గనుపట్టుమేనితోడఁ
జుఱుకుఁజూపులతోడ జ్యోతిర్లతారుణా, రుణము లౌకఱకువెండ్రుకలతోడఁ
దామ్రోష్ఠములతోడ దారుణాహ్వలలీల, వెలయువింశతిభుజార్గళులతోడఁ
తే. భయము బీభత్స మొలయురూపంబుతోడఁ, గైకసీభామినీమణిగర్భమున మ
హోగ్రుఁ డగురాక్షసుం డొకఁ డుదయమయ్యెఁ
గాలకూటంబు వారాశి గనినయటుల. 140
శా. ఆరక్షోవరుఁ డుద్భవించు నెడ గృధ్రారావముల్ మించె మే
దోరక్తంబులు మేఘముల్ గురిసె నాందోళించె భూతావళుల్
భీరుత్వం బెనసెన్ సురౌఘములు గంపించెన్ సృగాలచ్ఛటల్
భూరిజ్వాలలు వాంతి సేసె రవిదీప్తుల్ మాసె మ్రోసెన్ దిశల్. 141
క. ఆవేళఁ బుత్త్రజన్మము, భావించి పులస్త్యసుతుఁడు పఱతెంచి దశ
గ్రీవుం డనుపే రతనికిఁ, గావించి యథోచితంబుగా నున్నయెడన్. 142
ఉ. వెండియు విశ్రవస్స్ఖలితవీర్యమునన్ బలుచూలు దాల్చి బ్ర
హ్మాండవిఖండనోద్భటతరార్భటి మీఱెడువానిఁ గుంభక
ర్ణుం డనుపుత్త్రునిన్ సురవరుల్ బెగ డందఁగఁ గాంచె నంత న
య్యండజయాన శూర్పణఖయన్ తనయం గనియెం గ్రమంబునన్. 143
వ. తదనంతరంబున. 144
మ. గుణరత్నాకరుఁ డింద్రియార్థమదదంకూరాహివన్యాశుశు
క్షణి విద్యానిధి విశ్రవఃకులహితాచారాశ్రయుం డార్యపో
షణచింతామణి సర్వభూతకరుణాసంగాత్మకుం డౌవిభీ
షణుఁడుం గైకసిగర్భవార్ధిఁ బొడమెన్ సంపూర్ణచంద్రాకృతిన్. 145
తే. ఆకుమారత్రయంబున కాగమోక్తమార్గమునఁ దండ్రి జాతకర్మంబు నామ
కరణములు మున్నుఁ గాఁ గలకర్మతతులు
క్రమమున నొనర్చి యుపనయనములు సేసె. 146
వ. ఇత్తెఱంగున నవ్విశ్రవస్సనూజాతు లుపనీతు లయి తండ్రివలన నఖిలవిద్యా

విశేషంబు లెఱింగి చిత్రభానుత్రయసమానులు దినదినప్రవర్ధమానులునై వెల యుచుండి రయ్యవసరంబున. 147

దశగ్రీవకుంభకర్ణవిభీషణుల బాల్యక్రీడలు.

సీ. అలఁతిగట్టులు భుజాగర్గళనిరర్గళత ను,త్పాటించి కందుకవ్యాప్తిఁ జూపు
నుడువీథి నొరసి పోయెడువిమానము లందు,కొని బిట్టు నేలతోఁ గొట్టియార్చు
నాశ్రమోన్నతభూరుహములు దాఁబడఁద్రోచి,పఱచుమానులడాసి పరిహసించు
శరభసింహాద్యుదేభసమితి నీడిచి తెచ్చి, గట్టిగా దామెనఁ గట్టివైచు
తే. గరుడగంధర్వపన్నగాగ్రణుల నెచటఁ,గనిన మీఁతో భుజాభుజిఁ బెనఁగవలయు
నిలువుఁ డను వార లుఱుక వెన్వెంటఁ దగులు
బాల్యలీలావిలోలుఁడై పంక్తిముఖుఁడు. 148
సీ. గిరిదిశాకరిభోగికిటికూర్మములు వ్రాల, నంఘ్రిఘట్టన నుర్వి నడఁగఁద్రొక్కు
నరుణనోదితరథం బట్టిట్టుగాఁ బట్టి, నలినాప్తుబింబంబు నాకి విడుచుఁ
బార సాఁచి దిగీశపట్టణాభ్యంతరో,ద్యానపక్వఫలాగతతులఁ గూల్చుఁ
గనుఁగొన్న వైమానికశ్రేణివివృతాస్య,బిలగతంబుగ నొక్క పెట్ట మ్రింగు
తే. నెదుటఁ బడకున్న మునికోటి వెదకి వెదకి,పట్టిభక్షించుఁ గ్రొవ్వెగఁ దొట్టిగుఱక
విడిచినిదురించు లేచునల్లడలఁ దిరుగుఁ,గుంభకర్ణుండు నడయాడుకొండకరణి.
చ. అతనిసహోదరుండు సుజనావనశాలి విభీషణుండు సు
వ్రతములు సల్పుచుఁ శ్రుతిపరంపరయర్థముఁ దండ్రి దెల్పఁగా
హితమతి నాలకించుచు జితేంద్రియుఁడై యుపకారశీలతం
బ్రతిదినముం జరించు మృదుభావముతోఁ గులధర్మపద్ధతిన్. 150
ఉ. అన్నలు సేయురాయిడి భయాతురులై పరు వెత్తుమానులం
గన్నులఁ జూచెనేని దనుకంపము మానిచి నానిమిత్త మా
పన్నుల వీరిఁ బ్రోవుఁ డని ప్రార్థన సేయు నతండు వారలం
బిన్నతనాననుండియు విభీషణుఁ డెంతపరోపకారియో. 151
క. క్రూరుఁ డగుకుంభకర్ణుని,ఘోరిఁ బడి విభీషణోక్తి బ్రదికి మునులు త
త్కారుణికుని నీవిపుడు, రారవితారముగ బ్రదుకు మన్నా యనుచున్.
ఉ. అంతట నొక్కనాఁడు దమయయ్యఁ గనుంగొన రత్నఘంటికా
క్రాంతవిమాన మెక్కికొని కన్నులపండువుగా ధనేశ్వరుం
డెంతయు వేడ్క వచ్చుచెలు వెల్లను దప్పక చూచి కైకసీ
కాంత స్వభావసిద్ధ మగుక్రౌర్యమునన్ దశకంఠుతో ననున్. 153
మ. కనుఁగొంటే భవదగ్రజుం డయినయక్షస్వామిసౌభాగ్య మీ
తనిచందంబున నీవు నిట్టిసిరు లొందం జూడఁ గాంక్షించెదం
దనయా యెందును నీదృశస్ఫురణఁ జెందన్ వచ్చు నానేర్పుఁ గై

గొను శీఘ్రంబున నేఁటి కూరక యశస్స్తంభంబులీ వర్తింపఁగన్. 154

వ. అని ప్రబోధించిన. 155

మ. జననీవాగ్వ్యజనానిలజ్వలితరోషజ్వాలియై యద్దశా
ననుఁ డిట్లంచుఁ బ్రతిజ్ఞఁ జేసె జననీ నామాట తథ్యంబుగా
విను మే ఘోరతపస్వినై ధనదుకీర్తిన్ మించెదన్ లేనిచోఁ
దనతేజంబున నీదృశంబగు ప్రభుత్వం బైనఁ బ్రాపించెదన్. 156

క. వెక్కువకు సాటియును గా, కెక్కువయుం గాక జోక నీతనికంటెం
దక్కువయై రా నిఁక నను, మక్కువ వీడ్కొలుపు మని సమగ్రవినీతిన్. 157

మ. వినతుల్ సేసె దశాననుండు మమతన్ వేమాఱు దీవించు న
జ్జననిన్ వీడ్కొని కుంభకర్ణుఁడు గనిష్ఠభ్రాతయున్ వెంట రాఁ
జని గోకర్ణసమాహ్వయాశ్రమము విశ్వాసంబుతోఁ జేరి కాం
చనగర్భున్ మది నుంచి యుగ్రతపముల్ సల్పంగ నుద్యుక్తుఁడై. 158

వ. తమ్ములతో ని ట్లనియె. 159

దశగ్రీవాదులు బ్రహ్మనుగూర్చి తపంబు సేయుట.

సీ. కమలగర్భుఁడు భక్తకామధేనువు నిక్కువంబు గా వత్సలత్వంబుఁ జూపుఁ
బరమేష్ఠి యాశ్రితపారిజాతము శ్రాంతిఁ, బాపి కావలసినఫలము లొసఁగు
భారతీనాథుండు ప్రణతచింతామణి, రాతనం బూనియు రక్తి నెరపు
చతురాననుండు దాసనసమీపమేరువు, గర్వరదాతృత్వగరిమ మించుఁ
తే. దాత తాపసజనకామితప్రదాత, పెద్దవేల్పు మునిశ్రేణిఁ బ్రీతి నిల్పు
నలువ యతిపిక్షుశాఖులు నిలుచుకలువ
యతని భజియింప మనకోర్కు లబ్బు టరుదె. 160

మ. అని వాణీరమణీమనోహరునిమాహాత్మ్యంబు వర్ణించి య
య్యనుఁగుందమ్ముల నిర్వురన్ ఘనతపస్స్యాసక్తచేతఃప్రవ
ర్తనధౌరేయులఁ జేసి వారి సవిధారణ్యంబులన్ నిల్పి తా
నును బ్రత్యేకవనాంతరంబునఁ బ్రశాంతుండై తపం బున్నెడన్. 161

సీ. వనజకాననశోషకున కెంత కువలయ,పరితాపకృతి నాఁగఁ బ్రబలుతపను
కరములు సోఁక భగ్గన మండురవిరత్న,ములతనుజ్వాలిక లొలసినపుడె
చురచురఁ గా లెడిశుష్కతృణశ్రేణి, సరణిఁ గన్పడునికుంజములఁ దగులు
మంటలు వెదురుజొంపములఁ బ్రాఁకమహోగ్ర,మైతదంతికభూరుహముల నెగసి
తే. దరికొనివహించునక్కాఁకఁ దాళలేక, తెరలిమృగములుమృగతృష్ణకరిగిపొరుగు
మండువేసవిఁ బంచాగ్నిమధ్యమునను, గుంభకర్ణుండు గావించె ఘోరతపము.

క. ఇటు లెండకు వానకు నుత్కటతర మగుచలికి వెఱక కంపింపక వే
సటఁ బడక కుంభకర్ణుఁడు, పటునిష్ఠ ఘటించెఁ దపము పదివేలేఁడుల్. 163

సీ. కంటిచూపు జగంబు కంటిరూపు సజాతి, కద్యుతికతన నైక్యంబు సేసి
సర్వభూతదయా ప్రసన్నభావంబుతోఁ, దరలనినియమంబుఁ దగులుపఱిచి
యించుకించుక సందడించుకోరికలతో, వివిధేంద్రియవికారవితతు లడఁచి
ద్వంద్వముల్ సహియించుతాల్మికంబంబుతోఁ, గడఁచి త్రైభంబుఁ గట్టివైచి
తే. కమలపట్కంబు శోధించి కమలభవుని, కమలపదములు దలఁచుచు గాఢశక్తిఁ
దగ విభీషణుఁ డేకపాదమున నిలిచి, యైదువేలేండ్లు గావించె నతులతపము.
క. మఱి యైదువేలయేఁడులు, దెఱచినకను మూయ కినునిదెసఁ జూచుచు నే
త్రైనూర్ధ్వబాహుఁడై మఱి, దఱుమక శ్రుతి నొడివికొనుచుఁ దపమొనరించెన్.
మ. ఎలుకల్ పిల్లులు నీలకంఠములు భోగీంద్రంబు లేణచ్ఛట
ల్పులులుం సింహము లేనుఁగుల్ శరభశాఖుల్ గండభేరుండముల్
చెలిమిం జెంది విభీషణాశ్రమమునం జెల్వొందు భూనాథ యం
దుల కుప్పొంగి నటింతు రచ్చర లమర్త్యుల్ పూలు వర్షింపఁగన్. 166
వ. అని పలికి లోపాముద్రాధిపతి వెండియు రామభద్రున కిట్లనియె. 167

పంక్తిముఖుఁడు వీరహోమంబు సేయుట.

సీ. అఖిలలోకాతీత మగుమహామహిమంబుఁ, బడయంగ నూహించి పంక్తిముఖుఁడు
విధిదేవతాకమై విలసిల్లుమంత్రంబు, జపియించుచును నిరశనతఁ దాల్చి
యొకకాలి పెనువ్రేల నుర్విఁ జక్కఁగ నిల్పి, సూర్యావలోకనధుర్యుఁ డగుచుఁ
దనహృదయాకాశమునఁ బితామహు నుంచి, ధ్యానించి వేయేఁడు లైనవెనుక
తే. నగ్రిమున మండునుగ్రతరాగ్నిలోన, మునుకొని కరాసిఁ దలఁ ద్రుంచి కొనిస భక్తి
కముగ బ్రహ్మార్పణంబగుఁ గాక యంచు, వీరహోమంబుఁ గావించె విస్మయముగ.
మ. వికటాచారుఁ డతండు నిశ్చలమతిన్ వేయేండ్ల కొక్కొక్కమ
స్తకమున్ ఛేద మొనర్చి వేల్చు దమున స్సంభాసితార్చిం దదీ
యకరోటిప్రతతుల్ పటిల్లు మని వ్రయ్యం బుట్టు ఘోషం బజాం
డకటాహస్ఫుటనాప్రచండతరమై నానాదిశల్ నిండఁగన్. 169
. పౌలస్త్యార్చితకీకసాస్రపలశుంభన్మస్తకప్లోషణ
స్థూలాభీలకరాళపావకశిఖాస్తోమంబు ధూమంబుతోఁ
బాలోమీపతిప్రోలు చుట్టికొనియెన్ భావిప్రవృద్ధాసురో
ద్వేలాస్త్రాగ్నులు తద్బలంబు లిటు లుద్దీపించు నన్పోలికన్. 170
మ. ఉరునిష్ఠోగ్రదశాస్యనిర్మితశిరోహోమక్రియాదగ్ధమే
దురమేదఃపలలాస్థికైశికమిళద్దుర్వాసనల్ భూనభో
ంతరముల్ నిండఁగ సైఁప నోప కిఁక నెన్నం డిచ్చునో వీనికిన్
వర మబ్జాసనుఁ డంచు నంచు వినుత్రోవం బోవు దేవౌఘముల్. 171
క. కైకసిసుతుఁ డిటువలెని, ర్వ్యాకులమతి దశసహస్రవర్షము లరుగన్

భీకరగతిఁ బడియవతలఁ, వీఁకం దెగఁ గోసి వహ్ని వేల్వఁగఁ దలఁచెన్. 172

వ. అప్పుడు. 173

చ. గగనము మ్రోసె వీచె సుడిగాలి సముద్రము లింకె మేరువుల్
దిగఁబడె భూమి చక్రముగతిం దిరిగెన్ రవి తోఁచ దప్పె న
మ్మగలమగండు వీక దశమంబగు మస్తకము త్తరించి వే
ల్వఁ గడఁగి హోమవహ్ని చటులంబుగఁ బ్రజ్వరిలంగఁ జేసినన్. 174

శా. ఆపౌలస్త్యవివర్ధమానఘనహోమాగ్నిజ్వాలజాలికల్
పైపైఁ బ్రాఁకిన దిక్పతుల్ యతులు విభ్రాంతాత్ములై సర్వలో
కాపూర్ణాధిపతిత్వసౌఖ్యనిధి బ్రహ్మం జేరి సేవించి స్వా
మీ పద్మాసన యార్తులన్ మముఁ గృపాదృష్టిన్ విలోకింపవే. 175

మ. దశకంఠాసురుఁ డగ్నిఁ దొమ్మిదితలల్ దా వేల్చియున్ నేఁటి క
ద్దశమం బైనశిరంబు వేల్వఁ గడఁగం దద్ధోమధూమచ్ఛటల్
దశదిగ్భాగము లావరించె నిఁకఁ బ్రత్యక్షంబు గా కుండి తే
ని శిఖిజ్వాలలఁ గ్రాఁగు ముజ్జగములున్ నిక్కంబు వాణీశ్వరా. 176

ఉ. ఒప్పిద మైననీకరుణ నున్నతుఁడై మతి మీఁదు గా జగం
బప్పిశితాశి యేఁచు హవనానిల మిప్పుడె యేఁచఁ బూనెడిం
జెప్పెడి దేమి యింక నెడ చేసినఁ దప్పగు మీఁదిబాధ కే
మొప్పితి ముగ్రమవ్వికృతహోమము మాన్పఁ గదయ్య చయ్యనన్. 177

వ. అని భయోత్పాతవిధూతచేతస్కులై చేతులు ముకుళించి ప్రార్థించువేల్పు
దొరల దరహాసవదనంబు దెరలం గనుంగొని మంచి దని సమ్మతించి విరించి
కాంచనమయకమలాసనంబు డిగ్గ నుఱికి యతిసత్వరంబుగ. 178

బ్రహ్మ ప్రత్యక్షమై దశగ్రీవవిభీషణులకు వరంబు లొసంగుట.

సీ. శ్వేతకేతుఁడు జోకసేసి తెచ్చినపద్మ, ర్వన్నెయంచవహుమాయి వడిగ నెక్కి
వెనువెంట వచ్చు సావిత్రీముఖస్త్రీల, ప్రణయభాషలమీఁది బాళి మాని
ప్రాఁబల్కుతుదలతోఁ బ్రణుతించుసంయమి, ప్రవరులనుతిఁ బెడచెవులఁ బెట్టి
సృజనాక్రమముఁ దెల్పఁ జేరికై నడచుబ్రహ్మలదిక్కు గని మాటలాడ మఱచి

తే. గునుకుపరువునఁ బఱతెంచుకోడుకువీణ, వినెడురక్తియుఁ బూనక వేల్పుఁ జెలువ
లాడఁ బాడంగ నెడ యీక యాక్షణమున
దశముఖున కబ్జభవుఁడు ప్రత్యక్ష మయ్యె. 179

శా. ఈచందంబునఁ బంక్తికంఠునకు వాణీశుండు గాన్పించి వీ
రాచారుం డతఁ డున్నయొక్కతలపై హస్తాసిఁ బూన్పంగ నో
హో చాలింపు దశాస్య యీతెగువ కుద్యోగింతురే మెచ్చితిన్
నీచిత్రాధ్వరకర్మ నైష్ఠికతకున్ నీకోర్కు లీ వచ్చితిన్. 180

వ. అని వారించి హితోక్తులు వివరించిన విరించనుపలుకు లాలించి సాహసోద్యో
గంబు సాలించి లేచి తల యెత్తి యతనిం బొడగాంచి పులకాంచితశరీరుం
డయి యవ్విశ్రవసఃకుమారుం డనేకనమస్కారంబు లాచరించి యిరువదికరం
బులు ముకుళించి హర్షగాద్గద్యంబు వహించి యి ట్లని స్తుతియించె. 181

సీ. ప్రకృతిదురాపమై । పరిపూర్ణరూపమై, యొసఁగుసత్తామాత్ర । మీవె కావె
సత్త్వప్రధాన మై । సాక్షితాధీన మై, యొసఁగునీశ్వరతత్త్వ । మీవె కావె
సృష్టినిర్మాత వై । యిష్టార్థదాత వై, యొసఁగుసర్వనియంత । వీవె కావె
పురుషాహ్వయుండవై । బోధమయుండవై, యొసఁగుమహాత్ముండ । వీవె కావె
తే. నిన్ను సృజియించుకొన్నది । నీవె కావె, నిన్ను నీయందుఁ గనుఁగొందు । నీవె కావె
యెల్లశ్రుతులెంచ మనువేల్పు । వీవె కావె, యెల్లశ్రుతులకు నావాస । మీవె కావె.

మ. తనుబుద్ధీంద్రియముల్ వికారములు నాత్మం జెందఁగాఁ జేసి వా
నిని దత్తద్బహుకర్మముల్ సలుపఁగా । నీవే నియోగించి యం
దున దారిద్ర్యము వైభవంబు సుఖముల్ । దుఃఖంబుఁ గాలంబు వెం
టనె కల్పించి సమస్తముం గనునినున్ । ధ్యానింతు నశ్రాంతమున్. 183

ఉ. దేవ శుభాశుభస్థితులు । దేవనరాసురముఖ్యు లొందఁ గా
నీవె యొనర్తు వాఢ్యుఁడవు । నీ కొకవిన్నప మాచరించెదన్
జీవులు మృత్యువన్న వెఱఁ । జెందుదు రుగ్రవిరోధి మృత్యువే
కావునఁ దద్భయంబు వెలిఁగా బ్రదుకన్ వర మీయవే కృపన్. 184

మ. గరుడాదిత్య నభశ్చ రాసుర మరు । ద్గంధర్వ సిద్ధర్షి భా
స్వర విద్యాధర యక్ష కిన్నర పిశా । చ ప్రేత రక్షః ఫణా
ధర భూత గ్రహ విశ్వ సాధ్య వసు రు । ద్ర శ్రేణిచేఁ బోరులన్
మరణం బొందనిమన్కి యిమ్ము గణియిం । పం దక్కుమర్త్యాదులన్. 185

మ. అని ప్రార్థించినఁ బద్మగర్భుఁడు దదీ । యాశాస్య మీడేర్చి తెం
పున ము న్నాతఁడు వహ్ని వేల్చినశిరం । బుల్ గ్రమ్మఱన్ మొల్చి చె
ల్వొనయం గట్టడ సేసి సౌఖ్యనిధి వై । యీ రేడులోకంబులం
దు నజయ్యుం డను కీర్తిఁ గాన్పు మని సం । తుష్టాత్ముఁ గావించుచున్. 186

చ. అతనిసపర్యలం బ్రముదితాత్మకుఁ డై పరమేష్ఠి యోగరం
జితమతి యావిభీషణునిఁ । జేరి తపంబున ధర్మమార్గసు
స్థితి ననివార్యభూతహిత । శీలత నీ ప్రతిఁ గాన నేను మె
చ్చితి నిను వత్స నీవలచు । చింతితముల్ గణియింపు నావుడున్. 187

శా. అంతర్నాదము విన్న యోగివరున । ట్లామాట లాలించుచున్
సంతోషించి విభీషణుండు విమల । స్వాన్తం భవాన్తం దయా
వన్తం శాన్త మనన్తరూపిణ మహం । వన్దే యటంచున్ వచః

గాంభీర్యము నీకు సమస్కరించి పలికెన్ । గంభీరవాచార్భటిన్. 188

ఉ. ఇనుమును నిగళంబులుం గళల । నిండుడు కీలల వహ్ని వన్నెగాం
చిన క్రియ సద్గుణంబులఁ బ్రసిద్ధి వహించినలోకకర్త నీ
వనయనకూర్మి వచ్చి నను । నెంతయు మెచ్చితి నంటి వింతకం
టెను వర మున్నదే యిపుడు । నేఁ గృతకృత్యుఁడ నైతి నీశ్వరా. 189

ఉ. ఐన నమోఘదర్శనుఁడ । వై నజగత్పతి వీవె మెచ్చి యిం
పైనవరంబు వేఁడు మని । యానతి యియ్యఁగ నూరకుండ రా
దే నుతి సేసి వేఁడెద సహింపఁగఁ గూడనియట్టియాపదన్
మానితధర్మమార్గమున । మామకచిత్తము నిల్పఁ జేయవే. 190

క. ఏయాశ్రమంబుఁ జెందిన, నాయాశ్రమధర్మమునకు । ననుకూలముగాఁ
జేయుము హృదయము ధార్మికుఁ డేయెడ నవిజయ్యుఁడనఁగనే విని యుందున్.

తే. శిక్షితము గాక యె మదీయచిత్తవృత్తి,కనుగుణంబుగ నిమ్ము బ్రహ్మాస్త్రమనిన
నావరము లిచ్చి తద్బుద్ధికజుఁడు మెచ్చి, యిచ్చననుకంపజనియింపనిట్టులనియె.

ఉ. అసురయోనిఁ బుట్టియును । నాసురవృత్తి యొకింత లేదు నీ
కీసురలైన దీటగుదురే భవదుక్తులు నన్నుఁ బ్రీతునిం
జేసె నమర్త్యభావము సుశీల యొసంగితి నింక నీవు దే
వాసురకోటిలో ఘనుఁడ । వై మను మంచు ననుగ్రహించినన్. 193

క. కొనియాడి రమరులజుఁ గనుఁ,గొని యాడిరి వేల్పుముద్దుగుమ్మలు వెత నీ
డ్కొని పాడిరి గంధర్వులు, వెను పగునమరత్వ మవ్విభీషణుఁ డొందన్. 194

చ. పరహితుఁడైనవానికి శుభంబు లభించిన నెల్లవారలున్
హరుసమె కందు దుర్జనున । కాయువు శ్రీయును వృద్ధిఁ బొందినం
బ రమభయంబుఁ జెందుదురు । భానుకులేశ్వర కావునన్ దయా
పరుఁడు విభీషణుం డమరభావము నొందిన నుబ్బి రందఱున్. 195

సరస్వతితోడ్పాటుచే బ్రహ్మ కుంభకర్ణునకు నిద్రను వరంబుగా నిచ్చుట.

చ. బిసరుహగర్భుఁ డిట్టులు విభీషణుకోర్కి యొసంగి పాభవం
బెసఁగఁగఁ గుంభకర్ణుకడ । కేఁగెడునప్పుడు వేల్పు లాడి ర
య్యసుర కభీష్ట మియ్యఁ దగదయ్య పరాకు సరస్వతీశ వాఁ
డసదృశకాయుఁ డీభువన । మంతయు మ్రింగఁగ నోపు నొక్కటన్. 196

సీ. గట్టిగాఁ బద మూర్విఁ । బెట్టెనేనియు సప్త, పాతాళలోకముల్ భగ్నము లగు
నొక్కమాటటు నిల్చి నిక్కెనేనియు శిరము, ప్రహతిచేనూర్ధ్వకర్పరము లగలు
నుత్సాహ మొదవమై । నుబ్బించె నేనియుఁ, బచ్చిగోడలజాడ । విచ్చు దిశలు
లేచి నీల్గుచు బార । సాఁచె నేనియుఁ జక్ర, వాళాచలేంద్ర మవ్వలికి వీఁగుఁ

తే. గేరి నవ్విన మింటికోటివారి కెల్ల, గుండెదిగు లగు మమ్ముఁ బేర్కొనఁగ నేటి

కీవఱకు వాఁడు సేసినహింస లెంచఁ, గూడ దటువంటిఖలు దయఁ జూడ నేల.

ఆ. తనువుఁ జూత మన్నఁ గన రాదు తుదమొద,లాత్మఁ జూత మన్న నతికఠినము
నడకఁ జూత మన్నఁ గడుహింస వాఁ డేల,ధాత వానితపముఁ దయ్య మెఱుఁగు.

క. నందనవనవాసినులఁ బు,రందరసహచరల నచ్చరలఁ జెక్కుండ్రన్
మ్రందించె మిగులఁగె నరముని, బృందంబుల ఖలుఁడు వీఁడు పిన్నతనమునన్.

క. ఏవరము లేకయే బలు,కావరమున జగము లేఁచు ఖలునకు వరముల్
దేవర యొసఁగుట మండెడు,పావకులో నేయి వోయు భావము గాదే 200

ఉ. కావునఁ గుంభకర్ణుపయిఁ గారుణికత్వము మాని నీవు మా
యావివశాత్ముఁ జేసి వర మంచొక దాని నొసంగినన్ శుభం
బావహిలున్ జగంబులకు నంచు సురల్ వివరింప భారతీ
దేవిముఖంబుఁ జూచెఁ దొలిదేవర సాదరవీక్షణంబునన్. 201

వ. ఇట్టువలెఁ దనమొగంబుఁ గనినఁ నలుమొగంబులవేలుపుదొరయింగిత మెఱింగి మెఱుంగుల తెఱంగునఁ దుఱంగలించుమెఱుంగుఁజూపులఁ దొంగలిఱెప్పల నప్పళించుచు విప్పుగలకప్పుఁగొప్పువిరులనరులకై కప్పుకొనునళిపరంపరల కళుకు సంపాదించునవతంసచాంపేయప్రభాసంపదలకు లాకె లగుచుఁ గనత్కనకతాటంకదీప్తులు విద్దెంబుఁ జూపుకోపున నందంపుఁజెక్కుటద్దములపై ముద్దు గురియం గరంబులఁ బుస్తకాక్షమాలికావిపంచికలు మెఱయఁగొదమ రాయంచ వలె నచ్చదువులజవరాలు పతియెదుటి కరుగుదెంచి యుదంచితాంజలి యొనరించి వినయలజ్జాభరానతవిలోకనంబులం దద్వదనంబు లలంకరించి యల్లన యేమిపని యాచరింతు నాన తిం డనిన నజుండు నద్దేవి నాదరించి యి ట్లనియె. 202

మ. సరసీజేక్షణ యెల్లజీవులరసజ్ఞల్ సేరి క్రీడించు నే
ర్పరి నీవే కద కుంభకర్ణురసనాభాగంబునన్ నిల్చి నే
వర మీ వచ్చినవేళ నయ్యసురచే వ్యర్థోక్తు లాడింపు మేల్
వరముల్ గోరఁగ నీకు పొమ్మనిన నవ్వాగ్దేవి య ట్లుండినన్. 203

మ. అమరజ్యేష్ఠుఁ డనంత నయ్యసుర డాయం బోయి లే కుంభక
ర్ణ మహాభాగ భవత్తపంబు గన నానందంబు వర్ధిల్లె వేఁ
డు మభీష్టం బొడఁగూర్తు నిప్పు డన వాఁడున్ మ్రొక్కి షాణ్మాసముల్
తమి నిద్రింపఁగ నొక్కనాఁ డశన మొందం జేయవే నాపుడున్. 204

చ. పనజుఁ డట్ల యానది యవశ్యము మేలు సుఖాన నిద్ర పొ
మ్మని సురకోటితోఁ జనియె నంత సరస్వతియుం దదాస్యవ
ర్తన ముడిగెన్ నిజప్రతిభఁ దాలిచి యప్పుడ కుంభకర్ణుఁడుం
దనను డువుల్ దలంచుకొని తా నిటు లంచుఁ దలంచె నెంతయున్. 205

మ. అకటా పద్మజునంతవాఁడు వర మిట్లియ్యన్ వచ్చినన్ మంచికో
రిక లర్థింపక నిద్ర యిమ్మనెడి వెఱ్ఱిం గంటిమే యిట్టి దే
టికి నానాటికి వచ్చె హా తెలిసికొంటిన్ వేల్పులే చేసి రీ
వికలత్వం బిఁక నేల యైన పనికిన్ విభ్రాంతి గావింపఁగన్. 206

క. పౌరుషమునకును దైవం, బారయ ఫలకారి యందు రాదైవంబే
వైరస్యము వహియించిన, నేరూపునఁ బురుషుఁ డొందు నిష్టార్థంబుల్. 207

క. దైవోపహతుఁడు సుకృతపుఁ, దోవ వెదకి పోవ నదియె దురతియగు మేల్
గావలయు నన్నఁ గీడగుఁ, గావున నిఁక జాలిఁ జెందఁగాదనుచున్నన్. 208

ఉ. అన్నయుఁ దమ్ముఁ డచ్చటికి నంతటిలోఁ గడువేడ్క వచ్చి తా
నున్నవిధంబుఁ జూచి యదియున్ విని దైవమె యిట్లు సేసిన
న్విన్నఁదనంబుఁ జెందఁ దగునే వగ పేటికిఁ బామరుండవే
యన్నఁ గలంక దేఱె నతఁ డర్కకులేశ్వర వారిమాటలన్. 209

క. ఈ తెఱఁగున దశకంఠుఁడు, ధాతవరంబునను గామితము లొనఁగూడన్
భ్రాతృసమేతంబుగ శ్లే, ష్మాతకవనమునకుఁ జనియె సంతోషమునన్. 210

వ. అని యెఱింగించి రఘుకులగ్రామణితో మఱియు నగస్త్యమునిశిఖామణి
యిట్లనియె. 211

### సుమాలిప్రముఖులు రసాతలముననుండి విశ్రవునాశ్రమమునకు వచ్చుట

చ. దశముఖుఁ డీప్రకారమునఁ దమ్ములతోఁ జని తల్లికిం బ్రదీ
ప్రశమధి యైన తండ్రికిని భక్తిఁ బ్రణామము లాచరించి దై
త్యశతము గొల్వఁ బాయక తదాశ్రమభూమి వసించు టంతయున్
విశదముగా నెఱింగి కడువేడుకఁ బొంగి సుమాలి యయ్యెడన్. 21

చ. చిలువలగుంపు వెల్వడిన చెల్వున రాక్షససైనికుల్ రసా
తలముననుండియున్ వెడలి తన్ భజియింపఁ బ్రహస్తముఖ్యపు
త్రులు సహితాప్తబంధు లయి తోడన రా దుహితృప్రియాత్మజా
తులఁ దిలకించు నుత్సవము దోరము గా సరుదెంచుచున్నెడన్. 213

శా. ఆమాతామహులరాక మున్నె విని భ్రాత్రన్వితుఁడై కైకసీ
కామిన్యగ్రసుతుం డెదుర్కొని నమస్కారంబులం బూజలన్
క్షేమప్రశ్నములన్ వినీతియును భక్తిస్నేహముల్ సూప న
త్యామోదంబు వహించి యాతఁడును నుద్యత్ప్రౌఢవాగ్జృంభణన్. 214

సీ. చిలువమేపరిపుల్గు బలుచట్టుపలఁ బుట్టు, గాడ్పుచే నొదవిన కాళ్లవడఁకు
గొంటుబంగరుఁగంటి కంటువేలుపువింటి, గుణరవంబున నంటు గుండెదిగులుఁ
దొలివేల్పుఁజిందంపుఁదోరంపురవళిచేఁ, గర్ణరంధ్రములందుఁ గవియు చెవుడు
వేయియంచులవాలు మోయు చుద్ధతిడాయు, నపుడు పైకొనిన భయజ్వరంబు

తే. నేఁటితోఁ బాసె రాక్షసానీకమునకు, వీరహోమంబుచే నీవు వేల్పుఁ బెద్ద
వెఱఁగుపడఁ జేసితోఁ గైకవిజయహేతు,వరములొందుటఁబౌలస్త్యవరకుమార.

మ. పరిపూర్ణోజ్జ్వలకార్తికీకుముదినీప్రాణేశ్వరజ్యోత్స్నవై
ఖరి నీకీర్తిరమావిలాసము పొసంగెన్ సొంపుఁ గాంచెన్ నిశా
చరవంశాబ్ధి మదీయహృత్సరసిజోత్సాహైకసంపాదన
స్ఫురణన్ మించె భవత్ప్రతాపరవి రక్షోనాథ నిక్కంబుగన్. 216

మ. పరమాన్నాజ్యసమిన్మఖాహుతులచే బ్రహ్మార్పణం బంచు న
ధ్వరముల్ సేయుదు రందఱున్ వసుమతిన్ ధైర్యోన్నతిన్ నీగతిన్
శిరముల్ వాణిఁ గృపాణిఁ జేర్చి యనలార్చిన్ వేల్చి నీయద్భుతా
ధ్వరకర్మం బొనరింప రెవ్వరును సత్యం బాసురగ్రామణీ. 217

తే. మిగులఁ గోపించి తన్నినభృగుమహర్షి,యడుగుపట్టినవేల్పురాయడికి వెఱచి
యడుగుపట్టినదైత్యులయాపదబ్ధి,కధిప యుష్మత్ప్రతాపమహోర్వాగ్ని యయ్యె.

క. బలియుం డన్వయకర్తవు, కలిగితి వీక నేల డాఁపఁగా మనకొఱకే
తొలుతన్ మత్ప్రేరితుఁడై, లలితస్థితి విశ్వకర్త లంక యొనర్చెన్. 219

వ. అట్టిపట్టణం బిటు లేల విడిచి పెట్టితి రంటి వేని వినిపించెద నాకర్ణింపుము. 220

మ. త్రిజగద్ద్రోహ మొనర్చుచున్ సమదవృత్తిం గూడి క్రీడించుమా
భుజగర్వంబు సహింప లేక చని వేల్పుల్ దెల్పికొన్నం జతు
ర్భుజుఁ డభ్రంకషశంఖరాజనినదంబుల్ మీఱ సంగ్రామకే
ళిజయోత్పాదనశాలి మాలి మును గూల్చెన్ గెల్చె మమ్మందఱన్. 221

ఉ. అడ్డము వచ్చి వేల్పుపురి యాఁగెడుమమ్మిటు లావరించి మా
యొడ్డనముల్ దెరల్చి హరి యుద్ధతిఁ జూపిన గొల్లవెల్చినన్
దొడ్డికిఁ బాఱునాపసులతో సరియై పురిఁ బాసి యాండ్రనున్
బిడ్డల వెంటఁ బెట్టుకొని భీతిలి చేరితి మూర్వి క్రిందటన్. 222

తే. అదిమొదలు లంక పాడైన నసురనాథ
యంత మాయన్న నడుమఁ దా నాక్రమించె
దానమున నైన సామభేదముల నైన
బలిమి నైన గ్రహింపు మప్పట్టణంబు. 223

తే. ఒరులపాలైనతమసొమ్ము మరలఁగొనుట,యార్తిఁజెందినచుట్టాలనరసికొనుట
నిజకులోచితధర్మంబునిలిపికొనుట,బలియుఁ డగుటకు ఫలమండ్రుపంక్తివదన.

తే. కరముచేఁ గంకణమ్ముఁగంకణమువలనఁ,గరముఁగరమొప్పుకరణిలంకాపురాధి
పత్యముననీవు వెలయుదప్పట్టణంబు, వెలయునీచేతనని తాత దెలుపుటయును.

మ. దశకంఠుం డనుఁ దాత నీనుడి యథార్థం బైనచో నెంతశా
లిశుఁ డైనన్ నయ మేది యగ్రజుని బల్మిం ద్రోచి దుర్వృత్తిఁ ద

ద్వేష మాని లెట్లు లాక్రమించు మఱి లేవా యిండ్లు పెద్దల్ భవా
దృశులే యి ట్లన నస్మదాదులకు బుద్ధిస్థైర్యముల్ గల్గునే. 226

క. అని తాత బోధ సేసిన, పనికిఁ సమ్మతిలక తఁడు ప్రత్యాఖ్యానం
బొనరించె నంత నొకనాఁ, డను వగుసమయంబుఁ గని ప్రహస్తుం డనియెన్.

శా. పౌలస్త్యాన్వయచంద్ర శూరులకు సౌభ్రాత్రంబు బాంధవ్యముం
బాలాయం బన వచ్చునే బలిమి యెవ్వాఁ డొందు వాఁడే కదా
త్రైలోక్యంబున మేటి మానడత యే ధర్మంబు యక్షేశుపై
నేలా యీమొగమాట మాతనిపురంబే లంక శంకింపఁగన్. 228

ఉ. ఏల బహూక్తు లప్పురి మహిన్ సృజియించినయట్టివారు వీ
రేలినవారు వీ రతని కే డది గా దతఁ డేలి కంటివా
యేలఁడె యింతకాల మిఁక నేలఁగ నీ కగుఁ బాలివంతునం
బాలికి లంకె లెయ్యెడల భ్రాతలు గారె పులస్త్యనందనా. 229

ఉ. అన్నను ద్రోచి యెంతచెడు గైనఁ దదీయగృహంబుఁ జేరునే
యన్నది వింటి మీవలన నారయఁ గశ్యపునాండ్రు దైత్యులం
గన్న నెలంత వేలుపులఁ గన్న నెలంతయుఁ దత్సుతవ్రజం
బున్న తెఱంగు వారలసహోదరమైత్రి జగం బెఱుంగదే. 230

ఉ. ఎక్కువ లాడఁగా వెఱతు నింద్రుఁడు భ్రాత లటంచుఁ గాచెనే
యొక్కెడ నైన దైత్యుల మహోద్ధతి గల్గిన నొంచుఁ దక్కినన్
దిక్కయి కావు మంచు హరిఁ దెచ్చి వధించఁగఁ బంచుఁ జూడమే
యెక్కడియన్న లేటితగ వేటివిచారము శూరకోటికిన్. 231

మ. దయయుం ధర్మము సత్య మార్జవము శాంతం బెప్పుడుం బూని స
త్క్రియలన్ సౌఖ్యము లొందువేలుపులె దైతేయచ్ఛటం ద్రుంపఁగా
భయ మేలా మనవంటివారలకుఁ దద్భంగిం బ్రవర్తింప నే
ట్లయినన్ మే లగు దాయ గెల్వ మసురేంద్రా యంచు బోధించినన్. 232

దశగ్రీవుఁడు లంకఁ దన కిమ్మని ధనేశునితోఁ జెప్పఁ బ్రహస్తునిఁ బంపుట.

శా. ఆకర్ణించి యతండు రెండుగడియల్ ధ్యానించి మీభాషితం
బే కర్తవ్య మటంచుఁ దాతవదనం బీక్షించుచున్ లేచి బా
హాకాంక్షేయకు లై యమాత్యులు ప్రహస్తాదుల్ భటుల్ గొల్వ లం
కాకాంక్షం జని నిల్చె దండధరదిగ్రాజత్త్రికూటంబునన్. 233

వ. నిలిచి యచ్చట. 234

చ. అతులవచఃప్రశస్తునిఁ బ్రహస్తునిఁ జూచి దశాస్యుఁ డీ విఁకం
బితృసము నస్మదగ్రజుఁ గుబేరుని శీఘ్రమ చేరి నాయభీ
ప్సితమును లంక మున్నసురశేఖరు లేచినకార్యభంగియుం

జతురతఁ జెప్పి యప్పుర మొసంగఁగ వే చని యాడి రమ్మనన్. 235

చ. అతఁడు హసా దటం చతిరయంబున లంకకుఁ బోయి కిన్నరీ
శతమణికంకణక్వణనచారుకరోదరచామరానిల
ప్రతిహతకుంతలుం డయి సభాస్థలి నోలగ మున్న దేవతా
పతినిభునిన్ ధనప్రభుని భక్తిఁ గనుంగొని మ్రొక్కి యిట్లనున్. 236

ఉ. దానదయాదిసద్గుణనిధాన పరాకు భవత్ప్రియానుజుం
డైనదశాననుండు వినయంబున మీ దగుసేమ మారయం
గా ననుఁ బంచె మీపదయుగంబునకున్ నతు లాచరించి మీ
తో నొకమాటఁ దెల్పు మనె దోరపువేడ్క వినుండు దెల్పెదన్. 237

మ. మనమాతామహు లాదికాలమున నిర్మాణంబు సేయించి యుం
డినగేహంబఁట లంక యెవ్వ రచటన్ లే కుండినన్ మీరు గై
కొని పాలించితి రిప్పు డద్దనుజముఖ్యుల్ వచ్చినా రందఱున్
ననుఁ గొల్వం బుర మేను మీవలెనె కొన్నా ళ్ళేలఁ గాంక్షించితిన్. 238

మ. అని మీకూరిమితమ్ముఁ డాడు మనినాఁ డామాట యట్లుండె యో
జనయుం దెల్పెదఁ బంక్తికంధరుఁడు భూమానాథదీవ్యద్వరం
బునఁ దేజంబున మేటి నెయ్యమె తగున్ మూర్ఖుల్ విరోధంబు సే
యన యున్నా రమితంబుగా నచట నయ్యా నీ కనుచిత్తం బనన్. 239

శా. ఆయక్షేశుఁడు పంక్తికంధరునమాత్యగ్రామణిం జూచి యే
మో యం చుండితి నింతమాత్రమున కోహో యింతసంకోచ మే
లా యీప్రో లొకఁ డెంత నాధనము నాయైశ్వర్యముం బ్రోవఁ దా
నే యస్వాం డగు శేమి మీ రెఱుఁగరే యిమ్మేది భేదోక్తికిన్. 240

క. నేనై చేయఁగ వలసిన,దాని నెఱింగించె మేలు తమ్ముఁడు నెమ్మిం
దా నిప్పట్టణ మేలుట, నే నేలుటకంటె వేడ్క యిబ్బడి గాదె. 241

వ. అని కలయం బలికి. 242

క. కాఁపురము సేయ కిఁక లం,కాపుర మెడఁబాయ వలసెఁగా యనుబలువే
తాపము దోఁపఁగ నీక ప్ర,తాపము గలయనుజుఁ దలచి ధనదుఁడు మరలన్.

క. రమ్మనుమా తమ్ముని దన,సొమ్మనుమా లంక రాక్షసులతో మేల్ గై
కొమ్మనుమా వల దనుమా,న మ్మనుమా యనుచు దండనాథుని బనిచెన్.

వ. ఇవ్విధంబున మనుష్యధర్ముండు దుర్మదుం డగుదశకంధరునకుఁ బ్రత్యుత్తరంబు
వచియింప దూతం బంచి తత్క్షణంబ. 245

విశ్రవు నిర్దేశంబువలన ధనేశుండు కైలాసంబు చేరుట.

మ. నవరత్నోజ్జ్వలదివ్యపుష్పకవిమానం బెక్కి వేవేగ వి
శ్రవసుం జేరి నమస్కరించి యనుజప్రారంభ మాద్యంతమున్

సవిశేషంబుగఁ దెల్పి యెయ్యది నివాసం బొందు వర్తింతు మీఁ
దివిచారం బిఁక నేమి తండ్రి కృప నిర్దేశింపవే నావుడున్. 246

మ. ధనదుం గన్గొని తండ్రి యిట్లనియెఁ బుత్త్రా నేఁడు గా దద్దురా
త్ముని దానిప్పని యల్లనాఁడె విని యీదుర్బుద్ధి యేమూర్ఖు దె
ల్పె నయో యగ్రజు ప్రోలు గావలెనె బల్మిం గైకొనం జోఁగు లే
దె నయం బేల పరిత్యజించె దని సూక్తిన్ నీతి నేఁ జెప్పినన్. 247

క. చిలువకు బదనికఁ జూపిన, చెలువున నాపలుకు వాఁడు సేకొన కలుకం
బలుకక మొగముల జేగుఱు, లొలుకఁగ వడి లేచి యిచట నుండక చనియెన్.

ఉ. వాఁడు మదాంధుఁ డార్యు లగువారలు పల్కినవాక్యపద్ధతిన్
రాఁడు పయోజగర్భునివరంబున లోకవిభుండుఁ దాన యై
నాఁడు దురాత్ము లైనదితినందనులన్ బలుమందిఁ గూడికొ
న్నాఁడు శపించినం గినిసినం బని సేయదు వానిపై నిఁకన్. 249

చ. తగనికుమారుఁ డైన మమతారహితస్థితి యొప్పుఁ దండ్రికిం
దగనిసహోదరుం డయినఁ దానును బాయుట యొప్పు నన్నకుం
దగ దని నిగ్రహించినను దాదృశు లౌదురు గాన వానితోఁ
దగ దిఁకఁ బొత్తు నీ కొకహితం బెఱిఁగించెద విన్ము పుత్త్రకా. 250

శా. లీలోద్యానలతాకుడుంగవిహారశ్లేషాంగనాహాసరు
గ్జాలప్రస్రవదిందుకాంతలహరీసంబంధమందాకినీ
నాళీకోత్పలవాసనాజనితకాంతాయుగ్భవ్రోల్లాస మా
కైలాసంబు వసింప నీకుఁ దగు నింకం జేరు మచ్చోటికిన్. 251

ఉ. అచ్చటి కేళికావనము లచ్చటికల్పితభూధరోచ్చయం
బచ్చటియచ్చపుంగొలఁకు లచ్చటిబంగరుఁజాయతమ్మిపూ
లచ్చటిరత్నమందిరము లాత్మకు మెప్పొనగూర్చునే కదా
యచ్చటికాఁపురంబునఁ బురారి సఖుం డగుఁ బొమ్ము నావుడున్. 252

చ. జనకునియాజ్ఞ మాళి నిడి సమ్మద మొప్ప ధనేశుఁ డప్పుడే
ధనమణివస్తువాహనకదంబము సేకొని యాశ్రితుల్ హితుల్
దనయులు సైనికుల్ గొలువఁ దక్కక లంకఁ బరిత్యజించి శం
భునిశరణంబుఁ జేరి ప్రియపూర్వముగా శరణంబు వేఁడినన్. 253

క. శరణాగతసులభుండగు, హరుఁ డాతని నాదరించి యలకాహ్వయ మా
పుర మిచ్చి మెచ్చి మచ్చికఁ, బరమాప్తునిఁగా నొనర్చి పరిపాలించెన్. 254

క. అనయము వినయము నయమును, దనసొమ్ముగ మెలఁగుకీర్తిధనుఁ డచ్చటి కేఁ
గిన నిష్టార్థముఁ జేకొనుఁ, గన రామ ధనేశుఁ డిటులు కాంక్షిత మొందెన్.

దశముఖుఁడు లంకం గొని పాలించుట.

మ. జనలోకేంద్ర కుబేరుఁ డిట్లరుగఁ ద్రింశద్యోజనీదీర్ఘమై
కనకోద్భాసితసౌధమై సుగృహమై కన్పట్టునాలంక ని
ర్జన మయ్యుం జెలు వొందె నొక్కవిభుఁ డాసం గూడి వీడ్కొన్నఁ జ
య్యన వే ఱొక్కనిరాకరుం దనరు వేశ్యాకాంత చందంబునన్. 256

ఉ. అంతఁ బ్రహస్తుఁడుం జని దశాస్యున కెంతయు వేడ్క నంతవృ
త్తాంతము విన్నవింప దరహాసముతో సభవారిఁ జూచినన్
వింతయె నీభుజామహిమ వీటఁడిపై పగఁ బూన రాజరా
జింతకు గాసి గాఁడె పుర మీయక యుండిన నంచు వా రనన్. 257

క. అది నిజ మౌనని పలుకుచు, నుదిలోన ముదంబు వొదలనుంచి ముహూర్తం
బిది యని భార్గవనందను, లదురుగడన్ వచ్చి తెలుప నద్దశముఖుఁడున్. 258

సీ. తనపురోవీథి మాతామహుల్ మదమత్త,మాతంగములమీఁదఁ బ్రీతిఁ జనఁగ
దనతల్లి కైకసీధవళాక్షి ముత్యాల,పల్లకిపై వారిపజ్జ నరుగఁ
దనయిరుదెసల నిద్దఱుతమ్ములపరిమి,తానీకినీయుక్తు లగుచుఁ గొలువఁ
దనవెంబడినె ప్రహస్తమహోదరసుపార్శ్వ,మారీచముఖమంత్రిమణులు నడవ

తే. దివ్యరథ మెక్కి శంఖవాదిత్రవేణు, కాహళాదులరవము లాకాశ మొరయ
ఛత్త్రచామరకేతనచ్ఛాయ లొలయ, వింశతిభుజుండు లంకఁ బ్రవేశమయ్యె.

మ. అరుసం బొందుచు మాల్యవత్ప్రముఖపూర్వాదిత్యు లవ్వేళ బం
గరుపీఠంబునఁ బంక్తికంఠు నిడి లంకాపట్టణాభ్యాసివై
పరిపాలింపుము దైత్యపాళి ననుచుం బట్టాభిషేకం బొన
ర్చిరి శుక్రాత్మజదత్తలగ్నమున భేరీశంఖముల్ మ్రోయఁగన్. 260

శా. ఆపౌలస్త్యకులేశ్వరుం డిటుల లంకాధీశ్వరుం డై హిత
వ్యాపారజ్ఞుల బంధులన్ సఖుల మిత్త్రామాత్యులన్ మాన్యభా
షాపూర్వంబుగఁ దత్తదర్హపదవీసంభావ్యులం జేసి వి
ద్యాపాండిత్యతపోబలాన్వయవయోహంకారముల్ మీఱఁగన్. 261

శూర్పణఖను విద్యుజ్జిహ్వున కిచ్చి పెండ్లి చేయుట.

మ. అనవద్యస్థితి నుల్లసిల్లు చొకనాఁ డాత్మానుజన్ నిండుజ
వ్వని నాశూర్పణఖాఖ్యఁ గన్యఁ గని యుద్వాహంబు గావింప బం
ధునికాయాన్వితుఁడై తలంచి యలవిద్యుజ్జిహ్వుఁ డన్ కాలకే
యునకుం బెండ్లియొనర్చెఁ దల్లిహృదయం బుత్సాహమగ్నంబు గన్. 262

వ. ఈప్రకారంబున శూర్పణఖకు వివాహం బాచరించి యావిరించిపౌత్త్రుఁ డొక శరత్సమయంబున మృగయావినోదం బొనరింపం దలంచి సమంచితమణిమయస్యందనారోహణంబు గావించి ధనుర్బాణంబులు ధరియించి యొక్క

రుండ పోయి యమితాగమసమన్వితం బయి పులస్త్యజనకాననంబునుంబోలె
నున్నయొక్కనిర్జనకాననంబుఁ బ్రవేశించి యచ్చట. 263

దశగ్రీవుఁడు మందోదరిని వలచి పెండ్లి యాడుట.

క. సురమృగముల నీక నిటువలె, హరియింతు నటంచుఁ దెలుపనువున నయ్యా
సురశార్దూలుఁడు వనభా,సురమృగముల వేట లాడుచుం జని యెదుటన్.

క. మయునిఁ బ్రశాంతకృపారస,మయుని మహాభ్యాసనియమమహిమాపహృతా
మయుని గుణముదితనరసుర,మయునిఁ దొలుతఁ గైకసీకుమారుఁడు సూచెన్.

వ. చూచి తదనంతరంబ. 266

సీ. హరినీలములకప్పు నళిజాలములయొప్పుఁ, గలకొప్పు రహిమెప్పుగులుకు దానిఁ
గలువఱేకులయేపు ఖంజనంబులరూపు, నిరసించు వాల్చూపు నీటు దానిఁ
పళుకుబంగరుగిండ్లు దులకించు విరిచెండ్లు, నడఁగించు పాలిండ్ల నమరు దానిఁ
గండచక్కెరదీవి దండి కెంపులతీవి, మొలపించు చెంగావి మోవి దానిఁ

తే. దళుకుఁజెక్కులదాని సిగ్గొలుకు దాని
నొఱపు గలదానిఁ దొలుకారు మెఱుపుఁజాయ
హెచ్చుజిగిదాని మయువెంట వచ్చుదాని
బాల నొక్కతెఁ జూచె నప్పంక్తిముఖుఁడు. 267

క. చూచి తల లూఁచి యెటు లని, యోచిన తమిఁ దలఁచె నౌర యీయొయ్యారం
బీచిన్ని పాయ మీచెలు, వీచెలువలయందుఁ గంటిమే లోకమునన్. 268

సీ. ఈనాతి కానుతో నెనగాక కాఁబోలు, సింగముల్ గుహలలోఁ జిక్కుటెల్ల
నీబాలనడలతో నెనగాక కాఁబోలు, నేనుంగు లడవిలో నీఁగుటెల్ల
నీచెల్వచూడ్కితో నెనగాక కాఁబోలు, సారంగములు పొదల్ దూఱుటెల్ల
నీకన్యఘనవేణి కెనగాక కాఁబోలు, నహులు పుట్టలు సొచ్చి యడఁగుటెల్ల

తే. నీనెలఁతఁ జేరి కాఁబోలు నించువింటి, చెంచతనుఁడయ్యు జగము జయించుటెల్ల
నీలలన సృష్టి సేసి కాఁబోలుఁ బంక,జాసనుఁడు విశ్వమునస్రష్టయగుటయెల్ల.

సీ. ఎలదేఁటివిహరణం బెపుడు నొందని ఫుల్ల,కమలంబు దొరసె నీకలికి మోము
రాచిల్కముక్కుఁ జేర్పని పక్వబింబంబు, ప్రతిబింబ మొనసె నీపడఁతి మోవి
గండుఁగోయిలకు దక్కని మావిచిగురుల, ట్లెసఁగె నీలతకూన మృదుకరములు
నవభుజంగాలింగనమ్ము సేకొనని గే,దఁగి తావిఁ దెలిపె నీతరుణిపలుకు

తే. వన్నెగల్గ క్రొన్ననకటారి మన్నెవాఁడు, చిన్నవాఁడు వహించిన చికిలికలువ
తూపు లనమించె నీచెల్వ చూపు లవుర, పెండ్లి లేనట్లు లున్న దిబ్బసరుహాక్షి.

శా. ఈపద్మేక్షణజాతి యెయ్యదియొ పేరే మందురో యీఘనుం
డీపూఁబోఁడికి నేమి గా వలయునో యే నర్థి నిమ్మన్న చో
నీపూర్ణేందునిభాస్య నియ్యఁడొకొ తా నీకున్న నింతేల సం.

తాపం బప్పటి కీతనిఁ గెలిచి మైనరఁ దీనిఁ బెండ్లాడెదన్. 271

క. అనుసాహసంబు మది నిడి, వినయము గలవాఁడపోలె వింశతిభుజుఁ డా
యన పోవుత్రోవ కడ్డము, చని వినతి యొనర్చి పలికెఁ జతురత్వమునన్. 272

ఉ. ఓమహితాత్మ యీవిపిన ముగ్రమృగాకుల మిప్పు డిందు మీ
రేమిటి కేఁగుదెంచితిరొ యెప్పుడు నెచ్చట నుందు రేమి మీ
నామము లానుపూర్విగ విశదఁ వలతుఁ వినిపింపుఁ డన్న వీ
తామయుఁ డామయుం డను దశాస్యునితోఁ గలరూప మేర్పడన్. 273

క. దానవశిల్పాచార్యుఁడ, నేను మయుం డనెడువాఁడ నిందువదన యి
మ్మానిని మందోదరి యనఁ, గా నొప్పు మదీయపుత్త్రి గాంభీర్యనిధీ. 274

ఉ. నామహనీయశిల్పమును నానుగుణంబులు మెచ్చి దేవతల్
హేమ యనం బ్రసిద్ధి వహియించినయచ్చరలేమ నిచ్చిరా
హేమకుఁ గా మనోజ్ఞ మగుహేమపురంబు సృజించి యచ్చటన్
హేమను గూడి యేను సుఖయించితిఁ బంచశతాబ్దముల్ రహిన్. 275

శా. ఏమో యీశ్వరమాయ యే నెఱుఁగఁ దంఘ్రీ హేమతో నున్నచో
వ్యామోహంబునఁ బెద్దకాలము క్షణంబై తోఁచు నాచెల్వ నె
మ్మోము మొక్కించుక చూడ కున్న నిమిషంబుం గల్ప మౌ నేయు నే
లా మే లెట్టిదొ. దాని యిల్లు వెడఁబాయన్ లే నహోరాత్రముల్. 276

శా. ఆయెం బోయెను నాఁటిజోలి యిఁక నేలా యీవలన్ వింటివే
యోయయ్యా యటు గొన్నినాళ్లు సన నాయోగంబునన్ దౌహృద
శ్రీ యప్పద్మపలాశలోచన ధరించెం గాంచె మాయావి యా
మాయావిన్ మఱి దుందుభిం బిదప నిమ్మందోదరీకన్యకన్. 277

చ. అనిమిషు లంతటం బిలువ నంపిన న న్నెడఁబాసి హేమ పో
యిన నది లేనిచోట వసియింప సహింపక సంసృతిప్రవ
ర్తనము జుగుప్సగాఁ గని విరాగుఁడ నై తప మాచరింపఁ బో
వనె సమకట్టి యీసుత వివాహము సేయఁ దలంచి యిమ్మెయిన్. 278

క. తగువాని నెందుఁ గానక, జగతిం గ్రుమ్మరెద రాత్రిచరశేఖర నీ
దగుకులము నామ మే వినఁ, దగుదు ననుచుఁ దోఁచె నేనిఁ దగువివరింపన్.

ఉ. నా విని పంక్తికంఠుఁడు మనంబున సంతస మంది యోమహా
త్మా విను నాకు బ్రహ్మ ప్రపితామహుఁ డేను బులస్త్యపౌత్త్రుఁడం
బావనమూర్తి విశ్రవుఁడు మజ్జనకుండు జగంబునన్ దశ
గ్రీవుఁడు నాఁ బ్రసిద్ధుఁడ నరీణపరాక్రమధైర్యధుర్యుఁడన్. 280

మ. లవణాంభోధిగభీరఖేయవృత మాలంకాపురం బేలుదున్
స్వవయోరూపకులానురూప యగుకన్యం గోరు చున్నాఁడ లే

డు వివాహం బని పల్కినన్ మయుఁడు సంతోషించి యర్హుం డితం
డవు మత్పుత్త్రిఁ బరిగ్రహించుటకు నూహాపోహ లింకేటికిన్. 281

క. అని కృతనిశ్చయుఁ డై యా, దనుజమణికి దారవోసెఁ దనపుత్త్రి మయుం
డనలునిసన్నిధి నతఁడుం, దనరుచుఁ బాణిగ్రహణముఁ దగ నొనరించెన్. 282

శా. మాణిక్యోజ్జ్వలకంకణస్ఫురిత మాయామందోదరీకన్యకా
పాణిం బట్టిన సాత్త్వికోదయము సూపట్టెన్ దశగ్రీవు నై
క్షోణీనాయక యెంతతామసగుణస్థుం డైనను న్సద్గుణ
శ్రేణిన్ మించినవారిపొం దొలసినం జేకూరుఁ దద్భావముల్. 283

ఉ. రాక్షసరాజ్యలక్ష్మి యన రంగు వహించినయప్పయోజప
త్త్రేక్షణ నిట్లు పెండ్లి యయి యెంతయు వేడ్క దశాస్యరాక్షసా
ధ్యక్షుఁడు మామకున్ బహువిధార్చన లిచ్చిన నాతఁడున్ లలా
టాక్షుని నైన నొంచునొకయద్భుతశక్తి యొసంగి ప్రేముడిన్. 284

క. ఇది పరమఘోరసాధన, మెదిరించిన నెట్టిపగతునేనిఁ జెఱుచు బె
ట్టిదుమీఁదఁ గాని వైవకు, మద రొందెడువారిమీఁద నని వీడ్కొనియెన్.

తే. రామ యాశక్తిఁగొనికాదె రావణుండు, మున్ను మనలక్ష్మణునినొంచెమూర్ఛవచ్చె
నదియుఁ బెనులోభిఁ బ్రార్థించునర్థియాశ, వలె నిరర్థక మై చన్న నవగలఁ బొగిలె.

కుంభకర్ణ విభీషణుల వివాహము.

మ. అవి యెల్లన్ రఘువీర నీ వెఱుఁగవే యాగాథ లట్లుండె ని
ట్లు వివాహోత్సవ మాచరించి దశకంఠుం డంత సౌదామినీ
చ్ఛవిమీఁ బౌబలిపుత్త్రి కాదుహిత వజ్రజ్వాల యన్ దాని బాం
ధవు లౌరా యనఁ గుంభకర్ణునకు నుద్వాహం బొనర్చెన్ రహిన్. 287

మ. సరమం గేసరమంజుసౌరభవతిన్ సౌందర్యలీలావిలా
సరమన్ భాసురమన్మథాస్త్రతులితన్ శైలూషగంధర్వశే
ఖరుకన్యామణిఁ జిన్నతమ్మునకు వేడ్కం బెండ్లి సేసెన్ నిశా
చరవంశాగ్రణి యద్దశాననుఁ డెదన్ సౌభ్రాత్ర ముప్పొంగఁగన్. 288

మేఘనాద జననము.

ఉ. ఆదటఁ గొన్నినాళ్లకు దశాస్యునిపట్టపుదేవి యైనమం
దోదరి గాంచె నొక్కసుతు నుద్ధతు నాతఁడు పుట్టినప్పుడే
రోదసి భేదిలన్ సురవరుల్ బెగడన్ ఘనలీల మ్రోయఁగా
నాదృతి మేఘనాదుఁ డనునాఖ్య యిడెన్ జనకుండు వేడుకన్. 289

చ. చిదుగుల వృద్ధిఁ బొందుశిఖిచెల్వున నద్దశకంఠుపుత్త్రుఁ డ
భ్యుదయముఁ జెందుచుండెఁ బితృపోషణపెంపున నక్కుమారుఁడే

కద మఱి యింద్రజిత్తనఁ బ్రకాశిలె నత్తెఱఁ గెల్ల జానకీ
హృదయసరోజమిత్త్ర వివరించెద మీఁదఁ గథాక్రమంబునన్. 290

కుంభకర్ణునకు నిద్రింప దశగ్రీవుం డొకయిల్లు గట్టించుట.

చ. వినుమట మీఁద బ్రహ్మ యొసఁగించిననిద్దురమబ్బు కుంభక
ర్ణుని మొగమాని జాగ్రదవరోధ మొనర్చినఁ బవ్వళింపఁగాఁ
దన కొకయిల్లు గావలయు దానవనాయక యంచు నన్నతో
ననుటయు నాతఁ డప్పనికి నప్పుడ పంచె ననేకశిల్పులన్. 291

వ. వారును దదాజ్ఞ శిరంబున ధరియించి తత్క్షణంబ. 292

సీ. చికిలిప్రాఁగెంపుటిట్టికల గోడలు పెట్టి, వజ్రంపుగారలపను లొనర్చి
మూలతారాసింబములు పెక్కు జతసేసి, జాళువాపతిమలచా లమర్చి
తులకించుపవడంపుదూలముల్ పయి నుంచి, పచ్చతాపలకలు పాదుకొలిపి
పులుదిండిరామొత్తములలోవ లమరించి, స్ఫటికసోపానముల్ సంఘటించి
తే. పుష్యరాగవితర్దికల్ భూరిచంద్ర,కాంతజగతులు గోమేధికపుఁదలుపులు
కలుకుముత్యాలసోరణగండ్లు వేడ్క, సేయఁ బడకిల్లు గట్టి రాశిల్పివరులు. 293

క. ఆమడ నర వెడలుపు మూఁ,డామడ నిడివియును గలిగి యతిరమ్యం బై
రామ ఘటకర్ణపటుని,ద్రామందిర మలరు మృదులతల్పతతులతోన్. 294

వ. అటుల ధవళప్రభాపహసితకైలాసం బగుతన్నివాసంబున. 295

సీ. కిన్నరాదులఁ గట్టిగెలుచునాందోళంబు, మించఁ బల్కుటఁ గల్వరించుకొనుచు
దిక్కుటల్ సెవు డొందదేవతల్ వెఱ సెంద, బెట్టుగా గుఱకలు వెట్టుకొనుచుఁ
గలఁగొన దిక్పాలకులమీఁదఁ జనిమాఱు, కొనువారిఁ గనిపండ్లు గొఱికికొనుచు
సెలవుల లాల చిప్పిల నప్పటప్పటి, కించు కించుక చప్పరించుకొనుచు
తే. మరలుచును బోరుచును మేను మఱచి మిగులఁ
జెమ్మటలఁ దొప్పదోఁగుచు నిమ్మళించు
నిబిడతామససుఖ మిచ్చునిద్రఁ గలిసి
కాలముఁ గ్రమించె నక్కుంభకర్ణుఁ డధిప. 296

దశగ్రీవుండు గరుడప్రముఖుల బాధించుట.

క. క్రూరుఁడు దశముఖుఁ డంతఁ బ,యోరుహభవదత్తవరమదోద్రేకమున న
మేర దలంపక దుష్ట,ప్రారంభమునందె బుద్ధి యలవఱిచె నృపా. 297

వ. అది యె ట్లనిన. 298

సీ. గరుడుల గరుడులకంబంబులనె కట్టి, గంధర్వగంధర్వగతు లడంచి
యక్షులఁ బక్షులయాటుల ఫాఱఁగఁ దోలి, ఖచరులఁ గుచరులఁ గా నదల్చి
కిన్నరు లెన్నరు త న్నని నొప్పించి, సిద్ధులఁ బద్ధులఁ జేసి కలఁచి
సాధ్యులు సాధ్యులై శరణు బొందఁగఁ జేసి, యమరులఁ జమరులయండ కనిచి

తే. భోగుల విభోగుల నొనర్చి యోగితతి వి,యోగితతివలె బలువెత నొందఁ జేసి
చారణానిలతుషితభాస్వరుల నొడిచి, యుద్ధతేజంబుఁ జూపె లంకేశ్వరుండు.

మ. పావనంబుల్ భువనంబులుం జెఱుచు మాయల్ దాల్చుఁ గూల్చున్ సుధా
శివనంబుల్ పవనంబులీల ద్విజులన్ ఛేదించు భేదించుఁ బ
ద్మవనంబుల్ భువనంబు లున్నతటినుల్ బంధించి మ్రందించు స
త్పవనంబుల్ ప్లవనంబుఁ జెంద గిరు లుద్యన్ముష్టి నొంచున్ వడిన్. 300

ధనాధిపుఁడు దశగ్రీవునకు నీతి చెప్ప దూతం బంపుట.

ఉ. ఆతఁడిఁ గొన్నినాళ్లకు ధనాధిపుఁ డంతయు నాలకించి దు
ర్ణీతి వహించుతమ్మునికి నీతియు ధర్మముఁ దెల్పుకోరికిన్
దూత నతిత్వరం బనుప దుశ్శకునంబులతోడ లంకకున్
భీతిల కేఁగి వాఁడును విభీషణు ముందఱ గాంచెఁ గాంచినన్. 301

ఉ. అన్నయశాలి వానిహృదయం బలరంగ బహూకరించి మా
యన్నకు సేమమే వదిన హర్షము గాంచునె పుత్త్రు లెల్ల సౌ
ఖ్యోన్నతులే కదా కుశలయుక్తులె యాప్తులు మంత్రు లాశ్రితుల్
నిన్నిట కేల యంపెఁ బతి నేఁ డన నంతయు వాఁడు దెల్పినన్. 302

తే. కొంత చింతించి మనహితోక్తులు సగౌర,వముగ విన నేర్చునే పంక్తివదనుఁ డేల
యన్న యిప్పనిఁ దలపెట్టెనైన నేమి. వచ్చితివి గద రమ్మని వానిఁ గొనుచు.

మ. గణనాతీతనిశాచరస్తవము లాకర్ణించుచుం గంకణ
క్వణనంబుల్ చెగఁ జామరంబు లమరన్ వారాంబు వీవన్ సభాం
గణసమ్మర్దము వేత్రహస్తు లుడుపంగా నిండుకొల్వున్న రా
వణునిం జేరి విభీషణుం డెఱిఁగి క్రేవన్ దూతఁ గాన్పించినన్. 304

క. ధనదునిదూతయు వినయం,బున నించుక చేరి మ్రొక్కి ముకుళితకరుఁడై
దనుజులబహుసమ్మర్దం,బున నొదుఁగుచు నిలిచి పంక్తిముఖుతో ననియెన్.

ఉ. స్వామి పరాకు దైత్యకులచంద్ర త్వదగ్రజుఁ డైనకిన్నర
గ్రామణివంశవిత్తగుణగౌరవయుక్తి సమానుఁ డొట మీ
సేమము వేఁడి మీకొకవిశేషహితం బెఱిఁగింపు మంచు న
న్నీమెయిఁ బంచె నెయ్యము వహించి వినుం డది విన్నవించెదన్. 306

చ. సమతఁ బరోపకారకృతి సల్పుటయే సుకృతంబు ఘోరపా
పము పరపీడ సేయుటయె బ్రహ్మకులంబునఁ బుట్టి దేవతా
ప్రముఖవిరోధముల్ నెరపఁ బాడియె ధర్మముచేతఁ గాదె యీ
సమధికసంపదల్ దొరసి సంతత మందఱమున్ సుఖించుటల్. 307

ఉ. నాస్తికుఁడున్ శఠుండుఁ గులనాశకుఁడుం గనుదుష్టవర్తనం
బాస్తికతాధురంధరున కర్హమె యద్భుతనిష్ఠచే నజా

ఉ. పాస్తి ఘటించినాఁడవు కృపాగుణశూన్యుఁడ వై భుజాబల
ధ్వస్తులఁ జేయ నేల సురవర్యుల నార్యుల ధర్మధుర్యులన్. 308
నందన మాది యాసురవనంబులఁ గూల్చితి వప్సరోవధూ
బృందము బల్మిఁ బట్టి చెఱఁ బెట్టితి వార్యులు సేయుయాగముల్
మ్రందఁగఁ జేసి తార్తు లగుమానులఁ జంపితి వస్మదాదు లే
మందురొ యర్కభయం బెఱుఁగ వైతివి తెల్పెడి దెట్టు నీకికన్. 309
ఉ. గొట్టుతనానఁ దర్క వెడలఁ గొట్టినఁ దట్టను రట్ట డంచుఁ దోఁ
బుట్టువ నౌట నోం డనక పోయితిఁ బల్కఱు బెట్టుఁ జూపినం
జుట్టము లైనఁ దాళుదు రె శూరత యే జడదారిపెద్దలం
బట్టి వధించుటల్ వెడఁగుభావము మానఁగదయ్య తమ్ముఁడా. 310
మ. హిమవత్పర్వతతుంగశృంగమున నే సిన్నాళ్లు శైవవ్రతం
బమితశ్రద్ధ నొనర్చి వచ్చి భవదీయాద్ధత్య మాలించి ధ
ర్మము గా దంచుఁ బ్రబోధ సేసితి ననుం బాటించి వంశోచిత
క్రమముం గైకొను మంచుఁ దెల్పు మనె యాతుస్వామి రక్షోధిపా. 311
మ. అది గా కన్యులకల్మిఁ గన్గొని యసూయామగ్నుఁ డౌ వాని కా
పద సేకూరు నవశ్య మట్టియశముం బ్రాపించె మీయన్న యే
యది తార్కాణగ విన్నవింతు వినుఁ డంచద్దూత కేల్మోడ్చి నె
న్నుదుటం జేరిచి పల్కెఁ గ్రమ్మఱ మదాంధుం డౌ దశగ్రీవుతోన్. 312
మ. దితిజాధీశ్వర యొక్కనాఁడు తుహినాద్రిం జేరి మీయన్న యం
దతిసౌభాగ్యనిరూఢి శంకరునియర్ధాంగంబునన్ మించుప
ర్వతరాట్కన్యక నట్టె చూచె నెటు సంప్రాప్తించె నీభాగ్య మీ
సతి కంచుం దనసవ్యనేత్రమున నీర్ష్యారోషమగ్నాత్ముఁడై. 313
ఆ. ఇటుల కుటిలబుద్ధి నీక్షించుయక్షేశు, సవ్యలోచనంబు క్షణములోన
దివ్యయోగమహిమ దేవి దగ్ధము సేయ, నేమి సేయువాఁడ నింక ననుచు.
క. విత్తవిభుఁ డడలి యగ్గిరి, యుత్తరశృంగమున నియమయుక్తి నిలిచి య
ష్టోత్తరదశశతవర్షము, లుత్తమశైవవ్రతంబు లొనరించు నెడన్. 315
ఉ. భూరిజటల్ ప్రవాళములపోల్పుఁ గనన్ ఘనబాహుశాఖలన్
మీఱి యపర్ణపర్ణరుచి మేకొనఁ గ్రొన్నెలరేక కోరకా
కారముఁ బూన నీలగళకాంతులు తేఁటులనీటుఁ జెంద మం
దారములీల శూలి ధననాథునకుం గనిపించి యిట్లనున్. 316
ఉ. మెచ్చితి నీతపంబునకు మీఁ టగునిష్ఠకు నిమ్మహావ్రతం
బచ్చపుభక్తి నెవ్వరుఁ బ్రయత్నముతో నిటు సంఘటింప లే
రచ్చుగ మున్ను నే సలిపినట్టులె సల్పితి వీ వాకండ వే

నిచ్చితి నాసఖిత్వము వహింపుము మత్తులితప్రభావమున్. 317
తే. దేవి నేదృష్టిఁ గంటివో దృష్టియొకటి, యనుధరారేణుపరివృతజ్యోతిగతిఁబి
శంగరుచిఁ గాంచు నేకపింగనయనుఁ, డనఁగ నందున వెలయుదువనఘునీవు.
చ. అని వర మిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలి కాని వెంటఁ దో
డ్కొని చనుదెంచె నట్లగుటఁ గోప మసూయయుఁ గీడు ధర్మవ
ర్తనము సమస్తబాంధవహితంబగునగ్రజుబుద్ధిమాటఁ జే
కొనుము శుభంబు మాన్చుచెడుగుం దన మే లని దూత దెల్పినన్. 319

దశగ్రీవుఁడు ధనేశ్వరునిదూతం జంపి యలకాపురిపై దండెత్తుట.

మ. పదిమోముల్ ప్రళయార్కబింబములరూపం బూనఁ గోపంబునన్
రదసంఘట్టన మాచరించుచు నదభ్రభ్రూకుటుల్ మీఱ ని
ర్వదికన్నుల్ జ్వలితాగ్నికుండములయుగ్రత్వంబు సూచింప మూ
ర్ఖదశాస్యుం డలదూతఁ జూచి మిగులం గ్రూరాత్ముఁడై యిట్లనున్. 320
తే. మంచితనమున నీతి బోధించువాఁడ, పోలెఁ దనయుగ్రతపమును శూలితోడి
చెలిమియును గల్గి బలిమియుఁ దెలుపఁ బంచి, నాఁడెమీఁదొ నాచెంత నానలేక.
ఉ. రొక్కముఁ గన్నకల్మియును రుద్రునిచెల్మియు నమ్మి క్రొన్నిదు
ర్వాక్కుల వాఁడు దెల్పి యిటు రమ్మన నీ వెటు లాడ వచ్చితే
యిక్కడ మూర్ఖ యం చడిద మెత్తి వధింపకుఁ డంచుఁ దమ్ముఁడున్
మ్రొక్కఁ నదల్చి దూతశిరముం దెగ వ్రేసె వివేకశూన్యుఁడై. 322
మ. అలకాధీశునిదూత నిట్లతఁడు ప్రాణాంతంబు నొందించి యా
తలయున్ మొండెముఁ గొల్వులో మెలఁగుభృత్యశ్రేణిపాల్ చేసెఁ బ్ర
జ్వలితాత్యుగ్రదవాగ్ని నే మిడిచినం జల్లారునే ? తివా
క్కుల మూర్ఖుండు శమించునే కినుకఁ గాకుత్స్థాన్వయగ్రామణీ. 323
క. చెనఁటి యని దశముఖుని ననఁ, బని లే దతనికి హితోక్తిఁ బ్రకటింపఁ దలం
చినధననాయకు నన వలె, జనవర విను మంత నద్దశగ్రీవుండున్. 324
తే. తనయమాత్యులఁ గనుఁగొని ధనదుమాట, వింటిరే యిప్పుడెంత గర్వించినాఁడు
మాకుఁ దన కున్న పాటివివేక మున్న, దే ప్రబోధింపఁ దాఁ గాక యెవ్వరింక.
ఉ. పట్టణ మాక్రమించి తనుఁ బాఱఁగఁ దోలిన నోర్చి తాను దోఁ
బుట్టువు గాన పోయెనఁట పోవక నిల్చిన నేమి సేయునో
గట్టిగఁ జూత మిప్పు డలకాపురి ముట్టడి చేసి గట్టువిల్
పట్టినదిట్టఁ గూడి మనపై భుజశౌర్యముఁ జూపుఁ గా కిఁకన్. 326
ఉ. మాన్యుఁ డటంచు నెంచుబహుమాన మెఱుంగక యత్నుఁ డే యసా
మాన్యవిరోధకృద్వచనమార్గణపంక్తుల నొంచె నింద్రము
ఖ్యాన్యులు నన్ను గెల్వఁగఁ బ్రయత్నము సేయుట యుగ్గడించె నీ

హైన్యము దీఱ నింక ధనదాదిదిగీశుల గెల్వఁ బోఁ దగున్. 327

ఉ. తెమ్ము ప్రహస్త తొల్త నవలీల ధనేశుని గెల్వఁ బోయెదం
బొమ్ము బలంబుఁ గూర్పు మన ప్రోలను గల్గినవీరదైత్యులం
దెమ్ము జయానకార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ నాబడిం
రమ్ము రయమ్ముతో నన భరంపడి యాతఁడు నట్ల చేసినన్. 328

సీ. శాతమన్యవశిలాచక్రఘర్ఘరదీర్ఘ,రావంబు దిక్కుల వ్రక్కలింప
గారుత్మతద్యుతిస్ఫారసైంధవఖురో,ద్ధురసముద్ధతుల నిద్ధర నలింపఁ
సారసారసరాగచారుకేతనకాంతు,లాకాశమణిదీప్తి నపహరింప
ఘనఘంటికాఘణంఘణనాదముల ధరా,ధరగుహాళులు ప్రతిధ్వను లొసంగ

తే. శరశరాసనముసలముద్గరకృపాణ, తోమరగదాదిసాధనస్తోమపూర్తి
మిక్కుటంబైనయొక్క తేరెక్కి వెడలె, వింశతిభుజుండు త్రైలోక్యవిజయకాంక్ష.

క. మారీచమహోదరశుక,సారణధూమ్రాక్షముఖ్యసచివులతోఁ బెం
పారఁ బ్రహస్తుఁడు ముంగలి, యై రాక్షససేన నడపె నపుడు నృపాలా. 330

క. మల లూటాడ నదీనదములు గలఁగఁగఁ జండవిపినములు గూలఁ బురం
బులు బెదర ముహూర్తంబునఁ, బలలాదబలంబు లలకపజ్జకుఁ జనియెన్. 331

సీ. చరనీలగిరిశంక నవరించుమదమత్త,కరులదంతురదంతకాండరుచులుఁ
దనువులొందినగాడ్పులననొప్పునుత్తమా,శ్వములముత్యాలకళ్లెములరుచులు
బలుమేరువులతీరుగలతేరులను మీఱు,కళుకువజ్రపుబండికండ్లరుచులుఁ
గలనైనభయమెఱుంగనిభటోత్కరమెత్తు, విచ్చుకత్తులనిచ్చహెచ్చురుచులు

తే. ధవళకేతనరుచులు ఛత్త్రములరుచులుఁ, జామరంబులరుచు లొక్కసారినిగిడి
మెండుకొని వెండికొండపై నిండ నాప్ర,చండభుజదండుఁ డాతండు దండువిడిసె.

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు రాముఁ డవల వింశతిభుజుఁడుర్
ధనవిభుఁడును బోరినవిధ, మనఘా వినవలతుఁ దెల్పు మని యడుగుటయున్.

ఆశ్వాసాంతము.

ఉ. నందకుమార మారద సనందన నారద మానసాంతరా
ళిందవిహారి హారిమురళీమృదుగానవిలోలగోపికా
నందనిదాన దానవఘనాఘనభిన్మరుదుల్లలద్గరు
ద్బృందతురంగ రంగదమరీజనరంజనరాసఖేలనా. 334

క. వనదారుణశిఖవారణ,వనదా మదవారణేంద్రవరద జగత్పా
వన దాసజననిరోధా,వన దాక్షిణ్యాదిసుగుణవరరత్ననిధీ. 335

పంచచామరము. సనాతనప్రసిద్ధపూరుషత్వకీర్తిభాజనా
జనాదిలోకసంగిమానిసంఘసౌఖ్యసాధనా

ధనాధినాథనందనాత్మతాపహృత్కృపాఘనా
ఘనాత్మరూపదర్శనోత్సుకత్సరోరుహాసనా. 336

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధానవద్య కవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణివైప వాధరీకృతరాజరాజ రాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధర ధరాభర్తృ సభాంతరస్తవనీయనయకళాయుగంధర బంధురమనీషావిశేషమంథానవసుంధ రాధరశోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాదిగుణరత్నాకర కంకంటి వంశపయఃపారావారపరిపూర్ణసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞాన విభవవిజితసనందన విష్ణుమాయావిలాసాభిధానయక్షగాననిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణం బను మహాకావ్యంబు నందు ద్వితీయాశ్వాసము.





శ్రీ

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీమదుత్తరరామాయణము

## తృతీయాశ్వాసము.

---



క. శ్రీవనితానిభనీళా
దేవీకుచమృగమదాభదేహరుచిఝరీ
గోవర్ధన లీలాధృత
గోవర్ధనశిఖరి వేణుగోపాల హరీ. 1

### దశగ్రీవుఁడు దండు విడిసి యున్కని యక్షులు ధనదునితో విన్నవించుట.

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
జానకీనాథ యిటు లద్దశాననుండు, విత్తవిభుపీటిపై దండు విడిసినపుడు. 2

మ. భటకోలాహలముల్ మహారథికశుంభచ్ఛంఖఘోషంబు లు
ద్భటదంతావళబృంహితంబులు హయప్రత్యగ్రహేషార్భటుల్
పటహాద్యద్భుతవాద్యభేదరవముల్ బ్రహ్మాండభాండచ్ఛిదా
పటిమన్ మించె విరోధిగాఢ్యువతిగర్భభ్రూణముల్ భేదిలన్. 3

వ. అప్పు డప్పర్వతప్రదేశంబున నుక్కళం బున్న యక్షకిన్నరు లన్నరవాహనున
కిది విన్నవింపకయ మించి మన మొక్కించుక శరపరంపరల ముంచిన చూఱ
వచ్చు నని కొంచి కొంద ఱందుఁ దరలక కొంద ఱలకాపురంబున కరుదెంచి
యుదంచితప్రాభవంబు మెండుకొన నిండుకొలువున్న కిన్నరేశ్వరుం బొడగని. 4

క. వందనములు సేసి పరా, కిందుకళామౌళిమిత్ర యిదె నేఁడు చమూ
బృందముతో దశవదనుఁడు, నందాతీరమున విడిసినాఁ డని తెలుపన్. 5

తే. ఆకుబేరుఁడు నవ్వి బళా మఱేమి, దశముఖుఁడు మంచిపని సేయఁదలఁచె హితవు
దలఁచినన్ మఱిముక్కోఁతలను మాట, నేఁడు నిజమయ్యె నిఁక నేల నెనరు దలఁప.

ఆ. మొగముఁ బొడువ లేనిముంగోప మిఁక నెప్పుఁ, డలకఁ జొచ్చె నేనిఁ జులుకనగుదు
మటులు చేయ నీయఁ గాఁగి భండనమాచరింపుఁ డనుచు వారిఁ బంపుటయును.

### యక్షరాక్షసులయుద్ధము.

ఉ. యక్షవరాజ్ఞ మౌళి నిడి యక్షులు నక్షుల నిప్పు లుర్ల హా
ర్యక్షములో యనన్ గహకహార్భటు లభ్రము నిండఁ జేయుచున్

రాక్షససేనఁ దాఁకి రలరాక్షసులుల్ నలిరేఁగి మార్కొనం
ద్ర్యక్షుధరాధరం బదరె నంబుజపత్త్రగతిం దదుద్ధతిన్. 8

మ. అసిఘర్షోదితవిస్ఫులింగమయ మై యస్త్రానలాభీలకీ
లసముజ్జృంభిత మై గదాముసలశూలప్రాససంప్రేరణా
వసరాన్యోన్యకృతాభినందనవచోవ్యాపార మై యక్షరా
క్షససంగ్రామము సూచుఖేచరులకుం గల్పించె దృక్పర్వముల్. 9

శా. దోరుత్తుంగతరంగముల్ నిగుడఁ దర్ఘోరాసిమీనప్రభల్
మీఱన్ సైనికచంద్రు లుబ్బ నఁగ గాంభీర్యం బవార్యంబు గా
భేరీభాంకృతిరావ మొప్పఁ గరిభూభృత్కోటి మీఁ టొందఁగాఁ
బోరాడెన్ వడి యక్షరాక్షసబలాంభోరాసు లొండొంటితోన్. 10

వ. అప్పుడు. 11

ఉ. కూలెడునేనుఁగుల్ దెరలుగుఱ్ఱములున్ వడిఁ ద్రెళ్లుతేరులున్
వ్రాలెడిటెక్కెముల్ దునిసి వ మ్మగుఛత్త్రము లాడుసట్టులుం
దూలెడిరూపులుం దొరఁగునెత్తురుఁ జేఱు లందుఁ బైఁ
దేలెడుపీనుఁగుల్ గలిగె ధీరతఁ బోరెడు రెండుసేనలన్. 12

ఉ. రాక్షససేనముందటఁ దిరంబుగ నిల్చి రణం బొనర్చున
య్యక్షులఁ జూచి పంక్తిముఖుఁడక్షముఁ డై నిజసైన్యరక్షణా
ధ్యక్షుల మార్కొనం బనిచి తానును నిర్వదిచేతులన్ గదా
సిక్షురికాదిసాధనవిశేషవిజృంభము గానిపించినన్. 13

చ. చెదరక యక్షులున్ దనుజశేఖరు బిట్టెదిరించి భీకర
ప్రదరపరంపరల్ గురిసి పైపయి నైకవిధాయుధచ్ఛటల్
గుదిగొన నించి బీరమునఁ గో యని యార్చినచో మహోదరుం
డుదురున నొక్కఘోరగద యూని కృతాంతునిలీల నుగ్రుఁడై. 14

క. వాయువు బలువడిఁ గుజములఁ, ద్రోయుతెఱంగున గదాహతులచే క్షితిపాల్
గా యక్షసేనఁ గూల్చె బలీ యని శుకసారణాదు లెల్ల నుతింపన్. 5

క. శుకసారణధూమ్రాక్షా,దికసేనాధీశు లొక్కెడ దశకంఠుం
డొకదెస యక్షుల జమువీటికి నతిథులఁ జేసి రోహటింపక యధిపా. 16

ఆ. అపుడు పఱచుయక్షు లతిభీతు లై పూరి, గఱచుయక్షు లొడలుమఱచుయక్షు
లఱచుయక్షు లై మహావాతధూతజీ,మూతరీతిఁ జని రరాతు లలర. 17

ఉ. విచ్చిన నొచ్చినన్ వెఱచి వేఁడిన నోడిన వారిఁ బోవ నీ
కచ్చెడుగుల్ దయారహితు లై యలకాపురిదాఁకఁ గోటలోఁ
జొచ్చినదాఁక వెంటఁ బడి శూలములన్ బలితంపుటీఁటెలన్
గ్రుచ్చిరి చొచ్చి వచ్చి రదిగో నని పౌరులు దల్లడిల్లఁగన్. 81

సంయోధకంటకుం డనుయక్షవరేణ్యుఁడు యుద్ధముచేసి పాఱిపోవుట

మ. ప్రకటక్రోధమునన్ ధనాధిపతి పంపన్ వేగ సంయోధకం
టకుఁ డన్ యక్షవరేణ్యుఁ డొక్కఁ డపు డుద్దండుం డై పురద్వారము
త్సుకతం జొచ్చునిశాటకోటిపయి శక్తుల్ దోమరంబుల్ శర
ప్రకరంబుల్ గురియించి నిల్చెఁ దనశౌర్యం బందఱున్ మే లనన్. 19
శా. ఆరక్షోబల మాతనిం గడవ లేకాకంపముం జెందఁగా
మారీచుం డెదిరించి శాతశరసంపన్నత్వముం జూప న
వ్వీరుండున్ గద యెత్తి వానిశిరమున్ వ్రేయన్ వెసం గూలె స
త్ప్రారంభం బుడి వోవ నేలఁ బడుపుణ్యభ్రష్టుచందంబునన్. 20
ఉ. కూలి ముహూర్తమాత్రమునకుం దెలివిం గని తాటకేయుఁడున్
వాలుమెఱుంగుఁదూపు లనివారణ యక్షునిమేన గ్రుచ్చి యా
భీలతఁ జూపినన్ సమరభీతి జనించి యతండు డాళఁగాఁ
జాలక వీఁగి పోయిన నిశాచరు లార్చిరి సంభ్రమంబునన్. 21
వ. ఇవ్విధంబున సంయోధకంటకుం డాయోధనంబు విడిచి యోధధర్మంబు దల
కడచి పాఱిన మీఱినకౌతుకంబునం బదిమొగంబులఁ గుతుకం బగుమంద
స్మితంబుతో నలకమొకంబు దాఁటి మేటికిరీటి పచ్చతాజంతులం గనుపట్టుకోట
వాకిటిరచ్చపట్టుకొట్టంబున నట్టనడితెరువుం బట్టుకొని నూఱొన్నలపట్టంబు వట్టు
వేల్పుఁజలుపలం గట్టిన గోపురంబు డాసి వాసి గలచిగురుఁదొగరులం దెగడు
పగడంపుదారబందంబు లురులం ద్రోచి మగతాలబోరుతలుపులు వీడం దన్ని
పదాఱువన్నెహొన్ను పనులం జూడం జూడ వేడుక యగునగరిముందరివైదూ
ర్యతోరణస్తంభంబుకడ కస్తంభసంరంభంబునం జొచ్చి వచ్చునక్కుంభకర్ణాగ్ర
జుం గనుంగొని. 22

దౌవారికుం డగుసూర్యభానునిఁ దుత్తుమురై పడ దశగ్రీవుండు గొట్టుట.

తే. అచటిదౌవారికుఁడు మహోగ్రహాసితతీవ్ర
భానుఁ డగుసూర్యభానుఁ డప్పంక్తిముఖున
కడ్డమై యెందు వచ్చెద వనుచు నతనిఁ, జుట్టు నరుదెంచుదైత్యులు బిట్టదల్చె.
ఉ. సింధువు మించి రా విడనిచెల్లెలికట్టె తెఱంగునన్ సురా
బంధుబలంబు నిల్పి నిలుపన్ నిల కేఁగెదుపంక్తికంఠ గ
ర్వాంధునిఁ జూచి పోకు నిలుమా చలమా ఫలమా బలాప్తికిన్
బంధుల నొంప వచ్చు టని పల్కి మహాగద పూన్చి వైచినన్. 24
శా. కుంభీంద్రంబు మృణాళముం దునుములాగుం దోఁప దానిన్ భుజా
శుంభల్లీల సురారి ద్రుంపఁ గని యక్షుండు దుగ్రుఁడై తోరణ
స్తంభంబుం బెకలించి వైవ నతఁడున్ దానన్ ధరం గూలక

య్యంభోజాసనదత్తదివ్యవరమాహాత్మ్యంబునం గ్రూరుఁడై. 25

క. అత్తోరణంబె కొని నడు,నెత్తి వగుల సూర్యభానునిన్ మొత్తినచోఁ
దుత్తుమురై వాఁ డిలఁ బడ్డ, నత్తఱిఁ బరువెత్తె నచటియక్షగణంబుల్. 26

మాణిభద్రుఁడు పోరి వ్రేటుపడి పార్శ్వమౌళియని పేరువడయుట.

క. అలబలము లిటుల పఱచిన, నలబల మెసఁగన్ దశాస్యుఁ డసురావళితో
నలకఁ గలఁపంగ నది గని, పలికె ధనేశుండు మాణిభద్రునితోడన్. 27

క. నొచ్చిరి మనయక్షులు పురిఁ, జొచ్చిరి రాక్షసులు బాలిశుని దశముఖునిం
జెచ్చెర నెదిర్చి నీవా, గిచ్చ నలర విక్రమింప నిది దఱి నీకున్. 28

తే. అనిన సామి హాసా దని యమితసమర,దోహళంబున నతఁడు చతుస్సహస్ర
యక్షవీరులు దనతోడ నరుగుదేరఁ, గల్పకాలాంతకునిలీలఁ గదలివచ్చె. 26

ఉ. వచ్చినమాణిభద్రుబడి వచ్చినసైనికకోటి గోటలోఁ
జొచ్చినరాక్షసోత్తములు స్రుక్క గదల్ గొని మోఁది తూపులన్
గ్రుచ్చి కటారులన్ నఱికి కుంతములం బడఁ గ్రుమ్మి యార్చినన్
విచ్చిరి నొచ్చి యప్పురము వెల్వడి రుక్కలు దక్కి రక్కసుల్. 30

వ. ఇవ్విధంబున. 31

ఉ. నాలుగువేలయక్షులును నల్గడఁ గొల్వఁగ మాణిభద్రుఁ డ
వ్వేళ దశాస్యసైన్యముల వెన్కొని నొంపఁగఁ దద్వరూథినీ
పాలకుఁ డాప్రహస్తుఁ డురుబాహుబలంబున యక్షవాహినీ
పాలుని బిట్టెదిర్చె మును పాఱెడుసేనల కుబ్బొనర్చుచున్. 32

క. దళకర్త లిరువు రిటువలెఁ, దలపడి పోరాడ రెండుదళములఁ గలయో
ధలు నుద్భటు లగుభటులును, గలయం బడి పోరి రుత్సుకత వెలయంగన్. 33

శా. కైలాసాద్రిగుహల్ ప్రతిధ్వను లొసంగన్ దివ్యనందాలకా
కూలత్క్ష్మారుహపాళి మూలములతోఁ గూలన్ భుజాస్ఫాలనో
ద్వేలధ్వానము లంఘ్రిఘట్టనము లెంతే మీఱఁగాఁ బోరి ర
ప్పౌలస్త్యద్వయసైనికప్రవరు లభ్యామర్దబద్ధస్పృహన్. 34

వ. తత్సమయంబున. 35

చ. కరము చలంబు మీఱ దశకంఠునిమంత్రి ప్రహస్తుఁ డుగ్రుఁడై
కరముసలంబునం గెడపె గ్రక్కున వేవురుయక్షులన్ మహో
దరుఁడు మహోదరుం డయి గదాహతి వేవుర నొంచెఁ దాటకా
వరతనయుండు ద్రుంచెఁ గరవాలమునన్ ద్విసహస్రయక్షులన్. 36

వ. ఇప్పరుసున నిజపార్శ్వచరు లయినచతుస్సహస్రయక్షప్రవరులం బరిమార్చి పేర్చినప్రహస్తాదులం గనుంగొని నిర్నిద్రరౌద్రంబున మాణిభద్రుండు వానిపై నురవడించిన. 37

శా. ధూమ్రాక్షుం డెడ చొచ్చి శాతశరవిద్ధుం జేసి వెల్లార్చినం
దామ్రాక్షుం డయి యక్షుఁ డారిపు గదం దాటించినన్ వాతధూ
తామ్రంబుల్ బలె వాఁడు మూర్ఛిల స్వకీయాంఘ్రిస్ఫురద్ఘట్టనన్
నమ్రత్వం బహిరాజు సెంద ఘటకర్ణజ్యేష్ఠుఁ డత్యుగ్రుఁడై. 38

క. ఆమాణిభద్రుఁ గదిసి శి,తాశితశరవృష్టి గురియ నతఁ డతికుపితుం
డై మూఁడు తూపు లసుర,గ్రామణి పేరురము నాటఁగా నేయుటయున్. 39

ఉ. అందున నొచ్చి పంక్తిముఖుఁ డల్గి గదాహతి మాణిభద్రుమా
ళిం దిలకించి కొట్టినఁ జలించి యతం డలమాళి యోరపా
టొందెఁ దదాదిగా రఘుకులోత్తమ యాయన పార్శ్వమాళి నాఁ
జెందె నభిఖ్య నంత వెఱచేఁ బఱచెం బరసేన లార్వఁగన్. 40

వ. ఇత్తెఱంగున దళవాయి దొలంగి పోయినం గనుంగొని. 41

ధనదుఁడు యుద్ధరంగమునకు వచ్చి దశగ్రీవునకు బుద్ధులు చెప్పుట.

సీ. పిడుగుఁజప్పుడులతో బెడిదంపుటడిదముల్, జళిపించుచును భటావళులు గొలువ
జయజయ నవనిధీశ్వర మహేశ్వరమిత్ర, యనుచుఁ జారణకోటు లభినుతింప
జవనకంఖాణరాజము లెక్కి కిన్నర, గ్రామణు లుభయభాగములఁ గొలువ
నుద్భటాహంపూర్వికోక్తులు వెలయఁగిం, పురుషయోధులును గ్రిక్కిఱిసి కొలువఁ
తే. బద్మశంఖాద్యనిధులు రూపంబు లూని, కొలువ బంగారు తేరెక్కి గురుగదాది
సాధనములొప్పఁ గిన్నరేశ్వరుఁడు వచ్చి, చులుకుఁజూపుల దశకంఠుఁ జూచి పలికె.

ఉ. తమ్ముఁడ వంచు నీకొకహితం బెఱిఁగింపఁగ దూతఁ బంచినన్
వమ్మొనరించి నాపలుకు వానిని జంపి ననున్ జయింప రే
ద్రిమ్మరిగుంపుతోడ నరుదెంచితి నిన్నన నేల నీకు డెం
దమ్మున మేలు గాఁ దలఁచునన్నె యనం దగుఁ గాక దుర్మతీ. 43

ఉ. రోగికి భక్ష్యభోజ్యముల రోగము హెచ్చుగతిం బటుక్రుధా
యోగికి నీకు మాదృశహితోక్తులఁ గ్రోధము మించు మాటికిన్
నీగుణచర్య లేటి కివి నింద యొనర్పఁగ నీకె తెల్లమా
రాఁ గలమృత్యువుం బొరసి రౌరవబాధలఁ బొందుచున్నెడన్. 44

ఉ. ఆపద లావహించుదురహంకృతి నీగతి మూర్ఖుఁ డుగ్రపుం
బాపము లాచరించి విషపాన మొనర్చి శరీర మంతయున్
వ్యాపక మైనఁ జింతిలుజడాత్మువలెన్ యమపాశబద్ధుఁడై
పాపఫలంబుఁ జెందునెడఁ బాపముఁ జేసితి నంచు వందురున్. 45

ఉ. అన్నకుఁ దండ్రికిన్ గురున కాపద యెవ్వఁ డొనర్చు వానిఁ గ
న్గొన్న మహోగ్రపాతక మగుం దను వస్థిర మృత్యు వెప్పుడున్
సన్నిహితస్థితిన్ మెలఁగు సంపద పుణ్యవశం బటంచు లో

న్నియు నెంచి ధర్మము వహించుజనుఁడు గృతార్థుఁ డయ్యెడిన్. 46
చ. కలఁగక బుద్ధిపూర్వకముగా జనుఁ డేక్రియఁ జేయుఁ దత్క్రియా
ఫల మనుభూతి గా నిది శుభం బశుభం బిది యంచు రెంటినిం
దెలిసి సుకర్మముల్ సలుప దేవత లందఱు మెత్తు రందునం
గలిమియు బల్మి యిచ్చుటనె కల్గు సుఖంబె లభించు నచ్చటన్. 47
చ. ధనమణివస్తువాహవనితాజనతాదులు బల్మి సంతరిం
చినయవి యంచు ధర్మములు సేయక యుండిన నేమి యంచు న
య్యనిమిషు లందఱుం బగతు రంచు మహాపద లొంద నున్నని
న్ననుజుఁడ వన్నఁ గల్గు నిరయంబు రయంబున రమ్ము పోరికిన్. 48

దశకంఠుఁడు ధనదుని మాయాయుద్ధమున గెల్చి యతని పుష్పకంబు గొనుట.

క. అని తమదొర దూఱెడుధన,దుని మారీచ ప్రహస్త ధూమ్రాక్ష శుకా
ద్యనిమిషరిపుమంత్రులు మా,ర్కొని నిలువఁగ లేక చనిరి కోఁచతనమునన్.
చ. అని యిటు లాత్మమంత్రులు ధనాధిపుకోల్తల కోర్వ లేమి న
ద్దనుజవరేణ్యుఁ డుగ్రనిశితప్రదరంబుల వాని ముంచినం
గనలుచు డాసి కిన్నరశిఖామణి వానికిరీటపంక్తి ఖం
గున రొద సేయ భూరిగదఁ గైకొని బెట్టుగ మోఁది యార్చినన్. 50
మ. కడుఁ గోపించి దశాననుం డతనివక్షఃపీఠముం జొచ్చి పో
యెడునట్లుగ్రశరంబు వేయుటయు యక్షేశుండు ధీరత్వ మే
ర్పడఁ గోదండగుణారవం బఖిలదిగ్భాగంబులన్ నిండ న
ప్పుడు వహ్న్యస్త్రము వైవ వాఁ డడఁచె నంభోబాణవేగంబునన్. 51
మ. శరసంధానదృఢాపకర్షణకృతుల్ జ్యాఘోషణంబుల్ పర
స్పరధిక్కారము లొక్కచందమున మించన్ విశ్రవఃపుత్త్రు లి
ర్వురుఁ గ్రొన్నెత్తుటఁ దోఁగుచుం గెరలుచున్ రోషించుచున్ డాయుచున్
హరియుగ్మం బన నిద్ద ఱిద్ద ఱయి శౌర్యస్ఫూర్తిఁ బోరాడఁగన్. 52
క. రణమున వివిధాయుధధా,రణమున సరిఁ బోరుయక్షరాక్షసవరులం
బ్రణుతించి రమరు లసురా,గ్రణియున్ మాయఁగొని న్యాయ్యరణవిముఖుండై.
సీ. ఒకసారి మేఘమై యుడువీథిఁ గనిపించుఁ, గనిపించి పిడుగు లుగ్రముగఁ గురియు
నొక తేప సింహమై యుద్వృత్తిఁ బఱతెంచుఁ, బఱతెంచి కహకహార్భటి వహించు
నొకతూరి కొండయై యురులీల నెదిరించు, నెదిరించి యెగసి బిట్టదరఁ జేయు
నొకమాటు వార్ధియై యూర్ములతో మించు, మించి రోదసి యెల్ల ముంచివైచు
తే. నొక్కపరి వ్యాఘ్రమై వచ్చు నొక్కసారి, దంష్ట్రియై తోఁచు నొకమరి దారుణాహి
కరణిఁ గనిపించు నొకమాఱు గానిపింప
కడఁగు మాయానిరూఢి నయ్యసురవరుఁడు. 54

చ. ఇటువలెఁ బెక్కుమాయల ధనేశ్వరునిన్ భ్రమియించి విక్రమో
ద్భటగతి మించి నిష్ఠురగదం దల మోఁదినఁ గ్రొత్తనెత్తురుల్
జొటజొటఁ గాఱఁ బూచినయశోకము గాలికిఁ గూలుచాడ్పునం
దటుకున వ్రాలెఁ దేరిపయి దానవసైన్యము లుల్లసిల్లఁగన్. 55

మ. ధనదుం డీగతి మూర్ఛఁ జెంది పడ నంతన్ సూతుఁ డత్తేరు గ్ర
క్కున నందాతటినీసమీపమునకుం గొంపోయె యక్షుల్ భయం
బున వృక్షంబులు ప్రాఁకియున్ గిరిబిలంబుల్ సొచ్చియున్ వచ్చి కా
ననముల్ దూఱియుఁ గోసలం బడియు దైన్యం బొంది రెంతేనియున్. 56

తే. మూర్ఛమునిఁగినధనదుసమ్ముఖముఁ జేరి, శంఖపద్మాదినిధులువిశ్రాంతిమాన్చె
నంత దశకంధరుఁడు నిట్టులన్న గెలిచి, పొలయ కాతనినగరంబు సొచ్చియచట.

సీ. శాతకుంభస్తంభసాహస్రములు గల్గి, వైదూర్యతోరణావళులు గల్గి
నవ్యమౌక్తికవితానవితానములు గల్గి, శశికాంతవేదికాచయము గల్గి
సొగసైనమగఱాలసోపానములు గల్గి, కప్పుఱాలోవలయొప్పు గల్గి
కామితార్థము లిచ్చుఘనవృక్షములు గల్గి, వికచకహ్లారదీర్ఘికలు గల్గి

తే. మానసజవంబు గల్గి కామగతి గల్గి, కామరూపంబులు వహించుగరిమ గల్గి
ప్రబలుపరమేష్ఠిరజతపుష్పకముఁ గాంచి
యందుపై నెక్కి యతఁడు తారాద్రి కరిగె. 58

మ. తరళోత్తుంగతరంగఘుంఘుమరవోద్యద్దివ్యనందారవిం
దరజోబృందమరందతుందిలమిళిందధ్వానసంబంధగం
ధరమాబంధురమంథరానిలుని చేతన్ శ్రాంతి వాయన్ ధనే
శ్వరుఁడుం దెప్పిటి భీతి సేనఁ గొని లజ్జం జేరె వీ డయ్యెడన్. 59

దశవదనుఁడు సపరివారంబుగాఁ గైలాసంబున కేఁగుట.

ఉ. ఆజితనూజ వింటివె దశాననుఁ డిట్టులు పుష్పకంబుతో
నాజిజయంబునుం బొరసి యావలఁ బోవుచుఁ జూచె ముందటన్
రాజతశైలముం దపనరథ్యనిరోధకృదత్యుదగ్రతా
రాజితసాలముం దటచరత్కరిసింహతరక్షుకోలమున్. 60

తే. చూచియచ్చోటివింతలు చూడవలసి, బలసియిరువంకలను దైత్యభటులుగొలువఁ
జెలువ మొలికెడునమ్మహాశిఖరమెక్కి, యక్కడఁ జరింపమారీచుఁ డతనికనియె.

మ. కలధౌతాచలదీధితిప్రచయమో గంగాప్రవాహాంతరో
జ్జ్వలడిండీరనికాయమో శబరయోషాధన్వముక్తాస్త్రని
ర్దళితప్రాంచితచామరవ్రజమొ నా రంజిల్లు రెండాఱుచే
తులఁ బోఁ డుండినతెల్లుటిల్లు గనుమా దోషాచరగ్రామణీ. 62

సీ. శైలజాసహచరోజ్జ్వలరుద్రకన్యకా, చరణాలక్తపంక మొరసినదియొ

యిది నగం బను పేరని పొందుఁ గావున, విపులంబుగాఁ బల్లవించినదియొ
తనగిరీశత్వ మందఱకుఁ దోఁప నభంబు, మించు పెంజడలు వహించినదియొ
సానుభాగచరద్భుజంగభోగమణీస,ముంచితప్రభ నాక్రమించినదియొ
తే. లేక ధననాథు గెలిచి త్రిలోకవిజయ,వాంఛ నరుదెంచు దేవరవారిదోఃప్ర
తాప మిటనుండినదియొ నాఁదరుణతరణి, కిరణగతి గైరికముల నిగ్గిరి వెలింగె.
చ. తిరముగ జైత్రయాత్ర చనుదెంచిననిన్ గని యీకుభృత్తు ని
ర్ఝరములఁ బాద్య మిచ్చి రవిసంజ్వలితార్కమణీవిభాపరం
పరల నివాళి సేసి వనభవ్యశుకాదివిహంగమోక్తినై
ఖరి నుతి సల్పెడిన్ రజతకాంతుల వెల్లఁదనంబుఁ జూపుచున్. 64
సీ. చిగురుజొంపముల రంజిల్లె నీయెలదోఁట, చెలు వపర్ణకు వేడ్కసేయు నేమొ
విరిగల్వవిరులచే వెలసె నిక్కొలనిందుఁ, జంద్రజూటుఁడు కేళిసల్పు నేమొ
సంతానకుసుమవాసన లూనె నిక్కోన, దేవకన్యకలు వర్తింతు రేమొ
పువ్వుఁబుప్పొడిదుమ్ము పొదలె నిప్పొదలలోఁ, సిద్ధాళు లెపుడు వసించు నేమొ
తే. తనరె బహుబిల్వరుద్రాక్షతరువు లిచటఁ, బ్రమథవర్యులకివి రచ్చపట్టులేమొ
యనుచు మారీచుఁ డెఱిఁగింప నచట నచట, నయ్యసురభర్త విహరించు నవసరమున.
సీ. చిమ్మచీఁకటి గ్రమ్ము క్రొమ్మావిగుమి నల్లి, బిల్లి యాడాత్తుపంతపుళ్ల నడుమ
వడిఁ బాఱువిరితేనెవాఁకలదరుల వెంబడి ఘుమ్ము మను మృగమదము తావిఁ
బాలుపొందు విరవాది పొదలలోఁ గుప్పలు, వడుసుర పొన్నపుప్పొడి దుమారము
మొలసిన లేఁదెమ్మెరలయెమ్మె గనుకమ్మ, బంగరుఁబూఁదోఁట పజ్జ నమరు
తే. మరకతనిబద్ధభూములు మలయు రేవెలుంగు జాతిశిలల చెన్నసంగు పొగడ
మ్రానినీడలఁ దగు నొక్క కోనలోనఁ, బుష్పకవిమాన మటు నాగిపోక నిలిచె.
చ. నిలిచినఁ బంక్తికంధరుఁడు నివ్వెఱఁ గంది యిదేల యిచ్చటన్
నిలిచెను శక్తుఁడే యొకఁడు నిల్పఁగ దీనికి దుర్గమలస్థం
బులు గలవూటు చూడుఁడటఁ బొండని మంత్రులఁ బంప వారల
క్కలఁకుల సంచరించి పరికించియు హేతువు గాన కయ్యెడన్. 67
మ. అలమారీచుఁడు దేవ వింటె యిది యక్షాధ్యక్షునిం గాని య
న్యులఁ బై నూని చరింపదో యతఁడు క్రోధోద్రేకియై నిల్పెనో
తెలియుం డం చనునంతలో వికటుఁడై దీప్తాస్యుఁడై కుబ్జుఁడై
బలధుర్యుం డగు నంది యందుఁ గని యప్పౌలస్త్యుతో నిట్లనున్. 68

దశగ్రీవునకు నంది శాపం బిచ్చుట.

చ. నిలిచె విమాన మంచు రజనీచర నివ్వెఱఁ గంద నేల యీ
నెలవున దేవితో హరుఁడు నేఁడు విహారము సేయుచున్నవాఁ
డలగిరి డాఁర గామర విరియచ్చరు లోడుదు రీడఁ జూడ నిం

దుల కరుదెంచి నీబలముతోఁ జెడి పోక తొలంగు నావుడున్. 69

చ. పటపట పండ్లు గీటుకొని ✽ పంక్తిముఖాసురభర్త పుష్పకం
బటు డిగి శంభుఁ జెవ్వఁ డహహా ననునిల్పెడునంత వచ్చె నే
యిట నిను నీశివుఁడు నిలువ ✽ నిచ్చిన నట్టులు గాదె నముం బుఁ ద
త్తటమున నుండి యగ్గిరివరోత్తంసము క్రిందికి వచ్చి చెచ్చెరన్. 70

క. ఉరుశూలముఁ గొని రెండవ, హరునివలెను నీ ప్రతిగ్రహము మీఱఁగ వా
నరముఖ మొందిన నందిని, బరికించి దశాననుండు ✽ పకపక నగియెన్. 71

తే. ఇవ్విధంబునఁ దనుఁ జూచి ✽ నవ్వుచున్న, యతివిమూఢుని దశకంఠు నెన్నబెట్టిచూచి
యపరశివుఁడైన నందీశుఁ డాగ్రహమువ, హించి కటకటమదరఁగా నిట్టులనియె.

చ. కపివదనుండ నై ననుఁ ✽ గన్గొని నీ వవమానదృష్టితో
నిపుడు హసించినాఁడ విట ✽ నీసృశవక్త్రముఖుల్ నఖాయుధుల్
గపు లిఁక నీకులం బడఁపఁ ✽ గల్గెద రంతటఁ గండగర్వముం
దపమునఁ బుట్టుబెట్టెదనుఁ ✽ దామె యడంగెడు రాక్షసాధమా. 73

శా. శాపోక్తుల్ వచరింప కున్న నెదిరింపంగా రాదె యంచేని నిం
దాపారంపరి మున్నె గా మృతుఁడవే ✽ నాకిట్టి పీనుంగుపై
నేపుం జూపఁగ నర్హమా నె యిది గా ✽ నీచేయుపాపంబుచే
నాపద్వార్ధి మునింగి పోవఁగల వేళ లా యింక నిన్ నొంచఁగన్. 74

క. అని యానంది శపించిన, విని యానందించి సురలు ✽ విరులు గురిసి ర
వ్వీనువీది దేవదుందుభు,లును మొరసెన్ బెరసె సుఖము ✽ లోకము లెల్లన్.

ఉ. అంత దశాననుండును మదాంధుఁడు గావున శప్తుఁడయ్యు నా
క్రాంతయుఁ జింత లేక మఱి ✽ హెచ్చినభీషణరోషవహ్ని చే
తాంతరశోణకాంతులు బయల్పడుపం గలధౌతశైలరా
డంతికవర్తియై పలికె ✽ నగ్రమునన్ నిలుచున్న నందితోన్. 76

ఉ. వెక్కులు వ్రేల నిచ్చినను ✽ బ్రేలవె నీపశుబుద్ధి మాటలం
దక్కునె చక్కఁగా నెదిరిఁ ✽ దన్ను నెఱుంగ వటుండు పుష్పకం
బిక్కడ నాఁగి మీయధిపుఁ ✽ డింక సుఖంబున నుండుఁ గాని లే
యెక్కిన వెండికొండ నిదె ✽ యేఁ బెకలించి రజంబు సేసెదన్. 77

వింశతిభుజుండు వెండికొండం బెకలింపఁ బూనుట.

వ. అని దురాగ్రహంబునం బలికి యద్దశగ్రీవుండు రవిగ్రహంబు న్గాఁగయునుదగ్ర
విగ్రహంబుతో నమ్మహాగ్రావంబు శిఖరాగ్రం బనర్గళలీలం బట్టి యిట్టట్టు గద
లించి బెట్టు గదలినయగ్గట్టు చుట్టుఁ గనుపట్టు నెఱియ విరియం బదఘట్టనంబు
గావించి గీర్వాణగణప్రాణనిర్వాణ ప్రవీణతాధూర్వహ దుర్వార గర్వాకర
దర్వీకరభీకరంబు లైనవింశతికరంబులు సారించి హుంకరించి యహంకరించి

పదిమొగంబులు జేగుఱించ వేగిరించుసాహసోత్సాహసంపదలతో నిజభు
జాంగదంబు లొండొంటితో నొరయ నిజాట్టహాసంబున గుహాకుహరంబులు
మాఱ్మ్రోయ నిజవిలోకనంబుల మిడుంగుఱులు గురియ నిజదంత సంఘర్షణం
బున దిగ్గజంబులు సెవుడు వోరయ నిజప్రతాపంబు మెఱయ నిర్నిమిత్త మీ
మహీభృత్తు హత్తి మత్తవృత్తిం జూప నేల యని తద్బలంబులు దనపై నుర
వడించెనో యన శరభ సింహ శార్దూలమదేభ ప్రముఖవనజంతువులు క్రొళ్లుఱక
మహోరగంబులు సరగ నరుగఁ గూడక చూడ గొప్పలగు పిప్పలాదితరువులం
జుట్టుకొని బుసకొట్టుచు నవియునుం జాఁపకట్టు నడ నొడళ్లు నలఁగి పడగ
లవిసి సమసినఁ దదగ్రజాగ్రన్మణులు ఫణిభూషణున కద్దురవస్థ నుడువం బరువు
లిడుచున్నవడువున దవ్వుల మిడిసిపడ గడగడ వడంకుచు నుడుగనిజడుపునం
దముఁ గౌఁగిలించు చెంచుమించుఁబోఁడులకౌఁగిళ్ల ననంగి పెనంగి వారి
యనుంగుమగ లడుగు మోపఁగూడక దబ్బునం గూలి నెత్తంబుపట్టులఁ బొర్లి
గింతలు వెట్ట నట్టివింతలు గని యెట్టివింతలు పుట్టె నని రచ్చపట్టు చెట్టులక్రీనీడ
లం గ్రీడలు సాలించి యన్నెలవున నిలువ లేక వేల్పుఁగలువకంటులు క్రొమ్ము
డులు వీడఁ గీలుగంటు లంసంబులపై జీరులాడఁ దళుకుఁజెక్కులు సెమరింపఁ
గులుకుగుబ్బలు పులకింప నెన్నొసళ్ల ముంగురులు నెఱయఁ జిగురుఁగెమ్మోవుల
నిట్టూర్పులు దొరయ నిజాధిపభుజాస్తంభంబు లూఁత గొని తద్భయంబునం
జెంగటివిమానంబు లెక్కికొని తమ్ముఁగ్రమ్మఱం బుట్టినవారిఁగాఁదలంప నిలింప
హృదయంబులు గలంపం జాలునారభటులతో వీరభటు లిరువంకల నిలిచి
పెక్కుచందంబుల నభినందింప నందికేశ్వర గణేశ్వర చండికేశ్వర ప్రముఖ
మహాప్రమథగణేశ్వరులు శర శరాసన పట్టిస ప్రాస కరవాలభిండివాల తోమర
ముద్గర గదా కుంత క్షురికాదినానాఘనంబులు గైకొని సర్వజ్ఞునియనుజ్ఞవడయుట
కై యతనియగ్రభాగంబున సలబలంబులు సేయుచు నిలువుఁగొలువు సేయఁ
బార్వతీపరమేశ్వరక్రీడోచితమణిఖచిత సౌధప్రాకారగృహకుడ్య గోపురతోరణ
స్తంభాదులు బ్రద్దలువాఱ తద్దయుఁ బ్రకంపనంబు వహింప సహింప రాని
దరంబునం గరంబులు పిసికికొనుచుఁ బదకంజమంజీర సంజాతశింజారవంబులు
సెలంగ నలుగడలం దిరుగుచు రుద్రకన్యక లనన్యశరణ్య లయి దైన్యంబు
నొంద నరవిందబాంధవాది గ్రహంబులు త్రోవలు దొలంగ నింద్రాదిలోక
పాలకలోకంబులు హాహాకారంబులతో బట్టబయల నిలిచి చూచుటకు బెట్టులికి
యిట్టులం బగుమొగుళ్ల తెట్టువలలో మఱుఁగుపడి యాకట్టెడి పొట్టక్రొవ్వున
నిట్టెట్టిదంబు గావింప గట్టువిల్లు వట్టినదిట్ట యెట్టు మట్టువెట్టకున్నవాఁడో యని
యొకళ్లొకళ్లతోఁ బలుకుచుఁ గనుంగొనఁ బ్రత్యంతపర్వతంబు లున్మూలంబు
లై పొడవడంగఁ బెదపెదగండోపలంబులుపైపై లనుంగి పెళపెళమనుచప్పుళ్ల

తో డుల్లి చఱుల నురలి పడం బడలు వడక పాతాళంబులోఁతు గనుపాఁత గలించి పుండరీకంబుఁ బెకలించు మదవేదండ ప్రకాండంబుడంబున ఝరీ మండలహారిపరంపరలు నలువంకలఁ దొరంగ ఖనిస్థలీవినిర్గత నీలమణి రమణీయ మధుకరంబులు నలుగడలఁ జెదరఁ గనకవకుళ కేతకీకురంటకాశోక మధూక కేసర ప్రముఖభాసురకుసుమనిస్సృమరపరాగవిసరంబు నలుదెసల నొరసికొన నవ్వెండి కొండ పెకలించి కందుక క్రీడ గావింపం గడంగె నయ్యవసరంబున. 78

మ. అసురాధీశకరావధూతకలధౌతాద్రిం బదం బూనలే
క సఖుల్ గొల్వ వనంబులో మెలఁగునద్రిగారీసరోజాక్షి మే
ను సెమర్పం దనుమధ్యముల్ వడఁక నాకన్దోళింప నేత్రప్రభల్
వెస నేతెంచి కవుంగిలించుకొనియెన్ విభ్రాంతయై శంభునిన్. 79

వ. ఇవ్విధంబున. 80

ఉ. బంగరుఁదళ్కుఁజెక్కులను బంజులకమ్మలడాలు చిందు ద్రొ
క్కంగ మెఱుంగుఁజన్నుఁగవ కంచుకపున్మడి వీడఁగా హఠా
లింగనసౌఖ్య మిచ్చినచెలిం గవుఁగింటనె యుంచి యల్లఁ డ
య్యెం గఱకంఠుఁ డద్రి నతఁ డెత్తఁగఁ గాముకు లెగ్గు లెంతురే. 81

శా. శంభుం డద్రికుమారికాస్ఫురదురోజద్వంద్వశుంభత్పరీ
రంభం బీగతిఁ జెంది యెంతసుఖ మాహా నెమ్మదిన్ వీనియా
రంభం బెట్టిదుపంగ వచ్చు నయినం గార్యంబు దీఱన్ భుజా
స్తంభోజ్జృంభ మొకింత మాన్పి పిదపన్ సాహార్దముం జూపెదన్. 82

క. అని తలఁచి లేఁతనగ వాననమునఁ దగ శంభుఁ డాసనము డిగ్గక మున్
తనవామపదాంగుష్ఠంబున నదిమె దశాస్యుహస్తములు క్రిందుపడన్. 83

తే. ఇట్లు లదిమినభుజశౌర్యమెడలిబడలి,యడలియొడలిమదోద్వృత్తిసడలిశూలి
కాలివెనువ్రేలు దెమలించి కరము లెత్తు,కొన సమర్థత లేక రక్షోవిభుండు.

మ. కులశైలంబులపెన్బిలంబులు బదుల్ ఘోషింప శేషాహి మూ
ర్ఛిల భూచక్రము దిర్దిరం దిరుగ జేజేపెద్ద భీతిల్లఁ జు
క్కలు రాలన్ దివి వెల్లగిల్ల సుర లాకంపింప నంభోనిధు
ల్గలఁగన్ దిక్కటు లొడ్డగిల్లఁ బదినోళ్లన్ బెట్టు వాపోవఁగన్. 85

క. తలఁచిరి మనుజు లకాండప్రళయం బిది యనుచు దిగులుపడి రమరేంద్రా
దులు యక్షసిద్ధసాధ్యులు, గలఁగిరి తొలఁగిరి పదంబుగ్రహరాణ్ముఖ్యుల్. 86

శా. ఈరీతిన్ జగముల్ దలంకఁగను వేయేం డ్లార్తుఁడై కూయఁగా
నారక్షోవిభుదైన్యపాటుఁ గని దైత్యశ్రేణి కన్నీరు ము
న్నీరై పాఱఁగ నే మొనర్తు మనుచున్ నిర్విణ్ణతం జెంద న
మ్మారీచాదికు లాతనిం గని యసామాన్యప్రబోధంబునన్. 87

తే పలికి రవధారు డై తేయపట్టభద్ర, భద్రగజచర్మధారియై భక్తి యుంచి
యంచితోక్తుల నతని నుతించి తేని, నీనిరోధంబు నెడఁబాపు నీక్షణమున.
క. హరుఁ డున్నతకరుణానిధి, శర ణన్నఁ బరిగ్రహించు జగతి నతనికిం
బురు డున్నదె యజకనకాం,బరు లెన్నఁగ లేరు తత్ప్రభావం బనినన్. 89

దశగ్రీవుండు శివుని నుతించి యతనివలన వరములు లోనైనవి వడయుట.

శా. ఆపన్నుం డగుపం క్తికంఠుఁ డిది యా నంచుర్ లలాటేక్షణ
శ్రీపాదాంబుజముల్ మనోంబుజమునం జింతించుచున్ వేదవి
ద్యాపాండిత్యము సర్వశాస్త్రకుశలత్వంబున్ మహాసాహితీ
నైపుణ్యంబును గానివింపఁ బొగడె న్గంగార్తితుంగార్భటిన్. 90
శా. ఆస్తోత్రంబున కామనోద్రఢిమ కాధ్యానాప్తి కాయీశ్వరుం
డస్తోకప్రియ మావహించి వెనవే లావేళఁ బై నెత్తినన్
హస్తంబుల్ వెడలంగఁ బాపికొని దైత్యస్వామి ఫాలస్థల
న్యస్తప్రాంజలి యై నుతింపఁ దొడఁగె స్గంభీరవాగ్గుంభనన్. 91
రగడ. జయజయ శంకర సాధువశంకర, జయజయ రిపుభటచయనాశంకర
శరణు నిరంజన సజ్జనరంజన, శరణు ప్రభంజనజవగజభంజన
పాహి పురాహవబంధురవిక్రమ, పాహి యవిద్యాపంకరవిక్రమ
యచ్చుగ నినుఁ దెలియవు తొలిచదువులు, మెచ్చిననిత్తువు మే లగుపదవులు
నీ కెవ్వరిపై నిలువదు కోపము, లోకుల కెంచఁ దెలుపుదు ప్రతాపము
పరుఁడు స్వజనుఁ డనుభావవిభేదముఁ, బొరయదు నీమది పూర్ణామోదం
బభవుని భవు ని న్నమితదయాపరు, నభినుతింప బ్రహ్మాదులు నోపరు
ఖలుఁడమదాంధుఁడఁగలుషోత్కృష్టుఁడఁ, జలచిత్తుఁడఁగడుజడుఁడనికృష్టుఁడఁ
నే మిముఁ బొగడఁగ నెంతటివాఁడను, స్వామీ మద మణి శరణన్నాఁడను
నీదాసుఁడ నిఁక నేరము లెంచకు, నాదుర్వృత్తి మనంబున నుంచకు
మెఱుఁగక చేసితి నిపు డపచారము, శర ణన్నను గడ నన దె విచారము
వలసితి నీసేవకుల మహత్త్వము, దెలిసితి నియ్యెడ దేవరసత్త్వము
నీకను దెఱచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు
ఇట్టినీకు సరియే నని హెచ్చితిఁ, బొట్టక్రొవ్వు ననఁ బొగడఁగ వచ్చితి
నాగుణ మెంచకు ననుఁ బాలింపుము, నీగుణ మెంచెద నీవాలింపుము. 92
చ. అని తనుఁ బ్రస్తుతించిన దశాననుఁ జూచి పురారి నవ్వుచున్
దనుజవరేణ్య నీస్తుతికిఁ దద్దయు మెచ్చితి ధైర్యశాలి వౌ
దనుమతి యిచ్చితిం జను ప్రియం బగుచోటికి నీభుజాబలం
బనితరసాధ్య మంచు విని యారయ నిల్పితి నింతె యివ్యెడన్. 93
తే. మత్పదాంగుష్ఠపరిపీడ్యమానరజత,పర్వతము క్రిందఁ జేతులు పడినయపుడు

జగము లద్రువ విరావంబు సలిపి తందు,వలన రావణుఁడను పేరు వెలయు మనిన.

ఉ. ఆదశకంఠుఁ డీశ్వరున కానతుఁ డై శివ నన్నుఁ బ్రోవ నా
హ్లాదము గల్గె నేని నిసుమంత కొఱంతయు లేని యాయువుల్
నీ దగు చంద్రహాసమును నెమ్మి నొసంగు మటన్న శంభుఁ డ
క్కైదువు నిచ్చి పిమ్మట నఖండతరాయువు నిచ్చి యిట్లనున్. 95

మ. దితిజాధీశ్వర నీవు గోరిన క్రియన్ దీర్ఘాయువుల్ నీకు ని
చ్చితి నీక్రొవ్వున నీతిఁ జేకొనక దుశ్శీలుండ వై మమ్ము నా
దృతి నొందించితివేని మావరము మమ్మే చేరుఁ బొమ్మన్న చో
నతఁ డాశూలికి మ్రొక్కి వీడ్కొని విమానారూఢుఁ డై యుబ్బుచున్. 96

క. తనపరివారము గొల్వఁగఁ, జనియెన్ రజతాద్రి డిగ్గి స్వచ్ఛందగతిన్
మనుజేశ్వర యని కుంభజుఁ,డినకులునకుఁ దెల్పి మఱియు నిట్లని పలికెన్.

రావణుని చర్యలు.

మ. ఇనవంశోత్తమ వింటె పఙ్క్తివదనుం డీలాగు కైలాసవా
సునిచే మన్ననఁ గాంచి పొంగుచుఁ బ్రహస్తుం డాది యౌ సైనికుల్
దనుఁ గొల్వం జని హేమకూటహిమవత్ప్రాంతంబులన్ గంధమా
దననీలాచలపారియాత్రములమీఁదం గ్రీడ సల్పెన్ రహిన్. వ. మఱియును.

సీ. చరియించు నొకవేళ జంబూనదీతీర, సౌవర్ణవాలుకాస్థలములందు [దుఁ
విహరించు నొకప్పుడు వేల్పురాతోఁటలఁ, బొదలు గొజ్జఁగపూవుఁబొదలయం
గ్రీడించు నొకతఱిఁ గేసరశ్వేతాంజ,నాద్యద్రి రాడధిత్యకలయందు
నలరు నొక్కెడఁ గేళి నరుణోదమానస, ప్రముఖదివ్యసరోవరములయందు
తే. నన్నెలవులందు మెలఁగెడు నమరఖచర,యక్షకిన్నరసిద్ధవిద్యాధరాప్స
రోభుజంగాదికులు మహాక్షోభ మొంది, తన్నుఁ గనుఁగొని పాఱ నద్దశముఖుండు.

సీ. పట్టణం బన రాదు కట్టాయితంబుగాఁ, బట్టి ముట్టడి చేసి చుట్టు విడియు
బలవంతుఁ డన రాదు బలియుఁ డై యెంతద,ర్పాల నున్న వడి నేఁగి గెలిచివచ్చు
సురజాతి యన రాదు కిర మల్గి యెటు సన్నఁ, జననీక శస్త్రాస్త్రసమితి నొంచు
ధరణీశుఁ డన రాదు తనకు నోడితి నన్న, దాఁక నీరసమున వీకఁ జూపుఁ
తే. బాయపు నెలంత యన రాదు పాపమునకు, భయపడక యెట్టులైన నను బట్టి కలయు
నర్హవస్తువు లటఁ గలవనఁగ రాదు, దుడుకుమైఁ జొచ్చికొని తెచ్చు దుష్టుఁ డతఁడు.

వేదవతిని జూచి రావణుండు భాషించుట.

వ. ఇచ్చెలువునం దనయిచ్చకు వచ్చిన హెచ్చున నచ్చటచ్చట నచ్చపలుండు నిచ్చలు మెలంగుచు నొక్కనాఁడు హిమవత్పర్వతంబునకు నుత్తరదిగ్భాగంబున నొక్కసుందరోద్యానంబు సందర్శించి యచ్చట. 102 [నెఱయ

సీ. ఘనమండలము సుధాకరమండలము నిండు,నటుల మోమున జటాచ్ఛటలు

వలఁజక్కవలుచిక్కు ǂ వలనొప్ప మృదువల్కలంబునఁగుచలికు ǂ చంబులొరయ
జెళుకుఁజూపులలేడి ǂ గెలిచి కైకొనియెనొ, నాఁగ్రిందఁ గృష్ణాజి ǂ నంబు నెలయ
నఖపాళిబెడఁగుమా ǂ న్పకుమంచునుడులుగై, వాగ్రెలెనాస్ఫటికాక్ష ǂ మాలిక దగఁ
తే. గొనుమరజంబు దొరసిన ǂ కల్పలతిక, బాగున విభూతిచేత మైత్రీఁగ వెలుఁగ
నొంటి గిరికన్యవలెఁ దపం ǂ బున్నతపసి,కన్నెనొక్కతెఁ జూచె రా ǂ క్షసవిభుండు.
తే. చూచియాచెల్వ చెల్వంబు ǂ లోచనముల,కబ్బురంబునుగాంతయు ǂ నుబ్బనర్పఁ
బుష్పకము డిగ్గి సరభసం ǂ బుగఁ దదగ్ర
భాగమున నిల్చి పలికె న ǂ ప్పంక్తిముఖుఁడు. 104
సీ. నీకులం బెయ్యది ǂ నీనామ మేమందు, రెవ్వరిదానవే ǂ యిందువదన
కలికిలేఁబ్రాయంబుఁ ǂ గానపాల్ గావించి, యేల కృశించెదే ǂ యిగురుఁబోఁడి
నీప్రాణనాథుఁడై ǂ నిను నేలుభాగ్య మెవ్వానికిఁ గల్గెనే ǂ వన్నెలాఁడి
యేతపం బొనరించి ǂ యీచెల్వు గంటివో, యింకఁ దపం బేల ǂ యేణనయన
తే. కాఁకఁజెందినపసిఁడిన ǂ లాకవంటె, తనువు వెండియుఁ గళ గాంచు ǂ నని తలంచి
చూపఱులయిచ్చ వేమఱుఁ ǂ దాపముంచె, దేమి నీచర్య లెఱిఁగింప ǂ వేలతాంగి.
ఉ. నీబిగిగుబ్బచన్నులకు ǂ నీనెఱిపెన్నెఱు లున్నతీవికిన్
నీబటువుంబిఱుందులకు ǂ నీయొలపాయపుఁగల్మి కింతిరో
యీబసుమంబు కప్పురమె ǂ యీతిరి వేణియె పట్టుఁజీరలే
యీబిఱుసైనవల్కలము ǂ లీతప మిష్టమనోజభోగమే. 106
సీ. అణుమధ్య నీమధ్య ǂ మణిమంబు వహియించు, మహికటినీకటి ǂ మహిమ గాంచు
గిరికుచ నీకుచ ǂ గిరు లొందు గరిమంబు, నలినాక్షి నీఱెప్ప ǂ లలరు లఘిమ
ఘనవేణి నీవేణి ǂ మను ఘనశ్రీప్రాప్తి, నతివ నీమెయి ప్రకా ǂ మ్యతను నెక్కు
నంగన నీభర్త ǂ యఖిలేశతనుఁ దగుఁ, జెలి నీకు వశి యగుఁ ǂ జెఱకువిల్తుఁ
తే. డిన్నివైభవములు గల్గి ǂ యిగురుఁబోఁడి, బేలతనమున నీతపం ǂ బేలచేయఁ
గొదవయొదవినదిదియంచు ǂ మృదులఫణితిఁ, జెవులకీయెడఁబండువు ǂ సేయుమనిన.
క. ఆనెలఁతయు నప్పలుకులు, వీనుల కెడఁ జేసి వాని ǂ విశ్రవసుతుఁగాఁ
దా నెఱిఁగి హీనుఁ డనక య,హీనత నాతిథ్య మొసఁగి ǂ యిట్లని పలికెన్.
మ. దనుజాధీశ కుశధ్వజుం డనుతపో ǂ ధన్యుండు మున్నొప్పు నా
యన వేదంబు పఠించువేళ నుదయం ǂ బై నేను వాపోవఁగా
ననుఁ బ్రేమ్ణంబునఁ జూచి వేదవతి య ǂ న్నామంబుఁ గావించి పెం
చిన లేజవ్వన ముప్పతిల్లుటయు జే ǂ జేలుర్ మునుల్ రాజులున్. 109
క. నను వలచినధిషణసుతుం, గని వేఁడిన హరికి నిత్తుఁ ǂ గాని యొరున కి
వ్వనితామణి నీ నని యె,వ్వని కైన నొసంగఁ డడుగ ǂ వచ్చినవేళన్. 110
వ. ఇవ్విధంబున. 111

శా. ప్రత్యాఖ్యానముఁ జెంది యండజుఁడు జనం భూపాత్ముఁ డౌదంభుఁ డీ
దైత్యుం డొక్కఁడు వచ్చి మజ్జనకునిం దా వేఁడి యీ నన్నుఁ గో
నత్యంతక్రుద్ధుఁ బూని ఖడ్గమున నిర్ద్రాసక్తు ఖండించి యా
హత్యన్ వాఁడు నశించె నత్తపసియిల్లా లగ్ని సొచ్చెన్ వెతన్. 112

తే. తల్లియును దండ్రియును జన్నఁ దనయభాగ్య
మునకుఁ గలఁగియుఁ గలఁగక పూర్ణనిష్ఠ
జనకుని ప్రతిజ్ఞఁ గడతేర్తునని తలంచి
వెన్నునిగుఱించియిటఁ దపమున్నదాన. 113

క. కంటివె యిచ్చటివింతలు, వింటివె నాపూర్వకథ సవిస్తరముగఁ జే
కొంటివె యాతిథ్యము పడ,వుంటివె యిటఁ జనుము గాకుసోత్తమ యనినన్.

చ. తన కిది దక్కె నంచుఁ బ్రమదంబున బంక్తిముఖుండు మీనకే
తునిచిగురాకుబాకు మదిఁ దూఱినఁ దాలిమి మాలి చేరఁగాఁ
జని యిది యేమి వెఱ్ఱి యెలజవ్వనముం బొలివోవ విష్ణుఁ డం
చునె కలకాలముం దపసిచొప్పున దాఁటెదు వృద్ధకాంత వై. 115

ఉ. వెన్నున కిత్తు నంచు బలువేఁడుఁబు నేకొని తండ్రి యీల్గుటం
గన్నులఁ జూచియున్ హరియె కావలె నంచుఁ దపించె దూరకే
కన్నెఱికంబు కాఱడవిఁ గాచినవెన్నెల సేసి యయ్యయో
నిన్నును ముంచె నీజనకునిం గుదియించిన వెఱ్ఱి యియ్యెడన్. 116

మ. హరి తానే బలవంతుఁ డైన మును మీయయ్యన్ విరోధించి యొ
క్కరుఁ డుగ్రాసి వధింప నడ్డపడి దోర్గర్వంబు గాన్పించెనే
హరి యన్నామము గప్పకున్ బెరయు నేలా యీవృథాభ్రాంతి యిం
తిరో యింకన్ ననుఁ బొందు మే లగు నయస్తేజఃప్రభావాఢ్యుఁడన్. 117

చ. అన విని కర్ణముల్ చిగురుటాకులఁ గేరెడుకేలుదోయి న
వ్వనజదళాక్షి మూసికొని వాని ననాదరదృష్టిఁ జూచి యీ
చెనఁటివివాదముల్ విడువు శ్రీహరి నేఖలుఁ డైన నింద న
ల్పునె తగుబ్రహ్మవంశమునఁ బుట్టియు మౌర్ఖ్యము మాన వక్కటా. 118

సీ. అన్వయంబుల కెల్ల నాదికారణభూతుఁ, డగుతాతఁ గనినాతఁ డతఁడె కాఁడె
జపతపోమఖముఖాచారసారఫలంబు, లరసి యిచ్చుప్రదాత యతఁడె కాఁడె
నీయందు నాయందు నిఖిలాత్మలం దంత,రాత్మయై కనునాత్మ యతఁడె కాఁడె
సముఁడయ్యు దుష్టశిక్షయు శిష్టరక్షయుఁ, బ్రతియుగంబునఁ జేయునతఁడె కాఁడె

తే. యాగమాంతరహస్యార్థమతఁడె కాఁడె,యన్ని జగములకధినాథుఁడతఁడె కాఁడె
యట్టిహరి నెంచ నేర కహంకరించి, నిర్నిమిత్తంబ నిందింప నీకుఁ దగునె.

మ. పలుకుల్ వేయును నేల లెస్స వినుమా పౌలస్త్య నామేను నా

యెలప్రాయంబును నామనోగతులు నాకయిచ్ఛాభిమానంబు లా
జలరుద్ధారికె దారవ్రాసినవి దుష్కాంక్షుల్ విసర్జించి పె
ద్దలు వర్తించుపథంబునన్ మెలఁగు మద్దైవంబు దో షయ్యెడున్. 120

తే. అనిపలికియందునిలకభయంబుదొలఁకఁ, గలఁకఁబిల్లికిఁదొలఁగురాచిలుకపగిది
నావలికిఁ బోవఁ దేఁటులయావళికిని, సతనునిశరావళికిఁ దాళ కనుం గదిసి.

చ. చెలి నునుమోవిపానకము చే వడ దేర్చి మోము మోమునం
బలుమఱుఁ జేర్చి ముద్దిడక బాహులతాపరిబద్ధఁ జేసి స
న్నలమియుఁ గౌఁగిలింపక రహస్యముగా బహుబంధవైఖరుల్
దెలుపక పోవ నేల యని తెంపున వేణికఁ బట్టి యీడ్చినన్. 122

చ. కలఁక దొలంగ వేదవతి గ్రక్కున బెత్తిలి యెత్తి వ్రేయుడున్
మలచుపువేణి నట్టనడుమం దెగి చేతికిఁ దున్క చిక్క నం
దుల కళు కొంది కైకసినుతుం డిది దీనితపఃప్రభావ మం
చలవడి యున్న నచ్చెలియు నవ్వలికం జని క్రోధమూర్తియై. 123

మ. ప్రళయాగ్నిజ్వాలితేక్షణప్రభల నప్పాపాత్ము నిం గాల్చున
ట్టుల వీక్షించి దురాత్ము నిన్నపుడె దుష్టుం జంపఁ జింతించియుం
దెలివిన్ విశ్రవసుం దలంచుకొని యాతిథ్యంబుఁ గావించి మా
ర్పలుకుల్ వల్కిన నింతయుం గలిగె నోర్వం గూడునే యిం కిటన్. 124

శా. ఘోరస్ఫారమదీయకోపదహనక్రూరార్చులన్ సేఁగా
నీరూపంబు దహింప క్రొర్చితిఁ దపోనిష్ఠార్థలోభంబుచే
నోరీ నీ విపు డంటుకొన్నమెయి నే నొల్లన్ జ్వలద్వహ్నిలో
నీ త్తై నిన్ దునిమించుపూనికను జన్మింతున్ ధరం గ్రమ్మఱన్. 125

తే. అని మహోగ్రతఁ బలికి క్రోధాగ్నితోడ
నచట యోగాగ్నియును మండునటుల చేసి
యయ్యెదుట నిల్చి శ్రీహరి నాత్మ నునిచి
యేపు సెడి దైత్యుఁడును విన నిట్టు లనియె. 126

ఉ. ఏను నిజంబుగా హరిపరాయిణ్ మది గల్గినదాన నేసి నా
పై నలినాక్షుఁ డాత్మ యిడి పత్నిఁగఁ జేకొనుమాట తథ్య మా
నేని నయోనిజత్వమున నిద్ధరఁ బుట్టి దశాస్యుఁ బుత్ర మి
త్రానుజయుక్తిఁ ద్రుంప నెప మయ్యెదఁ గా కని వహ్నిఁ జొచ్చినన్. 127

క. వేదవతిమాట నిజ మగు, వేదమువలె ననుచు మ్రోసె విసువీధి మహా
మోదమునఁ గుసుమవర్షము, లాదిత్యులు గురిసి రప్పు పవనీనాథా. 128

తే. యతిసుతయు నిట్లు కైకసీసుతకృతావమానపవమానజాజ్వల్యమానకోప
దహనసంయోగయోగాగ్నిదగ్ధయై వి, దగ్ధతాస్నిగ్ధదైవయత్నంగతన. 129

వేదవతియే సీత యగుటను రామున కగస్త్యుఁడు దెల్పుట.

సీ. తనపద్మవాసినీత్వముఁ జూపువహి లంకఁ, దోయజాంతరమునఁ దొల్తఁ బుట్టి
నిడె నీకు మిత్తినై యేఁగుదెంచితి నన్న, గతిఁ బంక్తిముఖున కే కానఁబడియె
నతఁడు పెట్టియఁ బెట్టి యబ్ధి వేయించిన, నబ్ధికిఁ బుత్త్రియై యటచటఁ దెల్పె
బహుళోర్విభవశమున బయలు దేఱి విదేహ, రత్నగర్భాగర్భరత్న మయ్యె
తే. జనకజననాయకుఁడు యాగశాలఁ గట్టు, చోట దున్నింప నాఁగేటిసరసఁ దోఁచి
సీతయను పేరువహియించి చెలువుగాంచి, ప్రేమ శ్రీహరివగు నిన్నుఁ బెండ్లియాడె.
తే. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గగరుడ, వాహనాదులు మాని యిక్ష్వాకుకులము
ఖ్యాతి గైకొన మానవాకార మూని, నట్టి నిన్నాశ్రయింతుఁ బట్టాభిరామ.
క. సాకేతనగరరాజును, వైకుంఠము నీవె హరివి వైదేహి రమా
కోకస్తని యీకపు లా, నాకపులు యథార్థ మిది ఘృణాగుణజలధీ. 132
క. కృతయుగమున వేదవతీ, సతియై తప మొంది త్రేత జనకజయై తా
మతిఁ దలఁచినటుల పట్టిన, పత్త్రినయు నెఱవేర్చెఁ దత్ప్రభావం బనదే. 133
ఉ. నా విని రాముఁ డద్భుతమునం గలశోద్భవుఁ జూచి యీసతిన్
రావణుఁ డల్లు దొల్లియును రాయడి వెట్టెనె క్రోధమూర్తియై
పావకులోపలం బడినబాలికఁ గన్గొని చేష్ట దక్కి వాఁ
డావల నెందుఁ బోయెఁ దెలియఁగఁ బలుకన్ వినిపింపుఁ డింపునన్. 134
మ. అనినం బ్రముఖుఁ గుంభజుం డనియె రామా యయోధ్యన్ నీ వెఱుం
గని దే మున్నది యైన మాఘునతి లోకంబుల్ ప్రశంసింప న
జ్ఞానిచందంబున నాలకించెదవు ప్రాజ్ఞుల్ నిచ్చ గోచూపులం
గనునానందము నీవె కావె విను రక్షశ్చర్య లామీఁదటన్. 135
తే. అటుల వేదవతీకన్య యనలశిఖలఁ, జొచ్చి మగ్గుటఁ జూచి యచ్చోటు వాసి
చపలుఁ డప్పంక్తిముఖుఁడు పుష్పకవిమాన
మెక్కికొని భూమిఁ దిరుగుచు నొక్కనాఁడు. 136

రావణుఁడు జన్నం బొనర్చు మరుత్తభూపతిపైఁ బోవుట.

క. ఒకచో స్వాహాస్వరపూ, ర్వకవివిధాజ్యాహుతప్రవర్ధితకీలా
ప్రకరానలధూమవ్యా, పక మగునొక సవనమండపము గనుఁగొనియెన్. 137
క. కని యెవ్వరిమఖమో క, న్గొని రమ్మని శుకుని సారణునిఁ బనుప హసా
దని పోయి తెలిసి క్రమ్మఱి, వినిపించిరి యిట్టు లనుచు వింశతిభుజుతోన్. 138
సీ. అవధారు జయరమాయత్తుఁ డైనమరుత్త, సర్వంసహాభర్త సవనకర్త
యమరేజ్యననుజుఁ డుగ్రమహత్త్వశాలి సం, వర్తకుండు గ్రతుప్రవర్తకుండు
బలభేదిశమనాంబుపతిముఖ్యు లనువేల్పు, మన్నవారు వహించుకొన్నవారు
కశ్యపాత్రివసిష్ఠకౌశికాదులు పుణ్య, భాజనములు దత్సభాజనములు

తే. హైమమణికాంతిఁ దగుశాల యజ్ఞశాల, మెచ్చినాఁడుహరుం డర్థ మిచ్చినాఁడు
విప్రయోగంబు మునులచే సుప్రయోగ మైనదని వారు దెల్పఁగా నాలకించి.
శా. ఆహా నాయెదుటన్ మఖం బొకటి సేయం బూననే నెట్టి యా
బాహాజన్ముఁడు విఘ్న మెట్లొదవదో భాగంబు లెట్లందఁగా
నూహల్ సేసిరొ చూత మీనుం లటం చుగ్రాహవక్రీడనో
త్సాహశ్రీ వహియించి యచ్చటికి దైత్యస్వామి యేతేరఁగన్. 140
సీ. నమ్మి యున్నను గ్రమ్మి దొమ్మి సేయు నటంచు, నెమ్మిరూపు సురాధినేత దాల్చె
నాఁకొన్న హరిదాక చేకొన్నవాఁ డంచుఁ, గాకయై ఖరి దండకరుఁడు పూనె
మించినాఁ డితఁ డాక్రమించి యే మొంచునో, యంచు నంచవిధంబుఁ గాంచె
వరుణుఁ [ధనదుఁ
డొండు చూడం డుమూర్ఖుండు మండు నటంచుఁ, దొండమై గండాటియుండె
తే. డితరు లాతురులై జాతిహీనరూప,ధారులై పోసి రంత నద్దశముఖుండు
దారుణాకారుఁడై మరుత్తక్షితీంద్రు,కెదుటవచ్చి నిలుచుండి యిట్టు లనియె.
క. ఓయిమరుత్తక్షితివర, యే యుద్ధాపేక్ష నిచటి కేతెంచితి నా
తో యుద్ధమైనఁ జేయుము, వే యేటికి వెఱచి తేని వెఱచితి ననుమీ. 142
మ. నను నీరాజులరీతిఁ జూడవలదన్నా నవ్వుతో నమ్మరు
త్తనృపాలాగ్రణి శత్రుకోటికులగోత్రప్రాభవాచారముల్
వినకే యుద్ధము సేయ నెవ్వఁడవు నీవృత్తాంత మాద్యంతమున్
వినఁ గాంక్షించెదఁ దెల్పు నావుడు మునిద్విద్వేషి గర్వంబునన్. 143
మ. విను మూర్వీశ్వర నేఁ బులస్త్యకులుఁడన్ వేధోవరోద్యత్ప్రతా
పనిరూఢుండ దశాస్యనాముఁడ మదీయభ్రాతన్ ధనాధీశు ము
న్ననిలో గెల్చి విమానముం గొని త్రిలోకాతీతమాహాత్మ్య మొం
దినవాఁడన్ రణభిక్ష యిమ్మనినఁ బృథ్వీనాయకుం డిట్లనున్. 144
చ. అవుర మదేమి నీమహిమ లన్నను గెల్చితి నన్నమాట వి
న్న విశద మయ్యె నాయనధనం బగుపుష్పకమున్ గ్రహించినాఁ
డవు బళి యింట గెల్చి కడ డయ్యక రచ్చల గెల్వఁ బోవలెన్
భువనములందుఁ గీర్తియును బుణ్యము దీనసమృద్ధిఁ జెందనే. 145
ఉ. ఇంతటిధర్మశాలి నిఁక నెవ్వ రెదుర్కొని గెల్చువారు ర
మ్యాంతప్రియంబు గల్గినటు లైన రణం బొనరింప నేనె ని
న్నంతకుచెంతకుం బనుతు నంతకు నేఁ దగువాఁడ నంచు నం
తంతకు రోస మీసు బెరయన్ ధరణీశుఁడు లేచెఁ జెచ్చెరన్. 146
మ. శరచాపంబులు పూని వజ్రకవచస్స్ఫారప్రభల్ భూనభోం
తరముల్ నిండ నజాండఖండనసముద్యచ్ఛింజినీనిస్వన

స్ఫురణన్ రాజు దశాస్యుపైఁ జనఁగ నెచ్చో నడ్డమై ధారుణీ
శ్వరచూడామణి పోకు పోకు మని సంరబ్ధుం డుదాత్తధ్వనిన్. 147

చ. పలికె బళా మఱేమి మది భాసిల దీక్ష వహించి శత్రుపై
నలుగుట నాయమే యిది మహాక్రతు వించుక విఘ్నమైనచోఁ
గులము నశించు నద్దశముఖుండును దుర్జయుఁ డేల వానితోఁ
జల ముపసంహరింపు పరమత్వము నా విని యమ్మరుత్తుఁడున్. 148

శా. ఆసంవర్తునిమాటఁ జేకొని పరిత్యక్తాస్త్రకోదండుఁ డై
యీసున్ రోసము నుజ్జగించి చన దైత్యేంద్రుండు వీక్షించి నా
తో సంగ్రామము సేయ నోపక మరుత్తుం డోడెఁ జుండీ యటం
చాసన్నాద్రిగుహావళుల్ బదులు మ్రోయన్ బెట్టు చాటించుచున్. 149

ఉ. అమ్మఖశాలఁ జొచ్చి కుపితాత్మకుఁ డై మునికోటిఁ ద్రుంచి యూ
పమ్ములు పెల్లగించి పశుపంక్తి హరించి ఘృతంబు వహ్నికుం
డమ్ముల నించి హోతల నడంచి యహో తల మంచు యాజకుం
డమ్మెయిఁ బల్కు నొక్కగతి నక్కడఁ బాసి చనెన్ బలంబుతోన్. 150

క. హరిహయముఖ్యులు భయములు, గిఱికొన శిఖికాకహంసకృకలాసగతుల్
ధరియించి యమ్మహాపద, దరియించి తదీయహితము దలఁచి ప్రియోక్తిన్. 151

సీ. కన్ను లీఁకలచంద్రకములుగా ఘనవేళ, నెమ్మిగా బలవైరి నెమ్మి కొసఁగెఁ
బెద్దకాలము మన్కి ప్రేతాత్మకతభుక్తి, గలుగఁగా జముఁడు కాకమున కొసఁగెఁ
బాలును నీరు నేర్పఱుచు నేర్పుఁ బయోవి,హారంబునుదధీశుఁ డంచ కొసఁగెఁ
దల వెండివలె నుండఁ దనువు బంగరుఁ జాయఁ, దులకించ ధనరాజు తొండ కొసఁగె
తే. నివ్విధంబునఁ దనుతమ యెలమికిఁ దగు,వరము లజ్జంతువుల కిచ్చి వారుసవన
భాగముల్ గొనిపోయి రప్పార్థివుఁడును,సుఖము నెఱవేర్చె సంవర్తమౌనికరుణ.

చ. అటుల మరుత్తభూవిభుని యజ్ఞధరాస్థలిఁ బాసి యార్చుచుం
బటహమహార్భటుల్ దిశలు బద్దలు సేయ నజయ్యుఁ డై ధరా
విభులఁ బరాక్రమోద్భటుల వీఁక నెదుర్చుచు నోప మన్నచో
నటఁ దనగెల్పుఁ దెల్పుచు దశాస్యుఁడు ద్రిమ్మరె భూమి యంతయున్. 153

సీ. పరిపంథిమదతమఃపంకజిన్యధిభావి,భుం డైనదుష్యంతభూవిభుండు
వైరిరాజప్రాణవాయుభుగ్భుజభుజం,గాధిరాజై మించు గాధిరాజు
హరిశౌర్యఘటితాక్షిలారిపీరమృగాప,హరణాజిమృగయుఁ డై యుష్మలరుగయుఁడు
శత్రుహృచ్ఛేదనక్షమచక్రనిర్ఘు,ర్ఘరఘోషసురథుఁ డై క్రాలుసురథుఁ
తే. డహితనుతచారుగౌరవుం డగుపురూర
వుండు మొదలైననృపపుంగవులు మహోగ్రుఁ
డౌదశాస్యునితోడఁ బోరాడలేక,నోడితి మటంచు వచియించి రోహటించి.

దశగ్రీవుఁ డనరణ్యనృపుని జయించుట.

తే. ఏమి దెలిసెద నింక శ్రీరామచంద్ర, యొక్కనృపుఁడైన నెదిరింపనోపఁడయ్యె
రావణాసురుపై ననరణ్యనృపవరేణ్యుఁ డొకరుండు దక్కె నిర్భీకుఁ డగుచు.
ఉ. ఆవివరంబుఁ దెల్పెద దశాననుఁ డిట్టుల యెల్లరాజుల
న్లావు దొఱంగఁ జేయుచు నొకనాఁడు బలాన్వితుఁడై యయోధ్యకుం
దేవడి సేఁగుదెంచి పఱతెమ్మనరణ్యనృపాల పోరికిన్
నీవిపులప్రతాపము గణింతురు దిక్కుల శూరు లందఱున్. 156
క. అనుమాన మేల వెఱచిన, ననుమా యోడితి నటంచు ననుమాట చుఱు
క్కున మానవపతి చెవి సొర, ఘనమానము రోస మినుఁ గనఁబడ ననియెన్.
ఉ. ఏల దురుక్తు లాడెద దనుజేశ్వర మమ్మెదిరించి పోరఁగాఁ
జాలుదువేని ద్వంద్వమునఁ జక్కఁగ నిల్వుము పిల్కుమాల్చెదన్
బేలతనంబుతో ఘనులు పెద్దఱికంబు గణించుకొందురే
యాలములోపలం దెలియు నందఱుఁ బీరము లంచుఁ బల్కుచున్. 158
సీ. పృథ్వీస్థలం బెల్లఁ బెల్లగింపఁగఁ జాలఁ, బెంపొందురథములు పెక్కువేలు
ఘనగాత్రమహిమ నాకాశ మెత్తెడుభంగి, బెడఁగైన యేనుఁగుల్ పెక్కువేలు
చక్రవాళము నైనఁ జక్కఁదాఁటెడుధాటి, బెరయుఘోటకములు పెక్కువేలు
కల్పాంతభైరవాకారులై శూరులై, బిరుదు లందినభటుల్ పెక్కువేలు
తే. మిక్కుటపువీఁక దిక్కులఁ బిక్కటిల్ల
నొక్కమొగిఁ దన్నుఁ గొల్వఁగా నుక్కుమీఱి
కదనమున కాయితం బయి కదలిపోయె, రావణునిమీఁదమనయనరణ్యనృపతి.
క. ఆవిభునిసైన్యపతులకు, రావణుసైనికుల కుగ్రరణ మయ్యెఁ ద్రిలో
కీవిస్మయావహోద్ధతి, దేవాసురయుద్ధమైన తెఱఁగున నధిపా. 160
మ. దనుజుల్ నీలశిలోచ్చయోచ్చతనులుద్యద్బాహు లుగ్రాశని
ధ్వను లొక్కుమ్మడిఁ జుట్టుముట్టి భటముల్ స్తంబుల్ రథాంగంబు ల
శ్వనికాయోదరపార్శ్వముల్ కరటిహస్తంబుల్ విదారించి య
య్యనరణ్యాధిపుసేన గాడుపు లరణ్యానిన్ బలెం గూల్చినన్. 161
సీ. పడగలు గొడుగులు పావడల్ వీచోపు, లొండొంటిపై వ్రాలియుండు నెడలుఁ
దొడలును మెడలు చేతులుగాళ్లు వేళ్లు ప్రక్కలు నొక్కొకప్రోఁగుగన్న యెడలు
నరము లెమ్ములు క్రొవ్వునంజుడు మెదడు ప్రేవులు నెత్తురొక్కటై కలయు నెడలు
హారకుండలకిరీటాంగుళీయక కంకణాంగదాదులు చూర్ణమైనయెడలు [దుఁ
తే. బహువిధాయుధశకలముల్ పడినయెడలుఁ, గలిగి పలలాశనోత్సవకారియగు
దనబలము నేలపాలైనయునికిఁ జూచి, యలిగి యనరణ్యభూపాలుఁ డౌడుగఱచి.
చ. కరమున విల్లు పూని లయకాలకృతాంతునిలీల మార్విటం

కరణము దిక్కరిశ్రవణఘట్టనముల్ ఘటియింపఁ దేరు న
త్వరముగ సూతుఁడుం నడపఁ దన్నదరించినఁ జూచి పంక్తికం
ధరుఁ డనరణ్యునిం బెలుచ నవ్వుచు నీను వహించి యిట్లనున్. 163

తే. ఆఁకలియు దప్పి గొన్న సింహాదు లాహ, రింప నరసేన దెచ్చి యర్పించినటుల
చటులమామకశరశిఖిజ్వాలికలకు, నిన్నొనఁగ వచ్చితే యన్న నృపుఁడు గదిసి.

చ. దనుజు కిరీటముల్ పదియుఁ దాఁక ననేకశరంబు లేసి యా
ర్చిన శతశాతబాణములచే దశకంఠుఁడు రాజు నొంచి యా
తనివిలు ద్రుంచి సారథి వధం బొనరించి హయాంగముల్ దళిం
చిన రథహీనుఁ డయ్యు గదఁ జేకొని శత్రుని మోఁదె మోఁదినన్. 165

తే. దండతాడితఫణిరీతి దశముఖుండు, పుడమి కుద్ధతి లంఘించి పిడుగుఁబోలు
కటకుటఁ జేతఁ దనమస్తకంబు వ్రేయ, వాయుహతసాలలీలభూవరుఁడు గూలె.

ఉ. అగ్గతి నేలఁ గూలినధరాధిపుఁ గన్గొని పంక్తికంఠుఁడుం
బెగ్గిలఁ గేక వేసి నగి బీరము లాడితి విష్వ డింతలో
డగ్గఱె నోటు మృత్యు వెచటం నను గెల్వఁగ నెవ్వఁ డోపు నీ
సిగ్గిటు సేసె నోటమి ఘటించిన నిద్దురవస్థ వచ్చునే. 167

చ. అని తనుఁ దూల నాడిన జనాగ్రణి గన్నులు విచ్చి దైత్యునిం
గనుఁగొని నన్ను నీ విపుడు గాఱియఁ బెట్టిన నేమి మీఁదటం
నిను వధియించు నొక్కమహనీయచరిత్రుఁడు మత్కులంబునం
జననము నొందు వట్టిపరుషంబులు వల్కకు పొమ్ము రావణా. 168

చ. పురుషుఁడు కర్మసంగమునఁ బొందు సుఖంబును దుఃఖ మెవ్వ రె
వ్వరికి విరోధముల్ సలుపువా రిది దైవవశంబు కీనఁ గా
తరత వహింప నేఁ గనక దానమఖాధ్యయనాదికర్మముల్
వొరసితి నేనిఁ బల్కు పొలివోవక యట్లగుఁ గాక యం చనన్. 169

క. మించినతమిని సురల్ గురి,యించిరి మందారవృష్టి యిది నిజ మని మ్రో
యించిరి పణవాదులు నుతి,యించిరి యనరణ్యనృపతిధృతివిభవంబుల్. 170

చ. అది సహియింప కచ్చెడు గహంకృతితో నిటువంటిసత్త్వమే
కద నిను నింత సేసెఁ దుది! గాంచియు వైరము మాన వంచు బ
ల్గదఁ గొని మస్తకంబు వగుల వడి నొంచి జయంబుఁ గాంచి స
మ్మదము వహించి యేఁగె సన మానికి నవ్వుచు రాముఁ డిట్లనున్. 171

క. అరి నోర్వఁ జాలువీరులు, ధర నెక్కడ లేరొ వీరధర్మము సెడెనో
నరపతులశౌర్యధైర్య,స్ఫురణ లిటుల నేలఁ గలసి పో నేమిటికిన్. 172

మ. అకటా సూర్యశశాంకవంశ్యు లగుబాహాసంభవుల్ నొచ్చి రే
స్వకరాస్త్రంబులు హానిఁ జెందెనె మనస్సంపన్నతల్ గుందెనే

యొకఁ డైనన్ రిపు నొంప కున్నకత మేమో విన్న వింతయ్యెడిన్
సకలస్తుత్యతపఃప్రభావనిధి యీసందేహముం జెప్పవే. 173

క. నా విని లోపాముద్రా,జీవితనాయకుఁడు నగుచు క్షితికన్యాప్రా
గ్జీవంజీవహితానన,జైవాతృకుఁ డైనరామచంద్రున కనియెన్. 174

మ. తనచే నిర్జితుఁ డైనశాత్రవునిదోర్దర్పంబుఁ గీర్తించినన్
విని సంతోషముఁ జెందు నెట్టిఘనుఁడున్ విశ్వావనీశాగ్రణీ
హననం బోర్వక వానియోటములె నీ వాలించఁ గాంక్షించె దెం
తని వర్ణించెద నీగుణస్ఫురణ రామా రాజచూడామణీ. 175

రావణుఁడు కార్తవీర్యార్జును గెలువ నెంచి మాహిష్మతికిం బోవుట.

క. ఆశ్రమమున ధరఁ దిరుగుచు, విశ్రవసుసుతుండు కార్తవీర్యార్జునవా
ర్ధశ్రవసాదుల కోడిన,విశ్రుతకథలు గల వవియు విను మని పల్కెన్. 176

శా. ఆహాంసోన్నతవజ్రసౌధరుచిసాంద్రాంభోధిదివ్యాపగో
ద్వాహోపక్రమసూచకోపరిచరత్పాండుచ్ఛదగ్రామణీ
సాహస్రచ్ఛదనిస్సృతాంబుకణచంచన్మౌక్తికస్తోమమై
మాహిష్మత్యభిధానపత్తనలలామం బొప్పు భూమీశ్వరా. 177

శా. ఆప్రో లర్జునచక్రవర్తి కృతవీర్యక్షోణిభృత్క్షీరవా
ర్ధిప్రత్యక్షశశాంకమూర్తి నతదారిద్ర్యార్తివిచ్ఛేదనో
ద్దీప్రక్షిప్రదయానువర్తి ద్విచతుర్దిగ్దంతిరాడ్దంతకాం
తిప్రద్యోతితకీర్తి యేలు నపుడున్ దేవేశ్వరస్ఫూర్తితోన్. 178

సీ. అనవద్యబాహాసహస్రముల్ దనచక్రభావ మంతయు బట్టబయలు సేయ
నణిమాదివిభవంబు లల్లదత్తాత్రేయ,గురుకృప దను ముంచుకొనుటఁ దెలుప
సంతతౌదార్య మష్టాదశద్వీపంబు, లేలెడితనకల్మి నెఱుకపఱుప
దక్షిణనాయకత్వ మనేకసతులతో, విహరించుతననేర్పు విస్తరింప

తే. సార్వభౌమలలాముఁడై జగతి యేలె, నప్రతిహతప్రతీపబాహాప్రదీప్త
దావపావకకీలికాదగ్ధదుర్జ,నార్జునుం డగుకార్తవీర్యార్జునుండు. 179

క. ఆసార్వభౌముఁ డమితవ,శాసంగతసార్వభౌమచందమున బహు
స్త్రీసంయుతుఁ డై యొకనాఁ, డాసన్నసరిద్విలోకనాదృతిఁ జనియెన్. 180

మ. చని వింధ్యాచలసార్వభౌమనికటాంచన్నర్మదాతీరభా
గ్వనసౌభాగ్యము మెచ్చి హైహయధరావజ్రాయుధుం డంగనా
జనతానేకవిధాంగసంపదలతో సామ్యంబు లౌవస్తువుల్
గనుఁగొంచున్ లతకూనలన్ దొరసి వేడ్కల్ సెందెఁ జైత్రుం బలెన్. 181

శా. తత్కాలంబున రావణాసురుఁడు దైత్యగ్రామణుల్ గొల్వ ను
ద్యత్కౌబేరవిమాన మెక్కికొని యుద్ధాపేక్ష రా సర్వభూ

భృత్కోటీరకిరీటరత్ననికరార్భిలద్ద్యుతిప్రస్ఫుర
త్పత్కంజపద్యుఁ డర్జునుం డనెడివార్తల్ భూమిలో మించినన్. 282

క. అతిరోషంబున మాహిష్మతికిం జని రావణుండు సమరస్పృహ వ
చ్చితి నాయాగతి మీయధిపతికిం జెప్పుఁ డన సార్వభౌముని మంత్రుల్. 283

వ. అతనితో ని ట్లనిరి. 284

సీ. బలువేసడములపైఁ బల్లపైఁ బ్రబలోష్ట్రపంక్తిపై ముందుగా బరువు లేఁగఁ
దదనువర్తనలీల దారుణాయుధరుచుల్, దిలకింప సుభటముఖ్యులు సనంగ
రథికహస్తిపకతౌరంగికుల్ వలగొని, మేడెమై కనుఁజూపుమేర నడవఁ
జెంతల నెవ్వారిఁ జేరరా నీయక, బహుకంచుకులు బరాబరులు సేయ

తే. నవ్యపల్యంకికారోహణము లొనర్చి, రాణివాసంపుసతులు పార్శ్వములఁ గొలువ
భద్రగజ మెక్కి మారాజు ప్రాభవమున, నర్మదాతీరవని కేఁగినాఁడు నేఁడు

శా. నేఁడే వచ్చునో రేపె వచ్చునో యని స్త్రీసంయుక్తిఁ గ్రీడించుచున్
రాఁడో రాజులచిత్తముల్ దెలియునే రక్షఃకులాధ్యక్ష యె
వ్వాఁడున్ మాపురిఁ జేరి నీకరణి గర్వస్ఫూర్తి ని ట్లాడఁగా
లేఁ డుగ్రుండ వతండు వచ్చినను బోరికిన్ రమ్ము మే లౌ ననన్. 286

శా. ఆమాటల్ విని నవ్వి పంక్తివదనుం డోకార యీబూమె లే
లా మీయేలిక నాప్రయాణకథ లెల్లన్ విన్నవాఁ డై సధూ
స్తోమంబుం గొని డాఁగ నేఁగె రణభీతుం జేరి పోరాడునే
భూమిన్ రావణుఁ డంచు వారి నగుచుం బోయెన్ మదోద్రేకి యై. 287

తే. ఇటులు మాహిష్మతీపురాధీశుఁ గాన, కసుర యచ్చోటు వాసి సైన్యముల డాసి
యలప్రహస్తుండు మొదలైన యఖిలమంత్రి
పుంగవులు గొల్వ నవ్వలఁ బోయి పోయి. 288

దశగ్రీవుండు వింధ్యాచలంబుఁ జూచి యందుఁ గ్రీడించుట.

మ. అవలోకించె దశాననుం డెదుట దివ్యస్త్రైణవీణారవ
శ్రవణోల్లాసరసోన్నమత్ఫణిఫణారత్నప్రభావాప్తభీ
తివిధానత్తటకుంభిఘీంకృతిరటద్వ్యాఘ్రుహాయాతమా
నివరారక్తజటాంశుకింశుకఘృణిన్ వింధ్యాచలగ్రామణిన్. 289

వ. కని యక్కొండచక్కటికిఁ జక్క నరిగి సుర గరుడ గంధర్వాది దేవతా మిథునంబులనిధువనంబులకుం దగుపృథువనంబులలోఁ దరలనిర్ఝరుల కిరవగు తోరంపుటీరంపుగుంపులఁ బెంపు గనుమవ్వంపుదివ్వెలవలె నివ్వటిల్లు గనగనని మణులకై కెరలుమధుకరనికరంబులగరుల తెమ్మెరలవలనఁ జలనంబు నొందు నలరులయందుండియుం దొరంగుమరందధారాబృందంబు వాఁకలం గలసి ప్రవహించు సెలయేటినీటితుంపరలన్ దొరసి మందగతులం దిరుగుమంద

పవనంబులం దార్కొని యావటించుసానుచరద్భుజంగసంఘంబులప్రాత్కా రంబులకు బెగడువడి వడి నిగుడం బరువు లిడుతమపడుచులజడుపు నీర్పుట కెదురువచ్చుతబిసిపెద్దలకటితటీరమణీయతరవ్యాఘ్రచర్మంబులపెంబుఁ గని త ల్లడంబునం గ్రోల్లుటుకుకన్నెలేళ్లకు మొల్లరిపుఁబచ్చిక లనుమచ్చిక లెచ్చరిం చుపచ్చ ఱాగనులచెంగటం గనుపట్టునీలరత్నాకరంబులవిభాకదంబంబు లంబు దనికురుంబంబు లనియుఁ దదుపరిప్రద్యోతితజ్యోతిర్లతావితానంబులు తటిల్ల తాప్రతానంబు లనియు నెంచి యాఁ గాదని పన్నిదంబులు సఱచి పఱతెంచి పరికించి మృష ధైన నోడినవారిఁ గేరడంబు లాడుచెంచుమించుఁబోఁడుల కరాంచలశరాసనోన్ముక్తదురాసదశరాసారంబులం బగిలిన వేణువులనుండిరాలు మెఱుంగుముత్తియంపుఱాలు దందశూకాండంబు లని ఖండింపం దివురుశిఖండి ప్రకాండంబుల విప్పుగల కప్పుఁబించెంబుల నొప్పుసాంద్రతరచంద్రకద్యోతము లింద్రచాపద్యుతు లని చరించురాయంచలచంచూపుటచరణారుణప్రభాస్ఫుర ణంబులం గాఁగిలించుజేగుఱులతోఁ గరంబు మీఁ టగుకూటర్ఘూటంబులం గ్రీడించుచు నప్పంక్తికంధరుండు. 290

రావణుఁడు నర్మదం జేరి తత్సైకతంబున శివపూజ సేయుట.

మ. అచలోపాంతమునం గనుంగొనియెఁ దుంగగాభంగభంగానిలా
క్షచరత్ఖేచరబాలికాతిలకభాకాలస్థలీఘర్మదం
బ్రచురస్నాతకశర్మదఁ స్వమహిమాప్రధ్వస్తనానాసరి
త్ప్రచయాంతర్మద నర్మదఁ జలగళద్దంతావళోచ్చైర్మదన్. 291
మ. కని కోయష్టిక చక్ర, సారస బక క్రౌంచాదినానాఖగ
ధ్వనులకు వీనులుఁ జంచదూర్మిలులితాభవ త్సైకతలం గన్నులు
న్వనజాతోత్పలసారసౌరభములకు నాసల్ తదీయానిలం
బున మేనుకు సఫలత్వ మొంద దితిభూమూర్ధన్యుఁ డుత్సాహి యై. 292
క. అత్తటినిఁ జేరఁ బోయి వి,యత్తటినికి సాటి యైన దౌరా యనుచుం
బ్రోత్తుంగం బగుతటమున, హ త్తివలె వసింపఁ గని ప్రహస్తుఁడు వలికెన్. 293
చ. జలశకునాకులచ్ఛకులజాలవిలోలవిలోకనంబులకు
జలు కెలఁగించుచుం గమలషండచలత్కలహంసికాగరు
చ్చలవసనాంచలంబునఁ గుచాయితకోరకపాళిఁ గప్పుచు
న్బలియుఁడ వైననీయెదుట నర్మద సాధ్వి తెలుంగు పూనెడిన్. 294
చ. తనవిమలోదకంబుల సుధామధురత్వము ఫేనయుక్త మా
తనసికతాతలంబున సితప్రభయుం దను నాశ్రయించుచా
డ్పున సనవద్యశైత్యమును బొల్పుగ నిన్నది తండ్రిపోలిక
ల్గనియు నడంచెఁ గ్రిందనె కళంకము కర్దమకైతవంబునన్. 295

మ. జలపానాగతసింహభీతసలిలస్తంబేరమస్తోమసం
చలనోపద్రవధావదుద్రకమఠీశంఖ్యాదికేతస్తతో
వలనానచ్ఛఘనప్రవాహ యగు రేవం దోఁచుమాలిన్య మీ
జలజాప్తప్రతిబింబ మొందెఁ జనునే సంసర్గదోషం బిలన్. 296

మ. అరుణాబ్జద్యుతి నీముఖద్యుతులచే నత్యున్నతోర్మిచ్ఛటా
గరిమన్ నీకరపంక్తిచే శకునరేఖల్ నీయశశ్ఛాయచే
హరియింపంబడె నంచు నిన్నుఁ బొగడెన్ హంసార్భటిన్ వార్ధిరా
ట్తరుణీరత్నము వింటివే యసురచంద్రా యన్న లేనవ్వునన్. 297

చ. అవు నని మంత్రితోఁ బలికి యందఱిఁ జూచి యహస్కరుండు నా
యవిరళకాంతికిన్ వెఱచి యంబరమధ్యగుఁ డయ్యెఁ జల్ల నై
కువలయబంధుపోల్కిఁ గనుఁగొంటిరె యున్నదిఁ గ్రుంకి యందఱుం
బువు లిఁకఁ గోసి తెండు శివపూజ కటంచు దశాస్యుఁ డంచినన్. 298

ఉ. స్వామి హసా దటంచు శుకసారణముఖ్యసమస్తసైనిక
గ్రామణు లమ్మహానదితరంగము లుద్దరు లావరింపఁగా
సామజపుంగవస్ఫురణ స్నానము లాడి దుకూలధారులై
యామహనీయవన్యల సుమాపచయం బొనరించి రందఱున్. 299

సీ. తొగలు గెందమ్ములు దుమ్మిపూ లబ్బెండ, పువ్వులు పొన్నలు పొగడవిరులు
సన్నజాజులు సురపొన్నలు గలిగొట్లు, మల్లెలు సంపఁగెల్ మొల్లవిరులు
బొండుమల్లె లశోకములు మంకెనలు నంది, వర్ధనంబులు విరవాదివిరులు
గోరంటలును గొండగోఁగులు దేవకాం, చనకుసుమములు గొజ్జంగవిరులు
తే. మాచపత్త్రియుఁ గురువేరు మరువకంబు, దవనమును గగ్గెరయు బిల్వదళములాది
యైనపూజార్హవస్తువు లపుడు దెచ్చి, వంతులకుఁ గొండపొడువుగా వైచుటయును.

మ. పరితోషించి శివార్చనాకుతుకసంబద్ధాత్ముఁడై లేచి యా
శరమూర్ధన్యుఁడు నర్మదాతటినిలో సంకల్పపూర్వంబు గా
స్మరవైరిన్ స్మరియించుచున్ మునిఁగి తన్మంత్రంబు వేమా ఱభం
గురనిష్ఠన్ జపియించి పెల్వడి మడుంగుల్ గట్టి నేమంబునన్. 301

క. ఏకతమున శుచి యగునొక, సైకతమున నధివసించి స్మరణప్రాప్తం
బౌకాంచనమయలింగముఁ, జేకొని ప్రాణప్రతిష్ఠ సేసి సునిష్ఠన్. 302

సీ. ఆవాహనము వృషభాధివాహనునకు, నాసనం బద్రిశరాసనునకు
నర్ఘ్యంబు విషధరానర్ఘ్యభూషణునకుఁ, బాద్య మాగమశిఖావేద్యునకును
గలితామృతాభిషేకం బమృతాత్మున, కంబరం బతులదిగంబరునకు
యజ్ఞోపవీతంబు యజ్ఞాభియాతికి, గంధంబు విషగమ్యగంధునకును
తే. హారిధవళాక్షతలు సంగరాక్షతునకు, నర్పణ మొనర్చి తత్సహస్రాభిధాన

ములనుబంచామృతంబులస్నపనమొనర్చి, వస్త్రగంధపుష్పధూపదీపనైవేద్యతాంబూలాదులగు నుపచారములచేఁ బూజచేసె.

తే. అమ్మహాపూజ గొనసాగి నట్టులైన, సంగరంబున గెల్చు నేశత్రు నైన
విఘ్న మొందిన నోడు నవ్విధము నుత్త,చిత్తుఁడై పాటు గణింపక చేయఁదొడఁగె.

క. ఇరువదిచేతుల శంభుని, బరిపూజన సేయుచుండి పంక్తిముఖుండో
హరహర హరహర హర ఓం, హర యని పదినోళ్లఁ బలుకు నంబర మద్రువన్.

క. కదలనిగాత్ర మొకించుక,వదలనిపద్మాసనము శివానాథునిపైఁ
జెదరనితలఁపును జలనము, గదురనిచూడ్కులును బంక్తికంఠునికె తగున్.

తే. ఈవిధంబున నమ్మహాశైవతిలక, మలికనయనుని నయ్యేటికెలన నుంచి
యంచితప్రీతిఁ బూజ గావించుచుండె, నంత నక్కడఁ గార్తవీర్యార్జునుండు.

కార్తవీర్యార్జునుఁడు స్వస్త్రీలతో వనవిహారము సల్పి జలక్రీడ సేయుట.

సీ. చిగురులు గిల్లుచోఁ జిగురులు దమకేలుఁ,జిగురుల రక్తితోఁ జెలిమి సలుపఁ
బువ్వులు గోయుచోఁ బువ్వులు దమనవ్వుఁ,బువ్వుల తెలివితోఁ బొత్తు సేయ
లతికలు సేరుచో లతికలు దమతనూ,లతికలమృదుతనులను బెనంగఁ
దేనియల్ వడియుచోఁ దేనియల్ దమమోవి, తేనెలరుచులపొందికలఁ జెంద

తే. మాటలాడుచుఁ బాడుచుమందమంద,గమనములఁగామినీమణుల్ గలసిమెలసి
వనవిహారంబు గావింప వారిఁ గూడి, యలరె నవమన్మథునిలీల నర్జునుండు.

మ. పరితస్స్రస్తలతాప్రతానము పృథగ్భగ్నప్రవాళచ్ఛదో
త్కరమారాన్నిపతత్సుమంబు యుగపద్ధావత్ఖగం బంజనా
చరదిందీవర మగ్రతఃప్రవిచలచ్ఛాఖానికాయంబునై
ధరణీనాథవధూవిహారముల నుద్యానంబు గాసిం బడెన్. వ. అప్పుడు. 310

మ. శ్రమతోయార్ద్రకపోల మంసగళదంచన్మాల్య మామ్లానగా
త్రమసవ్యావృతకంచుకం బలికమధ్యస్థాలకం బానతా
స్య ముదారోచ్ఛ్వసనాకులంబు నగుసర్వస్త్రీగణంబుతోఁ హైహయుం
డమరియుక్తబలార్థియై యరిగె రేవాంభోవిహారస్పృహన్. 311

తే. అరిగి పశ్చిమవాహిని యైనయమ్మ,హాతరంగిణి బాహుసహస్రమునను
గార్తవీర్యార్జునుం డడ్డకట్టి శశిము,ఖీసహస్రంబుతోఁ జలక్రీడ లాడె. 312

లయగ్రాహి. ఈఁదుచును వయస్యల గ్రహించుచుఁ దరంగములవంచుచుఁ దరంగ
ములముంచుచుఁ జలంబుల [నించుచుఁ దొగల్ పా
పెంచుచు నొకళ్లొకరిమించుచు సరోజములు దుంచుచు ముఖాబ్జముల
పించుచు రథాంగములఁ గలంచుచు మరాళములఁ గాంచుచుఁ దమిం బొదువఁ
నెంచుచుఁ బతిం బ్రా [లతాంగుల్.
ర్థించుచు జలేభములకుఁ గొంచుచు ఖగాళి బెదరించుచుఁ జెలంగిరి హసించుచు

సీ. సార్వభౌముని నొక్కసతి పద్మముల మైచి, పద్మముల్ దగు నని పరిహసించెఁ

జక్రవర్తినొకర్తు సక్కనికువలయం,బుల ముంచి యివి నీకుఁ బోలు ననియె
రాజుపై నొకతె సైరవిణీముఖోదార,మధుధారఁ జిలికి నర్మంబు లాడె
నగ్గనుమే నొక్కతె యతివ బాహావల్లి,కలఁ జుట్టి యాచిత్యగరిమఁ దెల్పె
తే. గట్టివారొక్కతె సహస్రకరునిమీఁదఁ, దఱచుగాఁ గ్రొన్ననైవాలతమమునించి
తలఁప నిది యొక్కటియె యయుక్తం బటంచు
విభుఁడు చిఱునవ్వు నవ్వ నవ్వించె సఖుల. 314

క. మాహిష్మత్యధినాయకు,బాహాసేతువునఁ జిక్కువడి కరతోయా
వాహిని కడు నుడివడియెఁ, సాహసిచేఁ బట్టువడినసతిచందమునన్. 315

మ. పతదభ్రంకషతీరభూమిరుహమై ప్రాదుర్భవత్ఫేనమై
హతనాళీకమృణాళనాళ యయి భీతాంభశ్చరవ్రాతమై
కృతవీర్యాత్మజుబాహురోధమునఁ బైకిం బొంగి రేవాసర
స్వతి ప్రాగ్వారిధిచాయకున్ మరలెఁ జంచత్తుంగభంగార్భటిన్. 316

మ. గిరినైనం దెగఁ గోసి మత్తహరిమాడ్కిం బాఱునయ్యేఱు భూ
వరదోర్గస్తంభవిజృంభముం గడచి పోవన్ బల్మి తే కట్టె స
త్వరమై క్రమ్మఱ వచ్చి పంక్తిముఖసత్ప్రస్వర్ణలింగార్చనా
స్ఫురితద్రవ్యము లెల్ల ముంచుకొనియెం బ్రోద్యత్ప్రవాహోద్ధతిన్. 317

మ. తను రోధించె నృపాలకుం డతనిపై దం డెత్తి పోమ్మేటిపూ
జన లిచ్చో నని చంచదూర్మినినదచ్ఛద్మంబునం బల్కుచున్
వినకున్నన్ నది మించి ముంచెనొ యనన్ విఘ్నంబు పూజావిధిన్
మొనయన్ దానవచంద్రుఁ డద్భుతరసాంభోరాశిమగ్నాత్ముఁ డై. 318

మ. చరమాంభోనిధిచెల్మి యేల యనుచుం జాలించి పూర్వాంబుధిన్
దొరయం బోయెడినో తరంగిణి యి దెందుం గాన మంచున్ మహే
శ్వరపూజానియమంబు మానక కరధ్యానంబునం జెంతమం
తురులం బిల్చి ప్రవాహకారణము దోడ్తో నారయం బంచినన్. 319

రావణుఁడు కార్తవీర్యార్జునిమీఁది కేఁగుట.

క. వారలలోఁ జతురులు శుక,సారణు లభ్రగతు లగుచుఁ జరమదిశకుఁ ద
త్తీరమున నరయ నామడ,దూరము నన వినిరి మదవతులకలకలముల్. 320

మ. విని యక్కాంతలచెంతఁ గన్గొనిరి ప్రావృట్కాలకాలాంబుము
ఘనలీలాలకవిస్తృతాళికు ముదగ్రస్వోగ్రబాహాసహ
స్రనిరుద్ధాబ్ధికళత్రు నిద్ధమదసంరక్తాంతనేత్రున్ సుమో
హనగాత్రుం గృతవీర్యపుత్రు జలఖేలాయత్తచిత్తార్జునున్. 321

క. కనుఁగొని నివ్వెఱపడి చ,య్యన మగిడి దశాస్యుఁ జేరి యంజలిబంధం
బొనరించి నిలిచి దేవర, వినుఁ డొకవింత యని యనిరి వేగరు లంతన్. 322

మ. ఘనసాలోన్నతిఁ గాంచినాఁడు మఱి సింహాసనంబున్ మించినాఁ
డు నదిన్ స్వీయభుజాసహస్రముల నాకర్షించి బంధించినాఁ
డు నదీనాంబువిహారతత్పరత నాంక్షస్త్రంబా విజృంభించినాఁ
డు నరగ్రామణి యెవ్వఁడో యొకబలిష్ఠుం డాసురగ్రామణీ. 323
క. తనకరములవలె నివ్వాహినితరఁగలు మించె ననెడియీసునఁ గాఁబో
లు నతండు గట్టినాఁ డం,దునఁ బఱమఁ ననక తటిని దూరుపు నప్పెన్. 324
క. దేవరకంటెను మించునొ, దేవరకు సమానుఁడో తెలియఁబడదు మే
మీవఱ కావిభుఁ బోలిన,భూవరుఁ గని యెఱుఁగ మనిన బుద్ధి సలింపన్.325
మ. శివపూజానియమంబు మాని తొలిజేజేపెద్ద మాహిష్మతీ
ధవుఁ డాతండు బళీ కనంబడెను యుద్ధక్షోణి మాత్రారత
మ్యావిశేషంబులు గానిపింతుఁ జనుదెండంచున్ వడిన్ లేచి బా
నవయోధుల్ రథదంతివాహముఖనానాసేనలుం గొల్వఁగన్. 326
వ. కదలి మదాధికపదాతిపదాఘాతఘాతధరాతలపరాగపటలంబులతోఁ గలసిమలసి
ప్రతికూలమారుతంబు లెదురుకొన సరకు గొనక పశ్చిమోన్ముఖుండై పంక్తి
ముఖుండు దత్తటినీతటంబునం జని చని. 327
శా. రంభోరూశతగీతనృత్యరసనిర్మగ్నాత్ముఁడై యాత్మదోః
స్తంభస్తంభితనర్మదాహ్వయసరిత్కల్లోలజాలంబులోఁ
గుంభీంద్రుం బలెఁ గేళి సల్పునృపముఖ్యున్ దవ్వులం జూచి ర
క్తాంభోరుట్ప్రతిమానవింశతిదృశుండై రావణుం డంతటన్. 328
శా. చేరం బోవఁ బ్రధాను లడ్డమయి యాక్షేపించి యిట్లేఁగఁగా
మేరా నీ వెటఁ బోయె దెవ్వఁడవు నెమ్మిం గొమ్మలం గూడి నేఁ
డీరా జున్నరహస్య మెన్న విది యేమీ యన్న మీరాజుతోఁ
బోరన్ వచ్చితి రావణుండఁ బిలువం బొం డాతనిం జెచ్చెరన్. 329
క. ఊరక పోవఁడు చూచినఁ, బోరక దశకంఠుఁ డనిన భూరికృపాణ
స్ఫారప్రభ లినుఁ బొదువఁగ, వారలతని కనిరి ధైర్యవైభవ మెసఁగన్. 330
క. సమరమున కనుచు నొప్పని,సమయంబున వచ్చి పిలువఁ జను నే నీమా
త్రమున కతఁ డేల యేమో,పమె ర మ్మెదిరింపఁ బంపు బలముల ననినన్.
చ. విని సహియింప కద్దనుజవీరునిమంత్రులు రాజమంత్రులం
గినుక నెదిర్చి శస్త్రచయకీలితగాత్రులఁ జేసి వారిఁ గో
ల్పినభటకోటి భక్షణము సేయుచు రక్తము లానుచున్ ముదం
బునఁ జెలరేఁగి యార్వ నుడివోవక హైహయసైనికాగ్రణుల్. 332
మ. బహునారాచపరంపరల్ గురియుచుం బైపైఁ బ్రహస్తాదిదు
స్సహులై మించిన రావణుం డలిగి హాస్తన్యస్తశస్త్రచ్ఛటా

ప్రహతిఁ జేసలఁ జెక్కుచున్ నఱుకుచున్ ఖండించుచుం ద్రుంచుచున్
గహనం బగ్నిసఖుండు గూల్చుక్రియ మ్రగ్గం జేసె నొక్కుమ్మడిన్. ౩౩౩

వ. ఇవ్విధంబున. ౩౩౪

చ. హాళహాళితో నెదిర్చి ఘనకజాగ్రణిచే బహుళసైనికోత్తముల్
గలన నడంగఁ జూచి చని కంచుకు లప్పుడె రాజుముందటన్
నిలిచి పరాకు సామి రజనీచరుఁ డొక్కఁడు పెక్కురక్కసుల్
గలఁకులఁ గొల్వ నొండు పరికింపక మీకడ కేఁగుదేరఁగన్. 335

క. అడ్డము వ్రాయినమంత్రుల,జడ్డిగములు ద్రుంచె భటులసందడి మాన్చెన్
దొడ్డచలంబున నీకెదు, రొడ్డి విజృంభించె నవలియొడ్డన నధిపా. 336

తే. పేరు రావణుఁ డంట యే మొకపరివారిఁ, గొందఱజయించినాఁడంట యందఱబలె
మిమ్మునుజయించుటకుపక్రమించినాఁడు, మించినాఁడిప్పుడె దెవిక్రమించినాఁడు.

మ. అనుమాటల్ వెనుగాడ్పులై నిగిడి రోషాగ్నిం బ్రవృద్ధం బొన
ర్చిన ధూమం బన భ్రూకుటిస్ఫురణ మించెన్ దంతఘర్షంబునం
గనిపించెన్ విపులస్ఫులింగములు దృక్కంజంబులన్ జ్వాలలు
జ్జనియించెన్ నృపుఁ డంత నన్యబలవన్యాప్లోషసంరంభి యై. 338

తే. ఒదవుపరవాహినీరోధ ముజ్జగించి, యిటు వృథావాహినీరోధ మేలచేయ
ననుచు నవరోధకాంతలయశ్రువు మాన్చి, తటినిరోధంబువాసి రోధంబు సేరి.

ఉ. భూధవమౌళి ధౌతపటముల్ ధరియించి విశేషదివ్యభూ
షాధవళానులేపముల ప్రక్కల మిక్కిలి పెక్కుఁ జెందియుం
గ్రోధము మూర్తిఁ గైకొనినకోపునఁ గాంచనవేష్టనోజ్జ్వలో
త్సేధగబాహురుం డగుచుఁ జెచ్చెర రావణుమీఁది కేఁగఁగన్. 340

ఆ. ఆసహస్రకరుని నస్తగించెఁ బ్రహస్తుఁ, డతనితోడ మూఁక లావరించె
ఖరకరాయుధాంశుకలన నమ్మూఁకపెం,జీఁకటులును విరియఁజేసె నతఁడు.

చ. అలిగి ప్రహస్తుఁ డుద్దవిడి హైహయుపై ముసలంబు వైచినన్
బలుసడిఁ దప్పఁ ద్రోచి గద పైకెగ నెత్తి పలాశినెత్తి సం
చలనము నొంద వ్రేయఁ గులిశప్రహతాచలరాజశృంగము
న్బలె నతఁ డొల్లఁబోయి యిలపైఁ బడియెన్ జడియన్ నిశాచరుల్. 342

ఆ. వానిపాటుఁ జూచి పడి గలతిన మెల్ల, మంటఁ గలయ నున్న మంత్రివర్యు
లొక్కఁడు ననిసతోవ నొక్కఁడు వ్రావక, బిఱువ్రాయి పఱచిపోవుటయును.

## రావణ కార్తవీర్యార్జునుల గదా యుద్ధము.

శా. మోముల్ జేగుఱుఁజాయ మించ దితిభూమూర్ధన్యుఁ డత్యుగ్రుఁడై
యామూర్ధన్యు నెదిర్చి భూరిగద బాహాగ్రంబునం బూని యు

భ్యామర్దస్పృహ సింహముం గదియుసింహంబుక్రియ బలేక విక్రమో
ద్దామక్రీడనతత్పరుండు నృపునిం దాఁకెన్ సురల్ మే లనన్. 344

వ. ఇత్తెఱంగున నక్కార్తవీర్యపౌలస్త్యు లుదాత్తధైర్యస్థైర్యశౌర్యధుర్యు లయి యహార్యయుగళంబుపంబుననుత్తుంగమాతంగపుంగవద్వయంబుభంగి నభంగురప్రళయకాలమార్తాండమండలద్వితయంబు నెంపున నుద్దండలయాదండధరద్వంద్వంబు గఁండున నఖండకాండప్రచండచండీశ్వరయమళంబు భాతి విలయసమయసమున్నిద్రసముద్రయుగంబును ప్రేకంబున నొండొరుల నెదుర్కొని మండలాకృతిన్ బెరయ బిఱబిఱ గదాదండంబులు త్రిప్పుచు మండలభ్రమణంబులఁ బరిభ్రమించుచు దిట్టతనంబు నెట్టుకొన మండి నెట్టుచు బెట్టుగా వ్రేయువ్రేటుల కొగ్గినటువలె నుండి యొక్కింత యోసరించుచు బదులు వ్రేయుటన్ గమకించుచుఁ దప్పించుకొను నేర్పునన్ దర్పించి పైఁబడం గుప్పించుచు మున్నంబు లెఱిఁగి నొప్పించుచు నుప్పరంబున కెగసి యన్యోన్యగదాప్రహారంబుల మేఘమాలికలఁ జీలికలు సేయుచు దిగ్గజంబులు మ్రొగ్గ నగ్గలికతో నుర్వికి లంఘించుచు నాలీఢాదిపదవిన్యాసంబుల బిత్తరంబుతో నొత్తరించుకొని యొరయుచు నొకరొకరిం జూచుకోపంబుచూపుల నిప్పులు గురియుచు నొండొరుల నొప్పిదప్పులకు మురియుచుఁ బ్రతిహతులకుం బాయుచు నప్రతిగతుల డాయుచు నుప్పతిల్లు గొప్ప నెత్తురువఱదలఁ దొప్పదోఁగుచు నొంపొరులగదాహతు లోఁగుచు నొడ్డారంబున మడ్డులు వెట్టి యొండు దెసం జూచి యొండు దెస మసలం గొట్టి బెడిలికలు పుట్టించుచుఁ గట్టల్కతో మట్టుమీఱి దట్టించుచు సకలభూతంబులు భయాద్భుతరసోపేతంబు లయి నలుదెసలకుం బఱవ నార్చుచు బెట్టిదంపుసాదన వెనఁకువలం బేర్చుచు హుంకారంబు లొనర్చుచు నహంకారంబున నెదుర్చుచు నొల్లంబోయి యొక్కింతదడ స్ఫూరక నిల్చుచు నొకళ్లొకళ్లఁ బేరుకొని పిల్చుచు నిదిగో వ్రేసెదఁ దప్పించుకొనుమని హెచ్చరించుచు నితరేతరబాహుబలంబులు సహింపక మచ్చరించుచుఁ బెల్లు మించినం బొగడుచుఁ దల్లడించినం బెగడుచుఁ గాలసర్పంబులవలె బుసకొట్టుచు నేటిదరిచెట్టులు నుగ్గునూచంబు గా మొట్టుచు భుజాస్ఫాలనంబు లాచరించుచుఁ గార్చిచ్చుల హెచ్చునన్ గొచరించుచు ఖేచరుల్ మెచ్చ గ్రద్దఱితనంబులం బెద్దతడవు గదాయుద్ధంబు సేసి రయ్యవసరంబున.

తే. అలుక వహియించి కార్తవీర్యార్జునుండు
బాహుగదఁ బూన్చి గర్జించు పంక్తిముఖుని
యుర మొరయ నేయ నది యొప్పె నుఱుము కాల
మేఘమున మించుఁ గనిపించుమించుఁ బోలె. 346

దనుజుఁడును గార్తవీర్యార్జునునురమున గద మిడుంగుఱులు సెదరఁగ వై
క. నదిచిన పర్వతమధ్యం, బున నూల్కొనునుజ్జ్వలోల్కపోల్కి వెలింగెన్. 347

వ. ఇవ్విధంబున. 348

ఉ. కొమ్ములఁ గ్రుమ్ములాడుమదఘోరవృషంబులమాడ్కిఁ బోరుచో
నమ్మనుజేంద్రుఁ డుద్ధతి మహాగద వైచినఁ బంక్తికంఠవ
క్షమ్మది తాఁకి త్రుంగ వరశక్తి నడంగక వింటివెట్టుదూ
రమ్మతఁ డేఁగి మూర్ఛ యడరం బుడమిం బడె వీతచేష్టుఁడై. 349

వ. అప్పుడు. 350

చ. గరుడుఁడు సర్పముం బొదువుకైవడి రావణు రాజు డాసి ముర
హరి బలిఁ గట్టివైచినక్రియం బటుపాశనిబద్ధుఁ జేసి ఖే
చరులు సుమావళుల్ గురియ సైన్యముతోఁ బురి కేఁగె నంత న
య్యరదముచుట్టు ముట్టిరి ప్రహస్తముఖాసురరాజసైనికుల్. 351

చ. ఇటువలెఁ జుట్టు ముట్టుకొని యొక్కఁడ కేఁగెదు రాజ నిల్వు మెం
తటిపనికైనఁ బద్మభవునాలవవాని గ్రహింపఁ గూడునే
తటుకున నీతనిన్ విడుము దర్పమునన్ విడ వేని నేఁడు నీ
పటుభుజముల్ శరావళుల బ్రద్దలు వాపక రిత్త వోదుమే. 352

మ. అని కాలాభ్రము లభ్రముం బొదువునట్లయ్యర్జునుం గ్రమ్మి యు
క్కున నొక్కుమ్మడిఁ బ్రాసపట్టిసగదాకుంతాదిశస్త్రంబు లే
సిన నాతం డవి యెల్లఁ జేనొడిసి సుస్మేరాస్యుఁడై వారిమీఁ
దనె వైవం గడు నొచ్చి విచ్చి చని రాత్మస్వామి చింతిల్లఁగన్. 353

కార్తవీర్యార్జునుఁడు చెఱఁబెట్టినరావణుం బులస్త్యుఁడు విడిపించుట.

వ. అప్పుడు. 354

సీ. దశకంఠదర్పవేదండకంఠీరవ, జయ జయ యని వందిజనులు పొగడ
రోదసీకుహరంబు భేదిల్ల సేనాముఖంబునఁ దూర్యఘోషంబు లెసఁగ
జంభారిమౌళి నచ్చరలట్లు గణికాంబు,జాస్యలు దండలాస్యములు సలుప
ఫలముఖోపాయనంబులు దీవనలు నిచ్చి, యెడనెడ బ్రాహ్మణు లెదురుకొనఁగ
తే. నఖిలశృంగారములుమించునాత్మనగర, మంచితైశ్వర్యమునఁ బ్రవేశించిసౌధ
చారణస్త్రీలుముత్యాలఁ జల్లుచుండఁ, గొలువునకునేఁగె జననాథకుంజరుండు.

తే. ఏఁగి పేరోలగమున దేవేంద్రవిభవ, మెసక మెసఁగంగ వసియించియెల్లజనులు
వెఱఁగుపడ దైత్యుఁ జెఱసాలవేయఁబంచి,యంతిపురముప్రవేశించె నర్జునుండు.

క. చెట్టతనంబునఁ బెద్దలఁ, బట్టి చెఱం బెట్టినట్టిపాపంబున నే
డిట్టైతి ననుచుఁ బౌరులు, దిట్టఁగఁ జెఱ నుండె నతఁడు దీనముఖుండై. 357

ఉ. అంతటఁ గొన్నినాళ్లకు వియచ్చరు లంతయుఁ దెల్పఁ బౌత్త్రువృ
త్తాంతము లెస్సగా విని దయాబ్ధి పులస్త్యమహర్షి సంయముల్
చెంతలఁ గొల్వ నింద్రుపురిఁ జేరెడుధాతవిధాన నద్ధరా

శాంతునిపీఁకి కేఁగి కుతుకంబు బెనంగఁగ మొగసాల నిల్చినన్. 358
మ. జనపాలుం గని ద్వారపాలురు పులస్త్యబ్రహ్మ విచ్చేసినాఁ
డని విజ్ఞాపన మాచరించుటయు నర్ఘ్యాద్యంచితద్రవ్యముల్
గొని ప్రాగ్భాగమునం బురోధ నడవన్ గోధిస్ఫురత్పాణి యై
చని యమ్మౌనికి మ్రొక్కి యర్హాగతిఁ బూజల్ సేసి భక్త్యున్నతిన్. 359
శా. ధన్యంమన్యహృదబ్జుఁ డై యతని నాస్థానస్థలిం జేర్చి మూ
ర్ధన్యుం డున్నతభద్రపీఠి నిడి యుద్యత్ప్రౌఢిమం బల్కె న
మ్మాన్యుం బయ్యెఁ గులంబు శ్రీలు వెలసెన్ మాహిష్మతిన్ నే నసా
మాన్యప్రాభవశాలి నైతి మిము సంభావించి సేవించుటన్. 360
ఉ. వీరు తనూభవుల్ హితులు వీర లమాత్యులు వీరు బాంధవుల్
వీరలు వీరు సద్భటులు వీరలు నేనును నిక్కువంబుగా
నీరు గణించినట్టిపను లెల్లను జేసెద మాన తియ్యరే
కారుణికాగ్రగణ్య యని గౌరవ మేర్పడ విన్నవించినన్. 361
పంచచామరము. పులస్త్యమౌని సంతసిల్లి భూతలేంద్రుతో ననున్
బలీ నృపాల నీప్రియోక్తి భక్తియుక్తి శక్తియుం
దలంప నద్భుతంబు లత్యుదాత్తభోగసంపదన్
నిలింపనాథు మించి తీవు నీకు సామ్య మున్నదే. 362
చ. బలియునిఁ బంక్తికంధరునిఁ బట్టితి వం చొకవింత గాఁగ నీ
బలము నుతింప నేల ప్రతిపక్షుఁడు ని న్నెదిరించి క్రమ్మఱం
గలఁడె మహానుభావుఁడ వగణ్యగుణాకర మాకుఁ బ్రీతిగాఁ
బలికినయట్ల యద్దనుజు బంధవిముక్తునిఁ జేయవే యనన్. 363
క. జనపతి యలరుచు మీపని, చినపని గావించుకంటె శ్రేయము గలదే
యని దశముఖు విడిచి ప్రియం,బున నాతని సత్కరించె భూపాదులచేన్.
ఆ. సత్కరించి వహ్నిసాక్షికం బగుసఖ్య, మాచరించి పనుప నధిపు నెంచి
పౌత్త్రు నూఱడించి పరమేష్ఠిసుతుఁ డేగెఁ, బంక్తిముఖుఁడు నెలవుఁ బాసి చనియె.
క. చని తనసేనల మున్నిడు,కొని యెదురుగ వచ్చుమంత్రికోటుల హర్షం
బున నాదరించి వారి,చ్చినపుష్పక మెక్కి దనుజశేఖరుఁ డవలన్. 366

రావణుఁడు వాలిపై కేఁగుట.

శా. దుష్కాంక్షల్ వివరింపఁ గ్రమ్మఱ మదాంధుండై నృపాలచ్ఛటా
శుష్కారణ్యదవాగ్ని దేజమున నెచ్చో నైనఁ గ్రీడించుచున్
నిష్కారుణ్యమునన్ ధరాజనుల హానిం జెందఁగాఁ జేయుచుం
గిష్కింధాపురి కొక్కనాఁడు వడి నేఁగెన్ వాలితోఁ బోరఁగన్. 367
క. ఏఁగి పురద్వారము బి,ట్టాఁగి నిలిచి తన్నుఁ జూడ నడవిదిరుగుడుల్

మ్రోఁగిరొన గగన మట్టిటు, గాఁగ లయాంబుదములెల్ల గర్జించుటయున్. 368

క. ఆరవము విని యశోజిత,తారుఁడు తారుఁ డరుదెంచి దశముఖుఁ గని యే
మీ రావణ నీవచ్చిన,కారణ మెఱిఁగింపు మనిన గర్వమున ననున్. 369

క. వాలి మహాభుజవిక్రము,శాలి యనఁగ నాలకించి సమరక్రీడా
ఖేలతఁ జూపఁగ వచ్చితి, నాలస్యం బేల పనుపు మగచర యతనిన్. 370

ఉ. నా విని తారుఁ డిట్లనియె నవ్వుచు నీ విది యేమి వెఱ్ఱివే
రావణ వాలితోడ బవరం బొనరింపఁగ నెవ్వఁ డోపుఁ బో
మ్మీ మ్మొకరుండ వేల పరమేశ్వరుఁ డైన నెదిర్చి నిల్వ లేఁ
డీవఱ కాతనిం దొడరి యెందఱు నొచ్చిరొ నీ వెఱుంగుదే. 371

చ. వనచరనాథునిం దొడర వచ్చినశూరులకెల్ల సావళుల్
గను మదె ప్రోవు లై గిరులకై వడి నున్నవి దానవేంద్ర నీ
వును జను వాలిమీఁద ననుపుల్ భరియింపఁగ నొల్లవేని నా
యన యిపు డేఁగినాఁడు చతురబ్ధుల స్నానము లాచరింపఁగన్. 372

వ. అని యంత నిలువక. 373

సీ. మహితాహిగుణవేష్టమానోరుమంథాన,మహీధరోన్మథితోర్మిమాలి వాలి
మాయావిముఖదైత్యమాయావనప్లోష,కేళిభీషణదావకీలి వాలి
పదఘట్టనోద్భగ్నపాదపాదపశిలో,జ్జ్వలశృంగశతసప్తశైలి వాలి
వజ్రధ్వజోత్తాలవాలవిక్షేపణో,త్పాతితనక్షత్రపాళి వాలి

ఆ. యట్టివాలిఁ దొడరి యమృతంబు ద్రావిన,వారికైన బ్రదుకవచ్చు నోటు
కాదు కూడ దతనికయ్యంబు వలె నన్న, నిపుడె దక్షిణాబ్ధి కేఁగు మనిన.

క. అత్తారుని భర్త్సించుచుఁ, గ్రొత్తలు వింటిమి మహిమ క్రోఁతులపురి నం
చెత్తినమదమున దనుజకు,లోత్తముఁ డాక్షణమ దక్షిణోదధి కరిగెన్. 375

వ. అరిగి తత్ప్రదేశంబున. 376

సీ. అతులితానంతపథాక్రాంతిశాంతుఁ డై, ధరణికి దిగినమార్తండుఁ డనఁగ
నుత్తరదిశ మాని యొకవేడుకకు దక్షి,ణాశఁ జేరినకాంచనాద్రి యనఁగ
ననవరతాంబుపానాయాసమునఁ దీర, నాశ్రయించినబాడబాగ్ని యనఁగఁ
గరచరణాదికాంగములతోఁ గపిరూపు, దాల్చినయామ్యప్రతాప మనఁగఁ

తే. దుర్నిరీక్ష్యప్రభావంబుతో నుదగ్ర,తనువుతోఁ గిలికాభీలతరలవాల
వల్లితో శోణముఖమై భవంబుతో న,వంధ్యగతిసంధ్యవార్చు నవ్వాలిఁ గనియె.

మ. కని శాఖామృగమాత్రుఁ గాఁ దలఁచి రక్షస్స్వామి యయ్యింద్రపు
త్త్రుని వంచించి గ్రహింప నెంచి తనమంత్రుల్ దవ్వునన్ నిల్చి క
న్గొనఁ దా నొక్కఁడ పుష్పకంబు డిగి యందున్ సద్దు గాకుండ నొ
య్యన పాదంబులు పెట్టుచున్ వెనుక యై యంతంత నేతేరఁగన్. 378

చ. పదములచప్పు డింత చెవిఁ బాఱనీఁ గన్నులు విచ్చి వాలి గ
న్దదలనె వానిఁ గన్గొని ననుం గపటంబునఁ బొంచి పొంచి ప
ట్టెద నని రావణుండు నిగిడెన్ వడి వీని భుజాంతరంబులం
బొదివి చతుఃపయోధులను ముంచెద నంచు జపించుచున్నెడన్. 379

మ. చరణాగ్రంబులఁ దిన్నగా నడచి పశ్చాద్భాగముం జేరి యా
శరుఁడున్ మస్తము లోరఁ జేసికొని హస్తంబుల్ పయిం జాఁచినన్
హరి దంతిన్ గ్రహియించునట్లు ప్రబలుం డవ్వాలి బల్సందిటన్
శిరముల్ ప్రక్కలు బాహుపంక్తు లిఱికించెం జండసత్త్వంబునన్. 380

వాలి రావణాసురునిగర్వం బడంచి పరిభవించుట.

ఉ. ప్రక్కలఁ జక్కఁగా నదిమి బాహుశిరఃప్రముఖాఖిలాంగముల్
మిక్కిలి నొవ్వఁ జేయుచు నమేయబలంబున వాలి మింటికిన్
గ్రక్కున నుద్గమించెఁ దనుఁ గన్గొని వేల్పులు సిద్ధసాధ్యు ల
మ్రొక్క మహాపరాక్రమసమగ్రుఁ డితం డని సంస్తుతింపఁగన్. 381

ఆ. ఇట్టులుద్గమించి యింద్రునిగారాపుఁ,బట్టి చిలువ నొడిసి పట్టి పఱచు
పన్నగారిదారిఁ బశ్చిమాంబుధిఁ జేర, నరుగ నంతలోన నద్భుతముగ. 382

శా. ఆకాశంబున కడ్డ మేఁగినప్రహస్తాద్యాసురామాత్యు ల
ప్పాకారిప్రియసూతివాలజనితప్రత్యగ్రఝంఝానిలో
ద్రేకం బోర్వక తూలికల్ చెదరురీతిన్ మేఘముల్ విచ్చి చీ
కాకై పోయెడుజోక నొచ్చి చని రాకంపింప సర్వాంగముల్. 383

క. తోయదముం గొని పోయెడు,వాయువువలె వాలి పంక్తివదను నిటులు గొం
పోయి వడిఁ బశ్చిమాంబుధి,తోయముల మునింగి నియమధూర్వహమతియై.

చ. ఇరవుగ నప్పయోధి ఘటియింపఁ గలట్టిక్రియల్ ఘటించి యు
త్తరజలరాశికిం జని యథావిధి స్నానముఁ జేసి పంక్తికం
ధరు నలవోక సందిటను దాల్చియె తూరుపువార్ధిఁ జేరి యం
దురుజపనిష్ఠ లెల్ల నియమోన్నతిఁ దీర్చి యివ్విధంబునన్. 385

మ. కృతకృత్యుం డయి యింద్రనందనుఁడు కిష్కింధాపురోద్యానప
ద్ధతిఁ బ్రాపించి భుజాంతరంబున మహాదైన్యంబుతో వ్రేలున
ద్దితిజాధీశ్వరు నందు వైచి నగుచున్ దేవారి హా యెప్పుడం
చతనిం జూడనివానియట్లుడుగ వీతాహంక్రియౌద్ధత్యుఁడై. 386

మ. తను వాద్యంతము చెమ్మరింప భయగాద్గద్యంబు గాన్పింపఁ గ
న్గొనలన్ బాష్పము లావరింప వడఁకుం దోడ్తోఁ బ్రవర్తింప బో
రున నిట్టూర్పులు మించ లేచి దనుజేంద్రుం డంతఁ దాఁ గ్రమ్మఱన్
జననం బొందితి నంచు నెంచి యనియెన్ శాఖామృగస్వామితోన్. 387

చ. బలియుఁడ వైన నీవె నిరపాయదయాఢ్యుఁడ వైన నీవె ని
శ్చలమతి వైన నీవె విలసద్ధృతివైనను నీవె కాక నీ
కిల నొకరుండు సాటి యగునే సురనాథకుమార నిన్ను నేఁ
డెలిసితి నేఁడు నిక్కముగఁ దీఱె మదీయమదాంధకారముల్. 388

శా. కైలాసం బగలించి శంకరునిచే ఖడ్గంబుఁ బ్రాపించి ది
క్పాలశ్రేణిఁ గలంచి మించిననుం గక్షాంతరాళంబునం
దూలంబుల్ బలె వ్రేలఁ జేసితివి నీదోశ్శక్తిమ్రోలన్ వృథా
స్థూలం బయ్యె మదీయశౌర్య మఖిలస్తుత్యప్రభావోదయా. 389

చ. గరుడురయంబు మానసము గాంచినవేగము చండమారుత
త్వరయు భవజ్జవంబున లవంబున కైనను సాటి వచ్చునే
సురగరుడోరగాసురులఁ జూచితి నీదృశబాహువిక్రమ
స్ఫురణ లెఱుంగ సత్య మిది స్తోత్రము గాదు ప్లవంగపుంగవా. 390

ఉ. అన్నవు నీవు భానుసుతునట్టుల నేనును గూర్మితమ్ముఁడన్
నన్నుఁ గృపం గనుంగొనుము నాధన మంతయు నీది నీవు నే
నెన్నఁటికిట్లు చెల్మి వహియించియె యుండుద మన్న నింద్రజుం
డన్నరభోజితోడ నపుడట్టులె సఖ్యము సేసి వేడుకన్. 391

క. బాంధవుఁ డగునాతనిఁ గిష్కింధకుఁ దోడుకొని పోయి స్నేహమున జగ
ద్బాంధవసుతుఁ జూచినగతి, బంధురమతిఁ జూచి మిగుల బహుమతిఁ జేసెన్.

క. మాసముదారత నచ్చట, మాసము వసియించి మిగుల మైత్రియుఁ గని య
య్యాసురపతి సత్కృతుఁ డై, యాసురపతిసుతుఁడు వనుప నరిగె నృపాలా.

వ. అని పలికి యగస్త్యమునిశేఖరుండు రఘువీరశేఖరునకు వెండియు నిట్లనియె.

మ. చతురంభోధుల దైత్యు ముంచినభుజాశౌర్యాఢ్యు నవ్వాసవిన్
హతుఁ గావించితి వొక్కతూపున సమిత్రామాత్యపుత్రంబుగాఁ
గృతవీర్యాత్మజుఁ ద్రుంచివైచినత్రిలోకీవర్ణితున్ రేణుకా
సుతు నిర్జించితి వెంచ శక్యమె నినున్ క్షోణీసుతాధీశ్వరా. 395

క. విను మివ్వాలికథ యిటువలె, దనుజుఁడు కిష్కింధ వెడలి తనసహజమదం
బున మునుపటివలె నృపతుల, నని నొంచుచు ధరఁ జరించునక్కాలమునన్.

### రావణుఁడు నారదుం జూచుట.

శా. సర్వాంగీణవిభూతికాంతులు శరచ్చంద్రస్ఫురచ్చంద్రికా
నిర్వాహంబుఁ గనన్ జటల్ భుజగమాణిక్యచ్ఛటల్ సాటఁగా
సర్వజ్ఞత్వము సార్వకాలము రహించన్ మించుదేవర్షి యం
తర్వాణిస్తవనార్హకీర్తి యెదురైనన్ దైత్యుఁ డుప్పొంగుచున్. 397

ఉ. దండము వెట్టి సేమమె కదా యనిమేపరియయ్యవారి కెం

దుం డిపు డెందుఁ బోయెదవొ యోజన లేని విశేష మెద్ది బ్ర
హ్మాండమునందు మీకుఁ దెలియం బడ కుండునె సర్వమున్ ధరా
మండలనాథులన్ గెలుచు మద్భుజశౌర్యము మెచ్చ వచ్చునే. 398

వ. అనినఁ జతురవచనరచనావిశారదుం డగునారదుండు నీరదపథంబునం జను
పుష్పకంబు నిలుపు మని నియమించి యతనితో ని ట్లనియె. 399

మ. యశముం దేజము బాంధవప్రియము ధైర్యస్థైర్యముల్ గన్న నీ
కుశలంబే తలఁతున్ శుభంబె కద నీకున్ రాక్షసాధీశ యీ
దృశశౌర్యాఢ్యుఁడ వీవు మానవులతో నేవేళఁ బోరాడఁగాఁ
గృశతం బొందె మదీయకౌతుక మదేమీ యన్న వాక్రుచ్చెదన్. 400

క. పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము, విచ్చలవిడి నిగుడఁ జేయువిధ మింతె కదా
మచ్చరము మనుజతతిపైఁ, దెచ్చుక పాలియింప నీవు దిరుగుట లెల్లన్. 401

మ. అకటా విష్ణుని గెల్చుటో జముని బాహాశక్తి మాయించుటో
సకలాదిత్యవినాశముల్ సలుపుటో శక్రున్ నివారించుటో
వికటవ్యాధిజరావికారకృశులన్ విభ్రాంతులన్ మర్త్యులం
బ్రకటక్రోధమునన్ జయించిన వికారం బంద రే మాదృశుల్. 402

క. సామజరాజము దోమల,తో మార్కొని పోరుపటుల తోఁచెన్ మనుజ
స్తోమముతోఁ దార్కొని సం,గ్రామము నీ వాచరింపఁ గాఁ గనుఁగొన్నన్.

మ. వర మబ్జాసను వేఁడినప్పుడును దేవశ్రేణులం గాని నే
నరులన్ వానరులన్ గణింప ననవే నాయంబె భీతాత్ములం
బరివేధించుట మార్కొనన్ వలసినం బాతాళవాసుల్ ఫణా
ధరులున్ దైత్యులు లేరె వా రసదులే దైతేయవంశాగ్రణీ. 404

వ. అని మనుజహితార్థి యై రావణునకు రసాతలజయోద్యోగంబునందు బుద్ధి
పుట్టించి యన్నలువపట్టి యంత నిలువక. 405

తే. ఇది హితంబుగ నూహించి యింక మనుజ,కోటిపై ధాటి చూపక నేటనుండి
చనుము పాతాళవాసుల సంహరింప, నీ గెలుపు గెల్పుగాదు దైత్యేంద్ర యనిన.

ఉ. నారదుమోముఁ జూచి యెలనవ్వునఁ బంక్తిముఖాసురుం డనున్
మీరు మనుష్యకోటులకు మేలు దలంచితి రేమొ మంచిదే
శూరులు భీరులం దొడరి శూరతఁ జూపిన శూరుఁ డందు రే
భూరిగుణాభిరామ తగు బుద్ధి గణించిన మాన వచ్చునే. 407

మ. బలిసద్మంబున కేఁగి తొల్త బలిశుంభద్దర్వమున్ మాన్చి దై
త్యులయాద్ధత్య మడంచి భోగివరులం దూలించి వత్తున్ రసా
తలయాత్రానుమతిప్రదానము మునీంద్రా యిచ్చితే యన్న నం
దుల కానందముఁ బొంది పద్మజనిపుత్త్రుం డి ట్లనుం గ్రమ్మఱన్. 408

మ. అల వుష్పాంగ రసాతలాధిపుల బాహాటోపముల్ మాన్పఁగా
వలతేనిం దొలుదొల్త సంయమనితో గర్వం బొప్పు నీ రాక్షసు
మ్మలికం జెంది జముండు మార్కొనిన సమ్మర్దంబుగా నచ్చటం
గలుగుం బోరతనిన్ జయించి యశముం గైకొమ్ము నా మెచ్చుచున్. 409

ఉ. దేవమునీంద్ర పంచియుపదేశ మొసంగితి రంత కాదిది
ద్దేవతలన్ దురంబునను గెల్వఁ బ్రతిజ్ఞ యొనర్చినాఁడ ము
న్నావిధ మెచ్చరింప హిత మయ్యె జయింతు నవశ్య మాతనిన్
దీవన లిచ్చి మీ రిపు డతిప్రమదంబున పీడుకొల్పుటన్. 410

క. పనివిని యెద నని నారద,మునికిన్ వినయోక్తియుక్తి మ్రొక్కి దశాస్యుం
డనుమతిఁ గొని జము గెల్వఁగఁ, జనియెన్ బలకలకలంబు చదలం బొదలన్.

నారదుండు యముని జూడఁ బోవుట.

ఉ. నారదుఁ డంత నిట్లని మనంబున నెంచె దశాస్యుఁ డెంతయుం
గ్రూరుఁడు మూఁడులోకములకున్ వెత సేయఁగఁ బూనుకొన్న వాఁ
డీరస మెక్కు డంతకుఁడు నింతట నంతట రిత్త పోవునే
వీరలు పోరుపోరు గని వేడ్క యొనర్చెదఁ గన్నుదోయికిన్. 412

చ. యమునకుఁ దానె పెద్దయముఁడై భయ మొందక రావణుండు సం
యమనికిఁ బోయె నింక నెటులైనను మంచిది మర్త్యకోటిబ
న్నము గడతేఱె నింతటఁ గనాఁటిలి వేల్పులమీఁదఁ జూపు వి
క్రమ మది మేలుగా దయినఁ గన్గొని మెచ్చక పోవ వచ్చునే. 413

ఉ. ఇచ్చటఁ దామసింపఁ దగ దిప్పుడె యాతని కివ్విధంబు వా
క్రుచ్చెద నంచు నారదుఁడు గొబ్బున సంయమనీమహాపురిం
జొచ్చి చిరత్నరత్నమయశోభితదివ్యసభాంతరంబులో
నొచ్చెము లేనికల్మిఁ గొలువున్న జముం గని చేరఁ బోవఁగన్. 414

సీ. కణ్వగార్గ్యమార్కండేయు లొకవంక, సముచితస్మృతివివాదములు సలుపఁ
దమరు దెచ్చినప్రాణితతుల ముందట నుంచి, యెడనెడఁ గింకరుల్ హెచ్చరింప
నెవ్వ రెవ్వరి నొంతు రెం దెందుఁ బోదు మం,చాకృతుల్ గని యామయములు
గవిలె లోనున్న ప్రకారానఁ బ్రజపాప,పుణ్యముల్ చిత్రగుప్తుండు దెలుప[వలుకఁ

తే. ధర్మపీఠంబునను గాలదండమృత్యు
సహితుఁడై నిండుకొలువుండి సకలలోక
వంద్యుఁ డాతండు సురమానివచ్చు రాకఁ
గాంచి యెదురేఁగి మ్రొక్కి యర్ఘ్యం బొసంగి. 415

ఆ. ఉన్నతాసనమున మునిని పూజలు సేసి, కుశలమడిగి ప్రియముఁ గూర్చి యిచటి
కేఁగుదేర నేమిహేతువు మునినాథ, తెలుప వలయు ననినఁ బలికె నతఁడు.

మ. నిఖిలస్తుత్యభుజప్రతాపనిధి వాసీమీఁద దండెత్తి న
చ్చె ఖలుం డైనదశాననుం డతనితో సిద్ధంబు యుద్ధం బగున్
శిఖరిన్ మేషము దాఁకి కుందుగతి నీచే వందురన్ సంగరో
న్ముఖభావంబు వహింపు మన్న నగి యంభోజాప్తపుత్త్రుం డనున్. 417

ఉ. మేలు మదేమి మాపురముమీఁదికి రావణుఁ డేఁగుదెంచినం
జాలుఁ భవత్ప్రసాదమున శౌర్యగుణంబు ఫలింపఁ జేసెదం
గాలునికాలదండ మెఱుఁగం డొకొ మృత్యువుఁ జెంద వానికిం
గాలము డగ్గఱించె నది గానియెడన్ మది నిట్టు లెంచునే. 418

క. మంచిది రా నిం డంతయుఁ, గాంచెద రీమునులు మీరు గర్వోక్తులు భా
షించఁ బని యేమి యంచు స,మంచితధైర్యమున నుండెనట దశముఖుఁడున్.

రావణుఁడు సంయమనిపై దండెత్తుట.

చ. హాలహలతీక్ష్ణభంగులు లయాంబుధరప్రతిబింబరూపముల్
ప్రళయసముద్రఘోషములు బాడబకీలల నేలు తేజముల్
వెలయ మహోగ్రరౌద్రములు వింతలు గాఁ దగుపేరరాక్షసుల్
గొలువఁ బరేతరాజపురగోపుర ముద్ధతిఁ జూచి వేడుకన్. 420

ఉ. ఆయతదివ్యపుష్పకమహాప్రభ లానిరయాంధకారము
న్ద్రోయ దశాస్యుఁ డయ్యెడఁ గనుంగొనియెన్ భటకోటి గత్తులం
గోయఁగ వ్రేయఁగాఁ గశలఁ గొట్టఁగఁ దిట్టఁగ బెట్టువేదనల్
సేయఁగఁ జిక్కి సుక్కి వెతఁ జెట్టలు దక్కి తపించుప్రేతలన్. 421

సీ. ఉక్కుకోఱలకుక్క లొక్కింతమర్మముల్, వట్టి తీయఁగ మొఱల్ వెట్టువారి
గొప్పనిప్పులయేటఁ గూల్చి పోనీయక, పొదివి యమ్ముల నేయఁ బొరలువారి
నెత్తురు చీమునిండినకూపములఁ ద్రాలి, పురుగు లంగముఁ దొల్వఁ బొగులువారిఁ
గత్తులఁ గోసినకాయముల్ ఘోరవా,హినుల ముంపఁగ బెట్టు పనవువారి
తే. బిట్టుగాలినపెనములఁ బెట్టి వేఁప, మిట్టిపడి యట్టె మూర్ఛిల్లునట్టివారిఁ
దప్తతైలకటాహపాతమున శోక,తప్తు లగువారిఁ జూచె సద్దశముఖుండు. 422

సీ. పక్షపాతులుఁ గూటసాక్షులు నన్ృతో,క్తి పరులు రౌరవబాధపడెడువిధము
కులహంతలును భ్రూణగోఘ్నులుచ్ఛ్వాసని,రోధకంబునఁ బడి రోఁజువిధము
బ్రహ్మహంతయు సురాపాని స్వర్ణస్తేయి, సూకరంబునఁ బడి సుక్కువిధము
స్వగురుతల్పగుఁడును స్వసృగామినృపహంత,తప్తకుంభికఁ బడి తలఁకువిధము
తే. కూఁతునుం గోడలిని బట్టుకొన్న చెడుగు
లురుమహాజ్వాల వ్రాలి బిట్టొఱలువిధము
దగనిమగువలఁ గవయుపాతకులు లవన
యాతనలఁ గూలువిధ మతఁ డచటఁ జూచె. 423

సీ. భృతికి వేదంబు చెప్పెడిదూబ వేదనిం, దకుఁడు విమోహపాపాతంబు గనుట
నతిథుల వృద్ధుల నరయ కన్నము దిన్న, పాపకర్ముఁడు క్రిమిభక్షి యగుటఁ
గ్రతువు సేయఁగ నాసతన నసద్గ్రాహి, యగువాఁడధోముఖుఁడైయెలుఁగులుట
బ్రాహ్మణుం డయ్యు బేరము లాడుదుర్జాతి, యంధకూపంబున నవశుఁ డగుటఁ
తే. బర్వగామియు గృహదాహిబంధురోధి, వైతరణిఁగూలి కాలుట వనమునఅకి
వైచినదురాత్ముఁ డసిపత్త్రవనిఁ దొరఁగుటఁ
జూచి దశకంధరుఁడు దల యూఁచి మఱియు. 424

సీ. నవరత్నమయభూషణములఁ బూనినవారి, దివ్యయానము లెక్కి తిరుగువారి
వికచమందారమాలికలు చుట్టినవారిఁ, దెలిగొడుగులనీడ వెలయువారి
మృగమదశ్రీగంధమిళితాంగు లగువారి, వీణాదినాదముల్ వినెడివారి
నచ్చరల్ గొలువఁ గోర్లై వ్రచెల్వుగనువారి, మేలిమచ్చులమీఁద మెలఁగువారిఁ
తే. జంద్రుసౌమ్యత తపను తేజంబు మరుని, చెలువ మింద్రునిభోగంబు శివునివిభవ
మూని భద్రాసనస్థులై యున్నవారి, ధార్మికులఁజూచె నొకవంక దశముఖుండు.
ఆ. చూచి నేను మొదటఁ జూచినవారి క,య్యెడ లొనర్చె వీరి కధిక సౌఖ్య
యుక్తి మెలఁగఁ జేసె నోహోజముఁడుపకృ, పాతియనుచుఁబలికెఁ బంక్తిముఖుఁడు.
చ. పురుషుఁడు కర్తయే దురితముల్ సుకృతంబు నొనర్పఁ గర్తయొ
క్కరుఁ డది నీవు సేయు మనఁగాఁ గదకర్మఁ డౌ స్వతంత్రతా
విరహితులన్ వృథా పరిభవించెద రిఖలు లంచు యామ్యకిం
కరుల నదల్చి రావణుఁడు గాఢకృపన్ విడిపించెఁ బ్రేతలన్. 427
క. భయపడునిరయస్థులఁ గని, దయ యనుపే రెఱుఁగనట్టిదశకంఠునకే
దయ పుట్టె నన్న వారల, దయిునవిపద్దశ దలంప నలవియె యధిపా. 428

రావణుఁడు యమునిభటులఁ బరిభవించుట.

ఆ. ఇటులు నిరయగతుల నెల్ల విముక్తులఁ, జేసి వాని హాయి నెంది పొగడ
విక్రమింపఁ గడఁగువింశతిభుజుఁ జూచి, శమనభటులు నీరసమునఁ గెరలి. 429
మ. పరిఘాసిక్షురికాపరశ్వధగదాప్రాసాదినానాయుధో
త్కరముల్ పూని దశాస్యుపుష్పకముమీఁదం బెల్లు గావించి హుం
కరణంబుల్ గఠినాట్టహాసములు టంకారధ్వనుల్ మీఱ భీ
కరులై యొక్కటఁ జుట్టు ముట్టుకొని మార్గంబున్ నిరోధించినన్. 430
మ. దనుజాధీశునిమంత్రు లజ్జమునిభృత్యశ్రేష్ఠులన్ బిట్టు మా
ర్కొని తత్సాధనముల్ దళించుటయు సక్రోధాత్ములై శూలముల్
గొని వారుం బ్రతిపక్షసైనికులవక్షోదేశముల్ గ్రుమ్మి యా
ర్చిన నీలాచలనిర్ఝరంబు లనఁ బాటెం గ్రొత్తపెన్నెత్తురుల్. 431
క. నెత్తుట జొత్తిల్లియుఁ బలు, మొత్తము లై రాక్షసులు జమునిభృత్యులకు

జిత్తమ్ముల నుత్తలముం, దత్తఱమును హత్తుకొన రణంబులు సేయన్. 432

చ. సమముగఁ బోరునద్దనుజసైనికులం దెరలించి కింకరో
త్తములు పయోదముల్ సలిలధారలఁ గాటుకకొండఁ గప్పుచం
దమున దశాస్యుమేను శరధారలఁ గప్పిన ఫుల్లకింశుక
క్రమమున రక్తసిక్తుఁ డయి శౌర్యము శౌర్యము ధైర్యముం దగన్. 433

చ. ఇరువదిచేతులన్ వివిధహేతితతుల్ గొని యొక్కపెట్టకిం
కరులపయిన్ నిగిడ్చినఁ గకావికలై రొకకొంద అందు నొ
చ్చిరి యొకకొంద అంత హతశేషులు క్రమ్మఱ డాసి పంక్తికం
ధరుమెయి మించి రస్త్రములఁ దమ్మతఁ డద్భుత మంది చూడఁగన్. 434

క. ఇక్కైకవడి రక్కసునకు, వెక్కసమునఁ దొడఁగుజమునివీరభటులతో
నక్కన మార్కొని పోరఁగ, నొక్కరుఁడుం గలుగఁ డసురయోధులలోనన్.

ఉ. అప్పుడు రావణాసురుఁడు యామ్యభటాస్త్రపరంపరల్ దనుం
గప్పినఁ గంకటం బవిసి గాత్రము భేదిల నొచ్చి కన్నులన్
నిప్పులు గుప్పలై తొరఁగ నేలకు డిగ్గి తదీయశౌర్యముల్
డెప్పరమైన సైఁపక వడిన్ విలు పూని గుణంబు మీటుచున్. 436

మ. తపనాదిగ్రహముల్ కదద్వగతిఁ జెందన్ వేలుపుంబెద్ద మి
ట్టిపడన్ భోగివరుండు డీలుపడ దంష్ట్రిస్వామియుం దెళ్ల స
ప్తపయోధుల్ గలఁగం గులాద్రులు సలింపన్ నాకుల్ ఝల్లఁ బా
శుపతాస్త్రం బరిఁ బోసి యంతకభటుల్ సుక్కం బ్రయోగించెన్. 437

మ. బహుశక్తుల్ బహుతోమరంబులు బహుప్రాసాదిశస్త్రంబు ల
మ్మహనీయాస్త్రమునన్ జనించి పొగలున్ మంటల్ సెలంగన్ మహా
గహనంబున్ దహియించుదావశిఖరేఖన్ మిత్రభూభృత్యులన్
దహియించెన్ నిమిషంబులో భువన మత్యాశ్చర్యముం బొందఁగన్. 438

తే. ఇటులు యమభటకోటుల నేపడంచి, చటుల మగుతచ్చరం బుపసంహరించి
పురము లేర్చినఫాలాక్షుఁ బోలి యట్టహాస మొనరించె నతఁడుసంయమనిబెదర.

ఉ. ఇంతయుఁ జూచుచున్నభటు లేఁగి కృతాంతునితోఁ బరాకు దు
ర్దాంతపరాక్రమకప్రమధురంధరుఁ డద్దశకంధరుండు నేఁ
డింతయు మించి పాతకుల నెల్ల విముక్తులఁ జేసి యుద్ధవి
భ్రాంతులుగానికింకరులఁ బాశుపతంబునఁ ద్రుంచినాఁ డనన్. 440

క. కటతటు లదరఁ బటుభ్రూ, కుటి నిటలస్థలి నటింప గొప్పమిడుఁగుఱుల్
చిటచిటఁ గన్నులఁ జెదరఁగ, గిటగిట రదనములు బెట్టుగిటుకొను క్రుధన్. 441

క. క్రూరుండై శమనుఁ డుఱక, తేరకు మద్వీరభటులఁ దెగటార్చినయ
వ్వైరి నిఁకం దెగఁ జూచెద, సారథి మనరథము దెమ్ము చయ్యన ననఁగన్.

### యముఁడు రావణుపై యుద్ధమునకుఁ బోవుట.

క. తోరపులత్తుకచాయల, వారువములు గట్టి మహిషవరకేతువు చె
ల్వార సమకట్టి తేరా, సారథి గొని తేర నెక్కె సంరంభమునన్. 443

సీ. క్రోధపావకుఁ దుండుకుండంబు లన నేత్ర, గోళముల్ మంటలఁ గ్రుమ్మరింపఁ
గులిశంబు చతురాకృతులఁ గాంచె నా మించు, దంష్ట్రలఁ గలిసి వక్త్రంబు వెలుఁగ
ద్వాదశద్వాదశాత్మక తేజ మొక టైన, గతి దుర్నిరీక్ష్యప్రకాశ మెసఁగఁ
బ్రళయకాలాభీలపాథోధరము లీలఁ, దాళమహోత్తాలతనువు గ్రాలఁ
తే. గాలదండంబు పాశంబు గాలమృత్యు, వగ్ని మయముద్గరము దక్క నాయుధములు
మూర్తులు ధరించి నిజరథంబున వెలుంగ
దశముఖుని మీఁది కరుదెంచె దండధరుఁడు. 444

వ. అప్పుడు. 445

సీ. ప్రళయార్కబింబంబుపగిది భూరిప్రభా, రాజితం బగు దివ్యరథముఁ జూచి
సంవర్తసమయప్రచండానలజ్వాల, లం బూను కాలదండంబుఁ జూచి
కాలపాశంబు ముద్గరముఁ గైకొని మ్రోలఁ, దులకించు కాలమృత్యువును జూచి
కల్పాంతభైరవక్రౌర్యం బకాలంబు, నందె చూపఁగఁ బూను యమునిఁ జూచి
తే. యతనియాకారమును జూచి యదరి బెదరి, చెదరి పదములు దడఁబడ నుదరిపాటు
గదురఁ బదురుచు నెదఁ దాల్మి గుదురు పఱుపఁ, జాలక సురలు పఱచిరిక్ష్వాకుతిలక.

చ. సహచరహుంక్రియోగ్రమహిషప్రవరోత్కరకంఠఘంటికా
బహుళఘణంఘణధ్వనులు పార్శ్వసమాగతకింకరాగ్రణీ
కహకహఘోషముల్ తురగకల్పితహేషలు చండమారుతో
పహతపతాకికార్భటులు భంగురచక్రరవంబు లొప్పఁగన్. 447

### యమరావణుల యుద్ధము

చ. నిమిషములోన నిట్లు రజనీచరముఖ్యునిఁ జేర వచ్చి సం
యమనివిభుండు శూల ముసలాసి గదాప్రముఖాయుధంబు లొ
క్కమొగి నిగిడ్చి పేరలుక గన్పడ నార్చిన రావణుండు ధై
ర్యమహిమ నోర్చి వజ్రనిశితాశుగకోటుల ముంచె నాతనిన్. 448

శా. ఆయస్త్రాంధతమిస్ర మర్కజుఁడు మధ్యాహ్నార్కచందంబునం
బాయం ద్రోచి సహస్రబాణముల నప్పౌలస్త్యు నొప్పించినం
గాయం బంతయు నెత్తుటం దడియ నాకంపించియుం గిన్క దై
తేయస్వామి పిఱిందికిం జనక యుద్వృత్తిఁ జముం జూచుచున్. 449

శా. బాహాస్ఫాలన మాచరించి దశచాపజ్యాళి మ్రోయించి శౌ
ర్యాహంకారత మించి హుంకృతుల బ్రహ్మాండంబు భేదించి యు
త్సాహశ్రీ వహియించి తూపు లరిమీఁదన్ నించి నొప్పించి స

స్త్రాహోరాత్రము లోకప్రచండమునఁ బోరరాజిన్ సమానోద్ధతిన్. 450
వ. ఇవ్విధంబున. 451
మ. తనతో జోడయి పోరురాక్షసునిదోర్దర్పంబు సైరింప క
య్యనజుం డేకశరాసుఁ డయ్యుఁ బదివే ర్లేసెన్ శితాస్త్రంబు లం
దున మే నంతయుఁ గ్రంత లైన దశవక్త్రుం డగ్గత మూర్ఛిల్లి యం
తనె తెప్పిర్లి యుగాంతకంతుహరదుర్దాంతక్రుధావంతుఁ డై. 452
చ. శమనుఁడ వాఁడు వీనిశితసాయకముల్ శమియింపు మంచు న
య్యమరవిరోధి యాతనిహయంబుల సూతుని నాలుగేడుబా
ణములఁ గలంచి వేయిబలునారసముల్ మెయి నాఁట నేసి వి
క్రమమున నార్వఁగా జముఁడు గన్నుల మంటలు గ్రమ్మఁ జూచినన్. 453
చ. దనుజబలంబుపై నడరి తచ్ఛిఖివేఁడిన కాస నేర్చుచె
న్నున నలిరేఁగి కాల్పఁగఁ గనుంగొని యంతకు మున్నె వచ్చి య
య్యనితెఱఁ గెల్లఁ జూచుచతురాస్యగిరీశసురేశముఖ్యు ల
య్యనసుతురోషశక్తి నుతియించిరి మెచ్చిరి రాక్షసేంద్రునిన్. 454
ఉ. అయ్యెడ మృత్యు వి ట్లనియె నర్కజుతో ననిఁ బూని యేడునా
ళ్లయ్యె సురాభియాతి మెదురై నిను నొంచుచు నున్నఁ జూడ సి
గ్గయ్యెడు నింత యేల నను నంపు మొకించుకలోన వీని ను
గ్గయ్యెడునట్లు సేసెద సురాసురు లింపును ఖేద మొందఁగన్. 455
మ. నను దాఁటన్ వశమే విధాత కయినన్ నాచేతఁ గా శంబసా
దనదైతేయుఁడు జంభపాకమధువృత్రవ్యాఘ్రనాగాసురుల్
కనకాక్షుండు హిరణ్యుఁ డాది యగురక్షశ్శేఖరుల్ మ్రగ్గుటల్
సన దాలస్యము పంపు మన్న జముఁడున్ సైరింపు మం చాత్మలోన్. 456
ఉ. మృత్యువుఁ బంపినం దనయహీనబలంబు దొలంగు ముద్గరా
ద్ధత్యము పాశమున్ రిపువధం బొనరింపఁగ లేవు సర్వలో
కాత్యయహేతుపావకమహార్చిరఖండము కాలదండమున్
దైత్యునిమీఁద వైవ నుచితం బిపు డంచుఁ దలంచి శూరతన్. 457

బ్రహ్మయాజ్ఞచే యముఁడు రావణుతోడియుద్ధంబు మానుకొనుట.

చ. బ్రతుకుదు గాని లేర యిఁకఁ బంక్తిముఖా యని కాలమేఘుని
ష్పతదమితాశనిస్ఫురణశాంభవఫాలదృగగ్నికీలికా
ప్రతినిధికీలలన్ భువనపంక్తిఁ గలంచెడుకాలదండము
ద్ధతిఁ గొని వైవఁ బూనినఁ బితామహుఁ డడ్డము సొచ్చి యి ట్లనున్. 458
చ. నిలు నిలు కాలదండ మతినిష్ఠుర మీతనిమీఁద వైవఁగా
వల దుపసంహరింపు మనవద్యవివేక తపం బొనర్చి న

న్నలరఁగఁ జేసి యందున సురాసురకోటి కజయ్యుఁ డై ప్రవ
ర్తిల వర మొందినాఁ డిపుడు దెల్లిన నానచనంబు దప్పదే. 459

తే. కాలదండం బమోఘంబు గాఁగ నేన, యాచరించితి దీన దశాననుండు
నొచ్చినను నొవ్వ కున్న నా నొడువు బొంకుఁ
జెందు నటువలెఁ గా కుండఁ జేయు మనిన. 460

శా. ఆవైవస్వతుఁ డబ్జగర్భువచనం బాలించి సద్భక్తితో
దేవా దేవరయాజ్ఞఁ గాదె జగముల్ దీపించు మీపల్కు స
ద్భావం బొందెదు నట్టు లైన నసురం బ్రాణంబుతోఁ గాచితిన్
లావుం జేవయుఁ గల్గియున్ విముఖులీలం బోయెదన్ వీటికిన్. 461

క. మాటికి మీయానతి జవ, దాఁటక నడచుటయె గెలుపు దనుజుని చే నా
కోటమి గలిగెఁ గదా యన, నేటి కని రథంబుతో నదృశ్యుం డయ్యెన్. 462

శా. కీనాశుం డిటు లేఁగఁ బద్మభవుఁడున్ గీర్వాణసంఘంబుతోఁ
దా నంతర్ధి వహించె నారదుఁడు యుద్ధం బెంచుచుం బోయె లం
కానాథుండును శత్రుఁ డోడె ననుచుం గౌతూహలం బొంది దై
త్యానీకాన్వితుఁ డై రసాతలజయోచ్ఛాయత్తచిత్తంబునన్. 463

రావణుఁడు భోగవతీపురఁబు జయించు.

చ. చని చని చూచె ముందట నిశాచరచంద్రుఁడు తోయబాలికా
జనఘనడోలికాయితవిశాలవిలోలతరంగకేళికా
కనదహిచూళికామణిశిఖాసఖవిద్రుమపాలికావినూ
తనరుచిమాలికాపిహితతాపనసారథి ఘోరనీరధిన్. 464

క. కని గాంభీర్యము సంశో, ధన సేయఁగఁ బోవునటులు తద్గర్భముఁ జొ
చ్చి నిశాటమాళి యాలోఁ, జనియెన్ నిజయానకాంతి సరణి గణింపన్. 465

వ. ఇవ్విధంబునం జని చని. 466

మ. దివిషద్ద్వేషణచక్రవర్తి గనియెన్ దేవేంద్రలోకాగ్రభో
గవతిం గైరవపద్మసద్మపరిఖాకారాధికాగాధభో
గవతిన్ రాజితసాలభోగివరశృంగప్రోజ్జ్వలాభోగభో
గవతిన్ వాసుకి యేలుభోగవతి నాగస్త్రైణలీలావతిన్. 467

క. కనుఁగొని యప్పురిచుట్టును, దనబలములు విడియఁ బంచి దారుణభేరీ
ధ్వను లడరఁ దాను ద్వారంబున నెలకొని యనికి భుజగముఖ్యులఁ బిలువన్.

ఉ. వా రది విన్నవింప విని వాసుకి బంధులఁ గూడి వచ్చి బల్
వారణముల్ రథాశ్వము లవారణఁ గానిక లిచ్చి మేము మీ
వారము మాపయిం జనదు వైర మటంచు హితోక్తు లాడ దే
వారియు వారి వీడుకొని యప్పురిఁ బాసి చమూసమేతుఁ డై. 469

### రావణుఁడు నివాతకవచులతోఁ బోరాడుట.

చ. మణిమయసౌధసాలగృహమండపశిల్పములన్ యథార్థ మా
మణిమతి యన్పురంబున కమర్త్యవిరోధి జయస్పృహాపరా
యణతఁ జనన్ నివాతకవచాభిధు లక్కడివారు రాక్షసా
గ్రణులు పయోజగర్భవరగర్వితు లాత్తనిరాక కుబ్బుచున్. 470
చ. రణమున కేఁగుదెంచె బళిరా దశకంఠుఁ డటంచు శత్రుభీ
షణపురుషోపలోచ్చకవచప్రభలున్ శితదంష్ట్రికాప్రభల్
ఫణినిభహస్తనిస్త్రులకృపాణమహాప్రభలుం జెలంగ రా
వణునియమాత్యులం దొడరి వా రొనరించిరి పోరుక్రూరతన్. 471
వ. ఇవ్విధంబున. 472
శా. ఖడ్గాఖడ్గి భుజాభుజిం దొడరి రక్షస్సైనికుల్ వాహినీ
రాడ్గంభీరరవం బడంచుఘనగర్జల్ మీఱఁ గాలానల
త్విడ్గాఢప్రకటప్రతాపములు వర్ధిల్లన్ మరుత్వత్సరో
రుద్గర్వాదిమనోభయంకరముగా రోషించి పోరాడఁగన్. 473
ఉ. ఆలమునన్ నివాతకవచాసురవీరులవీఁక కోర్వఁగాఁ
జాలనిమంత్రిపుంగవుల సైన్యములం గని పంక్తికంఠుఁ డా
భీలభుజాప్రతాపమును బెంపును మీఱఁగఁ బోరె వారితో
రేలు పగళ్లు నాక నలరేఁగి మొగిం బదిరెండుమాసముల్. 474
శా. బద్ధస్పర్ధలతో నివాతకవచుల్ పౌలస్త్యుఁడున్ గాఢస
న్నద్ధత్వంబున నిట్లు పోరఁగ శతానందుండు వేంచేసి యీ
యుద్ధం బేటికి మీర లిందఱు నజయ్యుల్ పంక్తికంఠుం డతి
క్రుద్ధుం డెవ్వనిచే నసాధ్యుఁ డిఁక మీకున్ సంధి సేయం దగున్. 475
చ. సమబలుతోడఁ జేయఁ దగు సంధి బలాఢ్యునితోడ సంధియున్
సమరముఁ గాదు హీనునెడ సంధికి నియ్యకొనంగఁ జెల్ల దీ
యమరవిరోధి మీకు సముఁ డౌట సఖిత్వము మే లటంచుఁ గా
ర్య మడఁచి పద్మజుం డరిగె నట్ల యొనర్చిరి వార లయ్యెడన్. 476
ఆ. ఆనివాతకవచు లధికసఖ్యంబుతోఁ, దను బహూకరింప దశముఖుండు
గొంతకాల మచటఁ గూర్మి మెవసియుంచి, వలయుమాయ లెఱిఁగి వారివలన.

### రావణుండు కాలకేయులతో యుద్ధము సేయుట.

క. వారల వీడ్కొని వరుణజ,యారంభముతోన కదలి యప్పథమున దే
వారివరుఁ డశ్మపుర మను, పేరిటి దోకపురము సూచి పృథుశౌర్యమునన్. 478
ఉ. అప్పురివాకిటన్ నిలిచి యార్పు లొనర్పఁగఁ గాలకేయు లా
చప్పుడు లాలకించి రభసంబున వెల్వడి పంక్తికంఠుపై

నప్పుడు దారసిల్లి తమకోయగ్గలికల్ గనిపించి మీఁకుఁగా
నిప్పతి గత్తి వట్టునె హిహీహీ యిటు రం డని మంత్రు లాఁగినన్. 479

శా. కల్పాంతాంబుదగర్జితంబు లెసఁగం గాలకేయాసురుల్
కల్పాగ్నిప్రథమానతేజములతోఁ గల్పక్షయాక్షయ్యసం
కల్పప్రోద్భవవిద్విషద్భయదవీక్షాకీలికీలచ్ఛటా
కల్పానల్పశరాళివృష్టి గురియం గంపించి రాస్సైనికుల్. 480

మ. తనసేనాధిపు లొందుదీనదశయుం దత్కాలకేయుల్ సహిం
చినబీరంబును జూచి పంక్తిముఖుఁ డాక్షేపించి రోషాగ్నిక
న్గొనల్ జ్వాలలు మించ నద్దనుజులం గ్రూరాస్త్రజాలంబులం
దునుమన్ సేనలు విచ్చి పోవఁ గని విద్యుజ్జిహ్వుఁ డత్యుగ్రుఁ డై. 481

ఉ. ఏఁ గలుగంగ మీఁకుఁ దగునే బెగ డొందఁగ నంచు సంగరో
ద్యోగనిరూఢి నందఱను నొక్కటఁ గొత్తలఁ జేసి యొండుది
క్కేఁగఁగ వారిలోఁ గలసి యేడ్తెఱ సూపఁగఁ బంక్తికంఠు బి
ట్టాఁగిరి నీలశైలము ఘనావలి యొక్కటఁ గప్పుచాడ్పునన్. 482

క. ఆసందడిజగడంబున, నాసురపతి మఱఁది యనుచు నరయక తనపై
డాసిన నీసునఁ గత్తిన్, వ్రేసె నడుము రెండు గాఁగ విద్యుజ్జిహ్వున్. 483

ఉ. ఉద్ధతి రావణుండు దనయోధలు మెచ్చఁ జతుశ్శతాసురుల్
బద్ధవిరోధులై కదియఁ బట్టిసముం గొని బెట్టు ద్రుంచినన్
యుద్ధధరాతలంబు చరణోదరబాహుగళాదియుక్తమై
బుద్ధికిఁ జూడ్కికిన్ వెఱఁగుఁ బూన్చెఁ గృతాంతునివంటయిల్లనన్. 484

క. శరనిధితరఁగల తెఱఁగున, గిఱికొని పఱతెంచు కాలకేయుల నెల్లం
గరచంద్రహాసధారా, స్ఫురణం బరిమార్చి యార్చె భుజబల మలరన్. 485

## రావణుఁడు వరుణపురిమీఁది కేఁగుట.

చ. తనవిజయంబుఁ జేర్కొని ముదంబున నెంచు ప్రహస్తముఖ్యులం
గని యిది యేటిమెప్పు గడఁకన్ జలధీశుని గెల్చినం గదా
ననుఁ గొనియాడఁ జెల్లు నని నవ్యవిమానవరాధిరూఢుఁ డై
చనియె విరోధిపట్టణముకై చక్కటి కుక్కుటగర్వసంపదన్. 486

మ. చని కైలాసనగాధిరాజతులితస్వచ్ఛప్రభాదీప్రమై
ఘనవప్రంబు వెలుంగఁ జూచి యిదియే కాఁబోలుఁ గాండాధినా
ధునిప్రోలంచుఁ దదీయగోపురమునందుం జేరి తద్రక్షకుల్
విన లంకాపురనాయకుం డనియెఁ బ్రావృట్కాలమేఘార్భటిన్. 487

ఉ. ఏ దశకంఠనామదనుజేంద్రుఁడ సంగరకాంక్ష వచ్చితిన్
మీదొరతోఁ గణింపుఁ డిది మీరలె మమ్మెదిరింప నోపినం

గా దన నేఁగుదెం డనుచు ♦ గ్రక్కున లోపలి కేఁగి యందు క్షీ
రోదధిఁ బోలువెల్లమొద ♦ వొక్కటి గన్పడఁ జూచి మ్రొక్కుచున్. 488

సీ. కల్పకసురరత్న ♦ కమలాసుధాకరా,దికులతోఁ బొడమిన ♦ దివ్యమూర్తి
వాఁకలి గొన్న దే ♦ వాళికిఁ దృప్తిగా, నమృతంబు గురియుసౌ ♦ హార్దవతివి
స్తనవిస్రవత్పయో ♦ ధారఁ బుట్టినయిల్లు, పాలవెల్లిగఁ జేయు ♦ భాగ్యవతివి
కోరినవారికిఁ ♦ గోర్కు లవ్వారిగా, దయ నిచ్చునసమాన ♦ దానవతివి

తే. ఇన్నిట జనించుకీర్తి పై ♦ గొన్నలీల, ధవళరుచి మించుమొదవుల ♦ తల్లి విట్టి
నిన్నుఁ గనుఁగొంటి శుభములు ♦ నేను గంటి

ఉ. ననుచు సురభికి వలగొని ♦ యసురవిభుఁడు. 489
అచ్చటిద్వారపాలకుల ♦ నందఱ మ్రందఁగఁ జేసి వీటిలోఁ
జొచ్చి రణేచ్ఛ రా వరుణ ♦ సూను లెఱింగ యభంగురక్రుధన్
వచ్చి విరోధిపై నికుల ♦ వాలికితూపుల ఖడ్గధారలన్
వ్రచ్చి రథాశ్వదంతిభట ♦ వర్గముతో వెసఁ బేర్చి యార్చినన్. 490

శా. ఆ ధూమ్రాక్ష మహోదర ప్రముఖదై ♦ త్యామాత్యు లత్యుగ్రబా
హాధిన్యస్తకృపాణముద్గరకుఠా ♦ రాద్యాయుధశ్రేణిఁ బా
థోధీశాత్మజదంతివాహభటులం ♦ దున్మాడి కాలాభ్రగ
ర్జాధిక్కారిఘనాట్టహాసముల ది ♦ క్చక్రంబు భేదించినన్. 491

రావణుండు వరుణసుతులతో సమరంబు సేసి గెల్చుట.

మ. ఉపలక్షించి పయోధినాథసుతు లో ♦ హో నిల్వుఁడం చానురా
ధపసేనానుల నిల్వరించి యసిపం ♦ క్తిన్ నొంచి తేరుల్ పయో
దపథం బంటి చరింపఁ జేసి బహుమా ♦ ర్తండప్రభల్ మీఱఁ దో
రపుఁగోపంబునఁ బంక్తికంఠునిశరీ ♦ రం బమ్ములన్ ముంచినన్. 492

శా. ఆశౌర్యంబు మహోదరుండు గని యీ ♦ ర్ష్యన్ మించి విస్ఫూర్తి కెం
తే శీఘ్రంబున నుద్గమించి పటుశ ♦ క్తిన్ స్ఫారసర్పోగ్రబా
హాశుంభత్పరిఘప్రహారపరుష ♦ వ్యాపారముల్ సూపె న
ప్పాశిపోద్భవసూతరథ్యరథముల్ ♦ భగ్నంబులై కూలఁగన్. 493

చ. అరదములున్ హయంబులు ని ♦ యంతలు గూలఁగ బీఱు వోవక
వ్వరుణసుతుల్ ప్రభావమున ♦ వాయుపథంబున నిల్చి భూనభో
తరములు మ్రోయఁ గార్ముక గు ♦ ణంబులు దీటుచు నమ్మహోదరున్
శరముల నొవ్వ నేసి వివ ♦ శత్వము నొందఁగఁ జేసి రీసునన్. 494

వ. మఱియును. 495

చ. అశనిసమూహముల్ గురియు ♦ నంబుదసంఘములో మహోష్ణక
ర్కశకరముల్ నిగుడ్చులయ ♦ కాలవిభాకరమూర్తులో యనన్

నిశితశరప్రకాండము లనేకము లొక్కట నించి నొంచి ర
ద్దశముఖు నాతఁడుం బ్రకటితభ్రుకుటీకుటిలేక్షణోగ్రుఁడై. 496

శా. జ్యాభూరిధ్వను లాకసంబుఁ బగిలింపం బాశహస్తప్రజల్
క్షోభించన్ శరశూలముద్గరగదాకుంతాదిశస్త్రోత్కరం
బాభీలోద్ధతిఁ బైపయిన్ నిగుడఁ జేయన్ మర్త్యముల్ గాడ నెం
తో భీతిల్లి పదాతులై ధరణి కావ్యోమాధ్వగుల్ డిగ్గినన్. 497

మ. అవలోకించి హసించుచున్ దశముఖుం డాహా ననున్ మించి పో
వ వశంబే సుతహీనుఁ జేసెద నిఁకన్ వారీశుఁ గల్పాంతవా
యువుబారిం బడినట్లు లైతిరి గదా యెుం డేల ప్రాణంబులా
స విసర్జింపుఁ డటంచు వారలపయిన్ సైన్యంబులం బంచినన్. 498

తే. ఆబలంబులు శస్త్రాస్త్రహతుల నొంప
బడలి వరుణునికొడుకులు పుడమిఁ బడిరి
యనుచరుల్ గొనిపోవ గేహములు సేరఁ
జూచి యార్చుచు రావణాసురుఁడు వలికె. 499

క. శరధులు గలిగియుఁ గాండస్ఫురణకు దొరవైనవానిపుత్త్రకు లయ్యుం
బరసేనలు వెనుచఱచుచుఁ బఱతేరఁగఁ బాఱిపోవఁ బాడియె మీకున్. 500

క. బలము చెడి నీళ్లకంటెను బలుచన యైతి రిఁక మిమ్ము బాధింపఁగ రా
దిలు సేరి తండ్రి నైనం గలనికిఁ బనుపుఁ డని బెట్టుగా నతఁ డనఁగన్. 501

క. ఆమాటలఁ బఱచుచు వరుణామాత్యుం డగుప్రభాసుఁ డాలించి పటు
స్థేమమున నిలిచి దనుజగ్రామణి విన నిట్టు లనియె ఘనవాక్ప్రౌఢిన్. 502

మ. అసురాధీశ్వర యీడ లేఁడు వరుణుం డబ్జాసనుం గొల్వఁ బో
యె సమానుం డగునేనియుం దొడరు నీ వీరేడులోకంబులం
దసమానుండవు నీప్రతాపమున కీయంభోధిరాట్పుత్త్రపౌ
త్త్రసుహృత్పుంగవు లోడి రాతఁ డిఁక వేఱా బుద్ధి నూహింపుమా. 503

క. వరుణసహస్రము వచ్చినఁ దరమే నిను గెల్వ ననిన దశముఖుఁ డుత్సా
హరసోన్నతి నార్చుచు నస్ఫురి వెలువడి చనియెఁ దూర్యములరొద లెసఁగన్.

క. అని కలశజుఁ డెఱిఁగించిన విని రామస్వామి యవల వింశతిబాహుం
డని గోరి యెచటి కరిగెనొ యనఘా నే వినఁగ వలతు నని యడుగుటయున్.

ఆశ్వాసాంతము.

చ. అనఘజనావనైకచతురా చతురాననచంద్రశేఖరా
ద్యనిమిషరాజమానసచరా సచరాచరవిశ్వలోకవ
ర్తనమహనీయరూపమధురా మధురాపురకామినీవిలో
చనకువలాబ్జదాస్యవనజా వనజాతవహాంబుదోపమా. 506

క. భద్రాహృదయేశ్వర బల, భద్రావరజాగ్రగణ్య భక్తశరణ్యా
భద్రార్తిహరణకరణ సు, భద్రాధిపభద్రకరణ పారీణమతీ. 507

సుగంధివృత్తము. పన్నగాధిరాజతల్ప పాదసేవనాపరా
పన్నగామరేంద్ర చంద్ర శారదాభకీర్తిసం
పన్న గాలవాదవంద్య మాన బాణధోరణీ
పన్నగాఢదేవశత్రు పార్శ్వహస్తమస్తకా. 508

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధానవద్యకవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణవితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధర ధరాధిపసభాంతరస్తవనీయనయకళాయుగంధర బంధురమనీషావిశేషమంథానవసుంధరాధర శోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాధికగుణరత్నాకర కంకంటివంశపయఃపారావారపరిపూర్ణసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞానవిభవవిజితసనందనవిష్ణుమాయావిలాసాభిధానయక్షగాననిర్మాణప్రవీణతానిధానపాపరాజప్రధానప్రణీతం బైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.





శ్రీ

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీమదుత్తరరామాయణము

## చతుర్థాశ్వాసము.



శ్రీరమణీరమణీయ
ద్వారవతీనగరహర్మ్యవాసివధూహృ
త్సారంగనివహమోహన
నీరదసంకాశ రుక్మిణీతరుణీశా. 1

### రావణుండు బలిచక్రవర్తిని జయించు నిచ్ఛచే సుతలంబున కరుగుట.

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
రఘుకులాధీశ యీరీతి రావణుఁడు జయంబు సేకొని వరుణాలయంబు వెడలి.

క. అతులనుతుల్ సలుపుచు దితిసుతులు గొలువ నవల నరిగి సురుచిరవిభవో
న్నతుల సురధానిఁ బోలిన సుతలము గని మెచ్చి చొచ్చి సొంపున నచటన్. 3

సీ. కలకంఠశుకశారికారవంబులచేత, వలనొప్పు నుద్యానవనములచేతఁ
బద్ధకైరవచారుపరిఖాంబువులచేత, భాసిల్లుకనకవప్రములచేత
మంజులోజ్జ్వలసాలభంజికావళిచేత, రాణించుమణిగోపురములచేత
గారుడోపలబద్ధతోరణంబులచేతఁ, గనుపట్టువిపణిమార్గములచేత

తే. నవ్యమౌక్తికమయవితానములచేత, ధవళమగుఁ దుంగసౌధయూథంబుచేత
భవ్యశశికాంతసోపానపంక్తిచేతఁ, బొలుపుమీఱెడు నొకదివ్యపురముఁ గాంచె.

తే. కాంచి యచ్చోటిబహుశిల్పకల్పనలకు, నద్భుతం బందినగరబాహ్యమున నిలిచి
దనుజవిభుఁ డీనివాస మెవ్వనిదొ వేగ, యరసి రమ్మని సేనాని నంపుటయును.

చ. అతఁడు మహాప్రసాద మని యత్తొలివాకిలి సొచ్చి యచ్చటన్
వెతకి మ ఱెవ్వరిం గనక వే ఱొకవాకిటి కేఁగి నిర్జన
స్థితి నదియుం గనంబడినఁ జెచ్చెర నవ్వలికొన్ని వాకిళుల్
జతనము మీఱ దాఁటి చని సప్తమసంఖ్య వహించువాకిటన్. 6

మ. అరుణుం బోలినకాంతితో నవపయోదానీలగాత్రంబుతో
నరవిందంబులఁ గేరునేత్రములతో నాజానులంబోన్నతో
ద్ధురబాహాద్వయితోఁ గటీతటలసద్దుగ్ధాంబరస్ఫూర్తితో
నరుదై చూడ్కికి నొక్కదివ్యపురుషుం డచ్చోటఁ గాన్పించినన్. 7

ఉ. ఆసురమంత్రి సేరఁ జని యంతటిలో నతఁ డట్టహాసముం
జేసిన గాసిఁ జెంది వెఱచేఁ బరువెత్తి దశాస్యు డాసినం
ద్రాసముఁ బొంది వచ్చినవిధం బిది యేమి ప్రహస్త యన్నచో
నాసురవైరిశేఖరున కక్కడిచోద్యము వాఁడు దెల్పినన్. 8
ఉ. ఔర విచిత్రమైనది మహాపురుషుం డతఁ డెవ్వఁ డొక్కొ క
న్నారఁగ నేను జూచెద నటంచు విమానము డిగ్గి నిల్వ క
వ్వీరుఁడు ద్వారషట్క మతివేగమునం గ్రమియించి సప్తమ
ద్వారము సేరఁ గాఁ జని ప్రధానుఁడు దెల్పినయట్ల యచ్చటన్. 9
సీ. కీలికీలారుణాభీలజిహ్వికవాని, దంష్ట్రికరాళవక్త్రంబువాని
బభ్రుబర్బరకేశపాశంబు గలవాని, సముదీర్ణశంఖకర్ణములవానిఁ
గుప్పగా నిప్పుకల్ గురియుకన్నులవానిఁ, జటులబింబారుణోష్ఠంబువాని
సంరక్తకర్కశశ్మశ్రుజాలమువాని, మసృణారుణోర్ధ్వరోమములవాని
తే. భూరిరోషాభిసూచకభ్రుకుటివాని
నున్నతోన్నతఘనబాహుయుగళివాని
నుక్కుగద యూనుకొని నిలుచున్నవాని
నొక్కపురుషునిఁ జూచె దైత్యోత్తముండు. [వెఱచి
తే. చూచి యాదివ్యపురుషుండు సూచు వేఁడి, చూపులకు జంకెలకుఁ జెంతనుడియ
వెఱఁగుపడి యట్టె నిలుచున్న వింశతిభుజుఁ, బలికె నమ్మేటిగంభీరభాషణముల.
చ. కదనము సేయ వచ్చి భయకంపితగాత్రుఁడవై వితాకుఁ జే
సెద విది యేమి రాత్రిచరశేఖర ధీరులు ధీరవృత్తిఁ ద
ప్పుదురె బలీంద్రునిం దొడరి పోరఁగ వచ్చితొ నన్ను మార్కొనం
గఁ దలఁచి వచ్చితో సమరకాంక్షితశూరునిఁ దెల్పు నావుడున్. 12
క. తలఁగినధైర్యము గ్రమ్మఱ, నిలుపుకొని దశాననుండు నిర్భయుఁ డగుచున్
బలిఁ దొడరఁగ వచ్చితి నని, పలికిన నప్పురుషవరుఁడు పకపక నగుచున్. 13
సీ. త్రైలోక్యవర్ణితౌదార్యశౌర్యాదితో, జ్జ్వలకీర్తి బలిదైత్యచక్రవర్తి
ఖలజనానీకనిగ్రహవిగ్రహాత్యుగ్ర, సమవర్తి బలిదైత్యచక్రవర్తి
యవలోకమాత్రనేత్రానందకరనిరం, జనమూర్తి బలిదైత్యచక్రవర్తి
జగదీశ్వరార్పణేచ్ఛాప్రకల్పితయజ్ఞ, శతపూర్తి బలిదైత్యచక్రవర్తి
తే. స్వవశచక్రపరిచ్ఛిన్నసకలశత్రు, చక్రవిస్ఫూర్తి బలిదైత్యచక్రవర్తి
యమ్మహాత్మునిఁ దొడర నీకలవి యగునె, యైనఁ బోవలతేనిఁ బొమ్మసురనాథ.
క. అని యవరోధము మానినఁ, జని యవరోధమున నసురచంద్రుం గనియెన్
వినయాదికగుణసాంద్రుం, బనితవిభోగామరేంద్రు బలిదైత్యేంద్రున్. 15
చ. కనుఁగొని యట్టహాస మెసఁగం జని బాహువు లప్పళించి ని

ల్చిన దశకంఠునిం గని బలిత్రిదశారి పులస్త్యవంశవ
ర్ధన యిటు రమ్ము రమ్మని కరమ్మునఁ జెంతకుఁ జేరఁ దీసి చ
య్యనఁ దొడమీఁద నుంచుకొని యాదరపూర్వము గాఁగ నిట్లనున్. 16

ఉ. సేమమె నీకు బంధులకు శ్రేయమె పుత్త్రులకున్ శుభంబె నీ
వేమిటి కిందు వచ్చితసురేశ్వర కోరినకార్య మంతయుం
బ్రేముడి నే నొనర్తు వినిపింపుము నాఁగఁ దదంకవర్తియై
యామనుజాశియుం బలికె నక్కడిమాట మఱుంగు వెట్టుచున్. 17

చ. హరి నినుఁ గట్టివేసె నని యందఱుఁ దెల్పఁగ నాలకించి నే
హరి నెదిరించి నొంచి భువనైకవదాన్య మహాన్యసైన్య ని
స్థిరమతి బంధముక్తునిఁగఁ జేసెద నంచుఁ దలంచి వచ్చితిన్
హరి యిపు డేడ నుండు నన నల్లన నవ్వి బలీంద్రుఁ డిట్లనున్. 18

బలిచక్రవర్తి రావణునకు విష్ణుప్రభావంబు సెప్పుట.

క. కడపటివాకిట నీ విప్పుడు గని మాటాడినట్టిపురుషుఁడె విష్ణుం
డుడుగక యొకచో నుండియు, నడఁగక యెల్లెడలఁ దోఁచు నతఁ డసురేంద్రా.

మ. మును నారాయణుఁ డేడ నుండు నని మాముత్తాత యాత్మీయపు
త్త్రుని వేధింపఁగ నాతఁ డెల్లయెడలందుం బూర్ణుఁడై యుండు నం
చన నాతీరున నుండి కోరినతదాస్థానగస్తంభసీ
మ నృసింహాకృతి నుద్భవించి విమతున్ మర్దింపఁడే రావణా. 20

మ. విను మవ్విష్ణునిచేతఁ గాదె శకుఁడున్ వృత్రుండు సంహ్లాదుఁడున్
దనువున్ శుంభ నిశుంభ శంఖ ముచుకుంద వ్యోమ ధూమామళా
ర్జున వైరోచన కాలనేమి కనకాక్షుల్ గూలుటల్ కాలకే
యనిశాటుల్ మధుకైటభాదికులు నుగ్గాటల్ సురారీశ్వరా. 21

క. మనవంటిదైత్యు లెందఱు, వనజాక్షునితోడ నిటులు వైరము గావిం
చినవా రవ్విభుచే నొచ్చినవా,రును బలియుఁ దొడరి చెడ మన కేలా. 22

తే. నన్నొకనిశౌరి బంధించినాఁ డటంచు, నెంచెదవు గాని తెలియ వెల్ల జనులఁ
జటులసంసారమోహపాశమునఁ గట్టి, ప్రాభవంబున వెలయుట పంక్తివదన. 23

సీ. చెలఁగి ప్రపంచంబు సృజియించు నొకవేళ, నొకవేళ సృజియింపకూరకుండు
విభుఁడు దానై ప్రోచు విశ్వంబు నొకవేళ, నొకవేళ సాక్షియై యూరకుండు
నామరూపములతో నటియించు నొకవేళ, నొకవేళ నవి మాని యూరకుండు
దుష్టరాక్షసశిక్ష దొరఁకొను నొకవేళ, నొకవేళ సమబుద్ధి నూరకుండు

తే. నెటులు తోఁచిన స్వేచ్ఛతో నటుల యుండు
నెఱిఁగి భజియించువారల నెఱిఁగి యుండు
నమ్మహాత్ముఁడు గట్టినయట్టికట్టు, లన్న విడిపింప నీకు నా కలవి యగునె. 24

చ. అని బలి దెల్పఁ బంక్తిముఖుఁ డౌర భయంకరమృత్యుయుక్తుఁడై
ఘనతరకాలదండమును గైకొని వచ్చుకృతాంతునంతవీ
రుని నొగిలించి వెండిమల రుద్రునితోఁ బెకలించి మించఁగా
జెనకఁ గలండె విష్ణుఁడు వచింపుఁ డతం డెటువంటివాఁ డనన్. 25

మ. బలిదైత్యేంద్రుఁడు గ్రమ్మఱం బలికె నోపౌలస్త్య వేదాంతవే
త్తలకుం గానఁబడం డనాదిలయుఁ డేతద్విశ్వసృష్టిస్థితి
ప్రళయాపాదకుఁ డవ్విభుం డతఁడె పో బ్రహ్మాదిరూపంబుల
న్వెలయుం దన్మహిమంబు లిట్టి వని వర్ణింపఁగ సమర్థుండనే. 26

సీ. యాగంబు యజ్వయు యాగైకఫలమున, యాగార్హమంత్రంబు లతఁడె సుమ్ము
దానంబు దాతయు దానసాధనములు, దానార్హకాలం బతండె సుమ్ము
యోగంబు యోగియు యోగోపదేష్టయు, యోగానందమహిమంబు లతఁడె సుమ్ము
ధ్యానంబు ధ్యాతయు ధ్యాననైశ్చల్యమును, ధ్యానార్హమూర్తియు నతఁడె సుమ్ము

తే. తన్ను వినఁ దన్నుఁ బేర్కొన్నఁ దను నెఱిఁగిన
వారియఘములు గడతేర్చి వాంఛితములు [యనిన.
గరుణ నొనగూర్చు బంధమోక్షముల కతఁడె, కర్త సుమ్మని బలిదైత్యభర్త

క. వైరోచనుమాటలు సెవిఁ, దూఱక యరుదెంచి మున్ను తోఁచినయులదా
వారికి నచ్చోఁ గానక, యారా హరి యోడి పోయె నని గర్వమునన్. 28

తే. అట్టహాసంబు సేయుచు నచట నిలక, పర్వతగుహాంతరము వెడఁ బాసి వచ్చు
కేసరివిధాన నవలివాకిళ్లు గడచి, పుష్పకం బెక్కి దైతేయపుంగవుండు. 29

మ. బలి నిర్జించితి విష్ణుఁడున్ వెఱచె మద్బాహాబలస్ఫూర్తికిన్
బలియుం గన్గొన మీస్థలంబున నిఁకం బద్మాప్తపద్మారుల
న్గెలువం బోవలె నేఁగుదెం డనుచు మంత్రిశ్రేణితోఁ బల్కుచుం
బలుమాఱుం దను వారు ప్రస్తుతు లొనర్పన్ సంతసం బొందుచున్. 30

వ. చని యుదగ్దిశాభిముఖుం డై యద్దశముఖుండు హిమవద్గంధమాదనకైలాసాది
పర్వతంబు లతిక్రమించి యవ్వల. 31

రావణుఁడు మేరుగిరిం జేరుట.

సీ. వీచోపుగుమి వీచువిధమున నునువెల్ల, జల్లుకమెకములు సఖులఁ దిరుగఁ
బావడలిడునట్లు పతుల చెమ్మటఁ బయ్యె,దల మాన్చుసతులు నెత్తముల మెలఁగ
దీపికావళి మించు తెఱఁగున జ్యోతిర్ల,తావితానము లుపత్యకల వెలుఁగఁ
జూపఁ జెంగట నిల్పు సొబగున హరులును,గరులును బాదాంతికములనోలయ

తే. భవ్యమందాకినీక్షౌమపటము గట్టి, గైరికద్యుతికుంకుమగంధ మలఁది
వేడ్కఁ గంధర్వగానముల్ వించుమించు,కాంచనావనిభృన్మౌళిఁ గాంచె నతఁడు.

తే. కాంచి రజతాద్రిఁ బెఱికిన కరణిఁ దన్నుఁ,బెఱుక వలదని గిరికాన్కఁ బెట్టెనీకుఁ

దటచరత్కుంభికరపతద్రత్నపాళిఁ
గొను మనుచు మంత్రి యనఁ దవ్వికొనుచు నచట. 33

శా. ఆనాఁ డెల్ల వసించి తద్గిరివినోదారామలీలావిలో
కానందామృతవార్ధిమగ్నుఁ డయి దైత్యస్వామి కల్యంబునన్
స్నానాదిక్రియ లాచరించి మణిచంచత్పుష్పకం బెక్కి ఛా
యానీరేజదళేక్షణాధిపజిగీషాయత్తుఁ డై యయ్యెడన్. 34

రావణుఁడు సూర్యజిగీషుం డై యరుగుట.

మ. అమరక్ష్మాధరతుంగశృంగగతదివ్యాధ్వంబునన్ వారివా
హమరుద్భూతనివాసముల్ గడచి సాధ్యస్థానగంధర్వలో
కములున్ సిద్ధపదంబు మున్నగునెడల్ గన్గొంచుఁ దల్లోకుల
న్సమరక్రీడకుఁ బిల్చుచున్ వెఱతు మన్నన్ వారి మన్నించుచున్. 35

మ. దనుజగ్రామణి భీతి లేక యిటు లుద్యద్వేగుఁ డై లక్షయో
జనముల్ వోయి ప్రభాకరార్చకులకున్ ఛాయాధినాథావలో
కనదీక్షాఢ్యుల కర్యమానతులకుం గాలోచితార్ఘ్యాంబువ
ర్జనసంసక్తులకున్ నివాస మగుభాస్వల్లోకముం గన్గొనెన్. 36

వ. కనుంగొని నిరవధికాలోకదురవలోకం బగునాలోకలోచనలోకంబు దఱియం
జొచ్చి యచ్చట. 37

సీ. అరుణచోదితఫణాధరబంధబంధుర,చ్ఛందోమయాశ్వహేషలు సెలంగఁ
గనకఖండోద్దండకరదండమాఠర,ప్రముఖసాహానినాదము లెసంగ
వాలఖిల్యాదికప్రతిముఖ్యపఠితఋ,గ్యజుషోక్తసౌరమంత్రార్భటి దగఁ
జామరగ్రాహిణీఛాయాసఖీమణీ,కరమణీకంకణక్వాణ మడర
తే. నేకచక్రరథారూఢుఁ డై కిరీట,హారకుండలకటకకేయూరముద్రి
కాదిభూషణఘృణులతో నమరునుగ్ర
భానుఁ గనుఁగొని పౌలస్త్యసూనుఁ డపుడు. 38

శా. ఆరక్తాంబరగంధమాల్యములతో నత్యుష్ణతేజంబుతో
హైరణ్యాంగముచెల్వుతో యుగపదూర్ధ్వాధోఖిలాశాస్ఫుర
ద్ఘోరస్ఫారసహస్రభానువులతోఁ దోఁచునబ్భానునిన్
ధీరత్వంబున నింత గైకొనక పంక్తిగ్రీవుఁ డుగ్రాకృతిన్. 39

మ. తనసేనాపతిమోముఁ గన్గొని ప్రహస్తా నీవు శీఘ్రంబె యీ
యనఁ జేరం జని పంక్తికంఠుఁ డని సేయన్ వచ్చెఁ బోరాడ ర
మ్మనుచుం బిల్వుము భీతిఁ జెందిన 'జితోహం నూన' మిత్యుక్తియై
నను వాక్రువ్వఁగఁ జేసి రమ్మనినయన్నాకారివాక్పద్ధతిన్. 40

చ. అతఁడును బేర్చి చండకిరణావళివేఁడిమి కోర్చి పద్మినీ

పతినికటంబు సేరునెడఁ | బార్శ్వగు లజ్జము సొచ్చి యేల వ
చ్చితి విట కన్న రావణుఁడు | సెప్పినవాక్యము లెల్లఁ జెప్పి మీ
పతి నిఁక మాపతిం దొడరఁ | బంపుఁడు నా విని వారు చెచ్చెరన్. 41

చ. తపనునిఁ జేరి మ్రొక్కి యవ|ధారు త్రయీమయ దివ్యమూర్తి శౌ
ర్యపరుఁడు రావణుండు సమ|రం బొనరింపఁగ వచ్చినాఁడు తో
రపుభుజశక్తి యొప్పసమ|రంబె యొనర్చెదరో యి దేల యం
చిపుడుఁ 'జితోఽస్మి' యంచు వచి|యించెదరో యిది యేమి నావుడున్. 42

ఉ. ఆహరిదశ్వుఁ డిట్లను ద|శాస్యునితో మన కేటిపోరు మం
దేహనిశాటులం దొడరి | నిత్యముఁ బోరెడిపోరు సాల దే
యూహలిఁ గేల యిప్పటికి | నోడితి మన్నను దప్పు గాదు పొం
డాహవకేళి నోడె రవి | యం చనుఁ డాయనతోడ నావుడున్. 43

తే. వారిలో దండుఁ డనువాఁడు | వచ్చి పంక్తి
కంఠుఁ గని యయ్య నిను డాసి | కయ్య మీయఁ
జాల కోడితి నన్నాఁడు | చండభానుఁ, డిచట నందఱ గెల్చితి | వేఁగుమనిన.

శా. ఆదైతేయకులేశ్వరుం డపుడు బా|హాస్ఫాలనధ్వాన మ
య్యాదిత్యానుచరాళిగుండియలు వ్ర|య్యం జేయఁ గాలాభ్రమో
నా దిక్కుల్ వగులంగ నార్చుచుఁ బ్రధా|నశ్రేణి యాత్మప్రతా
పాదుల్ పేర్కొని యొంచఁ బుష్పకవిమా|నారూఢుఁ డై యవ్వలన్. 45

క. తుహినాంశుని గెల్చెద నని, మిహిరోపరిలోకములు గ్ర|మించి రయమునన్
బహుయోజనములపొడ వగు,మిహిమలతుదఁ జేరి విశ్ర|మించినయంతన్. 46

క. అచటికి వీణామానిస,హచరుం డగుపర్వతాఖ్యుఁ | డరుదెంచిన రా
త్రిచరేంద్రుఁ డుపచరించి స,ముచితస్థితి మాట లాడు|చుండెడివేళన్. 47

{ తపస్సులోనగు పుణ్యకర్మములచే భోగంబు లనుభవించువారిని రావణుండు పర్వతువలన నెఱుంగుట. }

సీ. తిలకంబు దిద్దుము|ద్దులగుమ్మయద్దంపు,నిద్దంపుఁజెక్కుల | నీడఁ గనుచు
నలరుదండలఁ జుట్టు|చెలి లేనగవుఁ జూచి, యీవింతపూదండ | యేడఁ దనుచుఁ
గలపంబు పూయుతొ|య్యలిమేనికమ్మవా,సనలు పైఁ బొలయ మూ|ర్కొని యలరుచుఁ
గపురంపువిడెమిచ్చు | కలికిముచ్చట విన,వేడ్కయై మాటాడ | వేఁడుకొనుచు

తే. నింద్రభోగంబు పరిపూర్ణ|చంద్రకాంతి, వెలయ బంగారుఁదేరెక్కి | వేలసంఖ్య
లప్సరలుగొల్వఁ దనమ్రోల|నరుగునొక్క,దివ్యపురుషునిఁ జూచి దై|తేయవిభుఁడు.

తే. చూచి తను లెక్క సేయక | సొగసు మీఱి
పొలఁతులను గూడి పోవునీ|పురుషుఁ డెవ్వఁ

అమరమునిచంద్ర వివరింపు మనిన దనుజపట్టబద్ధున కనియె నప్పర్వతుండు.
సీ. ఒకనాఁడు జలపాన మొనరించి బహుకాల, ముపవసించినమేటితపసి యితఁడు
దళమొకించుక మెక్కి తలఁకక వెక్కండ్లు, జపము సేసినతపోశాలి యితఁడు
దిగువ రాలినపండ్లు దిని యనేకాబ్దముల్, ధ్యానంబు సేసినధన్యుఁ డితఁ
డనిలభక్షణ సేసి యమితవత్సరములు, గ్రసమాధిఁ బూనినఘనుఁ డితండు
తే. దనుజవర యీతఁ డమృతంబు ద్రావి కల్ప
వృక్షములనీడ నీవేల్పు వెలఁదివంది
యధరములు నొక్కికొనుచుఁ జిరాయువంది
వెలయఁ బోయెడు నితనిపై నలుగ వలదు. 50
మ. అని యమ్మౌని గణింపఁగా వినుచు నన్నంతన్ మణిస్యందనం
బునఁ జండాంశుసమప్రచండరుచి వేల్పుంగొమ్మలుం గొల్వఁగాఁ
జనువేఁ డొక్కనిఁ జూచి యెవ్వఁ డితఁ డోసన్మౌని నా సంగరో
ర్విని స్వామిప్రియకాంక్షఁ గూలినమహావీరుండు దైత్యాగ్రణీ. 51
వ. అని కొండపేరిపాఱుండు నుడివిన నూఁకొనుచు నయ్యసురమండలాఖండలుండు
వెండియు నిజాగ్రభాగంబున. 52
సీ. ఉభయభాగములయందుండి కొమ్మలువీచు, వెలిచామరములు వెన్నెలలుగాయఁ
బద్మరాగవిమానభాసమానద్యుతుల్, గపటసంధ్యారాగకాంతి నింప
వీణెలు వాయించువెలఁదులు గాంధర్వ, కలనఁ జెట్టుల నెల్లఁ గరఁగఁజేయ
హైమకుండలకిరీటాదిభూషణరుచుల్, నింగికి బంగారుసీరు వ్రాయఁ [రుషుఁ
తే. దనువుదాల్చినమరునిచందమున నంద, మొందియుడువీథిఁ జనుచున్నయొక్కపు
గాంచి వీఁ డెవ్వఁ డనఁ బాత్రకనకదాత, యితఁడనితపస్వి దెలుపదైత్యేశ్వరుండు.
క. ఆఋషిఁ గని యతిశేఖర, వీరలలో నెవ్వరైన వినువక నాతోఁ
బోరాడఁగఁ గలవారు గ,లారె తెలుపు మనఁగ నతఁడు లలితోక్తి ననున్. 54
ఉ. ఆయతధర్మకర్మజనితాంచితసౌఖ్యరసానుభూతికై
పోయెడువారు వీ రసురపుంగవ వీరల డాసి కయ్యముల్
సేయఁగ రాదు వీరు నని సేయఁగ రారు కృతార్థు లౌట నీ
కీయెడఁ బోరఁగా వలసెనేని గణించెద నొక్కశూరునిన్. 55
మ. అతఁ డెవ్వా డని యంటివే విను మయోధ్యాపత్తనాధ్యాసియై
చతురంభోధిపరీతభూభరణదీక్షాదక్షబాహాబలో
న్నతి మించున్ యువనాశ్వనందనుఁడు మాంధాతృక్షితీశుండు నీ
ప్రతి యావీరుఁడు నిక్క మిప్పటినరేంద్రశ్రేణిలో రావణా. 56
క. నా విని రావణుఁ డౌ నౌ, నీ వెఱిఁగించినటు లందఱెంచెద రతనిన్
దేవర్షీశ్వర యపుడ,బ్భూవరుఁ డెం దుండు నిపుడ పోయెద ననినన్. 57

దశగ్రీవుండు మాంధాతతోఁ బోరి సంధి సేయుట.

మ. అజభూమిత్రుఁడు వల్కె నీవు నన నేలా రాక్షసాధీశ ది
గ్విజయారంభముఁ బూని నేఁ డిదె యుదగ్రోద్దేశంబుమీఁదన్ బహు
ధ్వజినీసంగతి నేఁగుదెంచు క్షణమాత్రం బోర్చినం దద్ధరా
భుజుతో నీకు రణంబు గల్గు నన నుత్సాహంగెన్ దశగ్రీవుఁడున్. 58

ఉ. అంతటఁ గొంతసేపటికి నచ్చటికిన్ విన వచ్చె ధారుణీ
కాంతురథాంతరస్ఫురితకాంచననిర్మితఘంటికాధ్వనుల్
స్వాంతమరుజ్జవప్రథితసైంధవమేదురకింకిణీధ్వనుల్
దంతిఘటాపరిప్రకటితధ్వజచిత్రపటీపటుధ్వనుల్. 59

క. ఆరవములు విని దశముఖుఁ, డీరసమున నట్టె లేచి యిసె చనుదెంచెన్
ధీరుం డగుయువనాశ్వకు,మారుం డని వడి నెదిర్చె మంత్రులతోడన్. 60

చ. ఎదురుగఁ బోయి పంక్తిముఖుఁ డింపును సొంపును దెంపుఁ బెంపుఁ జ
క్కఁదనము రాజసంబు భుజగర్వముఁ గల్గినయాన్నృపాలునిం
గదిసి నరేంద్ర నేను దశకంఠుఁడ సంగరకాంక్ష వచ్చితిన్
బెదరక నన్ను మార్కొనుము భీతుఁడ వైనఁ దొలంగు నావుడున్. 61

సీ. నిడుదకన్నులక్రేవ నడరుకెంజిగి కర్ణ,సాంకవమదముతో సంధి సేయఁ
గనుబొమల్ ముడి నొందుకంబె ముందుగఁ గరం,బున నున్నచాపంబుకొన
య మెనయఁ
బెనుగాడ్పు సోఁకఁ గంపించుకెంజిగురు నా, బెట్టుహుంక్రియలానిపెదవి యదర
రమణీయరత్నహారచ్ఛలంబున మనసి, ప్రకటరోషజ్వాల బయలుపడఁగఁ
తే. జులుకుచులుకునదశకంఠుఁ జూచి యార, యోరిపౌలస్త్య నాతోడనారణంబు
సేయ వచ్చితి మంచిదేమాయె నెదుటఁ, జక్కనై నిల్వరా యంచుజనవిభుండు.

క. పిడుగులకుఁ దోడువుట్టయిన, కడిఁదిశరము లసురఱొమ్ము గాఁడఁగ నేయన్
జడియక యాయుఱుములకా, పడె నిపు డీచినుకు లనుచుఁ బంక్తిముఖుండున్.

మ. పదికోదండము లొక్కసారి గొని దర్పం బొప్ప మాంధాతపైఁ
బ్రదరాసారము నింపఁ దద్విశిఖవర్షంబున్ నివారించి తన్
గదియన్ వచ్చునిశాటమంత్రిమణులం గారించి భూభర్త బె
ట్టిదపుఁదూపుల నొంప నంతకునిమాడ్కిన్ రావణుం డుగ్రుఁడై. 64

మ. తనబల్లోదుల నెల్ల నొక్కట నయోధ్యానాథు రోధింపఁ బం
చిన వా రందఱుఁ జుట్టు ముట్టుకొని యాక్షేపించి కోపించి మిం
చి నిశాతాస్త్రపరంపరల్ గురిసినన్ సింగంబు మాతంగభం
జనముం జేయఁ గడంగినట్లు నృపుఁ డుత్సాహంబు రెట్టింపఁగన్. 65

సీ. శుకునిఁ బంట్రెండు సాయకముల నొప్పించి, సారణు నేడింట జడియ నేసి

ధూమ్రాక్షు నెనిమిది దూపుల నొగిలించి, మారీచునిఁ బదింట మద మడచి
జంబుమాలిని మూఁడుశరముల బడలించి, యూపాక్షు నాల్గింట నుదుటు మాన్చి
త్రిశిరునిఁ బదియేను తీవాస్త్రముల నొంచి, దుర్ముఖు నైదింటఁ దూల నేసి
తే. వెండియుఁ బ్రహస్తముఖుల నుద్దండచండ
కాండముల భండనము సేయకుండఁ దఱిమి
తరమె నను గెల్వ నీకని దశముఖాసు, రాగ్రగణ్యుని మాంధాత యపుడు వాదవి.
ఉ. క్రౌంచవిభేదశాలి యగుస్కందుని చందముఁ జెంది ముందె న
క్తంచరరాజు పేరురము గాఁడఁగ ముద్గర మెత్తి వ్రేసి నొ
ప్పించిన సొమ్మసిల్లి ధృతి పెంపునఁ దెప్పిఱి వాఁడు రాజ ని
న్నంచెద నేఁడు దండికడకం చతిరోషకషాయితాక్షుఁడై. 67
ఉ. అక్కనకాద్రి బిట్టదర నంటి యదల్చి యెదిర్చి యవ్విభుం
డెక్కిన తేరు సెక్కులుగఁ జేసి హయంబులఁ ద్రుంచి సారథిం
దక్కక నొంచి కేతనము ధారుణిఁ గూల్చిన నాగ్రహించి వే
ఱొక్కరథంబుపై రవికులోత్తముఁ డెక్కి లయాంతకాకృతిన్. 68
చ. పటుతరఘంటికాక్వణనబంధుర మామహనీయశక్తి యొ
క్కటి గొని పంక్తికంఠ తుదఁ గంటివి ఘమ్మని వేసి యార్చినం
దటుకున గేలిశూలమున దాని నడంచి దశాననుండు భ్రూ
కుటు లెసఁగన్ నృపాలుపయిఁ గుంతము లిర్వది పూన్చి వైచినన్. 69
మ. అవి ఖండించి యఖండకాండములు చండాంశుప్రభోచ్చండముల్
యువనాశ్వప్రియసూతి యేయ దనుజవ్యూహంబు భేదిల్లె నం
త వివస్వత్సుతదత్తదివ్యశర మాదైత్యేశ్వరుం డేసినన్
వివశుం డయ్యె నరేశ్వరుండు దివిజుల్ విభ్రాంతిఁ జింతింపఁగన్. 70
వ. తదనంతరంబున. 71

చ. నిమిషములోపలం దెలిసి నీరజబంధుకులాగ్రగణ్యుఁ డ
య్యమరవిరోధిమీఁద జలదాశుగ మేసిన వాఁడు మారుతా
స్త్రమున నడంచె భూపతి కృశానుశరం బరిఁ బోసి వైచిన
న్విమతుఁడు రౌద్రబాణమున నిల్పెఁ దదీయశిఖాపరంపరల్. 72
శా. మాంధాతృక్షితినాథుఁడుం గెరలి భీమస్ఫూర్తి బ్రహ్మాస్త్రమున్
సంధించెం దనవింట రాక్షసభటుల్ సంత్రాసముం జెందగ
ర్వాంధుం డద్దివిజారి పాశుపత మేయం బూనె నయ్యుద్ధతిం
గంధిశ్రేణి గలంగెఁ గ్రుంగె ధర యాకంపించె స్వర్ణాద్రియున్. 73
శా. ఆయుత్పాత మెఱింగి యాడకుఁ బులస్త్యబ్రహ్మ వేంచేసి యె
లా యీయుద్ధము దీన లోకముల కెల్లన్ భీతి వాటిల్లె మీ

గడల నాల్గుసముద్రముల్ గ్రమ్మినటులు
చెలఁగి పటువాద్యముల్ మ్రోయఁ జేయుటయును. 267

వ. అప్పుడు. 268

మాలిని. మురజపటహఢక్కాముఖ్యవాద్యస్వనంబుల్
పరదితిసుతసేనాపాళిఁ బల్లాఱు మించెన్
సురలు చెవుల సోఁకన్ స్రుక్కి భీతిల్లి రాస్వః
పురినలుదిశలందుం బుట్టె నుత్పాతకోటుల్. 269

సీ. నిండినగేహముల్ నిండినట్టులె యుంచి, బలువిమానము లెక్కి పఱచువారు
దగు సువస్తువులతోఁ దమవారిఁ గొని భీతి, నెగిరి మహర్లోక మెక్కువారు
నొకరితో నొకరు దెల్పక యథాయథ లయి, యేడకేడకుఁ బరువెత్తువారు
నెందుఁ బోఁ గాల్లాడ కిండ్లలో మూలమూ,లలఁ జొచ్చి వడఁకుతో నలయువారు
తే. నెచటఁ జొచ్చినఁ బోనిత్తురే నిశాటు, లిదిగో లగ్గలువట్టి రింకేటిస్వర్గ[వారు.
మనుచు స్వర్లోకమున సారెకఱచువారు, నగుచు నడలొందిరమరాలయంబు

సీ. రణశూరులకు నప్సరఃస్త్రీలతోఁ గూడి, వీథి సరాళంబు వెడలఁ బాసె
సోమయాజులకు రంభామేనకలఁ గూడి, శృంగారవనము వీక్షింపఁ బాసెఁ
బరమధార్మికులకుఁ బసిఁడి మేడలనుండి, వెలఁదులగానముల్ వినఁగఁ బాసె
సకలదివ్యాపపాదకులకు సఖులతో, నలదేవనది నీఁదులాడఁ బాసె
తే. నున్న సురలకు నిండ్లలోనుండియైన, సొరిది నటునిక్కితలలెత్తిచూడఁబాసె
నలబలంబులతోఁ గూడియలబలంబు, లమరపురిఁ జుట్టుకొనునట్టియవసరమున.

చ. తలఁకునఁ గోటనల్గడలతల్పులు వేల్పులు మూసి డాసి కో
త్తళములపై నలంగములఁ దార్కొని పూర్కొని విక్రమింపఁగాఁ
గల రణశూరులైన యధికారుల వీరుల హెచ్చరించి పై
బలములరాకఁ దెల్ప సురపాలకుపాలికిఁ బోయి యయ్యెడన్. 272

సీ. శచిముద్దుమోముఁ జూచుచు నాగకన్యాన,వీనగానము వినువింతహాయులు
వేల్పులమనవులు వినుచు నచ్చరమచ్చె,కంటులనటనంబు గాంచుమురువు
ధనదాదిహితమంత్రిజనులతోఁ బల్కుచు,
మునులవాదులకు నవ్వెనయుహారువు [హెచ్చరికయుఁ
మ్రొక్కువారలకుఁ గేల్మోడ్చుచు గురుఁ డాన,తిచ్చు యుక్తు లెఱుంగు
తే. దనకుఁ జెల్లునసంగ సంతస మెసంగ, వైజయంతంబుపైఁ గొలువై జయంత
ముఖులు బర్హిర్ముఖులు చంద్రముఖులు గొల్వ
నిండుకొలువున్న దేవతానేతఁ గనిరి. 273

మ. కని జోహారిడఁ గోటనల్గవనులం గాపున్నవారేఁగుదెం
చినవారిం దవధారు దేవ యనుచుం జేమోడ్పుతోఁ గంచుకుల్

వినిపింపం దొలునాఁడె వేగరులచే విన్నట్టివృత్తాంతము
న్దనలోఁ దోఁచి బలారి మీఁద లిటకు న్నాఁ గార్య మేమో యనన్. 274

ఉ. వారు వినీతులై యనిరి స్వామి దశాస్యుఁడు కుంభకర్ణ దే
వారియు మేఘనాదుఁడు ప్రహస్తమఘప్రముఖుల్ మహాచమూ
వారము గొల్వ వచ్చి యిదె స్వర్గమునల్గడ లావరించి యు
న్నా రని విన్నవింప సురనాథుఁడు రోషకషాయితాక్షుఁడై. 275

శా. ఔరా రావణుఁ డబ్జగర్భవరగర్వాయత్తుఁడై నాపురిం
గారింపం జనుదెంచెనే తనభుజాగర్వంబు నాచెంతనా
వారిన్ వీరిఁ దలంచినట్టులె నను న్వాఁ డెంచెఁ గాఁబోలుఁగా
నీ రక్షోజలవార్ధి నస్త్రబడబాగ్నిన్ నేఁడె యింకించెదన్. 276

వ. అని పలికి కొలువు గలయం గనుంగొని. 277

సీ. కోటవాకిళ్లు బల్కొత్తళంబు లలంగ,ములు నేమఱక కాచి మోహరింప
దారుశిలాయంత్రతతి కొమ్మకొమ్మలఁ, దోరంబుగా నించి దురుసు సేయఁ
దలబొమిడికము కత్తళము కేడెము కత్తి, యాదిగాఁ గలవి ముస్తీదొనర్ప
నరదముల్ ద్విరదంబు లశ్వముల్ మొదలైన,సకలవాహనములసంఘటింపఁ
తే. దగినవారి నియోగించి తన సమీప,మున వసించు పులోమజాముఖ్యసతుల.
మఱియుఁ జనువారిఁ బ్రచ్ఛన్నమార్గమునను
స్వర్ణగిరిశృంగమున కంపి శతమఖుండు. 278

ఉ. కామగవీసుధాకలశకల్పకదివ్యమణీవిభూషణ
స్తోమము మాటుచేసి తనతోడిదె లోకముగాఁ జరించు సి
ద్ధామరసాధ్యరుద్రతుషితానిలభాస్వరముఖ్యదేవతా
గ్రామణులన్ రణోత్సుకులుగా సెల విచ్చి యొకంతఁ జెచ్చెరన్. 279

కమలవిలసితవృత్తము.

వనజనయనుఁ గరివరదుని జేరం, జని ముకుళితకరజలజయుగుండై
తనువునఁ బులకలు తఱచుగ మించన్,వినయముననుసురవిభుఁడిటు లెంచెన్.

కవిరాజవిరాజితము. జలజదళేక్షణ శాత్రవశిక్షణ శౌర్యవిచక్షణ చక్రధరా
కలితరవిగ్రహ కాంతిసువిగ్రహ కల్మషనిగ్రహ కంబుకరా
విలసితకేతన విశ్వనికేతన విస్మితచేతనవేషయుతా
సలిలభవాసనసమ్యగుపాసన శార్ఙ్గశరాసన సాధునుతా. 281

మ. అవధారయ్య దశాననుండు సబలుండై నేఁడు నాపట్టణం
బవరోధించినవాఁడు తమ్ముఁడును దోడై నాఁడు తత్పుత్త్రకుం
డు వృషాంకప్రియహోమనిష్ఠల బలిష్ఠుండై విజృంభించినాఁ
డు విశేషించి మఘుండు బంధుఁ డయి వాఁడుం గూడినాఁ డియ్యెడన్. 282

ఉ. ఇందుల కేమి బుద్ధి గణియించెదొ వైరుల నెట్లడంచెదో
ముందును వెన్క దోఁచక యమోఘదయానిధి వంచుఁ జేరితిన్
ముందు బలాదిశత్రుజయమున్ భవదుక్తిన కాదె కల్గెనో
వింద ముకుంద నీవె కదవే గతి వేగతులం దలంచినన్. 283

ఉ. ఆరయ సర్వభూతముల కాప్తుఁడ వయ్యును మమ్ముఁ గూర్చి దై
త్యారిసమాఖ్యఁ గాంచితి తదాఖ్య యథార్థము సేయు మోదయా
నీరధి పాల ముంచినను నీళ్లను ముంచిన నీదె పెంపు నీ
వారము నీదుచిత్త మనువాసపుఁ జూచి జనార్దనుం డనున్. 284

చ. అమరవరేణ్య యిట్టిసమయంబున రావణకుంభకర్ణులన్
సమరములోపలన్ గెలువ శక్యము గాదు తదీయనందనుం
డమితపరాక్రమక్రమసమగ్రుఁ డజయ్యుఁడు మీఁదఁ గొంతకా
లమునకు మానుషాకృతిఁ జెలంగి వధించెద వారి నందఱన్. 285

చ. హరి యరుదెంచి యూరక దశాస్యునిఁ దాఁకి వధింపలేక క్రి
మ్మరె ననునట్టిలాఘవముమాత్రమె నే నిపు డేఁగుదెంచినన్
హరిహయ నీవె పోయి పలలాదుల మార్కొని తోఁచినట్టులన్
దుర మొనరింపు మిప్పటికిఁ దోడ్పడి మీఁద శుభం బొసంగెదన్. 286

శా. దేవత్వంబున నుండియే యరిని మర్దింపంగ లేనంటివే
నీ వేలాగు నరత్వ మొంది పగవానిన్ గెల్చెదం టేని రా
జీవప్రోద్భవుమాట నిల్పుటకుఁ గాఁ జేకొంటి శాంతం బికన్
భావిప్రాంచితరామరూపమున నిన్ బౌలస్త్యుఁ బో నిత్తునే. 287

దేవదానవులయుద్ధము.

మ. అని వీడ్కొల్పిన వజ్రి వచ్చి రణవాంఛాకల్పులన్ వేల్పులం
గని హర్షించి జయానకార్భటుల ఢక్కాశంఖఘోషంబులన్
దనుజస్తోమముగుండె దిగ్గు మన రత్నప్రస్ఫురచ్చక్రశం
ఖనిజాశ్వధ్వజఘంటికాఘణఘణోగ్రస్యందనారూఢుఁడై. 288

సీ. ద్వాదశద్వాదశాత్మలతోడ వడిఁ బదు,ముగ్గురు విశ్వులు ముందు నడువ
సురులీల ముప్పదార్గురు తుషితులతోడ, నెనమండ్రువసువులు నెనసి కొలువ
మెఱయునర్వదినలుగురుభాస్వరులతోడ, నలువదితొమ్మండ్రనిలులు గొలువ
రూఢి నేకాదశరుద్రులతోఁ బదు,నిద్దఱు, సాధ్యు లుద్వృత్తి నడువ
తే. గరుడగంధర్వచారణఖచరసిద్ధ,యక్షకిన్నరకింపురుషాహిగుహ్య
కాదితేయమహారాజికాదిదేవ,సమితి నలుగడఁ గొలువ వాసవుఁడు వెడలె.

చ. వెలువడి యెప్పు డెప్పు డరివీరులఁ దాఁకుద మంచు విచ్చుక
త్తులబెడఁగుండలత్తళలతోఁ దనముందట వచ్చు దేవవీ

రులకును జేయి వీచుటయు రోసముతోఁ జని దైత్యవీరులం
దలపడి రాసురాసురులు దాఁకొని రుగ్రతరాగ్రహంబునన్. 290

వ. అప్పుడు గొప్పచప్పు డుప్పతిల్ల బాహువు లప్పళించుచు ధరారేణువు లుప్పరంబునం బొరయఁ గుప్పించుచుఁ దమచేతిహేతుల నరాతుల నొప్పించుచుం దమదొరల మెప్పించువేల్పులును రోషారుణితలోచనముల నిప్పు లురులఁ బరుల నిలు నిలుండని యెలుంగెత్తి పిలిచి నిలిచి యెదిరించియు ధిక్కరించియు ఖడ్గాఖడ్గిం దలపడి యడిదంబులు పొడిపొడియై పుడమిం బడినఁ జిడిముడిపడి వడి నడరుపడి మగుడం గచాకచిం బెనంగురక్కసులు ననుంగుఁజెలికాండ్రకు సహాయులై యీరసంబునం దారసంబైన పోరునం బేరువాఁడి మెఱసి మున్ను తమవారల నొప్పించిన పరవీరులం గడచి పోనీక డయ్యం జేసి కయ్యంపుటుఱుపడి గనంబడఁజేయు దేవతలును బంతంబు మెఱసి కుంతంబునఁ బడఁ గ్రుమ్మిన నెమ్మనినొప్పిఁ దప్పు లెంచక కరాంచితపట్టిసంబులఁ బత్త్రిపక్షహస్తప్రసారితకుంతంబు లానుకొని యట్టె నట్టనడిమికిం దెగఁ గొట్టి కట్టలుకబిట్టెగసి జగజట్టితనంబున నెదుటివారి యెదుటు మాన్చు దానవులును గఱకఱిఁ బెరయ మెఱయు సురియ లురంబునఁ గ్రుచ్చి వీఁపున నుచ్చిపాఱునంతలో మరలమరలం దివియువారలలా వెఱింగి యాడు గఱచి సురియతోడికరంబు కరంబు చలంబుతో బిగఁబట్టి వలకేలికరవాలంబునం దలలు కఱుక్కునం దెగనఱకు సురవీరులును బెడిదంపుఁగటారులం బొడిచినఁ గడుపులనుండి బొసబోస వెడలు ప్రేవులపోగు లదిమి దిట్టతనంబుతో నడుమఁ జుట్టినట్టి దట్టిచెఱంగుల నడంచి కట్టుకొని తము నొంచినవారిం బట్టికొని యట్టిబెట్టిదంబులే యాచరించు నిశాచరులును నిష్ఠురగదాఘాతంబులం దల లువగిలి నొగిలి బుడబుడ నెత్తురు గ్రక్కుచుండియుం బెండువడక కడింది రిపుల వక్షస్స్థలంబులు శూలంబులం గ్రుచ్చి పడఁ ద్రోచి యెత్తెఱం జూపు వినువీటి పోటుబంట్లును గఠోరకుఠారధారల భుజశాఖలు నఱికివైచినం గఱకు చెడక యరులం జులుకుచులుక్కునం గనుంగొనుచు మొఱకుతనంబున మీఁది కుఱికి బెట్టుగాఁ బదఘట్టనంబులు పఱఁగించు రట్టడిదనుజులు నెదురుగ నుండి చూచు తమయేలికలతో మార్తుర నిదె యిందఱ ద్రుందించి వచ్చెద మని నొడివిన వడువునం గడిమి మెఱసి ప్రతిజ్ఞ లీడేర్చుకొని సొంపు లొందు నిలింపులును బెడబొబ్బ లిడుచు నెదురుగా నడుచు పెక్కుమంది పగతుఱపై రోషంబునఁ దాఁకొని తోమరముద్గరభిండివాలశూలక్షురికాదివివిధాయుధంబులసాధనంపు మెరవ ళ్లెఱింగించు నక్తంచరులును నడికలన నింటివారిం దలంచుకొని కేడించి వచ్చి యచ్చటచ్చట మచ్చరంబుల నెదిరి బలంబు సొచ్చి వ్రచ్చి నొచ్చువారిం జచ్చువారిం జూచి నిజకులస్థానపౌరుషంబులుఁ దలంచుకొని ముంచుకొనుసభి

మానంబుతోఁ గ్రమ్మఱం దోడరవచ్చువియచ్చరులును జనకాగ్రజానుజతనూ
జాదిబాంధవులును మ్రందినం బోలిన్రాని బంటుతనంబునం గంటకులపై నురు
వడించి యొంటిపాటునం దమయింటిప్రతిష్ఠలు నిలుపుకొను తొలివేల్పులును
నూఱాఱుగాయంబులం బడియుఁ గాయంబులనొప్పిఁ దలఁపక యేలినవాని
కార్యంబునకుఁ బాటుపడు నమర్త్యభటకోటులుం గలిగి యుభయబలంబుల
వీరభటు లారభటులతో నుబ్బి గబ్బి బెబ్బులులవలె నుదుటుగల బొబ్బమెకం
బులవలె నుఱుమని పిడుగులవలె నుడుగని కార్చిచ్చులవలె నుడివోని కాల
సర్పంబులవలె నురవడింపని మదహస్తులవలె నోలమాసగొనక యొక్కచందం
బునం బోరుచుండి రట్టియెడ. 291

క. పడుతలలు తఱుచు నఱకుడు,వడుచేతులు జడిసి బెండువడుగుండెలు చే
ప్పడుమేనులుఁగడు త్రొక్కుడు,పడునడుగులుఁబంక్తిముఖునిభటులకుఁ గలిగెన్.

సీ. అపుడు రావణుఁ డంపయజ్ఞకోపసుపార్శ్వ,ధూమ్రాక్షయూపాక్షధూమకేతు
జంబుమాలిసుమాలిశతమాయసుధిరాక్ష, ఖరమహోదరమహాకాయదూష
ణత్రిశిరోనరాంతక సురాంతక మహాపార్శ్వ మారీచ సుప్తఘ్నసూర్య
శత్రువృశ్చికరోమసర్పరోమాభేద్య, కవచ విరూపాక్ష కాలనేమి
తే. దుర్ముఖశుకాదివీరదైత్యులు ప్రహస్తసహితులై తీవ్రహస్తప్రశస్తశస్త్ర
ధాళధళ్యంబు లఖిలదిక్తటుల మెఱయ
నామరచమూజిగీషులై యడహటయును. 293

చ. అసురుల మార్కొనన్ మఘవుఁ డంపినసిద్ధులు సాధ్యులశ్వులున్
వసువులు భాస్వరుల్ దుషితవర్యులు రుద్రులు విశ్వులుగ్రసా
హసమున నొక్కటై యలప్రహస్తుఁడు మున్నగుసైన్యనాథులన్
మసలక తాఁకి రద్రులను మార్కొనునభ్రలపోల్కి నయ్యెడన్. 294

చ. అఱచుచు హుంకరించుచు నహంకృతిఁ జూపుచు నస్త్రధారలన్
సుడివడఁ జేయుచుం దెగడుచున్ బెగడించుచు నిల్వరించుచుం
గడఁగుచు నోసరించుచు ముఖాముఖి నిల్చుచు బిట్టదల్చుచున్
జడియక పోరి రయ్యుభయసైన్యములం గల యోధు లుద్ధతిన్. 295

చ. హరులు మదేభయూథముల నాఁగనకైనడి దేవవీరుల
య్యరుల నెదిర్చి శస్త్రముల నస్త్రములన్ నిగిడింప రక్తని
ర్ఝరములతోడిజంగమధరాధరపంక్తులఁ బోలి వారలం
దఱు వెనుతియ్యఁ గాంచి యెలనవ్వు వహించి సుమాలి యాసునన్. 296

చ. నిలఁగదరోయి దేవరథినీవరులార యటంచు నుజ్జ్వల
జ్జ్వలనరుచిప్రకాశ మగుస్యందన మెక్కి గుణంబు మీటుచున్
బలరిపుసైన్యపాలకులపైఁ బ్రళయాశనితుల్యసాయకం

బులు నిగిడించి యార్చి పొలి వ్రానిపరాక్రమవైభవంబునన్. 729
చ. వసువుల బిట్టదల్చి పితృవర్గములన్ బెగడించి విశ్వులన్
వసమఱఁ జేసి సాధ్యులజవం బడఁగించి శరాళి రుద్రులన్
దొసఁగులఁ బెట్టి చారణులదోహలముల్ సడలించి యమ్మరు
ద్వసరము నొంచి భాస్వరులధీరము మాన్చి పరాక్రమించినన్. 298
ఆ. ఈసుమాలి సురలనిటులు చిక్కులఁ బెట్టె, నీసు మాలి చూడనేల యనుచు
వసువు డాయుపేదవలెను సావిత్రాఖ్య,వసువు విక్రమించి వానిఁ దాఁకి. 299
శా. నీవీరత్వము గానిపించితివి మేల్ నేఁ డింక నాశౌర్యమున్
నీవున్ గన్గొన వల్వదే యనుచు నిర్ణిద్రాస్త్రధారాహతిన్
సావిత్రుండు సుమాలి నొంచుటయు రోషభ్రూకుటీభ్రాజితుం
డై వాఁ డేసినబాణముల్ నడికి పూర్వాదిత్యుఁ డత్యుగ్రతన్. 300
శా. ఆకాశం బవియించునార్పు లెసఁగన్ జ్యావల్లి మ్రోయించుచున్
బాకారిప్రముఖామరుల్ బెగడ శుంభద్వజ్రశాతాశుగా
నీకం బవ్వసుగాత్రపంజరమునన్ నించెన్ సటోత్పాటన
వ్యాకీర్ణక్రుధ మైనకేసరివలెన్ వాఁ డల్గి దేవారిపైన్. 301
మ. పదినారాచము లేసి మైమఱువు నిర్భగ్నంబు గావించి యి
ర్వదిబాణంబుల ఱొమ్మగల్చి కరరాజచ్ఛరాసంబు ము
ప్పదివాల్దూపులఁ ద్రుంచి సారథిశిరఃపాతంబు రథ్యధ్వజ
చ్ఛిదనున్ నల్వదిసాయకంబుల నొనర్చెన్ వేల్పు లుప్పొంగఁగన్. 302
వ. ఇవ్విధంబున. 303
మ. విరథుం డైన సుమాలిపై నడరి సావిత్రుండు వృత్రారి భూ
ధరశృంగంబు శతారపాతమున విధ్వస్తంబు గావించువై
ఖరి నుద్దండభుజాగ్రమండితగదాఘాతంబునన్ వానిబల్
శిరమున్ గాత్రము నుగ్గుఁ జేసె దివిజశ్రేణుల్ ప్రహర్షింపఁగన్. 304
ఆ. అతనిపాటుఁ జూచి యశ్రుధారాపూరి, తాక్షు లగుచు నెల్లరాక్షసులును
దలలు వీడ నాయుధంబులఁ బడవైచి, రణము విడిచి చనిరి రఘువరేణ్య.
చ. ముదిపొలదిండిచేటు తమమూఁకలకొండలపాటు వేల్పువ
న్నెదొరలగెల్పునీటుఁ గని నెమ్మది నీసును రోస మెచ్చఁ గెం
పొదవెడిచూడ్కితో దనుజయోధుల నిల్పుచు మేఘనాదుఁ డా
త్రిదశులఁ బిట్టదిర్చెఁ దనతేరు శిఖిద్యుతి నుల్లసిల్లఁగన్. 306
క. ఎదిరించి శిఖిశిఖాభ, ప్రదరపరంపరల నమరబలవనము దహిం
పఁ దొడఁగె జగతీస్థలి గ్ర,క్కదల రథము దుర్నిరీక్ష్యగతిఁ జరియింపన్. 307
క. అక్కడిఁ దివిజోదుముందరఁ, జక్క నిలిచి తేజి చూడఁజాలక దివిజుల్

దిక్కుమోఁబులవలె నలు,దిక్కులకుం బఱచి రేమి।దెలిపెద నధిపా. 308

తే. ఇక్కరణి దేవతలలోన । నొక్కఁడేని, రావణాత్మజు నెదిరించి । రణము సేయఁ
జాల కతిభీతిఁ జనఁ జూచి । శతమఖుండు, పేరెలుంగెత్తి వారలఁ । బిలిచి పలికె.

ఉ. అమరశూరులార తగ।వా పగవారలు చూచి నవ్వ సం
గ్రామము డించి పోవ భుజ।గర్వము ఖర్వము సేసి యూరకే
యేమిటి కిట్లు పాఱెద రో।కించుక నిల్వఁడు మేఘనాదు బా
హామహిమం బిఁకన్ మనజ।యంతుఁడు మాన్చు నటంచుఁ బల్కఁగన్. 310

ఉ. అంతకు మున్నె రావణి ర।ణావని గెల్వఁగ నుత్సహించి కా
లాంతకశౌర్యవంతుఁడు జ।యంతుఁడు సారథిఁ జూచి దేవతా
సంతతి నొంచు రావణని।శాచరసూతి నెదిర్చి పోర నేఁ
డెంతయు వేడ్క యయ్యెఁ జన।నిమ్ము రథంబు రయంబుతో ననన్. 311

జయంత మేఘనాదుల యుద్ధము.

ఉ. స్వామి మహాప్రసాద మని । చయ్యన నాతని తేరిసూతుఁ డా
గోముఖుఁ డాగతిం బఱప । గోముఖనాదము లుల్లసిల్ల సు
త్రామసుతుండు రావణి న।దగ్రత మార్కొని భూరిబాణధా
రామయగాత్రుఁ జేసె నమ।రప్రకరం బది చూచి క్రమ్మఱెన్. 312

చ. పకపక నవ్వి రావణి సె।బాసుర ఘోరి జయంత దేవతా
నికరములో బలాఢ్యుఁడవు । నీవె యొకించుక సేపు పాఱి పో
వక నిలు నిల్చినం బొగడ।వచ్చును నిన్నని పల్కి శాతసా
యకముల సారథిన్ హయచ।యంబుల నొంచి యహంకరించినన్. 313

చ. శతమఖనందనుం డతని।సారథి నొంచి నిశాతసాయక
ప్రతతుల నించి మేను రుధి।రంబున ముంచిన నొచ్చి దండతా
డితభుజగంబు మాడ్కి భ్రు।కుటీప్రకటీకృతరోషుఁడై దశా
స్యతనయుఁ డాజయంతుని స।హాయుల నొవ్వఁగ నేసెఁ దూపులన్. 314

వ. ఇచ్చెలువున జయంతునికిఁ దోడుపడ వచ్చినవియచ్చరులమేను లుచ్చిపాఱ
శరోచ్చయంబులు నిగిడించి యచ్చిఱుతరక్కసుండు వెండియు. 315

చ. అరదముమీఁద నుండియు బ।యల్పడ కుగ్రతమంబు పన్ని యం
బరగతుఁడై శరాసనకృ।పాణ పరశ్వథ భిండివాల ము
ద్గర పరిఘాస్త్ర తోమర గ।దా ముసల క్షురికాదిసాధనో
త్కరములు శైలశృంగములు । గాటముగాఁ గురియించె నొక్కటన్. 316

ఉ. అందున భీతిఁ బొంది సుర।లందఱు నిల్చినచోట నిల్వ కెం
దెందె చనంగ నాత్మభటు।లెంతయు వంత గనంగఁ జూచి సం
క్రందననందనుండు దశ।కంఠసుతోద్ధతమగిపరంపరం

గుండియ దేవసైన్యములఁ గొల్లలఁ జేయఁ గడంగుచున్నెడన్. 317

తే. ఆమహేంద్రకుమారుమాతామహుండు
మనుమఁ డలయుట గని తనమాయవలన
నెత్తికొనిపోయె జలరాశి కెవ్వరతని, పోక తెలియకయద్భుతాంబుధిమునుంగ.

క. పతిలేనిచానవలె దైవతసేన గలంగి దానవప్రభుసుతుచే
నతిదైన్యమొందఁ గని సురపతి మాతలిదిక్కు చూచి పటుమతిఁ బలికెన్.

చ. అలజడిఁ జెందె సేనలు జయంతుని నెక్కడఁ గాన నైతి వే
ల్పులకు నజయ్యుఁడై సమరభూస్థలి రావణి మించె వీనితోఁ
గలహ మొనర్ప కున్న నిఁకఁ గార్యము గాదు రథంబు వేగ మా
తలి యటు పోవ నిమ్మరివధం బొనరించెద నేఁడు నావుడున్. 320

సీ. కమనీయశతకోటిఘంటికాఘణఘణారవముచే దిక్కరుల్ సెవుడు పొరయ
దశసహస్రోదగ్రతరమణీమయచక్ర, చంక్రమణస్థితి జగతి వడఁక
సకలలక్షణవిచక్షణలక్షహయఖురో, త్థరజోహతుల సముద్రములు గలఁగ
శరదభ్రవిభ్రమస్ఫురదదభ్రధ్వజో, ద్భటభటోర్భటి నభస్తటము వగులఁ

తే. చక్రచాపగదాఖడ్గశక్తిశూల, కుంతతోమరపరిఘాదిఘోరసాధ
నాంశువులు శత్రుదృక్కాంతు లపహరింప
సమరవిభు తేరు మాతలి యపుడు నడిపె. 321

చ. నలుగడలన్ మరుద్వసుగణంబులు సాధ్యులు రుద్రు లశ్వులుం
గొలువ వరాప్సరోయువతికోటులు ముందు నటింప శంఖమ
ర్దళమురజాదివాద్యనినదంబులు బోరుకొనంగఁ జారణుల్
పలుమఱు నెంచఁగా ననికిఁ బాకహరుం డరుదెంచుచున్నెడన్. 322

చ. అభిముఖుఁడై దశాననుఁ డుదంచితకాంచనకింకిణీక్వణ
క్షుభితదిశాకరిశ్రవణకోటర మారథ మెక్కి వాహినీ
ప్రభు లిరువంకలం గొలువ బంధురతూర్యరవంబు లొప్ప స్వ
ర్విభు నెదిరింప మాన్చి రణవీరుఁడు రావణి తా నెదుర్కొనెన్. 323

ఉ. అత్తఱిఁ గ్రొత్తగా బవర మయ్యె సురాసురయోధకోటికిం
గత్తులబల్లళత్తళలు కత్తళపుఱ్ఱమగరాతళత్తళల్
మొత్తము లై నభోమణిని ముంచె నభస్తటినీమహోర్ములన్
జొత్తిలఁ జేసె సైన్యయుగశోణరజఃపటలంబు లొక్కటన్. 324

ఉ. అందును నిందుఁ బేరు గలయట్టిదొరల్ నెఱయోధు లుగ్రులై
యందఱు కందత్రై పెలుచ నార్చుచు నొండొరుఁ దాఁకి పోరి రా
క్రందునఁ గుంభకర్ణుఁ డధికత్వర ముందుగ నన్నడెంద మా
నందముఁ జెందఁగా రణ మొనర్చె మహోన్నతశూలహస్తుఁడై. 325

మ. పదఘాతంబుల జానుఘట్టనములం బార్ష్ణిప్రహారంబులం
త్రిదశానీకిని నొంచుచుం గలఁచుచున్ సేనత్వ మొందించుచున్
రథసంఘర్షములన్ సభంబు వగులన్ రౌద్రాకృతిన్ మించఁగా
నెదిరింపన్ వసపోక భీతిలిరి దేవేంద్రాదు లుర్వీశ్వరా. 326

ఉ. అద్రి తెలంగునన్ సురబలార్ణవమున్ మథియించు శాత్రవో
పద్రవకారి నయ్యసురభర్తఁ గనుంగొని రౌద్రమూర్తులౌ
రుద్రులు వచ్చి తాఁకిరి మహోత్తులు బిట్టదరించి యద్రిశృం
గద్రుమసంఘముల్ గురిసి కాఱియఁ బెట్టిరి యొక్కపెట్టునన్. 327

శా. ఆదిత్యుల్ చెలరేఁగి యయ్యసురమేఘస్త్రప్రవర్షంబులన్
భేదింపన్ గిరినిర్ఝరంబులరహిం బెన్నెత్తురుల్ వాఱి యా
చ్ఛాదింపన్ రణభూమి యెల్ల నపుడీర్ష్యాగ్రస్తులై యాప్రహ
స్తాదుల్ సేనల నెల్లఁ గొల్లలను జేయన్ మీఱెఁ బోరయ్యెడన్. 328

చ. కిరిమకరాహికర్కటకకీచకమీనవరాహఖడ్గకా
సరచమరీతరక్షుహరిశల్యకురంగతురంగగండకా
ద్యురుతరనైకవాహనము లుద్ధతి నెక్కి సురారివీరు లా
సురల నెదిర్చి రొక్కమొగిఁ జూపరు లచ్చెరువంది చూడఁగన్. 329

క. ఆసంకులసమరంబున, వాసవుఁ డౌ మే లనంగ వసువులు తుషితుల్
డాసిరి యసిధారలఁ దెగ, వ్రేసిరి రోసమున నసురవీరులశిరముల్. వ. అప్పుడు.

సీ. తెగుభుజంబులుతుమురగుధ్వజంబులు కూలఁ,బడుగజములునడరెడురజములు
వ్రీలునెమ్ములు నేలరాలు సొమ్ములు చిక్కు,లొందుకాళ్లురవడి ప్రుందుజోళ్లు
సడలుఛత్రములు కీలెడలుగాత్రములు వ్రగ్గడుకరములు దునిగెడుశిరములు
పారలురౌతులుభీతిఁదెరలుసూతులు వ్రస్సి,యొఱగుబండ్లును బెట్టువిఱుగువిండ్లు
తే. పాఱునెత్తురుటేఱులుఁ దీఱుశస్త్ర,ధారలును మీఱుగాములు బారు గల్గి
పేరుగలవేల్పుదొరలచేఁ దీఱునాత్మ,బలము వీక్షించి రోషించె పంక్తిముఖుఁడు.

మ. అమరాధీశచమూసమూహముల దివ్యాస్త్రానలజ్వాలలన్
సమరక్షోణిఁ గలంచినం దెరలి యాసైన్యంబు దైన్యంబుతో
నముచిధ్వంసిరథంబు మాటునకుఁ జన్నం గిన్కనేత్రారవిం
దము లారక్తసరోరుహద్యుతులఁ జెందన్ జిష్ణుఁ డత్యుగ్రతన్. 333

క. అరదము దశముఖుమీఁదం, బరువడి నడిపింపు వేగ మాతలి యనుచున్
గురుకార్ముకమౌర్వీటం,కరణముతో వచ్చు నింద్రుఁ గనుఁగొని యతఁడున్. 334

ఉ. సారథి నెచ్చరించి రథసంబున నిర్జరరాజు తేరికిం
జేరువ యై తనుం బొదువు చిల్లరవేల్పుల వాఁడితూపులన్

భీరులఁ జేసి మాతలి ననేకశరంబుల నొవ్వ నేసినం
బేరలుకన్ శతక్రతుఁడు పేర్చి దశాస్యు నదల్చి శూరతన్. 335

మ. శతకోటిప్రతికోటిశాతవిశిఖాసారంబులన్ సైంధవ
ప్రతతిన్ నొంచి ధ్వజంబు ద్రుంచి మకుటీభాగంబులన్ నించి సూ
తతనుత్రాణముఁ జించి మించినసురాధ్యక్షున్ నిరీక్షించి యు
ద్ధతిమై రావణుఁ డాగ్రహించి దశకోదండీకరోద్దండుఁడై. 336

మ. పదిహస్తంబుల నస్త్రముల్ దొడి నభోభాగంబు భేదిల్ల వే
ల్పుదొరల్ నొవ్వఁగ నేసి యార్చిన మరుల్లోకేశ్వరుండున్ శిత
ప్రదరాసారము నించె నింద్రదనుజేంద్రస్ఫారబాణావళుల్
గదిసెన్ భానుని దానఁ గ్రమ్మె దిశలన్ గాఢాంధకారచ్ఛటల్. 337

శా. ఆపెంజీఁకటిలో స్వకీయపరకీయానీకినీభేదసమ్య
గ్వ్యాపారేతరులై సురాసురులు తారన్యోన్యముం బోరుచో
దీపించెన్ భుజఖడ్గకాంతు లపు డుద్రేకించి పౌలస్త్యసే
నాపంక్తిన్ దశమాంశముం బొదివి మ్రందం జేసి రద్దేవతల్. 338

శా. ఆసేనాక్షపణంబు గన్గొని దశాస్యాదిత్యవిద్వేషి రో
షాసూయావిలమానసుం డగుచు సింహాస్ఫూర్తి గర్జించి వీ
క్షాసంఘంబుల నిప్పు లుప్పతిల నుగ్రభ్రూకుటుల్ మోములన్
భాసిల్లం దనసారథిం గని యనుం బ్రావృట్పయోదార్భటిన్. 339

క. ఇదె నందనమున నుండియు, నుదయశిఖరిదాఁక నిండియుండెడు నైక
త్రిదశానీకినినడుమం, బదరక మనరథము నడపు ప్రావీణ్యమునన్. 340

మ. వసురుద్రానిలభాస్వర ప్రముఖదేవశ్రేణితో నేఁడు జి
ష్ణుసమీపంబున సంహరింతుఁ బొలియింతుం దోడుగా వచ్చురా
క్షసహాశాయుధయక్షరాజశమనస్వాహావధూనాథులన్
వెసఁ గైకొందుఁ దదీయలోకములు దోర్వీర్యంబుతో నావుడున్. 341

మ. అతఁ డాలాగె రథంబు దోలఁగ సహస్రాక్షుండు వీక్షించి య
ద్దితిజాధీశ్వరు నిశ్చయం బెఱిఁగి యాదిత్యాదులం బల్కె నేఁ
డతిశౌర్యంబున బ్రహ్మదత్తవరగర్వాయత్తుఁ డౌ రావణున్
మృతిఁ బొందింపఁ దరంబు గాదు గద బల్మిం బట్టి దెత్తుం జూఁడీ. 342

మ. అవలోకింపుఁడు మీర లిందఱు మదీయం బైనశౌర్యం బటం
చు విజృంభించి బలారి దక్షిణపదస్థుం డై చరించెన్ సురా
రివరుం డుత్తరభాగవర్తి యయి మీఱెం గొంతసే పంత న
ద్దివిజేంద్రుం డెదిరించె దైత్యు నతఁ డద్దేవేంద్రుఁ దాఁకెన్ వడిన్. 343

వ. ఇవ్విధంబున. 344

క. కుడియెడమలుగాఁ దిరుగుచు, నెడనెడ మాఱ్కొనుచుఁ దలఁగి యేఁగుచు శరముల్
జడిగొన నిగిడించుచు బడి, బడి నడచుచుఁ దొడరి తెంపు పనికిఁ దివురుచున్. 345

మ. పలుచందంబులఁ బోరుచున్న యెడ జంభద్వేషి యాదిత్యరు
ద్రులతో ముప్పదిమూఁడుకోటులసురల్ దోడ్తో విజృంభించి కో
ల్తల సేయన్ దశకంఠునిం దొడరి రథ్యవ్రాతమున్ నొంచి చే
తులవిండ్లం దెగవ్రేసి పట్టికొన నుద్యోగించి ధైర్యంబునన్. 346

చ. అరదము చుట్టుముట్టుకొని యాఁగి దశాస్యుని బిట్టదల్చి పై
కుఱికి తెమల్చి పట్టుకొని యుద్ధవిడిం దన తేరిమీఁదికిన్
సురపతి గొంచుఁ బోవుటలు చూచి నిశాటులు స్రుక్కి దానవే
శ్వరుఁ డదె చిక్కె దైత్యులకు వచ్చె నుపద్రవ మంచుఁ గూయిడన్. 347

ఉ. ఆరొద లాలకించి తమయయ్యయుపాధియుఁ గాంచి సంగర
క్రూరుఁడు మేఘనాదుఁ డతికోపముతో శిఖిఁ బుట్టినట్టిబల్
తేరును గేతువున్ హరులు దివ్యధనుశ్శరధుల్ వెలుంగ గా
రిరమణీమనోహరవరిష్ఠవరాగతశౌర్యధుర్యుఁడై. 348

చ. కడువడి నేఁగుదెంచి దశకంఠుని చుట్టును నిండి యాఁగి యుం
డెడి తెఱగంటిమూఁకలఁ గడంకబలంబున డాసి యంపవెం
జడి నిగిడించి వర్మములుఁ జర్మములుం బగిలించి నెత్తురుల్
మడువులు గట్టఁ జేసి బలుమచ్చర మెచ్చను హెచ్చరింపఁగన్. 349

సీ. అరదంబు లదలించి ద్విరదంబుల నడంచి, దురదమ్ము లగు నాయుధములఁ ద్రుంచి
పడగలగుమిఁ జీల్చి గొడుగులగమిఁ గూల్చి, వడిగల తేజీలఁ బుడమి వ్రాల్చి
శిరములఁ బగిలించి కరముల నొగిలించి, నరముల విశిఖసంతతులఁ ద్రుంచి
హనువులు నొప్పించి ధనువులు దప్పించి, తనువులు నిశితశస్త్రముల ముంచి
తే. భటుల బడలించి యాశ్వికార్భటుల మాన్చి, సారథుల నేసి రథికులఁ జదియఁ జేసి
హస్తిపకకోటి నలయించి యభవదత్త, తామసీవిద్య దాల్చి యద్దనుజసుతుఁడు.

మేఘనాదుం డింద్రజిత్తగుట.

మ. అలుకం దేరును దా నదృశ్యుఁడయి మాయాంధ్వాంతమున్ దిక్కులన్
బలియం జేయుచు నింద్రునిన్ బొదివి తత్పార్శ్వస్థు లౌ దిక్పతుల్
తలఁకన్ మాతలిపైఁ బతాకపయి రథ్యశ్రేణిపైఁ దేరిపై
బలుతూపుల్ నిగిడించి యార్చిన బలప్రత్యర్థి విభ్రాంతుఁడై. 351

మ. అరదం బయ్యెడ డిగ్గి యగ్గలికతో నైరావతారూఢుఁడై
పరునిం గానక నాల్గుదిక్కు లరయం బౌలస్త్యపుత్త్రుం డగో
చరుఁడై గోచరచక్రవర్తి సొలయన్ శస్త్రాస్త్రముల్ నించి బం
ధురమాయాతిమిరాంధుఁ డౌ నతని బద్ధుం జేసెఁ బాశావళిన్. 352

మ. తనమాయాబలలీల నీగతి సుధాంధస్స్వామి బంధించి య
ద్దనుజాధీశసుతుండు నవ్వుచు రథస్తంభంబుతో నంటఁ గ
ట్టి నను న్గన్నదశాననుం ద్రిదశకోటిం గూడి బంధింప నెం
చిన నీవే యిటఁ జిక్కితింద్ర యనుచుం జెండంబుఁ బూరించినన్. 353

ఉ. అత్తెఱఁ గెల్లఁ దెల్లముగ నారసి యుబ్బుచు దైత్యసత్తముల్
మత్తిలి మేఘనాదుఁ బలుమాఱు నుతించుచుఁ గేలు వ్రేయుచున్
నృత్తము సేయుచుం జెలఁగి రింద్రుని కొందలపాటు చూడలే
కత్తఱి రుద్రసాధ్యమరుదాశ్వినులార్చుచు ధీరచిత్తులై. 354

చ. చలమున రావణుం బొదివి సాయకజర్జరితాంగుఁ జేసి త
ద్బలముల నొవ్వ నేసి గుమిఁ బాయక పైపయిఁ గ్రమ్ముకొన్న బి
ట్టలసి దశాననుండును బ్రయత్నముతో నని సేయ నంబర
స్థలమున నుండి చూచి రభసంబున రావణి వచ్చి యార్చుచున్. 355

మ. ప్రళయాభ్రం బమితాశనుల్ గురియు దర్పం బేర్పడన్ వారిపై
శిలలుం బర్వతశృంగముల్ శరములున్ జేయార వర్షించి ద
వ్వులకుం బాఱఁగఁ దోలి తండ్రిఁ గని దివ్యుల్ సాటి రింద్రుండు దు
ర్బలుఁడై నాచెయిఁ జిక్కె నేల యిఁక సంగ్రామంబు దైత్యేశ్వరా. 356

చ. మగఁటిమి నీదుగాని సురమండలితో నని సేయ నేల ము
జ్జగముల కీవె నాథుఁడవు సైన్యములన్ మరలింపఁ బంపు నీ
కగపడె వీఁడె వాసవుఁ డటంచును జూపిన మేఘనాదునిన్
బిగియఁ గవుంగిలించి కడుఁ బ్రీతి వహించి దశాస్యుఁ డిట్లనున్. 357

చ. వెలసెఁ గులంబు నీవలన విక్రమధైర్యనిధాన పోరిలో
బలరిపునంతవానిఁ జెఱఁ బట్టఁగ నెవ్వరికైన శక్యమే
తెలిసిరి నీప్రతాప మదితిప్రియపుత్త్రులు ముజ్జగంబులన్
వలసినయట్ల కొంటి నినువంటికుమారుఁడు కల్గి యుండుటన్. 358

ఉ. అందఱిలోనఁ బెంపును జయంబును జెందితి గాన ముందు నీ
స్యందన మేఁగనిమ్ము వెనుచక్కిన వచ్చెద నేను సేనతో
నిందఱు జోదులుం గొలువ నియ్యెడ నంచుఁ గుమారుఁ బంచి మి
న్నుండి బలంబుతో వెనుకయై దశకంధరుఁ డేఁగె వేడుకన్. 359

వ. ఇవ్విధంబున. 360

చ. సుతునిఁ బురస్కరించుకొని సూరెల మంత్రులు సంస్తుతింపఁగా
శతమఖుగుండె దిగ్గుమన సర్వనిశాచరసేన గొల్వఁగా
నతులమహావిభూతి మెఱయం దనప్రోలికిఁ బోయి సోదరా
న్వితుఁ డయి పౌరు లుల్లసిల వేడుక నొందుచు నుండె రాఘవా. 361

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని యింద్రుం డెటులు మరల వీడింపించుకొనెన్
వినిపింపుఁ డవలికథ యని, మనువంశనృపాలమౌళిమణి యడుగుటయున్. 362

ఆశ్వాసాంతము.

మ. నతరక్షాభరణా రణార్థి రిపుసేనావారణా వారణా
శ్రితమోహాపహృత్తపనా పనాయితగుణశ్రీధారణా ధారణా
న్వితచేతోభ్యుదయా దయాముదితకుంతీనందనా నందనా
యతధాత్రీజహరా హరాదికసపర్యాభాసితా భాసితా. 363

క. అమరార్చితపదకమలా, కమలారమణీసమీపగతహారమణీ
రమణీయదయైకమనా, కమనాకృతిముషితగోపికామానధనా. 364

పృథ్వీవృత్తము. ఫణాభృదరుణాధరాప్రణుతికర్ణసంతర్పణా
పణాయితఘృణారసప్రవిలసత్కటాక్షేక్షణా
క్షణాధ్వశరణాగతోచ్చ్రయగృహార్చనాకారణా
రణాశనకణాదపర్వతముఖార్యసంరక్షణా. 365

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధానవద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణివైభవాధఃకృత రాజరాజ రాజయోగ సామ్రాజ్యలక్ష్మీవిలాస ధురంధర ధరాధిప సభాంతర స్తవనీయనయకళాయుగంధర బంధురమనీషావిశేషమంథానవసుంధ రాధర శోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటి వంశపయఃపారావారపరిపూర్ణసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞాన విభవవిజితసనందనవిష్ణుమాయావిలాసాభిధానయక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబు నందుఁ జతుర్థాశ్వాసము.





శ్రీ

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీమదుత్తరరామాయణము

## పంచమాశ్వాసము.


మత్సత్రాజిత్తన
యామంజులచరణతలసమాసాదితలా
క్షామోహాకరణచణ వ
క్షోమధ్యస్ఫురితరత్నశుభకాంతినిధీ. 1

దేవతలు బ్రహ్మయొద్దకుం బోయి యింద్రునిపరాజయము సెప్పుట.

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుం డిట్లను శ్రీరామచంద్రుం జూచి
రఘుకులాధీశ యాకీర్తిరావణాత్మ, జుండు సురపతిఁ గొనిలంకఁ జొచ్చుటయును.

శా. ఆశ్చర్యార్తిభయాత్ములయ్యు వసురుద్రాదుల్ సుధాశిద్విష
త్పశ్చాద్భాగముఁ జేరి కొంతవడి బద్ధస్పర్ధఁ బోరాడి త
ద్దోశ్చక్రాసిగదాపరశ్వథముఖాస్తోకాయుధస్తోమముల్
నిశ్చేష్టత్వముఁ జెందఁ జేయుటయు శాంతిం బొంది వారందఱున్. 3

మ. ఒకచో గుంపులు గూడి దీనముఖులై యుచ్ఛ్వాసముల్ నించుచుం
వికలత్వంబున వైరిఁ గాంచుచు నయో వృత్రాదిదైత్యచ్ఛిదా
ధిక తేజోనిధి కింత వంత వొడమెం దేవత్వముం రాక్షస
ప్రకరాధఃకృత మయ్యెఁ గాలగతి మాన్పం గూడ దెవ్వారికిన్. 4

తే. ఏమిసేయుద మింతకు హేతు వలవి, ధాత గద యమ్మహాత్మునకీ తెఱంగు
విన్నపము చేసి తద్వచోవృత్తి మెలఁగ, నన్నిటికి మేలని తలంచి యపుడు కదలి.

సీ. ఎదురుగా వచ్చి దేవేంద్రునిఁ బొడగాన, కల్ల స్వర్గమువారు తల్లడిల్ల
నింద్రునంతటివాని కెంత వచ్చె నటంచు, వనట సువర్లోకవాసు లడల
జేజేలు తండ్రిఁ బాసిన ప్రజలై రయో, యని చూచి జనలోకజనులు వగవ
శతమన్యుఁ జెఱఁ బట్టెఁ జాలి రే పగవార, లని తపోలోకంబుమునులు బెగడ

తే. వాసవుం డెందుఁ జనెనొ వివర్ణులగుచు, నమరు లేటికి వచ్చిరో యనుచు సత్య
లోకమునఁ గాఁపురంబున్న లోకు లరయ, జలజగర్భునిసభఁ జేరఁ జనిరి సురలు.

మ. చని నానావిధదివ్యరత్నమయభాస్వన్నవ్యశిల్పంబులం

గనన్నై నైకవిధావదాతరకమణీరాజీశ్లాఘ్యచిత్రార్చిచి
త్రనవస్ఫాటికకుడ్యహారిరుచులం దళ్కొండు యాత్మప్రకా
శనిరూఢోన్నతిదివ్యమానకమహాప్రాసాదాగ్రభాగంబునన్. 7

సీ. కపిలమార్కండేయకణ్వాదిమునిశిఖామణులతో నొకమోము మాటలాడ
నీకుఁ జేయఁదగుసృష్టి యిది సేయుఁడనియుచ, బ్రహ్మలకొక మోము బదులుపలుక
భావగర్భము లాడుభాషావధూటితో, నొక మోము నగుచు నర్మోక్తి నుడువ
నప్సరఃకమలాస్య లాడులాస్యము లొక్క
మొగము చూచుట కాభిముఖ్య మొంప

తే. సర్వతోముఖచాతుర్యధూర్వహత్వ, మొంపుడెంపంబు చెలువందనున్న తాబ్జ
రాగసింహాసనస్థుఁడై రాజసమునఁ, బెద్దకొలువున్న జేజేలపెద్దఁ గనిరి. 8

మ. కని యాదిత్యమరుద్వసుప్రముఖలేఖశ్రేష్ఠు లాపెద్దవే
ల్పునకుం జాఁగిలి మ్రొక్కి మోడ్చినకరాంభోజాతయుగ్మంబు లా
త్మనిటాలంబులఁ జేర్చి నిల్చిన దయాధౌరేయుఁడై మీరు వ
చ్చినకార్యం బది యేమి దెల్పుఁ డని రాజీవాసనుం డాడెనన్. 9

మ. అమరుల్ స్వామి పరాకు నేఁ డమరలోకారాధ్యుఁడౌ నింద్రునిన్
సమరక్షోణి నెదిర్చి రావణతనూజాతుండు బంధించి దు
ర్దమశౌర్యంబునఁ గొంచుఁ బోయెఁ బురికిన్ దద్ఘోరమాయామహ
త్త్వమునన్ మేమును దూలి వచ్చితిమి సంతాపంబు వారింపవే. 10

ఉ. గట్టుల మట్టుపెట్టు బలుకైదువుఁ బట్టినయట్టిదిట్టఁడున్
దిట్టతనంబు వాసి పొలదిండికి లోఁబడి గాసిఁ జెందఁగా
నెట్టు సహింప వచ్చు జగదీశ యశక్తునిచంద మొంది చూ
పెట్టుక యుండ నేల విడిపింపఁగదయ్య మదీయవల్లభున్. 11

మ. అని ప్రార్థించుదివౌకకోటిఁ గని యాహా యెంతకార్యంబు వ
చ్చె నిలింపాగ్రణి కంచు ధాత కరుణాస్ఫీతాత్ముఁడై లేచి కొ
ల్వున నున్నందఱుఁ గొల్వ వెల్లజిగిపుల్గుందేజిపై నెక్కి గ్ర
క్కున లంకాపురి కేఁగెఁ జారణముఖుల్ కైవారముల్ సేయఁగన్. 12

బ్రహ్మదేవుఁ డింద్రజిత్తునకు వరం బొసంగి యింద్రుని విడిపించుట.

ఆ. ఏఁగి తనకుఁ బూజ లిచ్చు మిత్త్రాత్మజ, భ్రాతృయుక్తుఁడైన సపంక్తిముఖుని
నాదరించి మింట నధివసించి విరించి, యంచితోక్తి దనుజు లలరఁ బలికె.

ఉ. వత్స దశాస్య యెందు నినువంటిబలాఢ్యునిఁ గాన వేల్పులన్
మత్సర మొప్ప గెల్చితివి మార్కొని జిష్ణునిఁ బట్టి తెచ్చె యు
ష్మత్సుతుఁ డింతకంటె భుజశౌర్యము లున్నవె యింక దేవతా
హృత్సరసీజముల్ వగుల నీతఁడు మేటగు నింద్రజిత్తనన్. 14

చ. అమరులఁ బ్రోవ ముజ్జగము లారయ నింద్రుఁ బ్రతిష్ఠ సేసినాఁ
డ మొదట వాఁడు కావలఁ బడెం దగఁ డింకిట నానిమిత్తము
య్యమరవరేణ్యునిన్ విడువు మంచుఁ బయోరుహగర్భుఁ డాడువా
క్యములు దశాస్యసూతి విని యంజలి సేసి వినీతి నిట్లనున్. 15

మ. జగదారాధ్యపదాబ్జ మీర లిపు డాజ్ఞాపించినట్లే జయం
తగురున్ వీడెద నాకొసంగు మమరత్వం బన్న వాణీశుఁడున్
నగి యక్షాసురకిన్నరప్రముఖనానాప్రాణిరింఛోళికిన్
జగతిన్ లే దమరత్వ మిం కొకటి గాంక్షన్ వేఁడుమా యిచ్చెదన్. 16

చ. అన విని మేఘనాదుఁ డను నట్టిదయేని మహాత్మ వైరితో
నని యొనరింపఁగా వలసినప్పుడు వేల్మి యొనర్చి హోమవ
హ్నిని జనియించుదివ్యరథ మెక్కినచో నమరత్వ మొంద ని
మ్మనుపమహోమవిఘ్న మయినప్పుడు నాశము సమ్మతించితిన్. 17

చ. తపములు పెక్కు చేసి కడ తాత యమర్త్యతఁ గందు రందఱున్
విపులపరాక్రమంబున నె వేఁడెద నీయభిలాష మియ్యవే
కృప నని పౌత్త్రజుం డడుగ నిచ్చితి నట్లగు నంచుఁ బద్మజుం
డపుడు విముక్తుఁ డైనదివిజాధిపుఁ దోడ్కొని వేడ్క మీఱఁగన్. 18

క. వారల నట వీడ్కొని తన,వారలతో గగనమార్గవర్తి యయినచో
గౌరవహానిజలజ్జా,భారంబున శిరము వంచి బలరిపుఁ డంతన్. 19

సీ. వీడినసిగ జాఱురిపువ్వసరులతో, మురువు డించిన వాఁడుమోముతోడ
దందడిఁ దెగి రాలుతారహారములతో, వదలినభూషణవ్రజముతోడ
బలుకట్లదద్దు లేర్పడుభుజార్గళలతో, నలఁగినచలువదువ్వలువతోడ
నరిశరజర్జరితావయవములతో, బడలికఁ బొడముచేడ్పాటుతోడ
తే. నడుగు లెడనెడఁ దడఁబడ నశ్రుజలము, లడర నడలున నడ తెంచి యంఘ్రికమల
యుగళి వ్రాలిన బలవైరి నూఱడించి, యంచితప్రేమ మించి విరించి యనియె.

దోదకవృత్తము. బాలిశునైనన్ బండితునైనను, గాలవశంబున గర్మఫలంబుల్
మేలయి కీడయి మేకొన కున్నే, యేల మనోవ్యథ నింకెద వింద్రా. 21

మ. తొలిజన్మంబునఁ జేయుకర్మములు చెందుం గొందఱం గొందఱన్
గలఁచుం దప్పక యాశరీరమున నాకర్మంబె కర్మస్థితుల్
తెలియన్ శక్యము గావు మాదృశులకున్ దేవేంద్ర నీకర్మమే
కలఁగించెన్ నిను నిట్లు పూర్వకథ యాకర్ణింపుమా తెల్పెదన్. 22

వ. అని పల్కి శతానందుండు పురందరున కిట్లనియె. 23

ఇంద్రునకు నహల్యాప్రాణనాథుఁడు శాప మిచ్చినవిధము.

శా. నే నిర్మించినకామినీమణులలో నీటొందునీలాలకన్

నే నిం కొక్కరితెఱఁ సృజింతు ననియుఁ గౌ నిష్కృష్టి గావించి యీ
నానాదివ్యవిశేషవస్తువుల సౌందర్యాంశముల్ గూర్చి లో
కానందాకృతిగా సృజించితి సహల్యానామభామామణిన్. 24

తే. హలమునాఁగలిరూపమౌ హలముభావ, మరయహల్యంబు నాఁజను నట్టిహల్య
మన్నెలంతకు లేమి నహల్య యనుచు, నేను బలికితి నెఱుఁగ వె యింద్ర నీవు.

సీ. కమలవైఖరిసుధాకరకళావిభవంబు, లొకటియై చెలు వొందియుండుటకును
భ్రమరసంపదలుసంపఁగెపువ్వువిలసనం, బొకటియై చెలువొందియుండుటకును
దాడిమీబీజసంతతి శుకమణిముఖం, బొకటియై చెలు వొందియుండుటకును
శంఖసౌభాగ్యంబుఁ జారువీణాస్వనం, బొకటియై చెలువొందియుండుటకును

తే. నేఁ బ్రయత్నంబు సేసి యన్నెలఁతకన్నుఁ
గవ మొగము చూపుగుబ్బ నాసికయు రదములు [టిమ.
మోవి కంఠంబు సుస్వరమును సృజించి, కాంచితి సురేంద్ర యఘటనాఘటనప

సీ. పూర్ణేందుబింబ మెప్పుడు నిల్వలేదాయె, నమదూఱు నీయాననమువలనఁ
గవజక్కవలఁ బాయఁగాఁ జేసె నౌ నను, నడ దీనికుచలికుచములవలనఁ
బగలు కల్వలచెల్వు ప్రబల నీయం డను, దూషణ దీనికందోయివలన
మించు నించుక సేపు మించి నిర్మించలేఁ, డనురట్టు దీనిదేహంబువలనఁ

తే. బాపుకొని లెస్స సృజియించె బ్రహ్మయనుచుఁ, గొలువవచ్చిన దేవతాకోటిదలఁప
నీవెలఁది నిమ్మనుచు నన్ను నీవు వచ్చి, వచ్చియడుగుదు మఱచి తే వజ్రపాణి.

చ. పలుమఱు నీవు వేఁడిన నభశ్చరు లెందఱు వచ్చి వేఁడినం
గలికి నొసంగ కెవ్వరికి గౌతమమౌనికి దాని నిచ్చినం
గళవళ మంది నీవు రతికాంతకృతాంతలతాంతకుంతముల్
బలువిడి మానసాంబుజము బ్రద్దలు వాపిన దైన్యమూర్తివై. 28

క. నను దూఱుచు గౌతమముని, ననిఁ దూఱుచుఁ గుసుమలసితవల్లీవిలస
ద్వనిఁ దారుచు నచ్చెలిఁ బెనఁ, గొనఁగోరుచుఁ బొంది ప్రొద్దు గ్రుంకినయంతన్.

ఉ. ఆనడిరేయి కోడివలె నార్భటి సేసి మునీంద్రునిన్ నది
స్నానము సేయఁ బంచి కుహనామునివై చని గౌతమాంగనా
నూనరతోత్సవాంబుధి మునుంగుచు నుండితి వంతలోన న
మ్మౌనియు వచ్చి నిన్నుఁ గని మచ్చరమల్కయు నిచ్చ హెచ్చఁగన్. 30

మ. కపటాకారముఁ బూని మానిసతులం గాంక్షించి యీలాగు గా
నిపనుల్ సేయఁ గడంగినాఁడవె బళా నీకిండగర్వంబు దే
వపతీ శత్రుఁడు పట్టి కట్టికొని పోవం దీటుఁ బొమ్మంచు నిన్
శపియించెం గద నాఁటిశాప మిదిగో సంధిల్లె నీనాఁటికిన్. 31

క. నినుఁ గలసిననిజకాంతిం, బెనుఁజట్టై యుండు మని శపించి జగతిఁ జ

క్కనిసతులు తఱుచు గలిగెద, రని మునియు నెనటుల కలిగెఁగది మొదలు ప్రజల్.

వ. కావున. 33

చ. వగవకు మీ యఘంబు చన వాసవ వైష్ణవయాగ మంచితం
బుగ నొనరింపు నీయనుఁగుఁబుత్త్రుఁ బులోముఁడు వార్ధి వైరిచే
నగపడ నీక దాఁచె వల దాతని కై వెతఁ జెంద నంచు న
న్నగరిపు నూరడించి నలినప్రభవుం డపు డేఁగె వీటికిన్. 34

చ. కమలజుఁ డానతిచ్చినప్రకారమునం గ్రతు వాచరించి ఖే
ద ముడిగి వాసవుండు నిజధామము చేరె నృపాల రావణ
ప్రముఖులకంటె రావణిపరాక్రమ మెక్కువ యన్నమాట ని
క్క మవుఁ గదా యటం చలయగస్త్యమహాముని యానతిచ్చినన్. 35

తే. ఆపురావృత్తమున రావణాత్మజన్ము, విక్రమము పెద్దయనుమాట విని రఘుప్ర
వీరుఁ డరుదందె సభ నున్నవార లెల్ల, నింద్రజిద్వైరి లక్ష్మణు నెంచి రపుడు.

ఉ. శ్రీరఘురాము చెంగట వసించి విభీషణుఁ డగ్రజక్రమం
బాఋషి దెల్పఁగా విని ప్రహర్షముతో నృపుఁ జూచి మున్ను క
న్నారఁగఁ జూచినట్లు మునియానతి యియ్యఁగ నేఁడు వింటి న
య్యారె యగస్త్యుఁ డెంతమహిమాధికుఁ డంచు నుతించె నయ్యెడన్. 37

క. మైత్రావరుణి ధరిత్రీ,పుత్రీవరునిఁ గని యనియెఁ బుంభావకళా
ధాత్రానందకరోక్తిసు,గాత్రీపదపుటితకటకఘటితార్భటులన్. 38

చ. జడధిమదాంధకారహర శౌర్యదినేశ్వర రామ మున్ను నీ
వడిగినమాట కింక నొకయద్భుత మున్నది యాలకింపు మి
వ్వడువున రావణుండు బలవంతుల మార్కొనువేడ్క నొక్కనాఁ
డెడపక పశ్చిమాబ్ధిదరి కేఁగి తదంతికకాననంబునన్. 39

రావణుండు కపిలముని చే భంగపడుట.

చ. పరిచరు లూడిగంబు సలుపన్ సచివుల్ హితభాష లాడఁగా
శరధితరంగరంగదురుసైకతసీమల సంచరించుచుం
బరిసరధారుణిం దుహినపర్వతమో యన మించు నొక్కభూ
ధరమణిఁ జూచి చేరఁ జని దానవుఁ డం దొకకోనలోపలన్. 40

సీ. నికటావనీజపంక్తికిఁ గడారజటాంశు, లామ్రేడితదళంబు లై వెలుంగ
నాసన్నరుఘుతములం దాననశోణాబ్జ, మమితారుణాంభోరుహముల నింప
సవిధకుంజాలిపుంజముల గ్రీవాలగ్న, పద్మమాలిక సౌరభములఁ బిల్వఁ
బరిసరపల్లవప్రతతిఁ బల్లవమంజు, పాదముల్ నఖకాంతిఁ బరిహసింప

తే. బద్ధపద్మాసనస్థుఁ డై పరమనిష్ఠఁ, గన్నుఁగవ మూసికొని పాణికమలసముది

తాటుమాలిక చెవి వ్రేల నాత్మయోగ, పూర్ణముఖ మొందు నొకమహాపురు [షుఁగాంచె.

ఉ. కాంచి సమీపభూమి దశకంఠుఁడు సేరఁగఁ దత్ప్రశంగనే
త్రాంచలవీథి నుప్పతిలె నగ్నిశిఖల్ భ్రుకుటీకరాళ మై
మించె ముఖంబు బాహుల నమేయశితాయుధయూథముల్ విజృం
భించెఁ దనూరుహాళిఁ గనిపించె మరుద్వసురుద్రసంఘముల్. వ. మఱియును.

చ. గ్రహముల భానుఁడున్ గిరులఁ గాంచనశైలము వేల్పులందు వృ
త్రహుఁడు నిభంబులందుఁ జవుదంతియుఁ జెట్టులఁ గల్పధారుణీ
రుహము వెలుంగునట్టు ఽజరుద్రముఖామరమూర్తులందు దు
స్సహమగుమూర్తిఁ జేకొని యొసంగెడునాథునుఁ జూచుచున్నెడన్. 44

సీ. ఉరమున శ్రీదేవి యూరుల ధర్మంబు, తలఁపున మదనుండు దపము దమము
మూఁపునబితృసంఘమును శల్యముల మరు,ద్గణములుఁ గుక్షిఁ సాగరచయమ్ము
వసువులు నడుమఁ బార్శ్వముల దిక్కులు కన్నుఁ,
గవ సూర్యచంద్రు లగ్రమున రుద్రు
లాశ్వినుల్ చెవులబాహాదండములను ధా,తయు విధాతయు నను దైవతములు

తే. రమ్యమణిబంధమున భిదురంబు పాణి,
తలములను భగపూషులు తగ నఖముల
భుజగతతి రోమముల దానవులు తనువున
వివిధదివ్యులు దివమును వెలయుటయును. 45

శా. ఆవింతల్ గని యౌర నాయెదుట మాయల్ సేయఁగాఁ జొచ్చినాఁ
డీవాచంయమి యంచు రావణుఁడు వహ్నిజ్వాలికాభీలలీ
లావేలాస్త్రచయంబు లాఘునునిపై నందంద వర్షించి వీ
రావేశంబునఁ బేర్చి యార్చిన నతం డాటోప మేపారఁగన్. 46

క. బెడఁగుంజూపుల నిప్పలు, జడిగొన వడి లేచి నన్ను సాధింపఁగ ని
క్కడకున్ వచ్చితె యోరీ, చెడుగా యని యలఁతిముష్టిచేఁ దాటించెన్. 47

ఉ. ఆయనముష్టిఘాతము మహాకులిశాయుధలీల మించినన్
వాయుమహోద్ధతిన్ ధరణి వ్రాలుమహాకుజమో యనంగ దై
తేయుఁడు గూలెఁ గూలినపతిం గని మంత్రులు దాఁక వచ్చినం
బాయఁగఁ జేసె హుంక్రియనె బల్లిదుఁ డప్పురుషుండు భూవరా. 48

వ. ఇవ్విధంబున. 49

ఆ. అలఁతిముష్టిఁ బొడిచియమరారి నొగిలించి, యతనివారి హుంక్రియనె కలంచి
యమ్మహానుభావుఁ డంతికగిరిగుహా,భ్యంతరంబు సొచ్చె నతిరయమున. 50

ఉ. ఆయెడ మూర్ఛఁ దేఱి దనుజాగ్రణియుం దనవారిఁ జూచి న
న్నీయెడ ముష్టి నొంచినతఁ డెక్కడి కేఁగె నటన్న వారల

య్యా యిఁక నేఁటి కొఁతఁడు భ౹యంపడి యిగ్గుహ సొచ్చి చెచ్చెరం
బోయెఁ బరాఙ్ముఖుం డొడరఁ ౹ బోవుదురే మిమువంటిబల్లిదుల్. 51

క. అది గాక బాహువిక్రమ, మదనం బతనికి మహాత్ముఁ ౹ డని తోఁచుచు ను
న్నది పాఱెడుబండ్లకు వల,వదు పదములు చాఁప దనుజ౹వల్లభ యనినన్. 52

చ. అలిగి బళా యతండు ప్రళ౹యాంతకుఁ డైనను బోవ నిత్తునే
నిలువుఁడు మీర లీడ నని ౹ నిర్భయుఁడై నిబిడాంధకారము
ల్దళముకొనంగ మూఢుమది౹లాగున నున్నగుహాంతరంబులోఁ
బలికి దశాననుం డరిగె ౹ బాణకృపాణరుచుల్ వెలుంగఁగన్. 53

వ. అరిగి తత్ప్రదేశంబున. 54

సీ. అతిభీషణాకారు ౹ లై ఘోరశస్త్రాస్త్ర,ధారులై విలసిల్లు౹వీరవరుల
నఖిలలోకైకమో౹హనవిలాసాగణ్య, లావణ్యవతు లైన౹దేవసతుల
నవలోకములనె బ్ర౹హ్మాండంబు భస్మంబు, సేయఁ జాలినమహా౹సిద్ధవరుల
శంఖచక్రగదాసి౹శార్ఙ్గముల్ గల చతు,ర్భుజములఁ దాల్చిన౹పురుషవరులఁ

తే. జూచి వారలతేజంబు౹సొంపు పెంపు, గఱువతనమును దను భీతుఁ౹గా నొనర్ప
నుప్పతిలుతత్తఱమునఁ ౹ దుండ వెఱచి, పఱచిదశకంఠుఁ డగ్గుహా౹భ్యంతరమున.

సీ. దివ్యచందనమాల్య౹భవ్యసౌరభములు, ఘుమ్మని గుహయెల్లఁ ౹ గ్రమ్ముకొనఁగ
మహనీయకోటీర౹మకరకుండలమణి,ద్యుతు లంధకారంబు ౹ తొలఁగఁద్రోయ
గగనభాగమున న౹క్షత్రపంక్తులఁ బోలి, యురమున మౌక్తిక౹సరము లలరఁ
జామరగ్రాహిణీ౹చటులకంకణనిస్వ,నంబులు చెవుల కా౹నంద మొసఁగఁ

తే. దగుశరచ్చంద్రచంద్రికా౹ధవళశయ్యఁ, బవ్వళించి పదాబ్జముల్ ౹ బాలయొకతె
తొడల నిడుకొనియొత్తఁ గ౹న్దోయి మోడ్చి,
నిదుర వోయెడియొకసౌఖ్య౹నిధిని జూచె. 56

తే. చూచియాయనచెంగట౹సొబగువాలు, బెళ్కుఁజూపులవెలయు న౹చ్చెలియనట్టె
తెప్ప వేయకకనుచు బి౹ర్వ్రత్తుఁ డగుచుఁ, జెంత కొక యింతఁ జేరిన౹యంతలోన.

తే. ఎఱిఁగి యమ్మేటితామును౹గిడినఁజిలుఁగుఁ,జలువవలిపట్టుదొలఁగించి౹సరగ లేచి
సరభసంబున నట్టహా౹సంబు సేయ, వింశతిభుజుండు భీతిల్లి ౹ వివశుఁ డయ్యె. 58

క. వివశుఁ డయి కొంతవడి క,ద్దివిజారిప్రభుఁ డొకింత ౹ దెప్పిఱి యతనిన్
సవినయముగఁ గని యెవ్వం,డవు నీవు మహాత్మ యేర్ప౹డఁగఁ దెల్పఁగదే. 59

సీ. రుద్రునిఁ గనుఁగొంటి ౹ రుద్రున కిటువంటి, దారుణోన్నిద్రరౌ౹ద్రంబుఁ గాన
జమునితోఁ బోర్కొంటి౹జమునకు నిటువంటి,కర్కశోదగ్రవి౹గ్రహముఁ గాన
దపనునిఁ బొడగంటిఁ ౹ దపనున కిటువంటి, ప్రతిమానితప్రతా౹పంబుఁ గానఁ
గనకాద్రిపై నుంటిఁ ౹ గనకాద్రికిటువంటి, యతిదుర్నివార౹ధైర్యంబుఁ గాన

తే. నింద్రచంద్రాదిదివ్యుల ౹ నెల్లఁ గంటి, వారియం దీప్రభావ మె౹వ్వరికిఁ గాన

నిగుఱులోనిప్పతీరున నీచరిత్ర, మెఱుఁగఁ బడ దన్న నగి యతఁ డిట్టు లనియె.
తే. ఇప్పుడెల్లను నన్ను నీ కెఱుఁగవచ్చు, నే దశానన యిఁక మీఁద నీవ యెఱిఁగె
దింతలోపలఁ బదరి నే నింతవాఁడ, ననుచు వివరింపఁ బో నది యట్టులుండె.
శా. బ్రహ్మేశానవరంబులన్ భువనముల్ బాధించి బ్రహ్మాణ్యుల
బ్రహ్మాణ్యంబులు పెట్టఁగా మెలఁగినన్ బ్రహ్మోక్తి సైరించితిన్
బ్రహ్మఘ్నున్ నిను నింక మీఁద ననిలో బాహాబలం బేర్పడన్
బ్రహ్మేశాదిసురేంద్రు లడ్డపడినన్ భంజింపుదున్ రావణా. 62

కపిలమునియైన నారాయణుండు రావణునకు స్వస్వరూపంబుఁ జూపుట.

క. నే నెవ్వఁ డని తలంచితొ, నా నిజరూపంబుఁ జూచి నామహిమంబున్
నానామ మెఱిఁగికొమ్మని, యానన మొకయింత దెఱచి యనంతటిలోనన్. 63
సీ. జ్వలనకీలాసహస్రము లర్కకరలక్ష, లైందవరుచికోటు లచటఁ దోఁచె
నరసురాసురవియచ్చరసిద్ధసాధ్యరు, ద్రాహిగుహ్యకతతు లచటఁ దోఁచె
నఖిలసముద్రంబు లఖిలాంతరీపంబు, లఖిలసరిద్వన్య లచటఁ దోఁచె
నభముభూమియుగాడ్పు నక్షత్రములుగిరు, లామ్నాయముఖవిద్య లచటఁ దోఁచె
తే. నట్టిముఖములు పెక్కు వే లమితకర్ణ, నయననాసాపుటంబు లనంతపదము
లమిత బాహువు లమితభూషాంబరాదు
లమితశస్త్రంబు లమ్మూర్తి యందుఁ దోఁచె. 64
క. ఆయద్భుతతేజోనిధి, చాయం గరియొద్ది దోమచందంబున నై
తేయుండు హీనుఁ డై తన, కాయము గంపింప వెఱచి కన్నుల మొగిచెన్. 65
వ. ఇవ్విధంబున. 66
తే. కన్నులన్నియు మొగిచి నక్తంచరేంద్రుఁ, డమ్మహామూర్తి కానతు లాచరించి
యంజలు లొనర్చి దేవ నీవని వధించు, నంతకంటె శుభంబేది యనుచుఁ బలికె.
క. ఆదట గిరితో గుహతో, నా దేవుఁ డదృశ్యుఁ డయ్యె నద్భుతభయన
మ్రోన్మదములు వెలయ మారీ, చాదులతో నచటు వాసి యతఁ డరిగె నృపా. 68
తే. రామ గుహలోన గిరిచెంత రావణునకుఁ, గనఁబడిన దేవుఁ డెవ్వఁడో యనఁగ నేల
యతఁడె కపిలావతారుఁడౌ నాదివిష్ణుఁ, డాయనకు నీకు భేద మింతైనఁ గలదె.
వ. అని పల్కి యగస్త్యమునిచంద్రుండు వెండియు రామచంద్రున కిట్లనియె. 70
సీ. స్నానసంధ్యాజపస్వాధ్యాయముఖముల, నెవ్వాని స్మరియింతు రెల్లఋషులు
జగదుద్భవస్థితిసంహారకృత్యంబు, లెవ్వాని క్రీడలై నివ్వటిల్లుఁ
బ్రాఁబల్కు కల్కి పాపటకుసిందూరమై, యెవ్వానిపదకాంతి యెసకమెసఁగు
దేశికోచ్చరితోపదేశమంత్రంబులై, యెవ్వానినామంబు లింపొనర్చుఁ
తే. బద్మజేంద్రాదిదేవతాప్రభువు లేమ, హామహాసమేయమాయాబ్ధిలో మునింగి
దరియుఁ దాపును గానక తల్లడింతు, రట్టిహరి వీవె కావె పట్టాభిరామ. 71

సీ. పదపంకజరజఃప్రభావంబుచే రాతి, నతివఁగా నొనరించినందువలన
సాక్షాన్నిటాలకటాక్షుండు దాల్చువి, ల్లవలీల విఱిచినయందువలన
ధనువు గైకొను నెపంబున జామదగ్న్యుబా,హాశక్తి హరియించినందువలన
నినజుతోఁ బ్రతినచేసినలీల నొకకోల, నమరేంద్రసుతుఁ గూల్చినందువలన
తే. నబ్ధి బాణాగ్రమున నిల్పినందువలన, నని నజయ్యాసురులఁ ద్రుంచినందువలన
నాదినారాయణస్వామివగుట దెలిసె,నరయ నరుఁడవె నీవు పట్టాభిరామ. 72

మ. పదిమోముల్ గలదండిరక్కసు ననిన్ భంజింప నీలాగు నీ
వుదయం బొందిన నీపనుల్ నడప నుద్యోగించి రుద్రాబ్జగ
ర్భదినేంద్రాబ్జముఖామరుల్ పవనభూభల్లూకరాడ్భానుజాం
గదముఖ్యాగచరత్వముల్ గనిరిగా కాకుత్స్థవంశాగ్రణీ. 73

ఉ. అందఱు నంద తౌనె కద యందఱిలోఁ బవనాత్మజుండు నీ
యందుఁ బ్రపత్తి గల్గినమహాత్ముఁ డుదాత్తగుణోత్తరుండు సం
క్రందనజిద్దశాస్యముఖరాక్షసముఖ్యుల నొక్కరుండె పో
రం దెగఁ జూడ నోపు బలరాశి నుతింపఁ దరంబె యీతనిన్. 74

మ. అకలంకాత్ముఁ డపాయశూన్యుఁ డఖిలోపాయాధికుం డం చెఱిం
గి కదా యెవ్వరి లెక్కసేయక లతాంగిం జూచి రమ్మంచు ము
ద్రిక యీమారుతిచేతి కిచ్చితివి భూరిస్తోత్రపాత్రంబుగా
సకలజ్ఞుండవు రామ నీ వెఱుఁగవే సామీరిమాహాత్మ్యముల్. 75

సీ. కదలఁ డీతఁడు వజ్రకఠినవిగ్రహుఁ డంచుఁ,బోలఁగా మైనాకశైల మెఱుఁగు
వెఱవఁ డీతఁడు మహావీరశేఖరుఁ డంచు, శోధింప వచ్చినసురస యెఱుఁగుఁ
గలఁగ డీతఁడుభూరిగాంభీర్యనిధి యంచు, వడిఁ బాయ యిచ్చినవనధి యెఱుఁగు
బలిమినీతఁడుమహాబలునంతవాఁ డంచుఁ, గెరలిమార్కొనిసలంకిణి యెఱుంగు
తే. జీవదాయకుఁ డితఁడనిసీత యెఱుఁగు,రాక్షసాంతకుఁడితఁ డనియక్షుఁ డెఱుఁగు
నధికుఁ డితఁ డని రావణియస్త్ర మెఱుఁగు,సిద్ధ మిదియని రామ నీచిత్త మెఱుఁగు.

సీ. అవనిజాహృదయశోకాంధకారము మాన్పఁ,గపిరూపుఁగనినభాస్కరుఁడితండు
దశకంధరోద్యానతరువులు గూల్పమైఁ,దాల్చురఘురామమారుతం బితండు
సైన్యేశపంచకసప్తమంత్రిజగిరుల్. వ్రాల్పఁ బ్రాణము లొందువజ్రమితఁడు
పరపలాశికులంబు భస్మంబు గావింప, వాల మూనినదవజ్వాలి యితఁడు
తే. రావణునిధైర్యలతఁ ద్రుంప అంప మితఁడు
దైత్యుల కకాలమునఁ దోఁచుమృత్యు వితఁడు
సకలకపిలోచనచకోరచంద్రుఁ డితఁడు,
ఖరకరాన్వయ మీ కేడుగడయు నితఁడు. 77

ఉ. రావణుపుత్త్రుకంటె నలరావణుకంటెను వాలికంటె ని

ప్పవని బాహువిక్రమవిభాసితుఁ డించుక యగ్గిసేని లో
కావలి హావళిం గను మహర్షులశాపముచే స్వకీయ మా
లా వెఱుఁగండు మత్తకరిలాగున నుండు నితండు రాఘవా. 78

తే. అని ప్రసంగవశంబున ననిలసుతునిఁ, బ్రస్తుతించిన కుంభసంభవునిమాట
లమృతధారలవలె వీనులార నలరి, యెలమితో జానకీజాని యిట్టు లనియె.

మ. కలశీసంభవ నీవు పల్కినది నిక్కం బంజనాపుత్త్రుఁ డన్
బలుతెప్పం గొని కాదె దాఁటితి విపత్పాథోధి యీభానుజా
దులు నన్ గొల్వ నొనర్చె నీతనిమృదూక్తుల్ గావె యిమ్మేటి కే
వలభక్తిన్ ననుఁ గూర్చి చేసినపనుల్ వర్ణింపఁగా శక్యమే. 80

సీ. తనవాగమృతధార ధరణిజాప్రాణముల్, నిలిపి నామదిలోనివెగులు దీర్చె
శరణుసొచ్చినవిభీషణుఁ గూర్చుకొమ్మని, తెలిపి మాకుఁ బ్రతిష్ఠ గలుగఁజేసె
బవరంబులోఁ బేర్చి పంక్తికంఠునియురస్స్థలిముష్టిహతి నొంచి సగముసంపెఁ
బరులచే హతులైన ప్లవగోత్తములకు జీవము లిచ్చి మాప్రాభవంబు నిలిపెఁ

తే. బడినలక్ష్మణు బ్రతికించి భానుకులము, నిలిపె నంతటఁ జననీక నిర్వహించె
వేయు నిఁక నేల నాకొఱకై యనేక,దనుజవీరులఁ ద్రుంచె నీయనిలసుతుఁడు.

ఉ. తమ్ముల బంధులం గలసి తల్లులనుం గని నేను సీతతోఁ
గ్రమ్మఱ నీయయోధ్య కధికారము గాంచి సుఖించు టెల్ల న
త్యమ్ము సమీరసూనునిసహాయతఁ గాదె మునీంద్ర యెన్నిజ
న్మమ్ములకైన నీతనిఋణం బెడఁబాపుకొనంగ నేర్తునే. 82

చ. అది యటు లుండె నీయన మహామహుఁ డర్కజుచెంత నుండి బ
ల్లిదుఁ డగువాలి నేల విదళింప కుపేక్ష యొనర్చె నాత్మశ
క్తి దెలియకుండుఁ గాక యని కిన్క వహించి మహర్షు లేటి కీ
సదమలమానసాబ్జునకు శాప మొసంగి రెఱుంగఁ దెల్పవే. 83

మ. జననం బాదిగ నీమహాత్మునిభుజాశౌర్యప్రభావోన్నతుల్
వినఁ గాంక్షించెదఁ దెల్పుఁ డంచు హనుమద్వీరావతంసంబు మూఁ
పున నాత్మీయకరంబు సాఁచి జగతీపుత్త్రీమనోభర్త వేఁ
డినఁ బల్కెన్ ముని నానటద్భవజటాకోటీకాభ్రగంగార్భటిన్. 84

## హనుమంతుని జననము.

ఉ. చండకరాన్వయాంబుధిచంద్ర రఘూద్వహ యీసమీరపు
త్త్రుండు మహాత్ముఁ డౌనె కద తొల్లిటిపుట్టుక నేకసాదరు
ద్రుం డితఁ డంచుఁ గొందఱు బుధుల్ గణియింపుదు రారహస్య మె
వ్వం డెఱుఁగుం జరాచరభవంబు లెఱింగిననీవు దక్కఁగన్. 85

శా. సాక్షాచ్ఛంభుఁడు గాక యున్నఁ గలవే చర్చింప నీశౌర్యధై

ర్యతుష్టాంతి ప్రతిభా ప్రభావములు రుద్రాంశంబు సంబార్వతీ
కుక్షిఁ వృద్ధి వహించి పావకునిలోఁ గొన్నాళ్లు వర్తించి యీ
యక్షయ్యద్యుతి పిమ్మటం బవనగర్భాంతస్థుఁడై భాసిలెన్. 86

చ. అనిలువరంబుచేఁ బిదప సంజనకుక్షిఁ జనియించి జన్మ మె
త్తినపుడె భానునిం బొదివె దేవత లిచ్చువరంబు లొంది యం
దున శిశు వొంట గర్వవతెఁ దోఁచిన మానులు శాప మిచ్చి రీ
తని కొకరుండు పేర్కొనినదాఁక స్వశక్తి యెఱుంగకుండఁగన్. 87

తే. దానఁ దనలా వెఱుంగఁడు గాన నితఁడు, వాలి వధియింపఁడది గాక వాలిభాను
సుతులఁ గొన్నాళ్లు సరి గాఁగఁ జూచి కొలిచి
యుండెఁ గావునఁ బగఁ బూన నొల్లఁ డయ్యె. 88

క. లేకున్న హనుమ కెదురే, పాకారికుమారుఁ డితఁడు ప్రభవించుట సీ
తాకాంత తెన్న దెలిపెద, నాకర్ణింపు మని మఱియు నమ్ముని యనియెన్. 89

సీ. తనధైర్యరమ కోడి కెసకాచలేంద్రంబు, సిగ్గుతోఁ దనభర్తఁ జేరికొనఁగఁ
దననామమున కుచితంబుగాఁ దనుఁ దాఁకి, శంబసాదనసామజంబు గూలఁ
దనతపోనియమంబు గనుభరద్వాజాది, వాచంయములకు సేవలు జనింపఁ
దనబాహుశాఖలు పైఁ దేయభీతాము, రులకును నిలువ నీడలు ఘటింపఁ
తే. దనరు కేసరి యను పేరవనచరేంద్రుఁ, డతని కంజన యనెడి కన్యకనొసంగె
నతనిమాతులుఁ డురువిక్రమాతులుండు, కుంజరుం డను వానరకుంజరుండు.

క. రంజిల్లఁ జేసెఁ గేసరి, యంజన నిది వింత యనుచు నంద అనఁగ న
క్కుంజరసుతతో నక్కపి, కుంజరుఁ డాకొన్నియేండ్లు కూడి సుఖంచెన్. 91

శా. సంసారోత్సవకారణం బగుతనూజాతోదయం బెంచి యా
హంసీగామినితో బహువ్రతపరుం డై దాన సవ్యాసరో
త్తంసుం డిష్టముఁ జెందనేరక మరుద్దైవంబుచే దైన్యవి
ధ్వంసం బా సతినిఁ భజింపు మని కాంతారత్నముం బంచిసన్. 92

క. పతియనుమతి గౌరీసతి, ప్రతి యగు నయ్యువతి నియమభవ్యమతి సదా
గతియ సదా గతి యని యుగ్రతపం బొనరించెఁ బెక్కుకాలం బధిపా. 93

ఉ. ఆయమ సేయుఘోరతప మంతట మెచ్చి సదాశివాజ్ఞ న
వ్వాయువు స్వోదరస్థితశివస్థిరతేజముఁ దెచ్చి యిచ్చినం
దోయజగంధి గర్భ మయి తొరపువేడుక నొక్కవర్ష మి
య్యాయతతేజుఁ దాల్చి మఱి యంచితమా నొకవాసరంబునన్. 94

మ. అమరుల్ దివ్యసుమావళుల్ గురియ రంభాద్యప్సరఃకాంత లా
డ మరుద్వైరులగుండియల్ బెదర మింటన్ భేరికాగోముఖ

ప్రముఖధ్వానము లుప్పతిల్ల దిశ లొప్పం గాంజరీగర్భవా
సమునందుండియు నిర్గమించె నితఁ డంచద్బాలభానుప్రభన్. 95

వ. అప్పుడు. 96

సీ. లలితసౌదామినీతులితదేహమువాని, నరుణారుణాంబుజాస్యంబువాని
రత్నకుండలభాసురకపోలములవాని, రంగత్పిశంగనేత్రములవాని
నాజానుదీర్ఘబాహాదండములవాని, ధవళయజ్ఞోపవీతములవాని
హారప్రభామనోహారివక్షమువానిఁ, గమనీయకరకంకణములవాని [వాని

తే. మంజురుచిపుంజిఁ గనుహాన్నమౌంజివానిఁ, బసిమిగనుపట్టునునుఁబట్టుపంచె
వాసవధ్వజనిభవాలవల్లివాని, నక్కుమారునిఁ గని తల్లి యాత్మ నలరె. 97

ఆ. అలరి చెక్కునొక్కి యక్కునఁ జేర్చి ముద్దాడి నీకు ఫలము లారగింప
వలసి నన్ని దెత్తు వాపోవకుండు నా,యన్న యనుచుఁ దల్లి యడవి కరిగె.

హనుమంతుఁడు ఫలభ్రాంతిచే రవిరాహులమ్రింగ నుద్యోగించుట.

ఉ. అంతటిలోన నీతఁ డుదయాద్రిపయిం బొడతెంచు పద్మినీ
కాంతు జపాప్రసూనరుచికాంతుఁ గనుంగొని పండటంచు వి
భ్రాంతి వహించి యాఁకటితో రణ రవిపై కెగసెన్ సమీరనా
గాంతకబాణవేగపరిహాసిసమిద్ధమహాజవోన్నతిన్. 99

తే. ఎగసి చనుచున్న యీతని తెగువఁ జూచి, గగనచరులైన గంధర్వగరుడయక్ష
సిద్ధసాధ్యులు నివ్వెఱఁ జెందియున్న, హామహాబలుం డెవ్వఁడో యనుచునంతలోన. 100

తే. భానుకడ కేఁగునప్పిన్నవానిమేని, కెండ దాఁకక యుండ నుద్దండవృత్తి
నుడిగిమిన్నేటితెమ్మెరపుప్పొడిదుమార, మొసఁగి వలిగాడ్పు వెనువెంటఁ జనుచునుండె.

సీ. పదతాడనములచే బద్ధలై పాథోధి, పాలికల్ దూలికాభంగిఁ జెదర
నూరుఘట్టనలచే నూర్ధ్వగంధర్వాది,నగరముల్ ఛిన్నభిన్నములు గాఁగ
బాహువేగంబుచేఁ బఱతెంచు వైమాని,కులవిమానంబులు కూలఁ బడఁగ
వాలవిక్షేపంబుచే లాజలను బోలి, తూలి నక్షత్రముల్ నేల రాల

తే. దేహకాంతులు చక్కఁగాఁ దేఱి చూడ, లేక ఖచరులు బెగడి చీకాకుఁ జెంద
నేదియును జూడ కీజగద్గీతచరిత్రుఁ, డట్లు చని బాలభానునిఁ బట్టె నపుడు.

సీ. ఒద్ద సేవలు సేయుచున్న ఛాయాదేవి, భీతిల్లి కరములఁ బిసికికొనఁగ
భయనివారణమంత్రపరతంత్రులై వాల,ఖిల్యాదిమౌనులు కేవ్రవ నొదుఁగ
జడుపుతోఁ గైదువుల్ విడిచి మాఠరముఖ్య, పారిపార్శ్వకు లెల్లఁ బాఱిపోవ
హతశేషమం దేవహ లట్లు గావలయుఁ బో,యీభానున కటంచు నిచ్చ నలర

తే. నలరు నాపద్మహితుఁ బట్టి యాననమునఁ, బెట్టుకొను బెటు వేఁడిగా నట్టె విడుచు
నడుచుఁ జేతులు సెగ వైనయది యటంచుఁ
గినిసి యాఁకటికడిమి నయ్యనిలసుతుఁడు. 103

చ. జగదుపకారి యీప్లవగచంద్రుఁ డటంచుఁ దలంచి భానుఁడున్
దగదగమండుచుండు కిరణంబులవేఁడిమిఁ జూపఁ డయ్యె రెం
డుగడియ లేఁగ నంతఁ దపనుం గ్రహియింపఁగ నాఁడు పర్వ మౌ
టఁ గదియవచ్చె రాహు వచటం గలవా రరు దంది చూడఁగన్. 104

ఉ. ఆగ్రహరాజుఁ బట్టినమహామహు నీతనిఁ జూచి రాహు వ
త్యాగ్రహవృత్తితోఁ గహకహార్భటిఁ జేయుచు డాయ నంత సూ
ర్యగ్రహణంబు మాని యవురా యిది నల్లనిపండు వచ్చె నం
చుగ్రలయోగ్రవిగ్రహత నొక్కట నాతని మ్రింగఁ బోవఁగన్. 105

చ. జడిసి విధుంతుదుం డితనిఁ జక్కఁ గనుంగొన లేక యయ్యెడన్
వడిఁ బరువెత్తి యత్తెఱఁగు వాసవుతో నెఱిఁగింప నాతఁడుం
గడువెఱఁ గంది నీక్రమముఁ గైకొను నంతటివీరుఁ డెవ్వఁ డం
చడుగుచు నాల్గుకొమ్ములమహాకరి నెక్కి శతారహస్తుఁడై. 106

చ. నలుగడలన్ వియచ్చరగణంబులు గొల్వఁగ నేఁగుదెంచి య
జ్జలరుహబంధుచెంతఁ బ్రతిచండకరుం డన దుర్నిరీక్షకాం
తులఁ దులకించు నీఘనుఁ గనుంగొని యెవ్వఁడొ వీఁ డటంచుఁ బే
రలుక వహించి మత్తకరి నట్టపయిం గవియించి యార్చుడున్. 107

క. పాండురుచి మించినది యీ,పండు హరింతు నని తీవ్రపడి కడుఁ బసిపా
పం డగుటఁ దెలియ కతఁడు, చండాంశుని విడిచి యలగజముపైకుఱికెన్. 108

వ. ఇవ్విధంబున. 109

తే. కేసరికిశోర ముద్భటక్రీడ మీఁది, కుఱికినంత భయభ్రాంతు లొంది చండ
పవనహతిఁ దూలుశారదాభ్రంబులీల, నభ్రమువిభుండు దెరల జంభారి గెరలి.

ఉ. భద్రగజంబుపై నుఱుకుపావని నొండొకటన్ జయింపలే
కద్రుల వ్రక్కలించుకులిశాయుధ ముద్ధతిఁ బూని వైవ న
య్యద్రిచరుండు వామహనువందున నొచ్చిన మూర్ఛఁ జెంది పూ
ర్వాద్రిపయిం బడెం గహకహార్భటిఁ జేయుచు రాహు వుబ్బఁగన్. 111

{హనుమంతుం డింద్రునివజ్రహతిచే మూర్ఛిల్లఁగా వాయుదేవుం డాత్మమూర్తి నుపసంహరించుట.}

చ. పడినకుమారునిం గని ప్రభంజనుఁ డార్తిఁ దపించి యింద్రుపై
నడరెడుకిన్కతో జగములన్నియు నిండినయాత్మమూర్తి న
య్యెడ నుపసంహరించి ప్రజ లెల్లను జేష్టలు దక్కి మిక్కిలిన్
జడిమ వహింపఁ బుత్త్రుఁ గొని శైలగుహాకుహరంబు చొచ్చినన్. 112

సీ. యాజకుల్ వహ్నిహవ్యములు వేల్వఁగఁ జాఁచు,హస్తముల్ సాఁచినయట్టులుండె
దివిజులు ప్రేరేప దివి కెగిరినదేవ,యానంబు లెగిరినయట్టులుండె

మునులు నదీతోయములఁ దోఁగ ముంచిన, యంగముల్ ముంచిన ǂ యటులనుండెఁ
బశుమృగనరముఖ ǂ ప్రాణు లుర్విని బెట్టు, నడుగులు వెట్టిన ǂ యటులనుండె
తే. భానుమండల మొక్కచోఁ ǂ బాదుకొనియెఁ, గాలగతి దప్పె సత్క్రియల్ ǂ గడచె వేద
పాఠ ముడివోయె బాహ్యమ ǂ భ్యంతరంబు, గాడ్పు బంధించి చనినయ ǂ క్కాలము
ఉ. ఆవిపరీతముల్ గని భ ǂ యంపడి కొందఱు తాపసోత్తముల్ [నను.
దేవవరేణ్యుఁ డాదియగు ǂ దేవతలుం బరమేష్ఠి చెంతకుం
బోవఁ దలంచి యుబ్బుకడు ǂ పుల్ నడవన్ వడి లేనిపాదముల్
లావఱి యున్న మేనులుఁ గ ǂ లంగినచిత్తములుం గనంబడన్. 114
తే. ఒకవిధంబునఁ జతురాస్యు ǂ నొద్ద కేఁగి
కడుఁ బ్రయత్నంబుతో మ్రొక్కు ǂ లిడి ప్రయాస [లిట్టు లనిరి.
మునఁ గరంబులు ముకుళించు ǂ కొని మొగంబు, లెత్తి దగ దొట్టికొన వార ǂ
శా. వాణీనాథ జరాయుజప్రముఖజీ ǂ వశ్రేణులం దొల్లి ని
ర్మాణం బీ వొనరించి వానికి జగ ǂ త్ప్రాణుం గదా సర్వథా
ప్రాణప్రాయునిఁగా సృజించి తతఁ డీ ǂ పట్లన్ విరోధించి త
త్ప్రాణిక్షోభ మొనర్చె నేమిటికొ యీ ǂ బన్నంబు వారింపవే. 116
మ. వనజాతాసన దేహనామసదన ǂ ద్వారావరోధంబు సే
య నితాంతవ్యథ మాయసుప్రతతి శు ǂ ద్ధాంతాంగనాశ్రేణితో
నెనయై వేదనఁ జెందె నీయడకు నీ ǂ వెల్లైన వారించి య
య్యనిలున్ స్వస్థునిఁ జేసి ప్రోవఁ గదవ ǂ య్యా లోకముల్ నావుడున్. 117
చ. వనరుహసంభవుం డనియె ǂ వారలతో వినుఁ డంజనాఖ్యయా
వనితకు వాయుతేజమున ǂ వానరవీరుఁ డొకండు పుట్టి చ
య్యన నినమండలంబుఁ గని ǂ యాఁకటిపెల్లునఁ బక్వమా ఫలం
బని కబళింపఁగా నపుడె ǂ యాడకు రాహువు వచ్చి యుగ్రతన్. 118
సీ. తనపాలిదాయమై ǂ తపనుని గ్రహియించు, నాంజనేయునిఁ జూచి ǂ యాగ్రహించి
వెఱపింపఁ బోయి తా ǂ వెఱచి శీఘ్రంబునఁ, బఱతెంచి యాదివ ǂ స్పతిని గాంచి
భానునిఁ బొదువ స్వ ǂ ర్భాను వేఱొకని, నియమింపఁ దగ వగు ǂ నే యటంచు
మాఱిన నీమీఁద ǂ నారాహువిది యేమి, యద్భుతం బని యింద్రుఁ ǂ డలుకవొడమి
తే. యపుడె రాహువుతో వచ్చి ǂ యర్కుచెంత
నున్నకపిబాలుఁ గని నిజా ǂ యుధము వైవ
హనువు భగ్నంబుగా నతఁ ǂ డవశుఁ డైనఁ బట్టిఁ గని గాడ్పు శోకంబుఁ ǂ బట్టలేక.
తే. ఈబలారాతిచేసిన ǂ యెగ్గుదలఁచి, యలిగి యాతఁడు పాలించు ǂ నఖిలజనులఁ
దనసుతునిలీలఁ జేష్టలు ǂ దక్కఁజేసె, నింక నగ్గాడ్పుఁ బ్రార్థింప ǂ నేఁగ వలయు.
తే. వాయు వధికుండు సకలదే ǂ వతలలోన, వాయువాధార మఖిలజీ ǂ వంబులకును

వాయువు బలంబు ప్రాణాదివాయులీల, వాయువె చరించుచుండుమనికాయము
క. ఆయన లేకున్న శవ, ప్రాయంబై యుండు జగము పటుతేం డీక న [లను.
వ్వాయువుఁ బ్రార్థింపుద మని, తోయజసంభవుఁడు వారితోఁ జనుదెంచెన్.
క. చనుదెంచి మారుతాశ్రిత, ఘనశైలగుహాంతరంబుకడ నిల్చిన న
వ్వనజభవురాకఁ గనుఁగొని, యనిలుఁడుగొడుకుఁగొనివచ్చియజునకుమ్రొక్కెన్.
తే. మ్రొక్కినసమీరుఁ గని యేల యిక్కడుండి, పని యొనర్చితి వత్స నీపట్టియేఁడి
వీఁడెకద యని పవిధారవివశుఁడైన, యక్కుమారునిఁ గనుఁగొని యాదరమున.
తే. పలుకుల వెలందితళుకుఁజెక్కుల విచిత్ర, పత్త్రములవ్రాయనేర్చినపాణి ననిల
సుతుని నెమ్మేను నవిరినశోష దీఱ, వాఁడు లేఁబైరువానచే వలెఁ జెలంగె.
వ. ఇవ్విధంబున. 126
తే. మూర్ఛదెలిసినయంజనముద్దుపట్టి, నంకమునఁ బెట్టి యజుఁడు ముద్దాడుచుండఁ
గాంచి హర్షించి తనవక్త్రగతి యడంచి, గాడ్పుజగములకుత్సాహకారియయ్యె.
చ. అనిలున కింపొనర్చి మది నంబుజసంభవుఁ డెల్ల వేల్పులం
గని సురలార యీకపిశిఖామణి లోకహితార్థి మీఁదటన్
మనకుఁ బ్రియం బొనర్చు మదమత్తనిశాటుల నుక్కడంచుఁ గా
వున నితఁ డుగ్రశౌర్యవిభవుండుగ మీరు వరంబు లీఁ దగున్. 128

బ్రహ్మేంద్రాదులు హనుమంతునికివరంబులొసంగి పవనుని సంతుష్టుంజేయుట.

తే. అనిన సుర లెల్ల మే లని రపుడు వజ్రి
తనశతారంబు దాఁకియు హనువు వెలయు
కతన హనుమంతుఁ డనుపేరు గాంచు నితఁడు
వజ్రహతి నొవ్వఁ డీక నని వర మొసంగె. 129
సీ. బ్రహ్మదండంబున బ్రహ్మాస్త్రమున హాని, నందనిదీర్ఘాయు నజుఁ డొసంగె
శూలరౌద్రాస్త్రపాశుపతాదికములచేఁ, జెడని ప్రభావంబు శివుఁ డొసంగెఁ
దనకాలపాశంబు దండంబు మృత్యువీ, యన నొంచ లే వని యముఁడు వలికె
నాత్మతేజమున శతాంశ మిచ్చితి విద్య, లిచ్చెద నీక నని యినుఁడు వలికెఁ
తే. బాశమునఁగట్టుబడఁడనిపలికె వరుణుఁ, డగ్నిదనచేత నశియింపఁడనియెధనదుఁ
డొసఁగెఁ దనగద నొగలనియునికి యెల్ల, కైదువుల నొవ్వఁ డని విశ్వకర్మ వలికె.
క. తక్కినదేవత లొక్కొక, రొక్కొక్కవరమ్ము నొసఁగి రుత్సాహముతో
నక్కమలగర్భుఁ డనిలుని, దిక్కు గని గణించె నెల్ల దివిజులు వినఁగన్. 131
పంచచామరము. సమీర నీకుమారుఁ డుగ్రశౌర్యధైర్యధుర్యుఁ డ
ప్రమేయశక్తి రామకార్యభార మూని రావణా
ద్యమిత్త్రభీకరప్రతాపుఁ డై చరించు లేదసా
ధ్యమీజగంబులందు వీని కించుఁ బల్కి పోయినన్. 132

క. సంతసమున నంత నభ,స్వంతుం డక్కొడుకుఁ గొంచు వచ్చి ప్రచింతా
క్రాంత యయి వగచు కేసరి, కాంత కొసఁగి యతనిమహిమ గణియించి చనెన్.

తే. రామ యాపిమ్మటన కాదె యీమహాత్ముఁ
డంతికాశ్రమములు చొచ్చి యచటిమునుల
వల్కలాజినములు వ్రచ్చి వారిమానసములు గలఁచినఁ గోపించి శాప మిడుట.

క. శాప మొసంగినఁ బశ్చా,త్తాపము ప్రాపించి దోఃప్ర తాప ముడిగి య
త్తాపసులకు సేవకుఁ డై, యాపవనజుఁ డుండి పిదప నినజునిఁ జేరెన్. 135

ఉ. బోనున నున్న మత్తహరి పోలిక బ్రాహ్మణశాపయుక్తి నెం
తేనియు శాంతిఁ జెందె నితఁ డీతనిబాహుబలం బెఱింగి స
న్మానము చేయ భానుజుఁడు మంత్రులలోపల నెల్ల వాయువై
శ్వాసగులట్ల వీరు రఘు వల్లభ పాయక యుందు రెప్పుడున్. 136

చ. విను మిఁక నొక్కవింత రఘు వీర యినుండు వరంబు లిచ్చువే
ళ సనిసమాట నెమ్మదిఁ దలంచి శ్రుతుల్ పఠియింప నెంచి యా
యన యొకనాఁడు భానుకడ కద్భుతవేగముతోడఁ బోయి మ్రొ
క్కినఁ గరుణార్ద్రదృష్టిఁ దిల కించి పయోరుహబంధుఁ డిట్లనున్. 137

మ. చదువుల్ నేర్చుకొనంగ వచ్చితివొ వత్సా త్రోవ నెట్లభ్యసిం
చెదు నాముండట నిల్వఁ గూడదు గదా శీఘ్రంబునం బోయినన్
మది యేకాగ్రతఁ జెందునే నుడువు మన్నన్ నవ్వి యన్వీరుఁ డ
య్యుదయాస్తాద్రుల నిల్పెఁ బాదయుగళం బుత్సేధదేహోగ్రుఁడై. 138

క. మును హరి త్రివిక్రమాకృతిఁ, గనిపించినయటుల నూర్ధ్వ కర్పర మెల్లన్
దనమయముగ నిండిన నీ, హనుమత్కపిఁ జూచి వెఱచె నఖిలజగంబుల్. 139

## హనుమంతుఁడు సూర్యునొద్ద వేదశాస్త్రాదులు చదువుట.

శా. భానుం డద్భుత మందె నంత నిజరూపం బూని యావానరుం
డానీరేరుహబంధు తేరి కెదురై యాకాశమార్గంబునం
దా నెంతే వడిఁ బోవుచున్ శ్రుతులు శాస్త్రంబుల్ పఠించెం బరి
జ్ఞానగ్రాహకలావిశేషములకుం జండాంశుఁ డుప్పొంగఁగన్. 140

తే. కుడిచి చల్లనినీడలఁ గూరుచుండి, గురువు చెప్పినఁ జదువ రే ధర వడుగులు
నిరశనుండయి పఱచుచు నింగిఁ గఱకు, టెండకు సహించి చదివె నీ తండు ఘనుఁడు.

క. ఈశాఖామృగశేఖరు,తో శతధృతి కవి బృహస్ప తులు మృదుభాషా
కౌశలి శ్రుతిముఖవిద్యా, వైశారద్యమున సాటి వత్తురె తలఁపన్. 142

సీ. వైరాగ్యమహిమ కీ వడుగు నివాసంబు, వినయంబునకు నీతఁ డునికిపట్టు
శమదమోన్నతుల కీ చతురుఁ డాధారంబు, దాక్షిణ్యమునకు నీ తండు చోటు

సౌశీల్యమున కీ ప్రశాంతిశాలి బిడారు, పరహితక్రియకీ ప్రసన్నుఁ డిక్క-
విక్రమస్ఫురణ కీవీరవర్యుఁడు తావు, గాంభీర్యగరిమ కీఘనుఁడు ప్రాపు
తే. బ్రహ్మవిద్యకు నిమ్మేటి పట్టుఁగొమ్మ, ఘనతపోధనమునకు నీయన నిధాన
మతులధైర్యంబునకు నీమహాత్ముఁ డిమ్ము, రామ నీభక్తికీ పుణ్యరాశి నెలవు.
సీ. గుఱిమీఱి రోదసీకుహర మొక్కట ముంప,నుప్పొంగు ప్రళయపయోధికంటె
జగములన్నియు నొక్కసారె భస్మముసేయ, నడరెడు కల్పక్షయాగ్నికంటె
బహుపర్వతారణ్యపటలిఁ జూర్ణము సేయఁ, గడఁగు సంవర్తాశుగంబుకంటె
బ్రహ్మాండభాండంబుఁ బట్టి బ్రద్దలు సేయఁ, దివిరెడువిలయభైరవునికంటె
తే. నధికగాంభీర్య మతులితంబగుప్రతాప, మనవధికవేగ మద్భుతంబైనరౌద్ర
మియ్యనిలపుత్త్రునకె కల దితనిమ్రోల, వాలి గీలియు నిలుతురే వసుమతీశ.
క. ఇనసుతుకడ నితఁ డున్నాఁ, డని యెఱిఁగియె వాలి గొంత యళుకుచునుండుం
దన కేమి యితఁడు గలఁ డని, యినసుతుఁడును వెఱవకుండు నింద్రసుతునకున్.
తే. అని యగస్త్యమహాముని హనుమమహిమ,లద్భుతంబుగఁ దెల్పిన నాలకించి
సభ్యు లనిలజుఁ బదివేలచందములను, బ్రస్తుతింపఁగ శ్రీరామభద్రుఁ డలరి.
ఉ. ఆవిపులప్రభావనిధి కంజలి సేసి మునీంద్ర వింటి నీ
చే వివిధేతిహాసములు శ్రీహనుమత్కథ లాలకించితిన్
దైవతనాథుఁడున్ రవియుఁ దండ్రి యనన్ వినినాఁడ వాలి సు
గ్రీవులజన్మ మెట్టు లెఱిఁగింపఁ గదే యన మౌని యిట్లనున్. 147

వాలిసుగ్రీవులజననము.

తే. రామభూపాల తొల్లి నారదమహర్షి, యేఁ దపంబున్నవనమున కేఁగుదేర
వాలిసుగ్రీవు లేయింతివలనఁ బుట్టి, రన నతఁడు దెల్పె నవ్విధం బవధరింపు.
చ. అమరనివాస మై మణిమయాంచితసానువు లొంది యెల్లలో
కముల ధరించి పర్వతశిఖామణి నాఁ దగు కాంచనాద్రిమ
ధ్యమశిఖరంబునందు నియమాన్వితుఁ డై యొకనాఁడు భారతీ
కమలముఖీమనోహరుఁడు గాఢసమాధి వహించి యున్నెడన్. 149
ఉ. తారకయోగనిశ్చలతఁ దాల్చినయప్పరమేష్ఠికన్నులన్
జాఱె మరందబిందువులు సారసపత్త్రవినిర్గతంబు లా
దారి ముదశ్రుబిందువు లతం డవి హస్తములన్ ధరించినన్
శూరవరుండు ఋక్షవిరజుం డనునందనుఁ డయ్యె నందునన్. 150
క. ఆనందను సృజనిచ,యానందనుఁ జూచి బ్రహ్మ హైరణ్యధరో
ద్యానమ్ములఁ గలఫలములఁ,దే నెలఁదను వ్రొమిఁకొనుచుఁ దిరుగుమటన్నన్. 151
ఉ. ఆవిధియాజ్ఞ మస్తకమునందు ధరించి యతండు కాంచన
గ్రావవనాంతరంబుల నిరంతరముం జరియించుచుం బ్రసూ

నావళి దెచ్చి తెచ్చి గురు కర్చన సేయుచు నంపఁ గ్రమ్మఱం
బోవుచుఁ గందమూలఫలముల్ భుజియించుచు ఖుత్తు మాన్పుచున్. 152

మ. ఒకనాఁ డుత్తరశృంగముం గదిసి యయ్యోర్వరక్షీశతానందపు
త్త్రకుఁ డీక్షించెఁ బ్రఫుల్లహల్లకసముద్యద్దీపికల్ షట్పద
ప్రకరప్రాంచితధూపధూమములు మీఱన్ రాజహంసచ్ఛటల్
వికచాంభోరుహసౌధవీథి దగ శోభిం జెందు కాసారమున్. 153

క. వీక్షించి యక్షు లలరఁగ, నాక్షణమున ఋక్షవిరజుఁ డటడిగ్గి తను
ప్రక్షాళనవిధిఁదీరిచి, సాక్షాదమృతంబుఁ బోలు జలములు గ్రోలెన్. 154

తే. క్రోలి తననీడ తేటయౌ కొలనినీటఁ గనఁ బడినఁ జూచి యమ్మహావనచరుండు
సహజజడబుద్ధిఁ బ్రతివనచరుఁడు వీనిఁ, బట్టెద నటంచు సరసిలోపలికి నుఱికె.

తే. ఉఱికి యం దెవ్వరిని గానకుఱక నీటఁ, బడితి నని వజ్రఘటితసోపానపంక్తిఁ
జేరినంత సరోవరశ్రీ స్వరూప, మిచ్చె నన నొక్కచక్కనియింతి యయ్యె.

సీ. తనశోణకమలాంఘ్రితలరుచుల్ మగరాల, తెలిమెట్లఁ గెంపుమెట్లుల నొనర్పఁ
దనసోయగపువాలుకనునుబెళ్కుఁజూపులు, కొలనెల్లఁగలువమై వెలయఁ జేయఁ
దనకుందనపుమేనితళుకులు తటధరా, రుహఘనావళిఁ గ్రొమ్మెఱుంగు నింపఁ
దనగబ్బిగుబ్బచనుదోయి చక్రదంపతుల సజాతివిభ్రాంతి ముంపఁ

తే. దనపెదవి సాంధ్యరాగంబు దళముకొలుపఁ
దన కచభరంబు తిమిరసంతతి సృజింపఁ [మునను.
దననగవు వెన్నెల ఘటింపఁదరుచరమణి, రమణియై యందు విహరించుసమయ

చ. కమలజుఁ గొల్చి యత్తెఱఁగు గాఁ జనుచున్న సురాధినాథుఁడుం
గమలహితుండు నచ్చెలువఁ గన్గొని దర్పకుఁ డేయుపద్మకో
శములఁ దలంకి దానిబిగిచన్నులు దానివెడందకన్నులుం
దమి వెలయింప నిర్వురును దత్తఱ మందుచుఁ బోక నిల్చినన్. 158

చ. మరు లధికంబుగాఁగ శతమన్యుని తేజము నిర్గమించి య
త్తరుణిశిరంబుపై నొలికెఁ దత్సమయంబునఁ బద్మినీమనో
హరునకు నింద్రియస్ఖలనమై యది చయ్యనఁ బోయి తద్గళాం
తరమున వ్రాలె నంచువలనం దమకంబులు దీఱ వారికిన్. 159

ఆ. శిరముమీఁదఁ బడినజిష్ణుతేజము జాఱి, వాలమున్నచోట వచ్చి నిలిచె
నట్టిచోటఁ బుట్టినట్టి వాసవుపట్టి, వాలి నాఁ జెలంగె వసుమతీశ. 160

క. ఉగ్రకరుతేజ మక్కం,బుగ్రీవగళాంతరమున మున్నొలికెఁ గదా
యాగ్రీవ నుద్భవించుట, సుగ్రీవుఁ డనంగ సూర్యసుతుఁడు చెలంగెన్. 161

చ. తనమెడహేమమాలిక ముదంబున వాలి కొసంగి పాకశా
సనుఁ డరిగెన్ దివంబునకు సప్తహయుండును గూర్మిపుత్త్రునిం

గని హనుమత్సఖిత్వ మధికోదద్యుతియుం గని వృద్ధిఁబొందు మం
చని చరమాబ్ధిఁ గ్రుంకెఁ జనె నాత్మజుఁ డుద్భవ మాట నోయనన్. 162

ఉ. ఆదిన శేష మెల్లఁ దనయద్వయితో నచటన్ వసించి సూ
ర్యోదయ మైనఁ గొంత యయియుండుట మాని వనాటమూర్తి యై
యీదృశపౌరుషంబు చెడి యేటికి భామిని నైతినో యటం
చాదిమవానరుండు వెఱఁగందుచు నచ్చొటు వాసి యయ్యెడన్. 163

చ. తనవలె వానరాకృతులు దాల్చినపుత్త్రులు గొల్వఁ బద్మగ
ర్భునికడ కేఁగి మ్రొక్కుటయుఁ బుత్త్రయుగాన్వితు నాత్మపుత్త్రునిం
గని ముద మంది నీవు తెలిగంటెలనంబునఁ గన్నవీరిఁ దో
డ్కొని ధర కేఁగి యెల్లకపికోటులఁ బ్రోవు మటంచుఁ బల్కినన్. 164

తే. విని హసాదని యాఋక్షవిరజుఁ డయ్యు, యలసరస్సునమునిఁగినసతివరూప
మేల ప్రాపించె వేగనేల యడఁగె, నానతియ్యఁగదే యన్నసజుఁడు వలికె.

ఉ. అచ్చటఁ దొల్లి పార్వతి వయస్యలతో జలకేళిఁ దేలఁగాఁ
గుచ్చితులై నరకసులు గొందఱు కాములై జలంబులోఁ
జొచ్చిన నిందుఁ జొచ్చి పురుషుల్ నిజ మిట్టులె యౌదు రంచు లో
హెచ్చినకిన్క నట్లు శపియించె త్రిలోకహిత యయ్యె నయ్యెడన్. 166

తే. అవ్విధము నేను వినియుండియుంతఁ గొంత,కాలమున కమ్మహాదేవిఁగాంచి వేఁడ
నచట మునిఁగినమగవాని కాఁడురూప
మొక్కనాఁ డుండు మఱునాఁటి కుండ దనియె. 167

తే. కావున దినంబు చనిన నీకామినీత్వ, మడఁగె నిఁక నేల తామసంబు ననికేఁగి
మించురహి విశ్వకర్మ నిర్మించె జెలువ
మొందఁ గిష్కింధఁ బాలించుచుండు మనుచు. 168

క. నిష్కర్ష చేసి దివ్యప, రిష్కారము లొసఁగి పనుప ఋక్షవిరజుఁ డ
ప్పుష్కరభవు వీడ్కొని చని, కిష్కింధను భటులతో సుఖించెం బ్రభువై.

క. జనని యయి తానె కనియెన్, జనకుం డై తానె పిదప సంరక్షించెన్
దనయుల వనచరకులనిధి, యనఁగాఁ జను ఋక్షవిరజుఁ డర్కకులేంద్రా. 170

తే. వృద్ధుఁ డై పిమ్మటను ఋక్షవిరజుఁ డింద్ర, సుతునిఁ దనరాజ్యమునకధిపతిని జేసి
భానుసూనుని యువరాజుగా నొనర్చి, చనియె నవ్వాలికథ మీరు వినినయదియ.

తే. అధిప యీపుణ్యకథ యెవ్వరైన భక్తి, వినిన వ్రాసినఁ జదివిన విపులభోగ
భాగ్యములు గల్గి బహుపుత్త్రపౌత్త్ర యుక్తిఁ
దనరుదురు భూమిఁ దామరతంప రగుచు. 172

మ. అని వింధ్యారి వచించి వెండియును రామాధీశుతో నిట్లనున్
విను ముర్వీశ్వర దైత్యుఁ డట్లు కపిలున్ వీక్షించి విభ్రాంతుఁ డై

తనలో నాఘనమూర్తినే తలఁచుచుం దైత్యారి గాఁబోలు నీ
యన గాకున్నఁ గలానె యన్యులకు నీక్రియం దత్ప్రభావోన్నతుల్. 173

రావణుఁడు బోధార్థియై సనత్కుమారునియొద్దకుఁ బోవుట.

వ. అని తలంచి వెండియు. 174

మ. పగవారై నగధారితోఁ దొడరి తద్బాహాబలక్షీణులై
తెగి హేమాక్షముఖాసురాగ్రణులు ముక్తిం జెందరే యగ్గతిం
బగ గోవిందునియం దొనర్చి సుగతిం బ్రాపింతు నంచుం గడం
గి గురుప్రజ్ఞ సనత్కుమారుకడ కేఁగెన్ వాఁడు బోధార్థియై. 175

తే. ఏఁగిచలిగట్టుపైనొక్కయెడసనత్కు,మారు జితమారుబ్రహ్మకుమారుఁగాంచి
హర్ష పులకితగాత్రుఁడై యతని కెఱఁగి
హస్తములు మోడ్చి యసుర యిట్లనుచుఁ బలికె. 176

మ. అమలజ్ఞాననిధాన యీజగములం దన్యక్తనానారహ
స్యములుం మీకుఁ గరస్థలామలకముల్ సర్వజ్ఞులౌ మిమ్మునం
టిమహాత్ముల్ నతులైన శిష్యుల నకౌటిల్యాత్మ వీక్షించి ని
క్కముగా దాఁపక యాన తిత్తురు గదా కాంక్షానుకూలార్థముల్. 177

మ. అనఘా యెవ్వఁ డనాదిమధ్యలయుఁడై యవ్యక్తుఁడై యుండు నె
వ్వనిచే నయ్యె నధీశ యుక్త మగువిశ్వం బెల్ల నెవ్వానిఁ జే
ర్కొనిసం బంధవిముక్తియూ విబుధవర్యుల్ బుద్ధి నెవ్వానివ
ర్తన మూహింపఁగఁ జాల రట్టిఘనునిం దథ్యంబుగాఁ దెల్పవే. 178

క. నా విని సనత్కుమారుఁడు, రావణునకు ననియె వినుము రక్షోవర స
ద్భావముతో నీ వడిగిన, దేవునిమహిమంబు నీకుఁ దెలిపెదఁ దెలియన్. 179

మ. అనఘుం డవ్యయుఁ డచ్యుతుం డమలుఁ డవ్యక్తుం డనిర్వాచ్యుఁ డం
జనదూరుం డఖిలేశ్వరుం డచలుఁ డక్షయ్యుం డమేయుం డటం
చు ననాదిశ్రుతు లుగ్గడింప నుతిఁ గాంచుం బ్రహ్మ మాబ్రహ్మమే
విను నారాయణ కృష్ణ విష్ణు హరి గోవిందాఖ్యలం జెల్వగున్. 180

సీ. అంతటఁ బరిపూర్ణుఁడై నిండియుండియు, జలధిలో శేషాహిశయ్య నుండు
నఖిలలోకేశ్వరుం డనుఖ్యాతిఁ జెందియు, వైకుంఠపతి యను వార్తఁగాంచు
ధవళనీలాదివర్ణనియుక్తి నొందియు, నానీలఘనదేహుఁ డనఁగ వెలయు
సకలజీవులయందు సమబుద్ధి మెలఁగియు, ఖలశిక్ష సాధురక్షయు నొనర్చు

తే. నభవుఁ డయ్యు వినోదార్థ మవతరించు
మాయఁ బాసియు మాయచే మహిమ గాంచుఁ [నాథ
బోపకుండయ్యు నుగ్రుఁడై పొడ వడంచు,నట్టిహరి నెంచశక్యమే యసుర

సీ.కన్నువిచ్చినయంతఁగలుగుబ్రహ్మాండముల్, గన్నుమూసినసవిగాంచులయము

మదిఁ దలంచినమాత్ర § నొదవు నేక్రియయైన,
మదిఁ దలంపక యున్న § మాయ యడఁగుఁ
జేపట్టిన ఖలుండు § శిష్టుఁడై వెలయుఁ జే, పట్టకున్న బుధుండె§పామరుఁడగు
వలసిన నేరూప§ములనైన వర్తించు, వలవకున్న నభంబు§నలె వెలుంగు
తే. నాదిమధ్యాంతరహితుఁడ§వ్యక్తుఁడఖిల, భువనసృష్టిక్రియా హేతు§భూతుఁడతని
సంస్మరించిన సకలదో§షములు వాయు
హరియ సేవింపఁ దగు దైవ § మసురనాథ. 182
సీ. విధుదర్శనంబుచే § విబుధబోధానంద, పాథోధిహృదయాభ్ర§పథము ముంచు
హరిప్రభావంబుచే § నాశ్రితషడ్వర్గ, భద్రదంతావళ § ప్రతతు లడఁగు
మాధవప్రాప్తిచే § మననశీలాంచిత, ప్రజ్ఞావనంబులు § పల్లవించుఁ
జక్రిసమ్ముఖముచే § జన్మమృతిక్లేశ, మారుతోద్రేకముల్ § మలయు టుడుగుఁ
తే. బాయు నాధ్యాత్మికాదితా§పత్రయంబు
తలఁగుఁ గలుషాంధకారముల్ § మలఁగు నహిత (నసురనాథ.
జాతి దుర్వృత్తిమూషిక§సమితి గలఁగు, నరయు మింతయుఁ గ్రమముతో§
చ. అన విని రావణుం డను మ§హాత్మ ముకుందునిచేత సంగరం
బున హతులైనశాత్రవులు § వొందెడి సద్గతి యాన తియ్యవే
యన హరిచేత నొన్చిన సు§రాదులు శ్రీహరిలోక మంది యం
దనయము విష్ణురూపధరు§లై విహరింతురు రాక్షసేశ్వరా. 184
వ. అని పల్కి సనత్కుమారుండు వెండియు నిట్లనియె. 185
సీ. ప్రణవంబు జపియించు§ఫలము కేశవుఁ జేరి, యట్టహాసముఁ జేసి§నంతలోనఁ
భాగీరథీస్నాన§ఫలము శ్రీధరుఁ డేయు, నస్త్రాళి మునిఁగిన§యంతలోన
బహుకాలచింతనా§ఫలము నారాయణు, నలుకమై వీక్షించి§నంతలోనఁ
బ్రాఁబల్కుల నుతించు § ఫలము నందకపాణి, నదలించి తిట్టిన§యంతలోనఁ
తే. దనువు గృశియింప శాంతితోఁ § దపముసేయు
ఫలము బహువత్సరంబుతోఁ § బద్మనాభు [గలదె మేలు.
నాఁగి మెయి వొంగ మార్కొన్న§యంతలోనఁ, గలదు హరితోడిపగకంటెఁ§
చ. చపలత లేనిచూడ్కులను § సారెకు శౌరిముఖంబు చూచుచున్
విపులరణోత్సవంబులను § విష్ణునిఁ బేరులు పెట్టి పిల్చుచుం
గుపితమనస్కులై యొరసి§కొంచు ముకుందుని మ్రోలఁ గూలుదై
త్యపతులభాగ్య మెంత సుకృ§తాత్ముల కైనను గల్గ నేర్చునే. 187
చ. ఆయుధధార ముంచి రుధి§రారుణచందనకర్దమంబునం
గాయము నించి శాతవిశి§ఖప్రసవావళి పై నిగిడ్చి దై
తేయులు శౌరిచేత నతి§తీవ్రముగాఁ గయికొండ్రు ముక్తి స్వా

ధ్యాయతపోమఖక్రియలు దాల్చినధన్యులకంటె ముందఱన్. 188
చ. పలుకులు వేయు నేల మధుభంజనుకిన్క తపఃఫలంబు శ
త్రుల కని యమ్మహామునివరుం డెఱిఁగించినఁ బంక్తికంధరుం
డలరి ముకుందుతో సమర మబ్బునె యవ్విభుచేతఁ జచ్చి ని
శ్చలపద మొందఁగాఁ గలనె శాంతినిధీ వివరింపవే యనన్. 189
క. సనకావరజుం డిట్లనుఁ, గనకాచలధీర పంక్తికంధర విను మా
ఘనకాయునితో నని మాఱొక్కని కాయము విడువఁగలవు కుందకు మదిలోన్.
తే. అనిన ముద మంది దశకంఠుఁ డమ్మహాను, భావుఁగని యెన్ని నాళ్లకప్పని యొనర్చు
హరి యన సతండు వెండియు ననియెఁ గృతయు,గాంతమున మానవేంద్రుఁడై
వ. అత్తెఱంగెఱింగించెద నాకర్ణింపుము. [హరి జనించు.
సీ. వేల్పులు గావించువిన్నపంబులు వించు, హరి నిన్ను వధియించు నాత్మమించు
రవికులాబ్ధి జనించు రామనామము గాంచుఁ, దపసిజన్నముఁ బెంచు రిపుల నొంచు
శిలఁ జెల్వ నొనరించు శివునిచాపము ద్రుంచు, జానకి వరియించు సంతసించు
జామదగ్న్యుఁ గలంచు జనకాజ్ఞఁ బాలించు, మునివృత్తిధరియించు వనిఁ జరించు
తే. నీసహోదరిముక్కు ఖండింపఁ బంచు, సరగ ఖరదూషణాదుల సంహరించు
నవనిసుత నీవుగొనిపోవ నాగ్రహించు, నదినిమిత్తంబు నిను రాముఁడని వధించు.
సీ. మణికిరీటమువాఁడు మకరకుండలకాంతి, దళుకొత్తు చెక్కుటద్దములవాఁడు
నిడుదకన్నులవాఁడు నీలమేఘచ్ఛాయఁ, గరమొప్పు దివ్యవిగ్రహమువాఁడు
కంబుకంఠమువాఁడు కౌస్తుభశ్రీవత్స, లక్ష్మియుతోరస్స్థలంబువాఁడు
కనకాంబరమువాఁడు ఖడ్గాదిపంచాయు,ధముల మించు చతుర్భుజములవాఁడు
తే. చిలువదిండిహుమాయిపైఁ మెలఁగువాఁడు
లీలఁ బెనుఁబాముపైఁ బవళించువాఁడు
నీమనోరథ మీడేర్చు నిక్కముగను, సంశయింపకు నున్న రాక్షసవిభుండు.
ఆ. అతనిఁ బెక్కుగతుల నుతు లొనర్చుచు భక్తి. నతు లొనర్చి దేవతతుల నుతుల
నతులభీతు లొదవ నచ్చోటుఁ బెడఁబాసి, చనియె స్వైరవృత్తి జనవరేణ్య.
ఉ. రామనృపాల వింటి గద రావణుబుద్ధిసమృద్ధి జానకిం
గాముకుఁడై హరించె నని కానక పల్కదు రామె యిందిరా
శ్యామ యటంచు నీవు హరి వంచు నెఱింగియె యుద్ధభూమి నీ
చే మృతిఁ బొందఁగా వలసి సీత నొగిం గొనిపోయె లంకకున్. 196
క. అని పల్కి మఱియుఁ గలశజ,మునిధూర్జటి యనియెఁ గమలముకుళనసమయా
గ్రనటన్నిటలతటీలో,చనరటదంఘ్రిపుటకటకచటులార్భటులన్. 197
మ. రవివంశంబున వెన్నుఁ డెప్పు డవతారం బౌనో యమ్మేటితోఁ
బవరం బెప్పుడు గల్గునో యెపుడు తద్బాణాహతిం గూలి దు

ర్భవమున్ మృత్యువు లేని దివ్యపదముం బ్రాపింతునో యంచు నెం
చి విరాగస్థితి సంచరించు ననురక్తశ్రేష్ఠుండు సీతాధిపా. 198

చ. నెమకి సనత్కుమారుఁ గని నీమహిమంబులు విన్నదాదిగా
నమరవిరోధి నీమదికి నల్క జనింప సురాలి నొంచు లో
కముల నలంచు జన్మములు గాంచిన విఘ్నము లాచరించు సం
యములఁ గలంచుఁ బుణ్యసతు లన్న గ్రహించుఁ జరించు నెయ్యెడన్. 199

చ. అలయక యిట్లు ద్రిమ్మరుచు నద్దశకంధరుఁ డూర్ధ్వలోకముల్
నలఁకువఁ బెట్ట నెంచి యొకనాఁడు మణీమయపుష్పకద్యుతుల్
నలుదిశ లావరింపఁగఁ జనంగ ననంగహరుం డనంగ ని
ర్మలరుచి నుల్లసిల్లుసురకాననివరుం డెదు రయ్యె నయ్యెడన్. 200

క. ఎదు రైనపోరుదిండికిఁ, బదిశిరములపొలసుదిండి ప్రణతుం డై నా
రద యెచటినుండి యెటఁ జని, యెద నెఱఁగింపుము విశేషమేమి యటన్నన్.

చ. ఎలనగ వంకురింప ముని యిట్లను రావణ యింక నేమి విం
తలు వివరింతు నీవిజయఘాటికి భీతిలి యూర్ధ్వలోకముల్
వలసలు దీయసాగె బలవంతుఁడ వన్నను నీవె కాక నీ
కిల నొకరుండు సాటి గలఁడే యన బెట్టుగఁ గేరి నవ్వుచున్. 202

మ. బలుమీసల్ వడిఁ గొల్పుచున్ బిగువుతోఁ బౌలస్త్యుఁ డేనుంటి వా
వలసల్ దీసెనె యూర్ధ్వలోకములు దేవర్షీంద్ర యట్లైన నం
దుల కేఁగం బని యేమి శౌర్యమున నన్నుం దాఁకి పోరాడఁగాఁ
గలవాఁ డెక్కడ నుండు నిక్కముగ వక్కాణింపవే నావుడున్. 203

ఉ. ఆముని గొంతసేపు హృదయాబ్జమునం దలపోసి యాసుర
గ్రామణిఁ జూచి పల్కె సురకంటక కయ్యము సేయఁ గోరినం
దీమన ముప్పతిల్లఁ దెలిదీవికిఁ బొమ్మచటం జతుర్భుజుల్
తామరసాయతాక్షులు సితప్రభు లుందు రజయ్యు లందఱున్. 204

శా. చండాంశుప్రతిమాన తేజములతోఁ సౌవర్ణభూభృన్నిభా
ఖండాత్యున్నతదివ్యదేహములతోఁ గౌమోదకీచక్రకో
దండాద్యాయుధపాళితోఁ దనరు శ్వేతద్వీపగుల్ త్వద్భుజా
కండూచండిమఁ బాప నోపుదురు లంకానాథ పొమ్మం చనన్. 205

క. ఆరావణుఁ డను క్రమ్మఱ, నారదుఁ గని యేతపం బొనర్చినవా రా
వారాశి యొకఁ బుట్టుదు, రారూఢజ్ఞాన తెల్పు మన నతఁ డనియెన్. 206

మ. హరిసేవాపరు లచ్యుతాంఘ్రికమలధ్యానాన్వితుల్ మాధవ
స్మరణాసక్తులు విష్ణుమంత్రజపితల్ చక్రాయుధార్చారతుల్

గరుడాఘాతకథాశ్రుతిప్రియులు రక్షశ్శ్రేష్ఠ యశం దుద్భవిం
తురు నారాయణచక్రనిర్దళితగాత్రుల్ మింతు రబ్ధివిలోన్. 207

మణికంధరుఁడు నారదప్రేరితుఁడై శ్వేతద్వీపమునకుఁ బోవుట

ఉ. నా విని పంక్తికంధరుఁడు నారదు వీడ్కొని వేడ్క మీఱ న
ద్దీవిఁ గనుంగొనం దలఁచి తీవ్రముగాఁ జను చుండి వార్ధులున్
దీవులుఁ బర్వతంబులు నదీప్రతతుల్ విపినాంతరంబులున్
ద్రోవను జూచుచుం గడచి దుగ్ధసముద్రముఁ గాంచె ముందటన్. 208

తే. కాంచి చెంగట మంత్రిపుంగవులఁ గాంచి
కాంచితిరె యీయకూపారకాంచికాస
మంచితక్షీరనిధిహీరమణివిరచిత, కాంచిరుచిఁ గాంచి చెలువు ప్రశంసించె నెదుట.

సీ. శకలవాలోత్థితప్తజలశీకరంబులు, మెఱుఁగుముత్యము లేర్పఱుప రాదు
కలికిరాయంచపక్కలమించు తెలిచాయ, తెరలతేటయు గుఱుతెఱుఁగరాదు
జలబాలికాపాలికలపాక్కిళుల వర్తులానత్రముల భేద మరయ రాదు
తఱుచుగా నిటికొన్న నురుఁగులకుప్పల, నిసుకతిప్పల నిర్ణయింప రాదు

తే. కనుఁగొనఁ దుదాత్తదాత్మత్వజనితకీర్తి, ముంచుకొనె నన సహజమై మించు ధవళ
కాంతి దిక్కుల నెల్లఁ బిక్కటిల వెలయు, పాలమున్నీరు కన్నులపండువయ్యె.

సీ. వలయుకోరికలియ్యఁగల పెయ్యగలిగిము, ట్టింపచుల్ పరితుష్టిఁ జెందు టెల్లఁ
మెడఁ గెంపురాతాళి నిడుకొని పసమాలి, లిబ్బిగుబ్బెతఁ బ్రబ్బి యుబ్బుటెల్ల
వింటితెర్వరి మేటి వెల్ల గొరును నిక్క, చెవులనీలని నెక్కి చెలఁగు టెల్లఁ
గటికిచీఁకటికి నగ్గంబైన రేవన్నె, లాఁడి వెన్నెలగిముఁ గూడు టెల్లఁ

తే. గూటిచవి వేలుపు లెఱింగికొనుటయెల్ల, నమరవనమీవి న్రాఁకుల నమరు టెల్ల
హరుఁడు శ్రీకంఠుఁ డను పేరు సలుపు టెల్లఁ, దలఁప నీక్షీరవారాశివలనఁ గాదె.

మ. వలమానాంబుకరీంద్రహస్తచలనావర్తభ్రమత్తోయదా
వలి మంథానమహీధరభ్రమణభావం బూన శంఖాబ్జశై
వలకూర్మాదులు దత్తదంగముల కేవల్ సుల్కఁ జెల్వయ్యె ని
క్కలశాబ్ధిం బునరప్సరోజననశంకాహేతువుల్ చంచలల్. 212

చ. అనుపమబాడబానలశిఖావళిపైఁ గనిపించెనో యనం
దనరెఁ బ్రవాళవల్లికలు దానవులార కనుం డటంచు వ
ర్ణన మొనరించుచున్ దనుజనాయకుఁ డవ్వసరాశి దాఁటి చెం
దినకుతుకంబుతోడఁ దెలిదీవిఁ గనుంగొని చేరఁ బోవఁగన్. 213

చ. స్థలమహిమంబు పెంపున నిశాచరనాథవిమానరాజ మ
వ్వలఁ జన లేక వాయుహతవారిదమున్ వలెఁ గ్రమ్మఱంగ మం
త్రులు భయ మంది యిన్నెలవు దొడ్డది మేనులు కంప మందెడిన్

నిలిచెద మేము పుష్పకము నిల్పినచో సురేంద్ర నావుడున్. 214

చ. నగుచు దశాస్యుఁ డిట్టు లయినన్ నిలువుం డని పుష్పకంబు శీ
ఘ్రగతిని డిగ్గి సాహసము గాఢపరాక్రమధైర్యసంపదల్
మగఁటిమియుం దగన్ దురభిమానముతోఁ దెలిదీవిఁ జొచ్చి పో
యె గరుడకేతుదర్శనసమిద్ధమనోరథదుర్నివారుఁడై. 215

వ. ఇత్తెఱంగున దైతేయస్వామి శ్వేతద్వీపంబు ప్రవేశించి తత్ప్రదేశంబున.

సీ. ఘనసారసితవాలుకాప్రదేశంబులు, శశికాంతవేదికాసముదయములు
మరకతప్రవిభాసమానసోపానముల్, పద్మరాగోల్లసత్పర్వతములు
సౌవర్ణకమలభాస్వరసరోవరములు, హరిచందనాంచితోద్యానములును
వివిధవిద్రుమలతావృతలతాగృహములు, బహువర్ణశుకపికభాషణములు

తే. బంధురానేకవిధదివ్యపరిమళములు, మహితవజ్రోపలనిబద్ధమార్గములును
నిర్మలోదకపరిపూర్ణనిర్ఝరిణులు, గలయెడల్ చూచిదనుజుఁడక్కజముఁ జెంది.

మ. ఒకశృంగారవనంబులో సఖులతో నొయ్యారముల్ మీఱ ను
త్సుకతం గ్రీడ యొనర్చుభామినుల రక్షోభర్త వీక్షించి చెం
తకుఁ బోవం జెలి యోర్తు పట్టి యఱచేతం బెట్టి యెవ్వాఁడ వే
టికి నిచ్చోటికి వచ్చి తీ వనినఁ గుంఠీభూతగాంభీర్యుఁ డై. 218

క. జడిసియు జడియక విశ్రవుకొడుకన్ దశముఖుఁడ రణము గోరి యిచటికిన్
నడతెంచితి నను మారొ్కని, యెడువీరుని నొకనిఁగాన నేమందు ననన్. 219

చ. కిలకిల నవ్వి యచ్చెలి సఖీమణులం గని యమ్మలార విం
తలు గనుఁగొంటిరే యిదిగో తానఁట యిక్కడ నున్నవారితోఁ
గలహ మొనర్ప వచ్చె నఁట కాదని పట్టిన నీఁడు చేతిలో
పలికిని లేఁడు నేఁడు బహుభంగులఁ బ్రేలెడు నంచుఁ జూపినన్. 220

ఉ. వారలలోన వేఱొకతె వచ్చి రయంబున దానిచేతిలో
బీరము దక్కియున్న యతిభీతుని రావణుఁ బట్టి పాణిపం
కేరుహసీమఁ బెట్టుకొని క్రేవలఁ బోర్లినఁ బోర్ల నీక యూ
కౌర విచిత్రమైనపురు గబ్బె నటంచుఁ జెలంగు చున్నెడన్. 221

ఆ. దానిపాణి నున్నవాని వేఱొక్కతె, బలిమిఁ దిగిచి తలలు పదియుఁ జేతు
లిరువదియును గల్గి యీపురుగెంతవిం,తాయె ననుచుఁబట్టియాడఁదొడఁగె.

ఆ. ఒకతెచేత నతని నుండనీయక నతు, లొకతెచేతివాని నొకతె యొడిచి
బూచి బూచి యనుచుఁ బోనీక పిడికిళ్లఁ, బట్టి పట్టి గాసిపెట్టుటయును.

క. ఆయిందుముఖులచేఁ బడి, రాయిడిఁ బడి నలుఁగుడువడి రావణుఁడు వడిన్
గాయమునొచ్చినఁ దొలఁగు,నుపాయము మఱిలేక యొకతెపాణిఁ గఱచినన్.

ఆ. చేయిఁ గఱచెనమ్మ చెల్ల నీచెడుపురు, గేడ నుండి వచ్చె నీడ కంచు

జడిసి కెలసనున్న సకియపై వైచిన, నదియు సతని బట్టియాగ్రహామున, 225.

క. మాచెలిని గఱవ వచ్చితి,వే చెడుపురుగ యని మింటి కెగసి రయమునర
డాచేత నున్నరక్కను, నాచక్కటివార్ధి విసరి యది పడవైచెన్. 226

క. వైచినc బవిధారానిహ,తాచలముం బోలి దైత్యుc డంబుధిc బడినం
జూచి సురమాని గంతులు, వైచుచుc దెలిదీవి నున్న వనితలcబొగడెన్. 227

శా. శ్వేతద్వీపముకొమ్మ లీగతిcదనుం జీకాకు గావించినన్
దైతేయాగ్రణి భీతివిస్మయపరీతస్వాంతుc డై యింతయుం
జేతోజాతగురుప్రభావ మనుచుం జింతించుచున్ లేచి ల
జ్జాతాపంబులు ద్రోచి లంక కరిగెన్ సామంతసంఘంబుతోన్. 228

చ. వనితలచేత గాసిపడి వచ్చితి విష్ణునితోడ నెట్టు మా
ర్కొనc గలవాడ నంచు మదిc గొంకcడు రావణుc డెట్టులైన ని
న్నని నెదిరించి నొంచెద నటంచు గణించు వచించు వాక్కులం
దన కెదు రెవ్వ రం చది మదం బని తోcచును విన్నవారికిన్. 229

ఉ. కాంచనగర్భదత్తవరగర్వమునం గడు మించియున్న రా
త్రించరరాజు నట్లు తెలిదీవివధూటులచేత గాసి సే
యించినవాcడ వీ వెఱుcగవే యిది యేల యెఱుంగనట్టు లా
లించెద వబ్జబాంధవకులీనతc జెంది సరోరుహేక్షణా. 230

చ. సబలు నశక్తుc జేయుదు వశక్తు బలాఢ్యునిc జేయు దజ్ఞునిన్
విబుధు నొనర్తు వవ్విబుధునిన్ జడుcగా నొనరింతు వెట్లెఱుం
గcబడు భవత్ప్రభావ మజరీకంతుహరాదు లెఱుంగ లేరు వే
డబములు గాక యైహికజడత్వము లున్నవె నీకు రాఘవా. 231

మ. ధరణీదైవతశాపవాక్యమున నీద్వారస్థులే దేవతా
పరులై మూcడుభవంబులన్ నినుc గనం బ్రార్థించినన్ ఘోణివై
హరివై తొల్తటిదైత్యరూపములు సంహారంబు గావించి తీ
కరణిన్ రావణకుంభకర్ణు లయినన్ ఖండించి తీరూపునన్. 232

క. శాపవశమ్మున నీరిపుc, డై పౌలస్త్యుండు కోరినటువలె నీచే
నేపడcగెను ద్వాపరమున, నీపరిభవ మంది ప్రొందెనయు విముక్తిన్. 233

వ. అని పలికి కలశజుండు వెండియు. 234

తే. రాముc గనుcగొని శ్రీరఘురామతపన, ధామశుభనామ కారుణ్యధామనృపల
లామ దశకంధరవిరామ సీమహత్త్వ, మెఱిcగి నుతియింప నేర్తునే యించుకైన.

అగస్త్యాదిమునులు రామునివీడ్కొని స్వస్వనివాసంబులకుc బోవుట.

నిరోష్ఠ్యసీసము. జయ దశరథరాజజలధిసాగరచంద్ర, జయ తాటకాకరంటకకరీంద్ర
జయ ధరాదికజగజ్జాలరక్షాదక్ష, జయ దయారసనిరంజనకటాక్ష

జయ ఘనాహల్యాఘకలయదాంఘ్రిసరసిజ, జయ సహస్రాదిత్యసదృశ తేజ
జయ చంద్రధరశరాసనధరాధరశక్ర, జయ నిగమాంతసంస్తుతజటిలచక్రి
తే. జయ ఖరాదినిశాటశిక్షానిధాన, జయ కిరాతీకృతార్చనసన్నిధాన
జయ నిశాతశరాహతిజలనిధాన, జయ జనకకన్యకాధీన జయనిధాన. 236
చ. త్రిదశులచింత జాఱె నమరేంద్రతతివంతలు గీఱె మానిన
మ్మదములు మీఱె నీవలన మార్తురఁ ద్రుంచి జయంబు గాంచి యే
కొదవయు లేని నిన్నుఁ గనుఁగొంటిమి వేడుక లయ్యెఁ బోయి వ
చ్చెద మికఁ మమ్ముఁ బంపు రఘుశేఖర నిన్ను శుభంబు లొందెడున్. 237
తే. అనిన నానందకందళితాంతరంగుఁ, డై రఘుస్వామి కలశజుం డాదియైన
మునులకుఁ గరాంబుజంబులు మోడ్చి సూక్తి
వినయము వహింప నిట్టు లని విన్నవించె. 238
చ. అతులతపోమహత్త్వనిధులార భవత్కరుణాకటాక్షసం
గతులకు నెల్ల సౌఖ్యములు గల్గుట వింతయె మిమ్ముఁ గన్న దు
ష్కృతములు నిల్చునే తలఁప నేటికి నిష్కృతులైన మీఁదటం
గ్రతువులు నేనొనర్చు నెడ రావలయుం గృప మీర లిందఱున్. 239
శా. వీనుల్ సౌఖ్యముఁ జెందె మీవచనముల్ విన్నందుకున్ మిమ్ము స
న్మానం బొప్పఁగఁ జూచి లోచనము లానందించె యుష్మత్పదా
ధీనుం డన్ గృపఁ జూడుఁ డంచని సభక్తిన్ మ్రొక్కి దీవించి యా
మౌనుల్ వీడ్కొని పోయి రంత రఘురామస్వామి హృష్టాత్ముఁ డై. 240
ఉ. వారి గుఱించి కొంతవడి వర్ణనసేయుచు నుండి విప్రులం
బౌరుల నిష్టబాంధవుల భానుకుమారవిభీషణాదులం
గూరిమితమ్ములన్ సఖులఁ గొల్చినభృత్యుల సాదరాంచితో
దారమృదూక్తులం బనిచి తానును లోపలి కేఁగె నయ్యెడన్. 241
చ. చరమదిశానురక్తి రవి జాఱెఁ గుముద్వతి మీఱెఁ బద్మినీ
స్ఫురణలు దాఱెఁ జక్రములభోగము దీఱె ద్విజాళి సంధ్యకున్
సరసులఁ జేరె నీడములఁ జక్కికిఁ బక్షులు పాఱె వేటకు
న్దురుసుగ మారుఁ డస్త్రములు నూఱెఁ దమంబును బేరె దిక్కులన్. 242
ఉ. అంతకుమున్నె రామవసుధాధిపుఁ డంతిపురంబునందు సా
యంతనసత్క్రియానిచయ మంతయుఁ దీరిచి కేళికాగృహా
భ్యంతరసీమ భూమితనయాకృతసేవల స్వాంత మెంతయున్
సంతస మంద నర్హ మగుచందమునన్ నిదురించె నయ్యెడన్. 243
చ. పులుఁగుల నెచ్చరించి తొగపువ్వుల నిద్దుర పుచ్చి తమ్ములం
గలకల నవ్వఁ జేసి వలిగాడ్పుల దిక్కుల నించి తారకా

విలసనవైభవం బడఁచి వేకువవేళ రహింప రాము మే
ల్కొలుపఁగ వందిమాగధముఖుల్ చనుదెంచి యుదంచితార్భటిన్. 244

సీ. చోఱవై వారాశిఁ దూఱి చోరునిఁ జీరి, మీఱుచారువిహార మేలుకొనుము
మేటితాఁబేటిబూమెలు పూని మంథాన, శైల మెత్తిన ధీర మేలుకొనుము
ఘోణివై సంభృతక్షోణివై రిపు యుద్ధ, కేళిఁ గూల్చినశూర మేలుకొనుము
భక్తుమాటలఁ బట్టి బలుకంబమునఁ బుట్టి, మెఱసిననరసింహ మేలుకొనుము
తే. లీలవటువృత్తిఁ గనుధన్య మేలుకొనుము, మేదినీశప్రమర్దన మేలుకొనుము
శూలికోదండఖండన మేలుకొనుము, నీలనీలాంబుదశ్యామ మేలుకొనుము. 245

చ. మునుకొని దేవ నీవు కనుమూసిన లోకము లస్తమించు నీ
కనుఁగవ విచ్చి చూచిన జగత్త్రయి మేల్కను విష్ణుమూర్తియా
నినుఁ గొనియాడఁగాఁ దరమె నిద్దుర మాలి జగంబుఁ బ్రోవవే
మనుకులనాథ యంచుఁ బలుమాఱును వారు నుతుల్ ఘటింపఁగన్. 246

క. విని మేల్కని తనకంటెన్, మును మేల్కని చెలువుఁ బూని ముందట నిలుచుం
డినసీతమొగము గని పతి, వెనుకన్ మణిదర్పణంబు వేడుకఁ గనుచున్. 247

సీ. వాడినవిరులతో వానుథేయీనేత్ర, కజ్జలకలితాలికంబుతోడఁ
జిటులుమైపూఁతతో సీతాదృఢోరోజ, కాశ్మీరచారువక్షంబుతోడఁ
జాఱుకైశికముతో జనకజాతాంబూల, రసరాగలసితనేత్రములతోడ
బడలు నెమ్మొగముతోఁ బంక్తిరథస్నుషా, గల్లహారిద్రాంకగళముతోడఁ
తే. కేళిగృహసీమ వెడలి భాగీరథార్క, కన్యకావినదీతోయకలితకనక
కలశములు సీతసఖు లూని కాచియున్న, యల్లమజ్జనశాలకు నధిపుఁడరిగె.

చ. జలకము లాడి క్రొంజిలుఁగుచల్వలు దాలిచి పుణ్యవేదిపై
నెలకొని సంధ్య వార్చి జపనిష్ఠలు దీర్చి కృతాగ్నిహోత్రుఁడై
వలయుధరామరేంద్రుల కవారిగ దానము లిచ్చి పంచి మా
తలకు నమస్కరించి కులదైవము గాంచి భజించి పిమ్మటన్. 249

రాముండు కొలువుకూటంబునఁ బేరోలగం బుండుట.

సీ. మణిసహస్రముల ద్యోమణిసహస్రంబుల, డంబు మెచ్చనికిరీటంబుఁ దాల్చి
మొగముచంద్రుని గెల్వ మొనయుకీర్తియనంగఁ, దెలివిగాఁగపురంపుఁదిలకమూని
నిజగుణావలిలీల నిర్మల శ్రీ మించు, తళుకుముత్యాలచౌకళి ధరించి
బలిమికేళికిఁ బూనుబలుబిరుదములు నాఁ, గరముల వజ్రాలకటకము లిడి
తే. పొసఁగఁగుంకుమగందంపుఁబూఁతరత్న, హారములుగాన రామున్తియంబుటంగి
రహిఁ దొడిగి పెద్దపీతాంబరంబు వెలయఁ
గొలువు సింగార మయ్యె రఘుప్రభుండు. 250

వ. ఇత్తెఱంగునం గొలువు సింగారంబై యప్పతంగకులపుంగవుండు నిజాంగన

మెఱుంగు వాలుఁజూపులతో నివాళించి మేలికపురంబుఁబాగా లొసంగినం గై
కొని సీతయనుంగునెచ్చెలి దెచ్చి యుంచిన కాంచనపాదుకాయుగళంబు వెట్టు
కొని తనగండపెండెరంబు రవళి ననుసరించు గిలుకుటందియరవళితో వెంటవచ్చి
పుడమిపట్టి యిచ్చు మడుపు లందుకొనుచుఁ ద్విచతుఃకక్ష్యాంతరంబులు
గడచి యయ్యంతి మరల ననిచి ముదంబున నెదుర్కొని పవననందనుం
డొసంగినకైదండ గొని తనయిరుగెలంకుల నకలంకముకురముఖులు పట్టు
హొంబట్టు జిగిగచ్చు టరిగలనిగనిగలతో నొరయు మణిమకుటప్రభలకు
నికటంబు లగుపద్మరాగమణిద్వారదేహళీవిటంకంబులఁ బొంకం బై మీఱు
హజారంబుఁ జేరి యంతకుమున్నె యచ్చటికి వచ్చియున్న వసిష్ఠాదిముని
శ్రేష్ఠుల కభివందనంబు లొనరించి తదంచితాశీర్వాదపురస్సరంబుగాఁ గాంచన
మయోచ్చాసనంబున నెలకొని కాంచనగిరిశిఖరంబుపై నిండోలగంబున్న
యన్నలు మొగంబుల కున్న విన్నాణంబు వహించి తలంపురామిన్న గద్దియ
పై నెలకొన్న వేల్పుమన్నె వాని చెన్నున నున్నతిగని తిన్ననగు నడలు నున్న
నగు తొడలు మిన్ననగు కౌనులు హొన్నుజిగిమేనులు బెళుకుఁదెలిగన్నులుఁ
గులుకువలిచన్నులుఁ దలిరునునుమోవులు నలరు పెనుతావులుఁ గలయొప్పు
లాఁడులుతమకప్పు పెన్నెఱులకు జోడుగా కివి వెలవెలనయ్యెఁ జూడుండని తెలి
పెదువదువున వెలిచామరంబులు వైవఁ జందురునగు మొగంబులు గలకొందఱు
కుందరదనలు తమ తెలినగవు వెన్నెలల చెలువంబున నలవడు చలువపావడలు
వీవఁ జిలుకలవలెఁ బలుక నేర్చినకొందఱు కులుకులాఁడులు తమకులుకుగుబ్బ
లంబోల కున్న నీళ్లుమోయించి రసఁజాలు జాలువాగిండ్లు పూని కెలంకుల
గొలువు సేయఁ గాయజునీమంబు లనం గొమరగు కొమిరెప్రాయంపుముద్దుగుమ్మ
లు కొందఱు తమతమ మేనితావులకుఁ దావలం బగువట్టివేళ్ల సురఁటులకమ్మ
నెత్తావులు తాళవృంతానిలంబుల నొలయింప సంపెంగముక్కులం డెక్కులు
గల చక్కెరబొమ్మలు కొందఱు కర్పూరవీటికాపేటికాదులు గైకొని యం
తంత నిలిచి తమతమ యూడిగంబులకు సమయం బరయం. గొఱనెలతో
నెదురునుదురులుగల చదురాండ్రు గొంద ఱంబురుహాకరంబులఁ దంబుఱలు
వీణెలు డక్కలు బిల్లనగ్రోవులుఁ గిన్నరలుఁ జెంగు లుపాంగంబులుఁ దాళం
బులు మొదలగుజంత్రంబులు గొని తత్తనుచితలయస్వరతాళమేళనంబులఁ
దానంబులు విస్తరించి యనురాగంబుతోఁ గాలోచితరాగంబులు సేయుచు
మనంబు లిలకం బాడుచు సభారంజనం బొనరింప నిలింపపతికొలువు వెల చె
లువలచెలువంబులు మెచ్చని మెచ్చులాఁడులు గొంద ఱరాళపతాకతా
మ్రచూడ సూచీముఖకటకాముఖత్రిముఖసర్పశీర్షార్ధచంద్రముఖహస్తవిశేషం
బులు విలోకనీయంబులుగాఁ గమనీయముఖవిలాసంబులు భాసిల మధ్యము

ద్రుతవిలంబితంబులు డంబు గులుక నూళాదితాళంబుల మేళంబుల రంగగురక్తి లెంసగ నభియించుచుఁ జదురుపదము దేశీయము మొదలగులాస్యవిధంబులు వినిపింప బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రాదిజనంబు లుచితప్రదేశంబుల వసియింపఁ గురు కరూశ ఘూర్జర సింధు గాంధార సౌవీర కాశ్మీరచేది తుందిర పాండ్య ద్రవిడ బర్బర చోళ పాంచాల మగధమాళవ మత్స్యమళయాళ నేపాళ కొంకణ కోంకణ యవన బంగాళ కళింగ ప్రముఖ వివిధదేశాధినాథు లలికస్థలవిన్యస్త హస్తులై భజియింపఁ గోసలరాజకన్యకాగర్భపయఃపారావారపరిపూర్ణ చంద్రోదయ దయాదాక్షిణ్య తారుణ్య నైపుణ్య లావణ్య ప్రముఖ నిఖలగుణ గణాలంకార లంకారక్షణదక్ష రక్షఃకులాధ్యక్షశిక్షాదీక్షాధురంధర ధరాకుమారికామణీరమణీయమనఃకమలకమలాకర విరాజద్రాజహంసోత్తంసవిహార హారకేయూర కటక మకుట కంకణాంగుళీయక ముద్రికాతులాకోటికాదిభూషావిశేషాభిరామ రామనృపలలామ జయవిజయీభవ యని వందిమాగధబృందంబు బహువారంబులు గైవారంబులు సేయ సౌవిదల్లకసాహసనినాదంబు లెసంగఁ బ్రసంగోచితవచనరచనాపటు లగుకవినటగాయక పరిహాసక విదూషక ప్రముఖులు భజియింప నింపుసొంపులతో నుబ్బుచు డెబ్బదిరెండునియోగంబులవారు దూరంబున నుండి సేవింప నిండోలగంబున నుండి విదేహరాజముఖ్యు లగుబంధుప్రముఖుల నుపచరించుచు భరతలక్ష్మణశత్రుఘ్నులు వచ్చి సేవించిన నాదరించి యుచితాసనంబుల నుండ నియమించుచుఁ గామరూపంబులు దాల్చినయంగదాదివానరవీరయోధులతోఁ దనవలపలికెలన నుదగ్రమణిపీఠంబుపై నున్నసుగ్రీవు నప్పటప్పటికి నుచితోక్తుల నలరించుచు మంత్రిచతుష్టయసమేతంబుగాఁ దనడాపలిపార్శ్వంబున నున్నవిభీషణునఁ బ్రేమంబుగా నవలోకించుచు నిజచరణపీఠాసన్నవర్తియగు హనుమత్కపిచక్రవర్తి యుపమాద్యలంకారకలితానవద్యగద్యపద్యాదులఁ దనుఁ బ్రశంసించిన నవధరించి సంతసించుచు విద్వత్ప్రముఖతత్త్వజ్ఞవిద్యాపరిశ్రమంబు లెఱుంగుచు హితపురోహిత మంత్రి సామంతమిత్త్ర సఖప్రముఖులకన్నభంగిఁ బ్రత్యుత్తరంబు లిచ్చుచుఁ బౌరజానపదాదిప్రకృతిజనంబులవిజ్ఞాపనంబు లవధరించుచు దీనానాథజనంబులు గోరిన ధనకనకవస్తువాహనాదు లిప్పించుచు నేర్పు మెఱసి పౌరాణికు లెఱింగించు సముచితపుణ్యపురాణకథాప్రపంచంబున వీనులకు విందు సేయుచు నక్షత్రమధ్యంబునం దేజరిల్లు రాకాచంద్రుచందంబున గ్రహసభాంతరంబున విలసిల్లు ప్రభాకరుభావంబునం జెలంగె నయ్యెడ. 251

శా. ఆరామక్షితి నేతచెల్మి వినయం బౌదార్య మైశ్వర్యముం
దారుణ్యంబును జెల్వు మెచ్చి నృపు లాత్మప్రాజ్య సామ్రాజ్యర
క్షారంభంబులు మాని దర్శనవిధాయత్తాత్ములై యుండి ర

ప్పొరలక జానపదాదు లొండొరులకు పనుల్ పాటింప రెప్పట్టునన్. 252

క. ధ్యానములమాత్రమునఁ బర, మానందమొసంగు బ్రహ్మ యాకారముతోఁ
గానంబడినను జూచిన, మానవు లానందవార్ధిమగ్నులు గారే. 253

చ. ఇనకులశేఖరుం డిటుల నెల్లజనంబులు సంతసిల్లఁగా
దినమును బాకశాసనుగతిం గొలువై తనపెద్దకొల్వునం
దనరుచు నొక్కనాఁడు సవిశేషంబున బంగరుగద్దె నున్నయ
జ్జనకనృపాలుఁ జూచి యుపచారపురస్సరభంగి నిట్లనున్. 254

శ్రీరాముండు జనకాదినృపవర్యుల సత్కరించి పంపుట.

చ. జనకుని కైవడిం బ్రజల సంతతముం దయఁ జూచి ప్రోవఁగా
జనకసమాఖ్య మీ కలరె శాత్రవశిక్షయొనర్చి సీతతో
ననుపమసౌఖ్య మేఁ గనిన దంతయు మీకృపఁ గాదె మామగా
రనుటయె కాని మా దశరథావనిభర్తను మీకు భేదమే. 255

ఉ. పెక్కుదినంబు లాయె నుముఁ బ్రీతిఁ గనుంగొన వచ్చి యెన్నినా
ళ్లిక్కడ మీర లున్న శుభమే యగునైనఁ బ్రజాభిరక్షణల్
దక్క వసింపరా దని కదా వివరించెదఁ బోయి రండు మా
దిక్కు కటాక్ష ముంచుఁ డని దివ్యమణీమయభూష లిచ్చినన్. 256

ఉ. ఆమిథిలాధినాథమణి యల్లుఁ డొసంగిన రత్నభూషణ
స్తోమము పాణి సంది నృపసోమ యిదేటికి మామ యంచు సత్
ప్రేమ బహూకరించుటయె పెక్కుధనంబులు సీత లక్ష్మి నీ
వే మధువైరి నీమహిమ లెంచుచు నూరికిఁ బోయి వచ్చెదన్. 257

క. అని యుచితభంగి వీడ్కొని, జనకమహీభర్త రామచంద్రు ననుజ్ఞం
దన వెంట భరతుఁ డనుపం, జనుదేరఁగ మిథిల కేఁగె సంతస మెసఁగన్.

ఉ. అత్తఱి రాఘవుండు వినయంబునఁ గేకయముఖ్యుఁ డౌ యుధా
జిత్తునిఁ జూచి పల్కె నృపశేఖర యీవిభవంబు యుష్మదా
యత్తము మాకు మీరె కద యార్యులు మీ రిటఁ దామసించినం
జిత్తమునందు మీగురుఁడు చింతిలు మీరును బోయి రాఁ దగున్. 259

తే. మిమ్ముఁ బనుపంగవచ్చు సౌమిత్రి యనుచు, నమితరత్నాంబరశ్రేణు లతని కొసఁగఁ
బ్రేమ నన్నియు మరల సర్పించి యర్హ్మా, ఘణితినుతియించి యజ్జనపాలుఁ డరిగె.

క. శ్రీరామచంద్రుఁ డంతట, వారాణస్యధిపుఁ డగుప్రవర్ధననామున్
భూరిగుణధాము నిజసఖు, గారవమునఁ జూచి ప్రియముగనఁ బడఁ బలికెన్.

ఉ. నీవు గుణాంబురాశివి వినీతుఁడ వెంతయుఁ బెద్దవాఁడవుం
బావనమూర్తి వాదరణఁ బాయను నే శిశువైనదాదిగాఁ
గావునఁ బాయఁ జాల నని గద్దియ డిగ్గి కవుంగిలించి సం

భావన సేసి వీడ్కొలిపె భానుకులేశుఁడు సభ్యు లెంచఁగన్. 262

క. తరువాత నిఖిలధరణీ, శ్వరులఁ బ్రియంకరుల రామచంద్రుఁడు వెలిదా
మరరేకులు వెదచల్లిన, కరణిం దనచూపు లోలయఁ గనుఁగొని పలికెన్. 263

మ. ధరణీనాయకులార మీభుజబలోద్ధత్యంబునం బంక్తికం
ధరుఁ డీల్గెన్ వినుఁ డేను గారణముమాత్రం బింతె మీలోన నొ
క్కరుఁడున్ నాయెడ నెయ్య ముంచి నయమార్గం బాప్ప మీమీధరల్
పరిపాలింపఁగ నింకఁ బొం డని సుధాప్రాయోక్తులం బల్కినన్. 264

క. ఆయుచితోక్తుల నవని, నాయకు లానంద మొంది నతిరమణాసం
ధాయకు రఘునాయకు శుభ, దాయకుఁ గని యనిరి ముకుళితకరాంబుజులై.

సీ. అఖిలభూతమయుండ వగుట నీవిజయ మం, దఱజయం బనుట తథ్యంబ కాదె
యొకటికి నన నేల సకలంబునకు హేతు, వైయుండు దనయుఁ దథ్యంబ కాదె
యంతరాత్ముఁడవై యందఱలో నొక్క, యాకృతి నునికి తథ్యంబ కాదె
నీయందు నెయ్యముల్ నిలుపుట నయమార్గ, మౌ నన్నమాట తథ్యంబ కాదె
తే. విభుఁడ వయ్యును మానుషవిగ్రహంబు
దాల్చి వెలుఁగొందు నీయాజ్ఞఁ దలల మోచి
పోయి వచ్చెద ముంచుము ప్రార్థికరుణ, రాజదేవేంద్ర దశరథరామచంద్ర.

తే. అని నుతించిన వస్త్రమాల్యానులేప, పేటికాదులు తద్ధరావిభుల కొసఁగి
వినయమునఁ బిన్నతమ్ముని వెంటఁ బనుప, నారఘూత్తము వీడ్కొని వారలపుడు.

మ. అవనీభాగము కంప మొందఁగ ననేకాక్షౌహిణుల్ గొల్వఁగా
జవనాశ్వద్విరదాదిఘోషముల దిక్చక్రంబు మారుమ్రోయ భూ
ధవు లెల్లం జని రాత్మభూములకు దైత్యచ్ఛేదనం బాడఁగా
రవివంశాగ్రణి చేసినట్టిబలుకార్యంబుల్ ప్రకీర్తించుచున్. 268

తే. ఇటులు జనకాధిబంధుల నెల్లనృపులఁ, బనుప రామాజ్ఞ నరిగిన భరతలక్ష్మ
ణాదు లాయానృపాలకు లంపినట్టి, కానికలతోడ వచ్చి రాఘవునిఁ గాంచి.

సీ. పట్టుపేనుంగు లారట్టాశ్వములు హొన్ను, గట్టుల మెచ్చని ఘనరథములఁ
బట్టుచుట్ట లనేకపరిమళపేటిక, లకలంకరత్నపర్యంకికలును
ధనమణిరాసులు దాసదాసీజనుల్, మణికిరీటంబులు మణిసరములు
జాళువాసొమ్ములు జరిగదుప్పటులువలు, హైమనానాశిక్యసింహాసనములుఁ
తే. బట్టెమంచంబు లొఱపై సరిపణుపు లుదిరి, బొమ్మలను బోలు ముద్దులగుమ్మలాది
యైనకానుకలు గొలువున్న యధిపుదృష్టి, పథమునం దిడి సద్భక్తిఁ బ్రణతులైన.

క. కాకుత్స్థుఁ డలరి యర్ఘ్యము, లా కొన్నివిభూషణంబు లతులాంబరముల్
చేకొని సుగ్రీవాదిమహాకపులకు నవ్విభీషణాదుల కొసఁగెన్. 271

తే. ఒసఁగి రఘురాముఁ డొకహార । మూని భల్లు
కేంద్రుఁ గని తాత తగును నీ । కిది గ్రహింపు
మనిన నన్నేల కొమ్మనె । ననుచు ముసలి, కేల యన నవ్వి సభ హార । మిచ్చె విభుఁడు.
క. ఉరముల మణిహారంబులు, కరములఁ గటకాంగుళీయ । కప్రముఖములున్
సిరముల మిసిమికుళాయులు, ధరియించి చెలంగి రఖిల । తరుచరముఖ్యుల్. 273
తే. వారిలోన విశేషించి । వాలిపుత్త్రు, నమ్మరుత్పుత్త్రుఁ బిలిచి ని । జాంకయుగళి [చ్చెఁ
నిలిపికొని తానె తొడవు । లన్నియును దొడిగి, యర్కసుతుఁ జూచి పతి యిట్టు । లానతి
క. నినుఁ గొలిచిన కపు లందఱు, ఘనకార్యధురీణు లగుచుఁ । గడఁది పనుల్ చే
సినవారు నీకు మారుం, డనిలసుతుఁడుఁ బూజ కర్హు । లన నతఁ డనియెన్. 275
సీ. శాఖిశాఖల నెక్కు । శాఖామృగములకు, హేమాసనములపై । నెక్కఁ గలిగె
వల్కలకౌపీన । వంతులౌ కపులకుఁ, బట్టాంబరమ్ములు । గట్టఁ గలిగె
వనభూరజము గప్పి । కొని మెలంగు వనాటులకుఁ జందనాదు ల । లందఁ గలిగె
ఫలమూలములు దిని । బ్రతుకు మర్కటులకు, మేలోగిరంబులు । మెక్కఁ గలిగె
తే. నొడల నేపోఁడిమియు లేక । యున్న వలీము
ఖులకుఁ గటకాదికము లూను । కొనఁగఁ గలిగె
నటవిచరులకుఁ బురిఁ దిరు । గాడఁ గలిగె, శ్రీరఘూత్తమ నినుఁ గొలి । చిన కతమున.

## శ్రీరాముండు సుగ్రీవాదివానరులను విభీషణాదులను బహూకరించుట.

క. నీనెయ్యము గల్గినఁ దృణ, మైనను మేరు వగు మేరు । వైనను దృణమౌ
నీనెయ్యము దఱిగిన నీ, వానరు లెంత యన రామ । వసుధేశుఁ డనున్. 277
క. నీవారి నీవు సన్నుతి, గావింపవు గాక సహజ । గాంభీర్యనిధుల్
నీవా రిందఱు రవిసుత, భావింపఁగ వీరిపనులు । పరమాద్భుతముల్. 278
సీ. ఘనభూమిభృచ్ఛిరో । గ్రము లెక్కు ఘనులకు, నీచిన్నగద్దియ । లెక్కు టెంత
బలుకాంతిఁ బరమేశు । వలువలు గప్పెడి, ఘనుల కీజిలుఁగులు । గట్టు టెంత
తులలేని శుభవాస । నలమించు ఘనులకీ, యలఁతితావుల గంధ । మలఁదు టెంత
యమృతాశనులసామ్య । మందినఘనులకు, నిక్కూడు చవిగొని । మెక్కు టెంత
తే. యధిక గుణరత్నభూషితు । లైనవీరి, కీవిభూషణతతులు వ । హించు టెంత
యఖిలజగముల నప్రతి । హతరయమునఁ, దిరుగు వీరల కీప్రోలఁ । దిరుగు టెంత.
చ. వననిధు లన్నియుం గలఁచి । వైవ వసుంధరఁ బెల్లగింప సూ
ర్యుని దిగ మ్రింగ ఘోరలయ । రుద్రుని నైనను మార్కొనంగ నో
పిన ఘను లీమహాకపులు । భీతి వహింపుదు రేమహాత్ము శా
సనమున కట్టియాజ్ఞగల । శౌర్యనిధిన్ నిను నెంచ శక్యమే. 280
మ. అని మైత్రిం గొనియాడి మంత్రిసహితుం । డౌ పంక్తికంఠానుజ
న్మని లాలించి వలీముఖాగ్రణుల కెం । తో వేడ్కఁ బుట్టించి యొ

క్కనిమేషం బని తోఁపఁ జెక్కుడిసముల్ । కాఁపుత్ స్థరత్నంబు మ
న్నసలం దేలిచె వారు నుండి రమితానందాబ్ధి నోలాడుచున్. 281

హేమంతఋతువర్ణనము.

క. శిశిర మరుదెంచె నంతట, నిశ లాయతగతి వహించె । నెత్తమ్మి తెగల్
కుశలత డించె దినంబులు, గృశియించె వడంకు ముంచె । నెల్ల జనములన్.
క. అంబరమణి సాంబరుఁ డయ్యుం బరువిడుఁ జరమగిరికి । నుర్వంశకుఁ డ
య్యుం బవమానసఖుఁడు మం,చంబుల క్రిందటనె డాఁగుఁ । జలి యల్పంబే.
సీ. ముద్దుగుమ్మలమొగంబులఁ జూడనే కాని, మానసింపరు చందమామఁ జూడ
జవరాండ్రమందహాసములు చెందనె కాని, నిలువరు పండువెన్నెలలపైట
సకులకెమ్మోవిపానకము గ్రోలనె కాని, కాంక్షసేయరు పానకములు గ్రోలఁ
జెలువలకుచదుర్గములకుఁ బ్రాకనె కాని, తలఁపరు కృతకభూధరము లెక్కఁ
తే. జెలులనాభిసరస్సులె । చేరఁగాని, యొల్లరు సరస్సులను జేరి । యోలలాడ
మానినులకమ్మయూర్పులె గాని సురఁటి,గాలి రానియ్య రధిపులకాలమునను.
సీ. దినముఁ బ్రాతస్స్నాన । మొనరించు ద్విజులకు, నగుకర్మలోపభయంబు కంటెఁ
బ్రాఁచిపనుల్ సేయ । లేచు కోడండ్రకా, నత్తలవలనిభయంబుకంటె
గడువులో మార మేఁగఁగ నున్న చరులకు, నధిపుచే నొదవుభయంబు కంటెఁ
గర్షణం బొనరింపఁగడఁగు కాఁపులకార,యమిఁ బైరు చెడునట్టి భయంబుకంటెఁ
ఆ. గడిఁది యయ్యె సీతు । ఖగ మృగ పశు నర, ప్రముఖజంతువులకు । భావములను
జాల మించె మిథునసంపర్కసౌఖ్యంబు, శిశిరమహిమ వినుతిసేయ వశమె.
క. కాచె నుసిరికలు తఱుచుగఁ, బూచెం జేమంతివిరులు । భూమికి బరువై
తోఁచెఁ జణకాదిసస్యము, లేచెన్ బలుమంచు చదల । హేమంతమునన్. 286
తే. ఎల్లజనములఁ దలచూపనీక వెలయు, నల్లహేమంతఋతురాజయశము దశల
నావరించెనో యనఁగ మంచగ్గలించె, రోదసి నతంద్రచంద్రికారుచిరరుచుల.
ఆ. కొండ లెల్ల మంచుగొండలై కనిపించె, నడవు లెల్లఁ బూచి । నటుల మించె
దీవు లెల్లఁ దెల్లదీవులై రహిఁ గాంచె, మాపు రేపు మించు । మంచువలన.
శా. ప్రాతర్వేళల మంచుచిన్కుగమి జొంపం బైనలేఁబచ్చికల్
శ్వేతశ్రీఁ దులకించు నంతయు రహించెన్ సర్వభూతంబులున్
శీతభ్రాంతి వడంకఁ దా నచల మై । చెల్వొందు భూదేవికిన్
శీతద్యుత్ప్రభుఁ డిచ్చువజ్రములరాశిం బోలి నల్వంకలన్. 289
వ. తత్కాలంబున. 290
చ. వలపులు గ్రమ్మఁగా బొగిచి । వండినకారపుఁగాయగూర ల
ప్పళములు దియ్యచే రొలుపుఁ బప్పు రసావళు లింపుటోగిరం
బు లపుడు గాఁచి తెచ్చుఘృతముం బలుమాంసము లర్కపుత్త్రము

ఖ్యులు రఘురాముబంతిఁ బ్రియమొప్ప భుజించి సుఖించి రెంతయున్. 291

## శ్రీరాముఁడు వానరరాక్షసుల వీడ్కొలుపుట.

ఉ. అయ్యెడ నొక్కనాఁ డినకులాగ్రణి భానుజుఁ జూచి నెమ్మదిన్
నెయ్యముఁ జేర్చి నాకొఱకు ననేకవిపద్దశ లోర్చి చేయు సా
హాయ్యముచేత నే విజయమందితి సన్నుతు లేల పెక్కు నా
ప్తయ్యెను నీవు వచ్చి యనఘా యింక నూరికిఁ బోయి రాఁగదే. 292

సీ. అంగదు నసురోచ్చయాంగదు నలరింపు, హనుమంతు గుణవంతు నాదరింపు
జాంబవంతుఁ బరాద్రిశంబవంతు భరింపు, నలు మహాజితదవానలుఁ దలంపు
నీలు సేనావనాభీలుఁ బాలన సేయు, శతబలి సతబలి సవదరింపు
తారుఁ గీర్తినిరస్తతారుఁ గటాక్షింపు, శరభు నాసురసింహశరభుఁ బ్రోవు

తే. గజగవయగంధమాదనగ్రథనకుముద, పనసధూమ్రసుషేణాదిబలిముఖేంద్రు
లిందఱు మదర్థముగ మేను లిచ్చినారు, వీరి నెల్లను రక్షింపు వీరవర్య. 293

క. నిష్కంటకవై తన రేఁడి, కిష్కింధకుఁ బోయి యింకఁ గేవలకరుణా
విష్కృతమతివై వాసవి, దుష్కార్యము లెంచ కంగదునిఁ బ్రోవఁదగున్.

క. అని పౌనఃపున్యముగా, నినకులపతి వాలిసుతుని నేలెమ్మని య
య్యినజునకుఁ దెల్పి యుపగూహన మొనరిచి యెల్లకపుల నలరించి కృపన్.

తే. ఆవిభీషణుఁ జూచి మహాత్మ నీవు, పుట్టినప్పుడె వెన్నతోఁ బెట్టెఁ దల్లి
వినయధర్మవివేకముల్ వేఱ యేల, బోధలైనను వినుము నా బుద్ధి యొకటి.

చ. కొలిచినవారు రాక్షసులు క్రూరము మానస మొక్కవైఖరిన్
నిలువదు కాలపద్ధతి ననేకవికారము లొందు నందునం
దలఁకక యన్నపై నెనరు ధర్మముపైఁ బ్రియ ముంచి లంకని
శ్చలగతిఁ బ్రోవు ధార్మికుఁడు శాశ్వతుఁడై వెలయున్ విభీషణా. 297

క. మఱవకు నీతివినీతులు, మఱవకు మామీఁది ప్రేమ మనకపివరులన్
మఱవకు నీతలిదండ్రుల, మఱవకు మని రఘుకులాబ్ధిమణి దెల్పుటయున్. 298

క. ఆరఘుపతివచనామృతధారలఁ బరితుష్టిఁ జెంది తరుచరరక్షో
వీరు లిటు లనుచుఁ బొగడిరి, సారెకు బహువార్ధు లొక్కసరి మ్రోయురహిన్.

సీ. శతబృహస్పతులైన సమతుగా రొకబృహస్పతి యీమనీషకు సాటి యగునె
వేమందయజులైన నేమాత్రమో కాక, యొకయజుం డీసూక్తి కుపమ యగునె
లక్షశేషాహివల్లభులైన నేమొ కా, కొకశేషుఁ డీబల్మి కుద్ది యగునె
కోటిమన్మథులైన నేటికి గా కొక మన్మథుం డీచెలువునకుఁ దుల్యుఁ డగునె

తే. తలఁప శతకోటిమేరుభూధరములైనఁ, బోల్పఁదగుఁ గాక యొకమేరుభూధరంబు
పోల్ప నీధైర్యలక్ష్మికిఁ బోల్కి యగునె, రవికులాంబోధిచంద్ర శ్రీరామచంద్ర.

సీ. ఎన్నిదోషములున్న నెంచక యించుక, గుణ మున్న మెచ్చి చేకొందు వనుచుఁ

బాటించి పలికినపలుకు బ్రహ్మవరంబు, గాఁ బ్రతిష్ఠకుఁ దెచ్చుఘనుఁడ వనుచు
హీనుఁడైన సమాశ్రయించినఁ దమ్ముని, జూచినచందానఁ జూతు వనుచుఁ
గొలిచినవారిని గూర్మినాచంద్రార్క,ముగ సౌఖ్యము లొసంగిప్రోతువనుచుఁ
ఆ. బరులు స్వజను లనక ప్రజల నందఱఁగన్న, ప్రజలలీలఁ బ్రోచుప్రభుఁడవనుచు
నీగుణంబు లెంచు నిఖిలలోకంబులు, రమ్యగుణసముద్ర రామభద్ర. 301
చ. అని కొనియాడుచున్న సమయంబున మారుతసూతి స్వామికిన్
వినుతు లొనర్చి పల్కె రఘువీర భవత్పదపంకజంబులన్
ఘనతరభక్తి యెల్లపుడుఁ గల్గఁగ మీకథ యెంతకాలము
ర్వినిఁ దగు నంతకాలము శరీరము నిల్వ వరం బొసంగవే. 302
ఉ. నీకథ లెప్పుడున్ వినుచు నీపదచింతన మాచరించుచున్
నీకరుణావలోకములు నీమృదుభాషలు నీవిలాసముల్
నీకలితప్రభావములు నెమ్మది నెంచుచు నున్నఁ గాక యే
లా కపిమూర్తిఁ జేకొని యిలాస్థలిఁ జెంద వృథాయురున్నతుల్. 303
క. శ్రీరామ నీకథామృత,ధారలు కర్ణాంజలులను ద్రావెడిధన్యుల్
కోరుదురే యమరత్వము, తీఱుదురే జన్మమరణదారుణరుజలన్. 304
సీ. కౌసలేయ త్వదీయకథ లూఁకొననివాసరంబు కల్మషధూసరంబు గాదె
తాటకాంతక నిన్ను ధ్యానంబు సేయని, క్షణము నివారితక్షణము గాదె
జానకీరమణ నీసంస్మరణం బొనర్పని, ఘటిక విషాపూర్ణగుటిక గాదె
సాకేతనిలయ యుష్మత్పూజ సలుపని, జాము మృత్యువునిల్పు గీము గాదె
తే. శ్రీరఘూత్తమ నిన్నుదర్శింప కరక, కడచుకాలంబు గాలంబుకరణిఁ గాదె
రామయటుగాననిన్నె నారతమువినుట, దలఁచుటస్మాదృశుల కుచితంబు గాదె.
ఉ. నా విని సంతసించి రఘునాథుఁడు గద్దియ డిగ్గి గ్రక్కునం
బావనిఁ జేతులం గదియఁబట్టి కవుంగిట నుంచి పల్కె న
న్నీవిపు డిచ్ఛయించినవి యిచ్చితి భూమి గలంతకాలముం
దావకకీర్తియున్ నిలుచుఁ దండ్రి చరింపు చిరాయురున్నతిన్. 306
ఉ. ఆపదఁ బాపి ప్రాపయినయన్నకుఁ బ్రత్యుపకార మూనఁగాఁ
గాపురుషుండు గోరుఁ బ్రతికారము సేయఁ దలంపఁ డార్యుఁ డ
య్యాపద రాఁ దలంచి నటు లౌ నని ధన్యుఁడ నైననీకు నే
నాపద లేఁ బ్రతిక్రియ యొకప్పుడుఁ జేయఁ దలంపఁ బావనీ. 307
మ. నినుఁ బూజించునతండు నాహితుఁ డగున్ నీలోన నే నెప్పుడున్
గనిపింతున్ వినిపింతు రచ్చరలు వేడ్కం ద్వత్కథల్ ఖ్యాతితో
మను మంచున్ హనుమంతుఁ బల్కె రఘురామస్వామి స్వగ్రీవఁ దా
యనిన్నై దూర్యపుఁదాళిఁ గైకొని తదీయగ్రీవ నుంచెన్ గృపన్. 308

క. ఆహారము లోకైకము, నాహారముఁ బూనుకొని హనుమ దగ నుడుసం
దోహావృతాప్యతాహా,రాహార్యమొ యనుచుఁ జూప నగ్గింపంగన్. 309

చ. ఇటువలె రాముఁ డాశ్రితుల నెల్లఁ గ్రమంబున బుజ్జగించుచుం
బటుమణిభూషణావళు లపారముగా దయచేసి వెండియున్
భటసహితంబుగా ననుప భానుకుమారవిభీషణాదు లే
మెటువలెఁ బాసి పోదు మవనీశ్వర యంచును ముక్తకంఠులై. 310

చ. వలవలఁ గన్నులం దొరఁగు బాష్పకణంబులతో రఘూత్తముం
బలుమఱుఁ జూచుచున్ నిలిచి పంచితివే రఘురామచంద్ర మా
స్థలముల కంచు మూఢులవిశేషంబున నేడ్చుచుఁ బోయి రెంతయుం
గళవళపాటుతోఁ గరుణగల్గినరాజును బాయఁ గూడ నే. 311

ఉ. భానుకులీనుఁ డీకరణి భానుజముఖ్యుల వీడుకొల్పి త
న్మానితశౌర్యధైర్యములు మాటికి నెంచుచు నార్యబంధుమి
త్రానుజమంత్రియుక్తి నపరాహ్ణముదాఁక సభాంతరంబునం
దాను వసించి యుండెను జనస్తవనీయకళాభిరాముఁ డై. 312

ధనేశునిపంపునఁ బుష్పకంబు రామునిఁ గొలువ వచ్చుట.

చ. తదవసరంబునన్ దశరథప్రియసూతికి నొక్కదివ్యమూ
ర్తి దివి వసించి యిట్లనియె దేవ కుబేరునిపుష్పకంబ మీ
పదములు గొల్వ వచ్చితిఁ గృపన్ ననుఁ జేకొనుఁ డన్న రాఘవుం
డిది దగునే పతిన్ విడిచి యేటికి వచ్చితి వెందు నావుడున్. 313

ఆ. ఆవిమానరాజ మనియె దేవరయాజ్ఞ, యక్షుప్రోలిపాలి కరుగ నతఁడు
మీగుణంబు మెచ్చి మీసేవఁ గావింపు,మనుచు మరలఁ బనిచె నను నరేంద్ర.

ఉ. ఆయన పంప కున్న సుగుణాకర యూరక నేను వత్తునే
నా యెడ సంశయం బుడిగి నన్ను గ్రహింపు మటన్న జానకీ
నాయకుఁ డుత్సహించి స్వజనంబులఁ బుష్పకరాజపూజనల్
సేయఁగఁ బంచి మన్ననయుఁ జెల్మియుఁ దోఁపఁగఁ బల్కెఁ గ్రమ్మఱన్. 315

క. ఓదేవయానరత్నమ, నేఁ దలఁచినయపుడె రమ్ము నీకు నిలువ నిం
పౌ డెస కిప్పుడు పొమ్ము స,మాదృతి మము మఱవకుండుమని పనుచుటయున్.

ఆ. అలరి సకలలక్షణాఢ్యుఁడౌ నాకృత,లక్షణునకు నది ప్రదక్షిణం బొ
నర్చి దక్షిణంబునకు నాక్షణంబున, నేఁగె నీక్షణముల కెఱుఁగఁ బడక. 317

మ. రఘువంశాగ్రణి యంత సంతసిలి యర్థస్వామి యౌరౌర యెం
తఘనుం డాత్మవిమానమే యొసఁగె మహత్సఖ్యంబుఁ గాంక్షించి చె
ల్మిఘటింపం దగు రాజరాజతఁడు బల్మిం గల్మి నత్యున్నతుం
డఘదూరుం డని పల్కఁ బల్కె భరతుం డావేళ హర్షంబునన్. 318

ఉ. దేవ భవత్ప్రతాపసముదీర్ణత నార్యవిరోధికారియా
రావణుఁ డీల్గెఁ గాన ధనరాజు ప్రమోదముఁ జెంది మీకు సం
భావనగా విమానమణిఁ బంపె దశాస్యు భరించుదోషముం
బోవునె పుష్పకంబునకుఁ బూని మిముం భజియింప కుండినన్. 319

చ. ఉరుమతి మీగుణంబులకు నొక్కఁడు బేరుఁడె యేల యొల్లది
గ్వరులును జెల్మి సేయుటకె కాంక్ష వహింతురు నైజభోగముల్
నిరుపమశక్తి మీరు కరుణించిన వంచునె యెంతు రెప్ప జే
పరుసున మీకు వేడ్క సలుపం గలమో యను చుందు రాత్మలన్. 320

సీ. నిర్జరాధీశుండు నెల మూఁడువానలు, కోరిన ధర నెల్లఁ గురియ సాగె
జ్వలితప్రదక్షిణార్చులతోడ హవ్యంబు, నేవేళ వహ్ని వహింపఁ దొడఁగె
మిక్కిలిముదుసల్లదక్కఁ దక్కనవారిఁ, బొలియింప శమనుండు పూనఁడయ్యె
వీచికాగ్రముల నవీనమణుల్ పూని, నీరధి తటముల నింప నించె
తే. శైత్యసౌరభ్యమాంద్యసంచారియగుచు, గంధవహుఁడెల్లప్రాణులకాసిమాన్చెఁ
బడినగింజలనవెత్తి పండె ధరణి, రఘుకులోత్తంసమీ రేలురాజ్యమునను.

సీ. సుతులులేక కలంగుసుదతు లెక్కడలేరు, సుతవియోగముఁ జెందుసతులు లేరు
పతులఁ బాసినకళావతు లెయ్యెడను లేరు, పడఁతులఁ బాసినపతులు లేరు
దారిద్ర్యదుఃఖసంతప్తు లెందును లేరు, కలిమి గర్వముఁ జెందుఖలులు లేరు
వ్యాధుల నాధులవగచువారలు లేరు, నింద లొందినవార లెందు లేరు
తే. లేరు జారులు చోరులు లేరు దుర్వి,చారు లగ్నిజలాహితతృష్ణాక్షుదాది
వాతదుర్భిక్షభయయుతులైనవారు లేరు, రఘుకులోత్తంసమీ రేలురాజ్యమునను.

చ. క్రతువులు దానముల్ శ్రుతు లకల్మషచర్యలు దండనీతు లం
చితపశురక్ష పణ్యము కృషిక్రియలుం ద్విజరాజవైశ్యసం
తతభజనంబునుం గలిగి నాలుగువర్ణము లుల్లసిల్లుటం
గృతయుగముంబలెం జెలఁగెఁ ద్రేత రఘూత్తమ యంచుఁ బల్కినన్. 323

క. ఆభరతుమధురభాషల, చే భావము పల్లవింప సీతాంభోజా
క్షీభర్తకుండలద్యుతి, శోభిలుచెక్కుల స్మితంబు సొబగున నలరెన్. 324

క. ఈభంగి వెలయు రాముని, వైభవకథ చదువుకొనిన వ్రాసిన వినినన్
శోభిల్లుదు రాజను లమి, తాభిమతార్థములు గలిగి యప్పుభుకరుణన్. 325

ఉ. సారమహోజ్జ్వలజ్వలనసారవిభాసి విభాసితాంగశృం
గార చరాచరాత్మకజగద్భరణా కరుణాకరాత్మ వం
దారుసుధీసుధీవిహరణక్రమదక్ష మదక్షపాచర
స్ఫారధరాధరాశనినిభా రవిరాజవిరాజిపక్షణా. 326

క. శంబరహరజనక జను,శ్శంబరమృగయాపుళింద సతతానందా
  శంబరనిధిగృహ రిపుగిరి,శంబ రమాకలితవక్ష జలజదళాక్షా. 327

తోటకవృత్తము. కురువిందనిభోజ్జ్వలసుందరదా,దరదారుణచక్రగదాభరణా
  భరణాదరకీర్తివిభాస్వర భా,స్వరవాక్ప్రథమాంచిత వర్ణమయా. 328

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధానవద్య
కవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణవితీర్ణివైభ
వాధఃకృతరాజరాజరాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధరధరాధిపసభాం
తరస్తవనీయనయకళాయుగంధర బంధురమనీషావిశేషమంథానవసుంధరాధర
శోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటి వంశ
పయఃపారావారపరిపూర్ణసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞానవిభ
వవిజితసనందనవిష్ణుమాయావిలాసాభిధానయక్షగాననిర్మాణప్రవీణతానిధానపా
పరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణం బను మహాకావ్యంబు
నందుఁ బంచమాశ్వాసము.



శ్రీ

రామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదుత్తరరామాయణము.

## షష్ఠాశ్వాసము.

---

శ్రీమహిళాత్మలలాటత
టీమృగమదసారసంఘటితరేఖాశ్రీ
క్షామముకురాయితజాంబవ
తీమానవతీకపోల ధీజనలోలా. 1

### వసంతకాలవర్ణనము.

తే. అవధరింపుము రామచంద్రావనీశ, చంద్రుఁ డీభంగి విభవనిస్తంద్రుఁ డగుచుఁ
బ్రజల నందఱఁ బొఁగన్న ప్రజలకంటెఁ, జాయుచును భూమిఁ బాలించుచున్నవసర [మున.
ఉ. భాసిలెఁ జైత్రమాస మతిభాసురపల్లవశస్తకోకిల
గ్రాసము లోకజైత్రరతిరాజకరాగ్రవిరాజికింశుక
ప్రాసము కీరవాక్ప్రకటపాంథజనశ్రవణాంతరాంగుళీ
న్యాసము కేసరాదిసుమనస్సముదంచితగంధవాసమై. 3
క. తనకంటె నుగ్రతేజం, బునఁ దనయుండు దక్షిణమునఁ బొడల నడచె నేఁ
జనదత్యుగ్రత నిలువఁగ, ననిలంపలె భానుఁ డుత్తరాశఁ జరించెన్. 4
సీ. తనుఁ బ్రోది సేసిన ధాత్రికి లతకూన, లర్పించు వివిధవస్త్రాళు లనఁగ
మలయుకొమ్మల డాసి మలయానిలవిటుండు, రహి వీక్షి వైచిన రవిక లనఁగ
వనదేవతాగాత్రమునను జైత్రుఁడు నించి, కడఁగి రాలిచి చిక్కన మనంగ
సమయవాసవుఁ డగచ్ఛదచయచ్ఛేదనం, బొనరింపఁ ధరఁ రాలుతునుక లనఁగఁ
తే. బయనములు వ్రాపుపథికులపాదములకుఁ, బరపుగ నిపింపఁ బడు బవనపణువులనుచుఁ
బండితరుశాఖలనుండి పడినపండు, టాకుగుమి నిండుకొనియె వనాంతరముల.
సీ. అలవనీలామహిళలకుఁ జైత్రునియందు, రహిఁ జెందురాగాంకురములగుమియొ
ప్రాంచితాగమసమాఖ్యశ్లాఘ్యజటిముఖ్య, సమితి ధరించు పెంజడలగుంపొ
వనము దవాభిఖ్యవహియించుఁ గావున, జనియించు కీలికాసముదయంబొ
మధువశంబున బేజుమాల్చేయ మరుఁ డుంచు, సవిరహాస్త్రారక్తశస్త్రచయమొ

తే. యిట్టులంబుగ గొమ్మలు గట్టుకొన్న, పెసఁగు చెంగావివలిపపావడలొ యనఁగ
నలరుఁబోఁడులకరచరణాధరముల, తొగరుపొగరులఁ జిగిరించి చిగురు లలరె. 6
ఆ. అతనిశాస్త్రరీతి నతిశయింపఁగఁ గల, మేలిగురుల దొరసి బాళి మెఱసి
యభ్యసించెఁ గోకిలాభ్యాసప్రకరంబు, శ్రుతిమనోహరైకసూక్తు లపుడు.
మ. వసుధాజంబు లనంబులై పొటచట చేవల్ గుల్కు నెత్తావి నాఁ 7
గిసలశ్రేణి రహింపఁ గోయిలలు భక్షింపన్ వనీలక్ష్మి యా
రసమూరన్ మణియోగ్యరత్నములవర్ణం బుంచె నేమో యనం
బస రొందెం నటరాకలన్ మరకతప్రత్యగ్రజాగ్రద్ద్యుతిన్. 8
సీ. పాదపంబుల పేరిపాత్రోదములమీఁదఁ, గనిపించు నక్షత్రగణ మనంగ
నవమల్లికావసంతసమాగమంబున, జనియించు పులకలచా లనంగ
వనమహాఖనిఁ బుట్టి యెన లేనిరుచులచేఁ, గొమరొందుమగరాలగుమి యనంగ
వనరాశి గానఁ బ్రవాళముల్ మునుగల్గి, నటులుదోఁచినమౌక్తికాలి యనఁగ
తే. నలరువనదేవతలపల్లవాంఘ్రియుగము, లస్దుఁ జెలువొందుశితనఖబృందమనఁగ
మీఱె సారెకు మధుపకిశోరకములు, కోరికలు చెందఁ గోరకవారకంబు. 9
క. పద నెఱిఁగి చికిలిచేసిన, మదనునినునుఁదూపుతెగలు మధుఁడిగురులమేల్
పొదలనిడెననఁగ మొగ్గల, గుదులు తలిరుకొమ్మలందు గుదికొని పొదలెన్.
సీ. నవ్యపరాగచందనచూర్ణపేటికల్, మదనసమ్మోహనమార్గణములు
కొదమతేఁటులు గన్నకోర్కులపంటలు, వలిగాడ్పు మెచ్చువల్వులకొటారు
లామనిదొరతేనియలకణఁజంబులు, వనలక్ష్మిసౌభాగ్యమునకు నెడలు
సకలదేవసపర్యలకు హేతువులు విర, హివధూజనమ్ముల కెదురుచుక్క.
తే. లఖిలవిషయాగ్రగణ్యంబు లనఁగఁ దగిన
యలరుగుంపులు గమకంబులై గుభుచ్ఛ [ములను.
భావమువహించి యెడలేక బటువు లొంది, యలరెఁ గొమ్మలకుచములయంద
మ. రవముల్ సేయుచు భృంగకోకిలకిశోరశ్రేణి మూఁగన్ వియో
గవతీవారము దూరదూరముల కేఁగం గింశుకాదిప్రసూ
నవిశేషాంశుకసంగతిన్ రజ మనూనం బై రహింపంగఁ బు
ష్పవతీత్వంబు వనేందిరారమణికిం బ్రాపించె నయ్యామనిన్. 12
చ. సుమసమయాధిపుం గలసి సొం పెసఁగంగ శిలీముఖసంతతిం
గ్రమమునఁ గాంచు గర్భములు గైకొనినట్టులు మంజరీస్తనా
గ్రమిళితభృంగనీలిమ దగం దెలిపుప్పొడి నిండఁ జెల్లఁడా
లమర మరందఘర్మ మొలయన్ వెలసెన్ లతకూన లయ్యెడన్. 13
సీ. మరుని కర్పింప నామని నమకట్టిన, పచ్చరాబరణుల బాగుఁ గాంచి
ఫలము లాశించి కొమ్మల నాశ్రయించిన, రాచిల్కపల్కుల రహి వహించి

ధరణిమీఁద జతరూపత్కరము నొక్కటఁ జూడ, బహురూపములనిల్పి భ్రాంతిమించి
లతికాంగనలవేడ్కఁ బట్టుపచ్చ మేల్పట్టు బంతులఁ గుట్టి తా బైటనుంచి
తే. యసమసాయకజయకాభ సతిశయించి, పసిమిఁ బెచ్చిన పచ్చి పసనడంచి
మసృణహరిదశ్వహరికాంతి మహిమ నొంచి
పసరుచాయలఁ బసుగాయ తెసక మెసఁగె. 14
క. తా నుద్యానగుఁ డౌటను, భానుఁడు ఛాయానిరూఢిఁ బాటించినయు
ద్యానంబున బహురూపము, దై నిలిచెనొ యనఁగ ఫలము లలరుఁ జెమసల రెన్.
శా. సారంగప్రమదామహాద్వతి సహింపఁ బల్లవశ్రేణికా
రారంజల్లతికాతతిప్రమలు మీఱం గేరుచంచూనితి
ద్వారస్ఫారఫలప్రవర్ధనపయోధారల్ పగన్ శ్యామలా
కారశ్రీపనముల్ దనర్పఁ ఘనరేఖన్ మించె సాలోఘముల్. 15
చ. లసితరసాలసాలకిసలగ్రసనవ్యసనానురాగభా
గ్రసనపికస్వరంబులు విరుస్వరతన్ విని చొక్కి యింపునన్
మసలుచు ఖత్తులాణను ఘనత్వముఁ బోవక నిల్చినందునన్
శ్వసనుఁడు మందమందగమనంబు వనంబులఁ బొందె నామనిన్. 16
చ. హాళిహాళి నక్షతలిచ్చిన క్రియన్ విరిశేసియ లాను తేఁటులున్
మలయుచు దాఁచఁ బెట్టిన క్రమంబునఁ బచ్చు గ్రసించు పిల్కలుం
బలకొని సంతరించిన విధంబునఁ గొంజిగురుల్ గ్రహించు కో
యిలలును గల్గి యామని రహించె మహీజనరంజనాకృతిన్. 17
తే. అట్టి వాసంతవేళ రామావనీశ, వహ్ని మున్నీటి మొలనూలి మగువ చూలి
బాళితోఁ గూడి వనపాళిఁ గేళి సలుప నుల్లము జనింప రహిమించి యొక్కనాఁడు.

—◆ శ్రీరాముఁ డుద్యానవనమునకుఁ బోవుట. ◆—

సీ. కలితాలికన్యస్తకస్తూరికాతిలకము ముఖలావణ్యకాంతిఁ దెలుప
మనువాలకాయ కౌముంగిటులు నవశ్రీ గెల్వ, శ్రవణయుగ్మమున కీర్తి నవధరింప
నవమల్లికాజైత్రనక్షత్రమాలిక, హృదయస్థగుణపాలి నెఱుకపఱుప
మకుటకీలితవజ్రమణిరుచుల్ జనవీక్షణాళుల మల్లెలరీల్లాస గొల్ప
తే. మిసిమిబంగారుతళుకుల మేటిదుప్పటి చెఱంగులు లలితాంజనాచలమున
నలరు నరుణాతపచ్ఛాయ లనఁ దనర్ప, రాముఁ డఖిలైకనయనాభిరాముఁ డయ్యె.

మ. పురకాంతామణు లాత్మరూపవిభవంబుల్ చూచి కందర్పగో
చరతం దత్తఱ మంద మంద పవనాంచత్స్యందనారూఢుఁ డై
స్మరుఁ డిందిన్నుమఁ గూడి చైత్రుఁ డిలకింపం బోవుచందానఁ బు
ష్పరథం బెక్కి నిజావరోధసహితుం డై యంద ముప్పొంగఁగన్. 21

శా. ఘర్మాంభఃకణికాంగసౌరభము దిక్పాలింపఁ జక్రాంగోపల
శ్రేణీధ్వాంగధగద్ధగస్ఫుర దుద్యన్మౌక్తికస్పర్ధిభూరిస్ఫుర
త్కీర్ణాంభోజ మనంగ మోహనకళాకేళీమనోహారియై
గాణిక్యంబు బిరుదంకలం గదిసి శృంగారంబునన్ గొల్వఁగన్. 22

క. ఒకచో నటభటపరిహా, సకగాయకవైణికాదికచతురులు సూర్షి
ప్రకరంబును గొలువఁగఁ దీ, ప్యత్కాన్వయమణి పురోపవనమున కరిగెన్. 23

వ. ఇవ్విధంబునఁ దనవిలాసంబున కుచితంబై నమితపరిజనంబుతోఁ జరిగి పుర పరిఖాయితాయతోత్తుంగ తరంగ సవానుషంగ రంగద్భృంగ యుగ యుగపద్వి హారణోచిత పరాగ విసర కేసర యూథ సరోరుహభాసుర సరయూరోధంబునం బొదలు కదళీ కరంజక వంజుళ హింజుళ సరళ వకుళ చందన హరిచందన పిచు మంద మందార మాకంద కందరాళ సింధువార తమాల తాల సాలహింతాల నారికేళ పనస ఖర్జూర జంబీర మధూక బంధూక శింశుపాశోక కదంబప్రముఖ తరునికదంబచ్ఛాయల సోయగంబై సాఁగి సోగ లగు నేలకితీఁగలతోఁ గలసి బాగు మెఱయు మిరియంపుఁదీఁగల తొడలం బొసంగు లవంగలతాకుడుంగంబులతో ననంగి పెనంగి యనుంగుల తెఱంగున రంగైన లుంగపల్లికల నల్లుకొని యల్లి బిల్లి యగు నాగవల్లికల జొకలఁ జేకొని మొగి లసుపోఁకమ్రాఁకులతీఁగల బందునఁ బొందిన ద్రాక్షపందిళ్ల సందునం గ్రందుకొను దుద్రాక్షతరువుల తెఱపుల నింపుకొన్న యొడిగుఱిగింజతీఁగ చప్పరంబుల చొప్పున నుప్పరంబు నంటు కప్పురంపుటనంటి గుప్పుమనం గప్పు తావులకుఁ దావలం బగు తావుల తావుగొను గుజ్జుచేమావుల పజ్జల నుజ్జీవించు గొజ్జంగి యారంబుల నంటుగోరంటలతో జంటఁ బాయని గొంటెనల నంటున నంటులతో గొంటునిగేదంగుల తెగలతో బుగులుకొను నగలు వాసనలు డాసి వాసి గన్న దానవముల యాసన్నసరణిఁ జెన్నుఁ బన్ను సన్నజాజులతో వన్నెకెక్కు హొన్నగన్నేరులం దగులు సురపొన్నపువ్వు పొదుమారంపుఁ దిన్నల చేరువం బొలుపన్నీటికాలువల దగుల పొంత వంతుమీఱు చేమంతుల చెంతల నండగొన్న బొండుమల్లియలం గలసి మొల్లంబు లగు మొల్లల తావులఁ గొల్లలాడు భ్రమరదంపతుల యింపుసొంపులు దింపు సంపెంగల సంపదలకు నిరుగుపొరుగులై పాడుకొను విరవాదుల యాడటఁ బ్రోదిగొను జాదులతోఁ దులఁదూఁగి కనుబుట్టు కలుగొట్టు చెట్టుల పట్టున నిట్టలంబుగాఁ బుట్టు మెట్ట కెందమ్ములకుఁ దోఁబుట్టువు లగు చెంగలువల చలువల నెట్టుకొను వట్టివేళ్ల కడలఁ బొగడు మీఱు కురువేరు సవురున గుబాళించు మరువంపువలపులతోఁ జెలిమి సలుపు సహాదిమల్లెతీఁగల నాదుకొని పొగడం దగిన పొగడలఁ గదలుగొని ఘుమ్మను వాతపోతంబులచేఁ గదలు పారిజాతంబుల కొమ్మల వ్రేలు వాళువాతూఁగుటుయ్యేలలకొల్లఁ గీలుకొను నతనంపు మెఱుంగులఁ దుఱంగ

లించు కృతకాచలకందరంబులం దిరమ్ము లగుమందిరమ్ములమెచ్చి చూడ వేడుక హెచ్చి జోడు గూడుకొని వచ్చి వైదూర్యగవాక్షంబులు చొచ్చి పోఁగూడ కళికి వెనుకచిక్కుచక్కనయ్యు చక్కెరదిండి తేజీలముక్కుల నెక్కసక్కెంబు లాడు నక్కడి సరోజాతరాగధాతురాగంబులకు సరాగంబు లగుచిగురుల పొగరున నెగడుకోయిలల పంచమస్వరంబులఁ గరంగు నెలరాయురంగులఁ దొలంగు జలధారాశీకరపరంపరలం గనుంగొని యంతరంగంబు లుప్పొంగ నటించునీలకంఠంబులపింఛంబులయొప్పు తప్పక చూచి నిప్పుగల కప్పుమొగులను దిగులునఁ గొలంకుల కెలంకులనిలువఁ దలంకి చంచలించు రాయంచల గరుదంచలధాళధళ్యంబు లసమయచంచలాలతల సొంపుసంపాదింపనిలింపవన సంపదలఁ బొంపిరివోవు నయ్యెలదోఁట డాయం బోవు నవసరంబున. 24

సీ. సవిధపంకజవనీచరమాణకలహంస, గరుదంచలాంబు వర్ఘ్యంబు గాఁగఁ
దనయంతఁ బరిసరంబునఁ దత్తణము రాలు, కమ్మక్రొవ్విరిచాలు కాన్క గాఁగ
నళికుటుంబములరాయిడిఁ జేరువల జాఱు, నవపరాగంబు గంధవడి గాఁగ
గాడ్పు సోఁకి చలించు కర్పూరకదళికా, దళములు తాళవృంతములు గాఁగ
తే. శారికాకీరికాసమంచద్రుతంబు, వైడుపీభాషితోరు స్తవంబు గాఁగ
రమణనారామలక్ష్మియారామవిభునిఁ, బూజగావించుచందానఁ బొల్చెనపుడు.

చ. ప్రసవరజంబు గందవడి పైఁ గెగఁ జల్లుచు భృంగఝంకృతిం
బొసఁగ నుతించుచుం జలజపూగమరందకణావలీముద
శ్రుసమితితో నెదుర్కొనియె సొంపున గంధవహార్భకుండు దా
రసహితుఁడై చెలంగు రఘురామునియుల్లము పల్లవింపఁగన్. 26

సీ. కలకలఁ బల్కుచిల్కలకొల్కిఁ దమజాతి, గాఁబోలునని చిల్కకేదుపుపొదువఁ
జెలికత్తె నెలుఁగెత్తి చీరుతొయ్యాలి దమ, కులమని కోయిలల్ గుంపుగూడ
వెడజాఱుకొప్పుతోఁ గడుమీఱు వగలాఁడిఁ, దమవియ్యమని తేంట్లు తారసిల్ల
నటనతో నడచు చందనగంధి దనుబంధు, వని యంచబలఁగంబు వెనుకొనంగ
తే. శతసహస్రసఖీజనసహితజనక, దుహితగణికాసమూహంబు తోడరి గొలువ
ననుచరుల నెల్ల నటనిల్వనానతిచ్చి, రాముఁడభ్యంతరవనాంతరంబుసొచ్చె. 28

వ. అప్పుడు.

సీ. కుంభినీసుతగబ్బిగుబ్బపాలిండ్లతోఁ, బ్రతియైనగజనిమ్మపండ్లు కొన్ని
జనకకన్యపిసాళిజళుకుకందోయితోఁ, సరియైనమెట్టదామరలు కొన్ని
సీతాంబుజాతాక్షిచిఱునవ్వుచాయతోఁ, సవరైనవిరిమల్లెనరులుకొన్ని
కోసలాత్మజపెద్దకోడలినెమ్మోని, జిగిఁబోలు మేలిసంపెఁగలు కొన్ని
తే. మైథిలీదేవిదంతసంపదలసొంపు, నకు సమంబైనకుందబృందములు కొన్ని
యేర్చికొని తెచ్చియినకులాధీశ్వరునకు నెలమివనపాలకులు కాన్కలిచ్చుటయును.

శ్రీరాముండు సీతాదేవితో సరసోక్తు లాడుట.

తే. అపుడు కటాక్షించి యుడిగంపుఁ బొలఁతుకలను బోవ, చేకొని రాముఁ డావేళ సీతఁ జూచి
వనిత నీయంగములఁ బోలు వస్తుసమితి, చేకొనక మాకు నిల్పునేర్చి త్తనుచును.
మ. దరహాసద్యుతి జిల్లు వెన్నెలలచందం బొంది నెమ్మోముచం
దురునందుం బులకింపఁగాఁ గలికి కాంతుం డాడు నర్మోక్తికిన్
శిర మొక్కించుక వంచి క్రేవలఁ గటాక్షించెం దదీయాననం
పరలే తూపులుగా మరుండు రఘురామస్వామి నేసెన్ వెసన్. 31
చ. అలికులవేణి లేనగవు వాల్యయారపుఁ జూపులు ముద్దుమోము క్రొం
దళుకుకడాని బంగరపు నక్కుల చెక్కులఁ జెక్కుచెక్కులుం
బలుచని మోవి కెంజిగురుఁ బల్కులుఁ జూడనె కాని ప్రోఁదుట్లలోఁ
గలిగినవింత లెవ్వియును గన్గొన నొల్లఁడు రాముఁ డయ్యెడన్. 32
క. తరుణీతరుణాంగుళములు, కరమునఁ బెనలించి యహోమకరకులజశిఖా
భరణము తనువునఁ బులకలు, దొరయఁగ వనవీథిఁ బ్రియముతో విహరించెన్.
వ. ఇత్తెఱంగున విహరించుచు సత్తరణికుల గ్రామణి జనకకన్యామణితో నిట్లనియె
సీ. ముదిత నీపదపద్మములఁ బోలని చిగుళ్ల, పాలికి బిక శ్రేణిపాలు చేసి
బాల నీయవయవ శ్రీలతోఁ బ్రతిగాని, ప్రసవాలి యళిపంక్తిపాలు చేసి
పద్మాక్షి నీమోవిపంటితో సరిరాని, ఫలరాజి శుకకోటిపాలు చేసి
వనిత నీతావితో నెనగాని బహువిధ, పరిమళంబులు గాడ్పుపాలు చేసి
తే. యుపవనశ్రీవధూటి నీ కొప్పిదంబు, చిలుకపలుకుల నభినుతి సేయసాగె
నవనిజవు గావునను సహజానురాగ, మవనిజావలి చూపెఁ బల్లవమిషమున.
మ. జళుకుంగన్నులఁ జెక్కెముల్ మధురభాషం గీరతుండీరముం
గలితభ్రూయుగళీవిలాసమున సింగాణిం గచశ్రేణి కాం
తుల మాద్రోవి విభవంబుఁ జూఱగొనియుం దోడ్తోడ నీపాటి లిం
డులఁ గంటే మరుతూపులం జిదుమ నుద్యోగించి రబ్జాననా. 36
చ. కనుఁగొని పల్కు యంటి నగి కౌఁగిటఁ జేర్చి మొగంబుఁ జూపి మూ
ర్కొని పద మంచి పాడి ముఖగుంభిత మారస మొల్కు చెట్టుల
న్నన లొదవించి నీచెలు లొనర్చు ప్రసూనవిరామ మివ్వనిం
గనఁబడనీక నించితివి కామిని యెంత ప్రవీణురాలవే. 37
సీ. గోరింట నెడ నుంచి కొమ్మ యశోకంబు, తన్నితి విది యేమి తలఁప సరసి
సఖి గోఁగుతోడ ముచ్చట లాడు సురపొన్న, నవ్వితి విది యేగుణంబు చెప్పఁ
గలికి ప్రేంకణము చెంగటఁ బాడి పొగడపై, నుమిసితి విది యేదుగత్తులాడెఁ
జాన మామిడి నంటి సంపెంగకును మోము, చక్కఁ జూపవ దేమి తక్కువయ్యె
తే. తిలకభూజంబు కారుణ్యదృష్టిఁ జూచి, సింధువారంబు చెంగటఁ జేరి యుసురు

మంటి వడి యేమి యపరాధ మాచరించె, నువిద యీ పక్షపాత హేతువు గణింపు.

సీ. ఈ ద్రాక్షఫలములఁ గెక్కుడో నీ మోవి, యీసారి చవిఁ జూడ నీవె చెలియ
యీ మంజరులకును నీ జేమొ నీ చన్ను, లింకొక్కపరి పట్టనీవె సకియ
యీ యనంటులకును హెచ్చౌనొ నీ తొడ, లీసారి పట్టనీవే లతాంగి
యీ కప్పురపుఁ జెల్వ కెనయొ మిక్కుటమొ నీ పల్కు, లింకొకసారి పల్కుమతివ
తే. ముదిత యీ లవలీదళంబులకు జోడొ, పెద్దయో తళ్కు చెక్కిలి ముద్దులాడ
నీయవే యని సమవస్తువీక్షణమున, రాముఁ డవనిజఁ బల్కు నారామమునను.

చ. అఱవిరి తేనె పానకము లానెడి తేఁటుల దాఁటు సేఁపఁ జె
చ్చెఱ నలిరేఁగి ఝంకృతులు సేయుచు డాయుచు మీఁద మూఁగినన్
వెఱచి కవుంగిలించు ధరణీసుత నక్కున నుంచి మోమునం
జెఱుఁగు సవరింప రఘుశేఖరుఁ డిష్టఫలాప్తి రంజిలున్. 40

ఉ. నాయక తావకీనశుభనామము నచ్చెలి పల్కఁ గంటివే
కోయిల పల్కకున్న దని కోమలి పల్కినఁ జాన దానఁ గా
దీ యెడ నీ యెలుంగు విని యీగతిఁ బల్కఁగ లేని లజ్జ న
క్కోయిల మూకవృత్తిఁ గయికొన్న దనన్ రఘురాముఁ డొప్పఁగన్. 41

చ. భ్రమరసమూహ మల్లపుడు పైకొనినన్ హృదయేశ యేయుపా
యమునను బాఱఁ దోలితి రటంచు ధరాసుత పల్క రాముఁ డో
రమణి యుపాయ మేటికిఁక రంగగు నీ నును ముక్కు చంపక
భ్రమ మొదవింపఁగా నవియ పాఱె నటంచును బల్కె వెండియున్. 42

చ. పరిసరచంపకప్రసవపంక్తులఁ బుట్టిన వెట్టవాసనల్
గరళము లై పయిం బొరయ గాసిలి వచ్చు మదాళిసీపరం
పరలు భవత్పదాబ్జములపై నొలసెం దమ నొంచు చంపకో
త్కరముల నీ జిగిన్ గెలిచి కావఁగ దే యని మ్రొక్కకై వడిన్. 43

ఆ. తేఁటు లానుపువ్వు తేనెవాఁగును బక్వ, ఫలరసస్రవంతి పైకగీతి
దొరయ శశిశిలాంబుధుని యుఁ ద్రివేణిగా, మగువ యిచట నుండు మాధవుండు.

తే. ఇట్టులపుఁ బువ్వుగుత్తుల నట్టనడుమఁ, గలికి దులకించె దాడిమీఫలయుగంబు
కంచె కెంబట్టురవికఁ బిక్కటిలి యుబ్బు, నిబిడపుఁ గబ్బిగుబ్బలనీటుఁ బూని.

తే. తరుణి కడు వింత నీ ముఖదర్పణమునఁ, బ్రతిఫలించెను శుకదష్టపక్వబింబ
ఫల మనుచు భర్తృ భావగర్భముగఁ బల్క
ముదిత ముసిముసినగవుతో మొగము వాంచె. 46

చ. పొనపొన పొన్నగున్న పయిఁ బోటికొ మల్లిక ప్రాఁకి మాటికిన్
నును విరి తేనెఁ జిందుచు మనోహరభృంగరవం బెసంగఁగా
లి నొరయుచున్ రతిన్ నినువలెం జెలు వొందెనె నన్న నల్లడల్

గనుచు లతాంగి నవ్వుచు మొగం బదిమెం బతిపేరురంబునన్. 47

మ. ఎదపై వ్రాలిన బాల మైనదిమి పోనీ కంగ ముప్పొంగఁగా
సుదతీ చిక్కితి వెందుఁ బోయెద వటంచుం గంచుకంబున్ వద
ల్పఁ దొడంగన్ నికటంబునం జిలుక పల్కం గల్కిపల్కంచు జ
ళ్కొదవం బోవఁ గడంగుసీత నగె రామోర్వీశ్వరుం డయ్యెడన్. 48

ఉ. కోమలులన్ మనోహరులఁ గూర్చు మనోజుని తేజి యయ్యు నా
రామశుకంబు విఘ్న మడరం బలికెం గలకంఠి దీని నిం
కే మణిముద్రఁ జూపి భ్రమయించెద నంచు స్వరత్నముద్ర శ్రీ
రాముఁడు చూప బింబ మని వ్రాలె శుకం బవనీజ మెచ్చఁగన్. 49

ఉ. శ్రీరఘువీరశేఖరుఁడు చిత్తము రంజిలఁ బల్కు చిల్క ముం
జే రహియింప సీతఁ గని చెల్వరో నీయధరంబు బింబికా
శ్రీరస మొల్క రాచిలుక చేరెడు నంచునొ జిల్గునవ్వులన్
వారక మాటు సేసెదవు వంచన సేతురె యాశ్రయించినన్. 50

మ. హరినీలాలక చిల్క నీపలుకుఁదోడై యుండఁగా ముద్దుచ
క్కెరమైనన్ దయసేసి పంపఁగదె నీకెంగేలఁ గీలించి నీ
సరసాలాపసుధారసం బయినఁ గాంక్షుం గ్రోలఁగా నియ్యవే
తరితీ పేల యటంచు రాఘవుఁడు సీతన్ ముంచె రాగాంబుధిన్. 51

మ. తన తేజిన్ గ్రహియించినార మని కందర్పప్రభుం డల్కతో
మనపై నేసినతూపుచా లనఁగఁ గోమ్మా యల్ల క్రొమ్మావిచా
యనె రాలెన్ విరిమోదుగుల్ పవనబాలాందోళనక్రీడలం
గనుఁగొంటే యని తత్సమీపమునకుం గాకుత్స్థుఁ డేఁగెన్ రహిన్. 52

వ. తత్ప్రదేశంబున. 53

చ. కరమున మొట్టదమ్మి విరి గైకొని రాఘవుఁ డందుకోవె సుం
దరి యని యాసఁ జూపి వనితామణి యించుక నిక్కి పాణిపం
కరుహము సాఁచినం బొడవుగా మఱియున్ గర మెత్తు బాహుమూ
లరుచులు జాఱుపయ్యెదఁ జెలంగుకుచంబులుఁ జూచు వేడుకన్. 54

సీ. నిగిడి నిక్కిన జాఱు నీవి గన్గొనునాస, వెలఁది కందనితీఁగవిరులఁ జూపు
వలువ యెత్తిన నూరువులు చూచుతమిఁ దలో,దరికిఁ బన్నీ రేటిదారిఁ జూపు
నళిపంక్తికళికి కౌఁగిలి యిచ్చు ననుకోర్కిఁ, బాలఁతికి విడిపువ్వుఁబోదలఁ జూపు
బడలి పై నొఱఁగునన్ బాళి నాతికిఁ గప్పు,రపుఁదిప్ప లొప్పునరంట్లు చూపు
తే. నధరబింబంబుపైఁ గాంక్షనడరుకలికి, చిలుకనదలించఁ జక్కెరల్ చిలుకుపలుకు
వినుప్రియంబున నెలమావివనులఁ జూపు, సీత కవ్వేళ రఘువీరశేఖరుండు.

మ. ఎలదీఁగన్ సుమకాంతుఁ జేరకు లతాంగీ తీఁగకున్ ఖేనికిం

దెలియఁగ రాను విభేద మంచకొఱ కింతి పోకుమె రాకపో
కల నీ కంచకు వేఱు లేదు చిలుకం గై నుంచకే చిల్కప
ల్కులొ నీపల్కులొ కాంచ లే మనుచుఁ బల్కుఁగ రాముఁ డాయమయెడన్.

ఉ. అంటితివేమొ పుష్పవతి యాలతకూన నవైన నంటు న
న్నంటను మున్నుదాఁకి నని యవ్వలి కేఁగిన సీత నవ్వుచుఁగ
వెంటనె పూఁబొదల్ దిరిగి వేసరి చెమ్మటఁ దొప్పదోఁగినం
బంటవలంతియల్లుఁడు కృపానిధి కౌఁగిట గ్రుచ్చె నంతటన్. 57

తే. అలరుపుప్పొడిదుమ్ము కచ్చాలల నెఱయఁ, జెంతఁ దనుడాసి నడయాడు సీతఁ జూచి
యధిపుఁడౌనె రజోవతి వైతి వనుచుఁ, బలికి విభ్రాంతిఁ గనునంతఁ బరిహసించె.

వ. ఇవ్విధంబున వివిధవినోదంబులం దగిలి విహరించుచు విపులపరిమళమిళితలలిత
ప్రసూనవల్లరులు హరించుచుం గమ్మవిరి తేనియలు గ్రోలుచు రసానుభవోల్లా
సంబున సోలుచుఁ జిమ్మచీఁకటులు గ్రమ్మపువ్వటీరంబులలోఁ దూఱుచుఁ
గొజ్జఁగపువ్వుసెజ్జలం జేరుచు డోలికాకేళికలం జొక్కుచుఁ గేళికాశైలంబు
లెక్కుచు నెలమ్రావిక్రేవలనీడల నిలుచుచుఁ గల్కిరాచిల్కలం బిలుచుచుఁ
గిసలయకుసుమలసితతరుశాఖ లూఁపుచు భ్రమరసముదయంబులం జోపుచు
మత్తమయూరంబుల నదలించుచు మరాళదంపతుల బెదరించుచుఁ బన్నీటియేటి
కెలంకుల మెలంగుచుఁ గ్రొన్నెలరాలతిన్నెలపైఁ జెలంగుచుఁ బ్రణయకలహం
బులు పూనుచుఁ బ్రణతికల్పనలచే మానుచుఁ దరులతాదులకుఁ బరిణయంబు
లాచరించుచు విచ్చలవిడిఁ జరించుచు సీతారాము లారామకేళిం దేలి రయ్యె
వసరంబున. 59

క. తిలకించుచున్న పతిచూపుల కింపుగ మెలఁగు జనకపుత్త్రిక నెంతో
నలరించుచు నాయమతోఁ, జెలిగుంపు సుమాపచయము సేయుచు వేడ్కన్. 60

### సీతాదేవి చెలికత్తెలతోఁ గూడి కుసుమాపచయం బొనర్చుట.

రగడ. అతివ మరుశరములకు నళిభటావళి కాపు
ప్రతిలేని వనసస్యపాళి కాముని కాపు
పోఁకముడి వీడఁ జెలి పోగడ కేటికి నిక్కఁ
బోఁకమ్రాఁకులయొద్ద పొద చీఁకటికి నిక్క
గలిగొట్టుచుట్టుఁ బొడగట్టె రటె చెలు లక్క
నెలచట్టు గెంపయ్యె నీపాదముల లక్కఁ
దళుకుబంగరువిరులు దాఁచినావటె మూల
నళు కేల బాలరు ద్రాక్షతరువులమూల
నలివేణి చెంగటనె యలరి కాఁచెను నిమ్మ
యల మొల్ల లడుగ నియ్యనె కాని కానిమ్మ

ననలబదు లమ్మ నీఽనవ్వు లతలను ముంచెఁ
బనిఁబూని చేమంతిఽబంతి నది ప్రియ ముంచెఁ
గలికి కను తేనెవాఁకఽకలమించు నియ్యాలలు
తెలిగంటి మన కిచటఁ ఽ దీఁగలే యుయ్యేలలు
తరుణి యీమల్లికకుఁ ఽ దగును సహకారంబు
పజలు మంకెనవిరులె ఽ వని కలంకారంబు
కొమ్మ యిక్కడ బుగుఽల్కొనియె నేలాలతలు
నెమ్మి విను కలకంఠి ఽ నేర్చు వాచాలతలు
మారేడుపంటికై ఽ మగువ కడుగోరేల
చేర రాఁగదె యిప్పఽచెంత నదిగో రేల
యింతి దివితో నొరసె ఽ నిదిగో హింతాళంబు
నింత విరవాదివిరి ఽ కేల కాంతాళంబు
మదవతులతావి గొనె ఽ మందవాతూలంబు
సుదతి కంటివె వృథాఽస్థూలంబు తూలంబు
మగువ పరుగెత్తకు వెఽ మరువంపుఁ దావులకు
ముగుద పోద మశోకఽములు వెలయు తావులకు
మెట్టకెందొగవిరుల ఽ మెట్టకువె లతకూన
వట్టివే రననేల ఽ వంచెదవె లతకూన
పొలఁతి యది చనసాగెఁ ఽ బొనపొన్న నీడలకుఁ
జిలుకపలుకులు తఱుచు ఽ చేరినవి నీడలకుఁ
జెలియ కెంజిగురు కేల్ఽజిగురు సరిగిల్లకుము
తలఁప బలునూఁకు గేఽదఁగికి రాగిల్లకుము
చెలిరో దీనికిని దయ ఽ సేయవే వదనంబు
నెలఁత కురువేరు వేఽఁడని గన్న దవనంబు
పూచి మోదుగులీల ఽ బోటి దగె వారిజము
నీచరణముల చాయ ఽ నెగడె స్థలవారిజము
హరిణాక్షి జాతి నదె ఽ యవతంస కువలంబు
పరికించెద వదేమొ ఽ పలుమాఱు కువలంబు
వలఁదయూడలజడల ఽ వఱలె జటిజాలములు
వలదు వెలుఁగలకుఁగా ఽ వనిత యీజాలములు
లేను బల[illegible]విరులఁ బొదఽలెడి దేవకాంచనము
నీమేనికాంతి యింఽతిరో మించెఁ గాంచనము
మావి మును చేరితిమి ఽ మగువ మాది ఫలంబు

కావలసెనేనిఁ గొను కాన్కమావిఫలంబు
కనకాంగి కనుఁగొంటె కర్పూరకదళములు
పెనుపొందెఁ గదలుచును విప్పైన కదళములు
బెడఁగు కెంజాయఁ గనుపించెను గదంబములు
నడలె సఖి నడలఁ గనె హంసీకదంబములు
తనుమధ్య తగె నారంగమున నీనఖరములు
ఘనకురంటకకంటకములు చాన ఖరములు
వెల్లిమై తోఁచెఁ గురివెందల మరందములు
చెల్ల విరులనె గనిరి చెలులు తమ చందములు
హేమాంగి నీకందునేమె ముకుళకుచములు
భూమిజకుఁ జెమరించెఁ బో కపోలకుచములు
తఱచైన విచట సుందరి కుందరాశములు
కరవీరముల కేల గైకొనె దరాశములు
పువ్వుఁబోఁడి యేమిటికిఁ బోయె దుత్పలికలకు
నవలా యలరెఁ గేకిన రత్నోత్పలికలకుఁ
బాటీరతరు లొరసి పదగడవె గణికలకుఁ
బోటి మిక్కిలి యలఁత పుట్టెఁ గదె గణికలకు. 61

క. అని సరసోక్తులఁ గమలాననలు ననల్ చిదిమి బడలి నగునెమ్మొగముల్
నునుఁజెక్కులుఁ జెమరింపఁగ, జనకజకడ నిల్చి రట్టిసమయమునందున్. 62

సీ. చిగురులన్నియు హరించితి రింతె మీకర, శ్రీలచే నైనఁ బోషింపుఁ డనుచు
రతిఁ దేనె లెల్లఁ గ్రోలితి రింతె మీవచో, మధు నైనఁ గరుణించి మనుపుఁ డనుచు
ఫలము లన్నియుఁ గొల్లఁబట్టితి రింతె మీ, బింబోష్ఠములనైనఁ బెనుపుఁ డనుచుఁ
గమ్మక్రొవ్విరు లెల్లఁ గైకొంటి రింతె మీ, తావులైన నొసంగి ప్రోవుఁ డనుచు
తే. వేఁడుకొనవచ్చుగతిఁ బికపతతి తేంట్లు, చిలుకగుంపులు వలికరువలియుఁ గరము
ఖాధరాంగసుగంధాప్తి కనుసరింప, బడలి యాడాడ నిలిచిరి పడఁతు లపుడు.

ఉ. లలనలు శాహులంబడముఁ లీఁగిచన్నులఁ గప్పకొప్పులం
బలుకులఁ బాటలన్ లతలఁ బల్లవగుచ్ఛమిళిందకీరకో
కిలముల నెప్పటట్ల కలిగించ వసుంధర మించెఁ బూర్వభం
గుల నవనీజయుక్తి మనుకొమ్మలచే వసి సేగిఁ జెందునే. 64

చ. చెదరినముంగురుల్ జఱుచు చెమ్మట దోఁగిన తళ్కుఁ జెక్కులున్
వదలిన కప్పుఁగొప్పు వసివాడిన మేనొకయింత జాఱు ప
య్యెద యసియాడు లేగవును నిట్టటు తొట్రిలుపద్మయుంబుఁ బె
ల్లొదవెడి యూర్పులుం గల తలోదరిఁ గన్గొని రాముఁ డిట్లనున్. 65

చ. అలసితి యిందుబింబముఖి । యక్కట యంగము చెమ్మరించె గు
బ్బల రవి కేల మాన్పు కటి । భార మింకం గయిదండ గొమ్ము నె
చ్చెలులును మేము నొక్కపరి । సేసెవ మేపనియైన నూడిగం
బులు గణియింపు మన్న సతి । మో మరవంచిన బోటి యిట్లనున్. 66
చ. ఘనరససంభవంబు లెసఁ । గన్ భువనాధికరాగ మొప్ప మీ
రనుపమితామృతస్ఫురణ । నాఁడితి రందున వేడ్కఁ జెందె నై
న నురువనౌఘపుష్పహర । ణంబునఁ బుట్టినశ్రాంతి పాయ నెం
చిన యది మేఘపుష్పములు । సీత రఘూత్తమ యంచుఁ జెల్పినన్. 67
ఆ. స్వామి నగుచుఁ జెలువ । సరసులు గాంక్షింపఁ, బలుక నీవె నేత్ర । పద్మనయన
గగనకుసుమమధ్య । గామింప మేఘపు,ష్పమ్ము లరుదె యనుచుఁ । బలికికొనుచు.
క. వనితాసహస్రములు గొలు,వ నితాంతప్రేమ రామ । వసుధాపతి జ
వ్వనితో నవ్వనిలోఁ పలఁ, జనియెం జలిగాడ్పు చెలఁగు । చల్లనిత్రోవన్. 69
క. చని ముందరఁ గనె నిందిర, ఘనమందిరముల కమంద । కలితమరందా
శనసంగులైన భృంగుల, స్వనభంగుల రంగెసంగు । జలజాకరమున్. 70
క. కనుఁగొని రాఘవుండు పలి । గాడ్పున రేఁగిన తేఁటిగుంపుస
ద్ధునఁ దమి నిద్దురల్ విడిచి । తోయజమండలి నంచ లార్వఁ బ
ర్విన తెలితెక్కచాలుజిగి । వెన్నెల లంచుఁ జలించు చక్రపం
క్తినెగులు మాన్ప భానుఁ డరు । దెంచె ననన్ దరి నిల్చె వేడుకన్. 71

సీతారాముల జలక్రీడాభివర్ణనము.

చ. జనకజఁ జూచి యాసరసి । శైవలకేశిని పద్మకోరక
స్తని బిసబాహ కంబుగళ । సైకతచారునితంబ మీనలో
చనయును గాన నీసకియ । చాడ్పున శ్రాంతి హరించె రాజహం
సనికరపక్షచామరజ । చందనశైత్యమరుత్పరంపరన్. 72
సీ. కలికి జక్కవలు నీ । వలిగుబ్బలకు నుబ్బి, పఱతెంచెఁ బారువ । పట్టనేమొ
వెలఁది తుమ్మెదలు నీ । వేనలి నీక్షించి, యరుదెంచె గుఱుతెఱుఁ । గాయెనేమొ
చెలువ రాయంచ నీ । చిన్నినెన్నడలకై, మలసెఁ జుట్టఱికంబు । దెలిసెనేమొ
చెలి జలేభములు నీ । చికిలితొడల్ గూర్చి, చెయ్యెత్తెఁ జెలిమిగాం । క్షించెనేమొ
తే. పొలఁతి నీకెళ్ళవాలుచూ । పులకు మేని,తళుకులకు నోడి నును బేడి । సలునివాళి
యిచ్చెఁ దమజాతిపెద్దలం । చెఱిఁగి యేమొ
యువిద సిరు లున్న బాంధవ్య । మొదవు టెంత. 73
సీ. ఈయూర్మ్లికమీఁద । నీవు వినోదింప, నామ్రేడితంబులై । యడర కున్నె
యీకల్వ లికమీఁద । నీవు ద్రుంపగణింప, విగళితమధువులై । నొగల కున్నె
యీయంచ లికమీఁద । నీవుపట్టఁదలంపఁ, దొలఁగి శైవలములఁ । మాటు కున్నె

యీ తేఁటు లిఁకమీఁద నీవు రాయడిసేయ, సవిధకుంజములకు జరగ కున్నె
తే. యీరథాంగంబు లిఁకమీఁద నీవు దఱుమ, నెగసి కమలవనంబులకేఁగ కున్నె
యీయిసుకతిప్ప లిఁకమీఁద నీవు కొలను, సొచ్చినప్పుడె పెండడికేఁగ కున్నె.
క. శకులములకు దుమికెడు లకు,ముకులగరుత్కాలన నలినములపుప్పొడి జా
నకి యిచ్చట నెఱసెఁ దటా,కకమల నీమీఁదఁ జల్లు గందవడి యనన్. 75
చ. సకి యకలంకతోయకణసంగత పద్మపలాశమధ్యహా
ల్లకరుచు లొప్పెడిం గొలఁకులచ్చి నినుం గని చెల్మి హెచ్చఁగా
మకరతపాత్రలో విమలమౌక్తికము ల్జతగూర్చి రత్నదీ
పకలన నిచ్చునారతుల భావమునం గనుఁగొంటె యిచ్చటన్. 76
మ. చెలి యబ్జంబు భవన్ముఖాకృతి రహించెం గానఁ జంద్రుఁడై
యలరె న్నీముఖమై ఖరింగువలయం బై తత్కళంకంబు నీ
తళుకుంగన్నుల పోల్కిరే పగలు చెందర్గ లేక విన్నందనం
బాలయంగా నపకీర్తి మించె మధుపవ్యూహాప్తిఁ గన్గొంటివే. 77
మ. అని వర్ణింపఁగ నంత జానకివయస్యల్ రత్నపుఁ సొమ్ములున్
మినుకుంబంగరుజిల్గువాఁతెపనుల్ మేలైనవల్వల్ నడ
ల్చి నునుంజందురుకావిపావడలు బాళిం బూని కేల్దమ్ములన్
ఘనవత్కోరుహపాళి మాటుకొనుచున్ గాసారముం జొచ్చినన్. 78
సీ. పద్మాయతాక్షులు ప్రపదసంపదలచేఁ, గూర్మల కొకవింత గొమరు గలిగెఁ
బడఁతులతళుకుఁజెందొడలచే జలదంతి, కరముల కొకవింత గరిమ గలిగెఁ
దరుణీమణుల మేలితఱులచేఁ దఱుచైన, తరగల కొకవింతయొఱపు గలిగెఁ
గిసలయాధరలపొక్కిళ్ళచే వర్తులా,వర్తాళి కొకవింత వన్నె గలిగెఁ
తే. గోమలయూరులనఖులొందెఁ గ్రొత్తసిరులు, సఖులగుబ్బలఁదులకించె జక్కవకవ
నతివలముఖద్యుతుల మించె నంబుజములు
సుదతులు క్రమంబునఁ గొలంకు చొచ్చునపుడు. 79
సీ. నీవు కొండొక యీఁదనేర్తువొ నేరవొ,పొలఁతిలోఁతటుమించిపోకుమనుచు
నీఁత నేర్తు నటంచు నెఱుఁగవా నామీఁద,నోలఁబెట్టిటువొ యెదుండుమనుచు
మనయుద్దిముద్దుగుమ్మనుగొమ్మ యది ముంచె,నెందుఁబో యెడినోపొనీకుమనుచు
వలదురాకుమమించియలనాఁటినాథాటి యెలనాఁగ మఱచితివేమొయనుచుఁ
తే. జెంతఁ జేరిన నీ వేమిసేయుదాన, వాయ యీవట్టిపగ్గె లేలమ్మ యనుచు
సరససల్లాపములఁ గేలిసలిపి రంబు,జాకరంబునఁ బూర్ణచంద్రాస్యలపుడు. 80
సీ. మొగములు గానరానిగిడి కామిను లీఁదఁ,గొలనెల్లఁ జంద్రమండలములయ్యెఁ
గుచములు గానరాఁగొమ్మ లీఁద సరోవ,రం బెల్లఁ గమలకోరకము లయ్యెఁ
గ్రొమ్ముడుల్ గానరాఁ గొమిరె లీఁదఁగఁ దటా,కంబెల్ల గాఢాంధకార మయ్యెఁ

బిఱుఁదులు గానరా బిసరుహానన లేఁద, చిక్కి కాంతన మెల్ల దీవులయ్యె
తే. బాహువుల్ గానరాఁ బద్మపాణి లేఁద, నగసి యెల్ల మృణాళైకసదనమయ్యె
నంగములు గానరాఁ గాంచనాంగి లేఁద, సారసాకరమెల్ల బంగారమయ్యె.
తే. కుచగిరులునీటితోఁ దాయఁగొమ్మయొకతె, మునిఁగి లేచిన నెమ్మోము మురువు చెం
శైలమథనంబునను దొల్లి పాలవెల్లి, జననమొందినపరిపూర్ణచంద్రుఁ డెగడి. [దె
మ. జవరా లొక్కతె దొట్టఁ దన్ను సరసీజాతంబులన్ నొంచిన
ట్టివఘాటిన్ మరలం బయోజములఁ దాటింపంగ నంకించి యం
బువులం దోఁచునిజస్తనంబు లరుణాంభోజాతకోశంబులం .
చు వెసం బాణులు చాఁపఁ జూచి నగి రచ్చో నున్నకన్యామణుల్. 83
మ. సరసిం దోఁచిన ముద్దరాండ్రమొగముల్ సత్యంబుగా మించు తా
మర లంచుం బరువెత్తఁ బోయెదుమదోన్మత్తద్విరేఫంబు లా.
సరసీజాక్షులవాలుఁజూపులు సరోజాతాటవిన్ వ్రాలినం
బరరోలంబకదంబకంబు లనుచుం బైపై నెత్తి పోకుండునే. 84
మ. కరియానామణు లూనుసంకుమదముల్ కాశ్మీరముం దావిక
స్తూరియున్ గంధము సంగ్రహించి యరిసందోహారుణాంభోజబం
భరహంసాదులగాసి కోరిచె సరఃపద్మాఖ్యపద్మాత్మ యి
ద్ధర నాత్మీయధనంబు లెంచరు వినూత్నద్రవ్యవాంఛాపరుల్. 85
ఉ. ఆననజేతృణాల్ జలవిహార మొనర్చుచు దర్ప మొంది యిం
దీవరపత్త్రభంగము లుదీర్ణతఁ జేయఁగ లూటి యేల యిం
దీవరపత్త్రభంగముల నేఁ గొననేరనె యంచుఁ దత్సర
శ్శ్రీ విరుతిన్ వచించి యలచేఁ గొనె వారలపత్త్రభంగముల్. 86
వ. తత్సమయంబున. 87
ఉ. వారివిహారముల్ గని యవారితవారివిహారవాంఛ లోఁ
గూరిన సీత వేడ్క కనుకూలుఁడు గాన మెఱుంగుఁ బోలు న
వ్వారిజగంధితో మొగులవైఖరిఁ గేళికి నర్హమైన యా
కారముతో ధరావరశిఖామణి గద్దియ డిగ్గనయ్యెడన్. 88
సీ. ప్రతిలేనితనమోముపరిపూర్ణచంద్రబిం,బమొ యంచుఁ జక్రదంపతులు గలఁగ
ఘనమైనతనకొప్పు కాదంబినియొ యంచు, రాజహంసకుటుంబ రాజి బెగడఁ
గనరానితనకౌను కంఠీరవమొ యంచు, జలకరేణుకరీంద్రసమితి దెమలఁ
దులకించుతనతనుద్యుతి సంపెఁగయొ యంచుఁ, జంచరీకచయంబు చంచలింపఁ
తే. జరణకాంతులు సంజకెంజాయ లనుచుఁ, బద్మవనలక్ష్మి తల్లడపాటుఁ జెంద
హేళికులరాజమౌళి కెంగేలు వట్టి, కలికితలమిన్న కొలఁకులోపలికి డిగ్గె. 89
క. డిగ్గినయగ్గజగామిని, నగ్గలికన్ సరసిలోని కధిపుఁడు తివియన్

బెగ్గడిలి కరయుగమ్మున, బగ్గర మెడ కౌఁగిలించి బెగడుఁగ నగుచున్. 90

ఉ. జానకిఁ జూచి యొక్కకలశోకము భరించినవార లెంతలోఁ
దైనను జొచ్చి యీఁదఁగ మృగాక్షి యురోరుహకుంభయుగ్మముం
బూనియు నీటికిన్ వెఱచిపోయెద వంచు రఘూద్వహుం డనం
గా నగియెన్ లతాంగి పతికాయమునన్ లతయై పెనంగుచున్. 91

చ. మొగముబిటారమున్ నుదుటిముంగురులుం గళుకొంగుచూపులున్
జిగిచనుదోయి చెన్నుగిలుచెక్కుల తేటలు ముద్దుమాటలున్
బెగడును నవ్వుఁ దత్తఱము వేడుకలుం గలసీతచెయ్వులం
దగిలి విభుండు లోమఱచెఁ దత్సరసిన్ విహరింప వచ్చుటల్. 92

సీ. పతిదీర్ఘబాహువుల్ పరికించుఁ బరికించి, జలదంతిహస్తముల్ దెలియఁజూచు
విభునికన్నుల తెల్వి వీక్షించు వీక్షించి, తెలిదమ్మిరేకుల తెలివిఁ జూచుఁ
జెలువునిమైచాయ దిలకించుఁ దిలకించి, నీలోత్పలంబులనీటుఁ జూచుఁ
బ్రాణేశుగళరేఖ భావించు భావించి, శంఖసౌభాగ్యంబు సారెఁ జూచు
తే. నధిపుదరహాసచంద్రిక లరయు నరసి, సరసిజమరాళఖగగరుచ్ఛాయఁజూచు
నతనియవయవములకు జోడౌనొ కాదొ, యనుతలంపునఁగొలనిలోనవనికన్య.

సీ. తొడలబం టిటురమ్మ జడియక యని యింత, యంతలోఁతున నడయాడ నేర్పెఁ
జెలు లీఁదులాడఁ జూచితె యంచుఁ జేయిచ్చి, యల్ల నల్లన నీఁదులాడ నేర్పె
నలయంచఁ బట్టి తెమ్మని కోర్కి రేఁచి ని, బ్బరపుటీఁతల నీటఁ దిరుగ నేర్పెఁ
బాణిఁ బూనినతమ్మి బల్మిఁదాఁ గొనివైచి, చనినఁ బోనీ కంటఁగొనఁగ నేర్పెఁ
తే. దొలుత నెలనాఁగఁ దనకరతోయధార, ముంచి కరవారిధారలముంచ నేర్పె
శ్రీరఘుస్వామి యంభోవిహారవేళ, ధరణికన్యక కన్నిచందములు నేర్పె. 94

ఉ. అంచల నంచఁ బోలి కమలాటవి నిందిరఁ బోలి నాఁచుమ
బ్బంచుల మించుఁ బోలి తెరయ న్తెరలో మణిపుత్త్రిఁ బోలి య
క్కాంచనగాత్రి రాఘవునికన్నుల కిం పొనరించుచున్ జలా
భ్యంచితకేళిఁ దేలె సరసాళులు సన్ముఖ మాశ్రయింపఁగన్. 95

తే. దశరథాత్మజుకరవారిధార ధారుణీకుమారికకురులపై నెఱసి చెక్కు
లొరసికణలీల మొగమాని మెఱసె ముఖసు, ధాకరునిఁ గొల్వవచ్చినతారలనఁగ.

మ. అలివేణీమణి సీత యాత్మకరశోణాంభఃకణాసారపం
క్తులు కౌసుంభరసప్రవాహరుచి నెంతో మించెఁ గాంతల్ హహా
హాళి నెంచం బతి వాళి నించ రఘువీరాంచత్కుచశ్రీల న
జ్జలముల్ సేసెఁ బాకశాసనశిలాస్పర్ధిద్యుతిస్నిగ్ధతల్. 97

సీ. కోదమజక్కవగోటఁ గ్రుచ్చిన పద్మకో, శము రేఖ కనుగొంటె సకియ యనుచుఁ
బద్మినిపై నెక్కి భ్రమరంబు మధురసం, బానుచందముఁ గంటె జాణ యనుచు

జలదంతియావర్తసరణి హస్తాగ్రంబుఁ, జొనిపినతమి గంటె సుదతి యనుచు
నుత్పలిన్యుచ్ఛ్వాసితోర్మిడోలికసంచ, నిపుడించువగ గంటె నెలఁత యనుచు
తే. ధ్వను లెసఁగఁబల్కుచును ఖగధ్వనులు వినుచు, సీతతోఁ గూడి రఘువీరశేఖరుండు
బాలలు స్వపక్షమున సీతపక్షమునను, జల్లుపోరాడఁ గనుఁగొంచు సరసిఁ దేలె.
క. తన తెగ మగువలు రఘురా, ముని తెగ కామినుల మించి ముంచిన సగున
జ్జనకజ నగవుల దీర్ఘిక, యనిమిషదీర్ఘికవిలాస మయ్యెడఁ గాంచెన్. 99
మ. తనకున్ దవ్వగుపద్మినిన్ వలచి సీతాదేవి ప్రార్థించినన్
మనువంశాగ్రణి యస్యకాంతను స్పృశింపన్ మా కనర్హంబు గై
కొను మీవే నినుఁ దెత్తు నాడ కనుచున్ క్షోణీజ బాహాంతరం
బునఁ బూనెం గమలావధూటి నెడపై మున్నుంచుకొన్నట్టుగన్. 100
ఉ. కామిని కేలుఁదమ్మికవ కమ్రపదాబ్జయుగంబు మోముకెం
దామర నేత్రపద్మము లుదగ్రకుచాంబుజకోరకంబులున్
రామనృపాలశేఖరుఁ డురంబున మించెఁ బయోజమాలికా
శ్రీమహిమం గచద్యుతులు చెల్వెసఁగెన్ మధుపాళిపోలికన్. 101
ఉ. ఓలలువెట్టి గెల్చినపయోరుహగంధిని బూనకుండినం
బోల దటంచు నీతి గలభూపతి గావునఁ దానె పూనినాఁ
డే లలితాంగి మీరఘుకులేశ్వరుఁ డంచును సీత నెచ్చెలుల్
గేలి యొనర్ప రాముఁడు సఖీయుతుఁడై విహరించె నవ్వుచున్. 102
చ. కమలమరందబిందు వుదకంబునఁ జింది యమందచంద్రికా
క్రమమున మించె నేమి యిది కాంతుఁడ యంచు ధరాజ వేఁడినన్
రమణి సరోజలక్ష్మి మగరా తెలికమ్మలు నీకొసంగె వే
గమ కొను మంచు రాముఁ డవి గైకొనఁ బోవఁగ నవ్వె బెట్టుగన్. 103
చ. చెలియలలోన నన్నగడు సేసెడవే రఘురామ యంచుఁ జెం
గలువ వధూటి భర్తయెడఁ గ్రమ్మఁగ వైచిన బోటు లందఱున్
వలగొని తమ్మిపూవుల నవారణ ముంచిరి రాముఁ డంపునం
దలఁకినయట్లు చేరె వసుధాసుతమాటునకున్ సఖుల్ నగన్. 104
ఉ. తప్పు గణించి కాదొరలు దండన సేయుదు రొద్దివారి వా
తప్పున కల్గి మంది కలదాన సటంచును మారుతూపులం
గుప్పితి వీవు నీచెలులఁ గూడి బళా యని మోము ద్రిప్పిన
న్దప్పు సహింపుఁ డంచు సతి నవ్వుచుఁ గౌఁగిలి యిచ్చె భర్తకున్. 105
ఉ. కోడెమిటారిగుబ్బకవ గుబ్బెత గ్రుమ్మిన మున్ను చల్లుపో
రాడినశ్రాంతి దీఱఁ బులకాంకురముల్ చెలువారఁ గుంజరీ
క్రీడల నుబ్బు హస్తిపతికిం బ్రతియై జలకేళిఁ దేలియున్

వేసుకవెల్లిఁ దేలె రఘువీరుఁడు మారుఁడు సేక వేయఁగన్.
వ. అప్పుడు. 107
సీ. అమృతనామము యథార్థముగను ధరియించె, ననిమిషాలోకాప్తి సధిగమించి
వార్యభిధానంబు వన్నెకెక్కఁగఁ బూనెఁ, గరియానలవిలాసగతు లడంచి
క్షీరాహ్వయము సార్థమై రహించ వహించెఁ, జెలులమందస్మితశ్రీల దొరసి
వనసమాఖ్య ప్రశస్తవాచకంబుగఁ దాల్చెఁ, గొమ్మలచిల్కపలుకులఁ జెలంగి
తే. కమలభావంబు నిక్కంబుగా ధరించె, లికుచకుచలకచాళిమేచకరుచి గొని
శరమనెడిపేరు నిజమందు బెరసిమెఱసె, సఖులతనువుల నొరసి తత్సరసిజలము.
చ. అడరెడివేడ్క నొండొరుల నంటినయప్పుడు కౌఁగిలించిన
ప్పుడు జనియించుసాత్త్వికపుఁబొల్పు తనూపులకాంకురంబులున్
గడల మెలంగుబోటులకుఁ గానఁగ నియ్యక నోలలాడి యె
క్కుడుతమి భూమికన్యయు రఘుప్రభుఁడుం దని వొందిరయ్యెడన్. 109
చ. అవనిజచూపులున్ రవికులాగ్రణిమైజిగి నల్లకల్వలుం
గువలయనేత్రనవ్వులు రఘుప్రభుచూపులుఁ దెల్లగల్వ లె
క్కువ యయి నిండె నీట మును గోసినపువ్వులకంటె రెట్టిగా
నవుర వధూవరుల్ సరసి కర్పణసేసి రనం జెలంగుచున్. 110
చ. సకులు పయోదముం గడచుచంచలలో యన వెల్వడంగ మ
ద్వికచపయోజహల్లకతతిం గొని కేళి యొనర్చి నీళ్లలో
మకరులఁ జేర్చి పోయెదరు మానినులంచు సరోవరేందిరా
ముకురముఖీలలామ వెస మ్రోసె సహోర్మిఖగస్వనంబునన్. 111
వ. ఇవ్విధంబున. 112
క. చెలువలు ముందుగ వెల్వడి, చలువలు చెలువలరఁ గట్టి సకలాభరణం
బులు వరుసఁ దొడిగి విరులిడి, బలువుగఁ గ్రొమ్ముడులు పూనిబాగొందు నెడన్.
సీ. స్తనగుళుచ్ఛంబుల స్వస్తికాకృతిహస్త, కమ్రపల్లవములు గప్పికొనఁగ
వర్షుకాంబుదలీల వహియించు కచపాళి, తటతటుస్థితకేకిపటలిఁ బిలువ
వాఁగు తేఁటులు రాఁగడాఁగెనా నంసాగ్ర, భాగంబునన తాస్యపద్మ మొదుఁగఁ
దడిసినజిలుఁగుతోఁ దళుకుతళ్కనుమేని, మించు లక్కొలనెల్ల ముంచుకొనఁగ
తే. గానుగడగడవడఁక వేఁకపుఁబిఱుందు, భారమున నెన్నడలు తొట్రువడఁదటాక
మవనికన్యక వెలువడి యధవుఁ గూడి, దరిని నిల్చిన సకియలందఱును జేరి.
క. కొందఱు రఘుకులభర్తకుఁ, గొందఱు మిథిలాధినాథుకూఁతున కత్యా
నందకరంబుగఁ గైసేయం దగి రిర్వురుఁ జతుర్విధాలంకృతులన్. 115
వ. అప్పుడు. 116
చ. తొలకరిమించుకెందొగలతోఁ గలతోయజతారహారకాం

తులఁ దగు నవ్వుకొ న్ననలతో నలతోరపుగుబ్బచన్నులం
దొలఁకెడికానుచంచలతతో లతతోఁ దగుమేనితావికిం
దుల యగు కొప్పుగేదఁగులతోఁ గులతోయదవేణి మించినన్. 117

సీ. ఒప్పు లొలెక్కెడితళ్కుఁగొప్పులోఁ దులకించు, కమ్మ గేదఁగిఱేకు లెమ్మెగు లెక్క
వలిపపై తాణిపావడమీఁదఁ దగునిండు, జిగిబురుసాచీరసోగను మీఱఁ
బొసఁగుచెంద్రపుబిల్ల బొట్టుపైఁగనుపట్టు, తళుకుఁగస్తురిరేఖ సోలపు దెలిపె
అవిరఁ బూన్చినలీల సవరొందు తెలిగంద, మలఁదినచందంబునంద మయ్యె

తే. రత్నతాటంకములు బవిరలును బావి, లీలు ముత్యాలసరములు కీలుకడెము
లాదియగుసొమ్ము లంగంబులాని యలరె, ననవిభుఁడు సీతసింగారమభినుతించె.

—••—◆సీతారాము లుద్యానవనంబునందలి మేడపై విహరించుట◆—••—

సీ. మొకమున వ్రాలుజానకివాలుఁజూపులు, కస్తూరినామంబుఁ గడలుకొనఁగఁ
బయికొన్న సీత నెమ్మెయిడాలు కటిబద్ధ, కనకాంశుకశ్రీలఁ గౌఁగిలింపఁ [గఁ
దులకించుకులకాంత తళుకుఁజెక్కులకాంతు, లురముగందపుఁబూఁత నొరసికొనఁ
గెలన మించుధరాజ కెంపురాబొగడల, జిగి చెవి జవ్వాది చెల్మిఁ గలరఁ

తే. గదిసి నిలుచున్న సౌమిత్రివదినెగారి, జిలుఁగునవ్వులు మగరాలచిలుకతాళి
ననఁగి పెనఁగఁ ద్రిలోకమోహనవిలాన, ధాముఁడెమించె సీతాభిరాముఁ డపుడు.

చ. ఒఱపు వహించి జానకియు నున్న చెలుల్ గణికాశిరోమణుల్
పరిసరభూమిఁ గొల్వ నరపాలకుఁ డానరసీతటంబునన్
గిఱికొనుగుజ్జుమామిడుల కేవ జగాకురువిందతీఁగచ
ప్పరములనీడఁ జంద్రమణిబద్ధవితర్ది వసించి యున్నెడన్. 120

తే. అంబ కౌసల్య వనుప మహానసంబు, జనులు మానస మలరింపఁ జాలుభక్ష్య
భోజ్యచోష్యాదికములు గవ్యాజ్యదధులు
మెచ్చఁదగుమాంసశాకముల్ దెచ్చుటయును. 221

సీ. వగవగకూరలు వరుగు లప్పడములు, నోలుపుఁబప్పును మించుటోగిరములు
సద్యోఘృతంబులుఁ జక్కెర, లుక్కెరల్, పచ్చళ్లు కిచ్చళ్లు పాయసములుఁ
గలవంటకము లిడ్డెనలు వడ లప్పమ్ము, లతిరసమ్ములు తేనియలు ఫలములు
గారెలు బూరెలు చేరులు మోరులుఁ, గమ్మనిమాంసముల్ ఘుమ్ముమనుచు

తే. వలచుపానీయములు చెలుల్ వరుసఁ బసిఁడి, పాత్రలధరించి వడ్డింపఁ బాత్రులైన
సహచరులబంతి నిడికొని జానకీల, తాంగితోఁ గూడి రఘువీరుఁ డారగించె.

క. మధురసగుంభనములు గల, మధురపదార్థములచవుల మరగి రసన త
న్మధురిమ సారెకుఁ బొగడఁగ, నధిపతి సుఖలీల నలరె నశనమువేళన్. 123

క. పౌలోమిఁ గూడి యమృతము, గ్రోలెడిసురరాజుఁ బోలి క్షోణీసుతతోఁ
గ్రోలె సుధారసధారలఁ, బోలిన మాధ్వీకరసము భూవిభుఁ డెలమిన్. 124

మ. అవనీకన్యకఁ గూడి యిట్లు చతురాహారంబులం దృప్తుఁడై
యవనీశాగ్రణి కామినీకరమణీవ్యాసంగభృంగారుకాం
బువులన్ ధౌతకరాననారుణపదాబ్జుండై నచో భూమిపు
త్త్రి వెసం బావడ యిచ్చి పైఁటఁ దడియొత్తెన్ భర్తపాదాబ్జములన్. 125

ఉ. అట్టియెడన్ నృపాలుఁడు వనాంతరకేళినగాగ్రసీమఁ జూ
పట్టెడు కెంపుటుప్పరిగ బాళి గనుంగొని చందుచట్టులం
గట్టినమెట్టు లింతిపదకంజరుచిన్ విడికెంపుగుంపులం
గట్టినమెట్టులై వెలయఁ గామిని కేల్గొని యెక్కి యెక్కెడన్. 126

సీ. నిలువుటద్దములతోఁ దళతళల్ వెలిఁగ్రమ్ము, ముమ్మూలరామొత్తములనెసంగు
బలుగోడలఁ బొసంగు నులిపచ్చ పగడంపు, బారుదూలంబుల వారమాను
పులుదిండిరాకంబములడాలుగరిమంబు, లను మెఱుంగులరంగులునుచుపసిఁడి
ప్రతిమలరూప మేర్పడఁ దోఁచు శశికాంత, జగతిపేరిటిగాంగఝురముదరికిఁ

తే. బచ్చికబెడంగు లిడు మేటిపచ్చరాల, చికిలితిన్నెలముంగిళ్లఁ జెలఁగు చలువ
చప్పరముక్రేవజలయంత్రజలకణంబు,లోలయవింతలుదిలకించియుత్సహించి.

చ. విరితొగచందువాతెగల వేడుకయానడియంకణంబులోఁ
బఱచినరత్నకంబళిని బాసుగ నూరెపుటంపుగద్దియన్
వఱలు మెఱుంగుబంగరపువన్నెజగాబురుసాతివాసిపై
ధరణిజతో వసించెఁ బతి తళ్కుతలాడలఁ జేతు లూనుచున్. వ. అప్పుడు.

సీ. నీలవేణియొకర్తు నిలువుటద్దముఁ జూపెఁ, గమలాస్యయొకతె బాగాలొసంగెఁ
గరియాన యొక్కతె కాళంజి ధరియించెఁ, గీరవాణియొకర్తు గిండిఁ బూనెఁ
గలువకంటియొకర్తు చలువపావడ వైచె, సొగసులాఁడియొకర్తు సురఁటి విసరెఁ
గలకంఠి యొక్కతె గ్గైవార మొనరించె, జవరాలొకర్తు హెచ్చరిక దెలిపె

తే. నతివయొక్కతె బిరుదుపద్యములుచదివె, భామినియొకర్తువడిబరాబరులొనర్చె
సీత వామాంకమున నుంచి చెలువు మించి 130
రవికులస్వామి కొలువున్నయవసరమున.

సీ. జంటముత్తెపుఁగుట్టుజంటతైకల నంటి, బిగిగుబ్బచన్నులు పిక్కటిల్ల
మగరాలచికిలికమ్మలడాలునిద్దంపుఁ, జెక్కుటద్దములతోఁ జెలిమిచేయ
ముకుళత్కరాంభోజములు నిటాలము లాని,కుంతలాలికులంబు కూడికొనఁగ
దరహాసరుచిగాంగఝురి గీలుకొన వాలు,గలలీల బెళ్కువాల్గన్ను లలరఁ

తే. గొదమపాయంపువెలయాండ్రగుంపు రామ
చంద్రునకుఁ గొల్వు మ్రొక్కులు సంఘటించి
యఖిలవిద్యాధికులతోడ నధివసించి, రధిపుననుమతి నర్తనస్థలాంతరముల. 131

క. మృదుపాకంబు రసస్థితి, పదగుంభనగల స్వకల్పపద్యశతంబుల్

చదివి యుపశ్లోకించిరి, మొదలఁ గవుల్ భానువంశముఖ్యునిగుణముల్. 132

మ. అధికాహ్లాదకరప్రభాకలితరాకాజ్యోదయోద్యత్సుధాం
బుధిజంఘాలతరంగఘుంఘుమరవప్రోద్భూతధ్వనిన్ వందిమా
గధు లత్యుద్భటఘోషవర్ణబిరుదాంకశ్లాఘ్యపద్యావళుల్
బుధు లౌరా యని మెచ్చఁగాఁ జదివి రాభూమీశ్వరాగ్రంబునన్. 133

చ. గవుసెన దీసి హొన్ను జిగికాయలు చన్నులు దాఁకఁ దంత్రులో
క్కవరున దీటి మెట్టు లొడికంబుగ నొత్తి స్వరంబు లన్నియున్
సవురు వహింపఁ దాళలయసంగతి గీతములుం బ్రబంధముల్
ప్రవణత నొక్కలేమ నరపాలునకున్ వినిపించె వీణియన్. 134

చ. స్వరము లయారె మేలు శ్రుతి బాగురె మూర్ఛన కంపితంబు బా
పురె బలిరయ్య డాల్ మెఱసె బో నెరమీటుకులంబు తాయి య
ద్దిర స్ఫురితంబు లమ్మ యని తేనియ లొల్కెడిజిల్గుపాటతోఁ
దరుణి విపంచి మీటె వసుధాపతి మెచ్చుకొనన్ రసజ్ఞతన్. 135

ఉ. తంబుర మీటి వేఱొకతె తానము లెంతయు విస్తరించి రా
గంబునరక్తి రాలు గరఁగన్ బలుమోడులు పల్లవింప న
య్యంబుజినీమనోహరకులాగ్రణిమీఁదిపదంబు పాడినం
గ్రొంబులకల్ జనించె సభకుం దల వాంచిరి వైణికాగ్రణుల్. 136

చ. దడముగ మర్దళధ్వనులుఁ దాళరవంబులుఁ బిక్కటిల్ల న
య్యెడఁ దెలిముత్తియంపుఁ దెర యెత్త శరజ్జలదాళి పాసి వె
న్నడుబలుమించులో గవుసెనల్ దొలఁగించిన మించుమంచిపు
త్తడిజిగిబొమ్మలో యనఁగఁ దా రొగి వెల్వడి రంబుజాననల్. 137

ఉ. మంజులతారంగభూషణసమంచితకాంతులు రచ్చ నేల మిం
చం జనుకట్టు లొబిగువు జక్కవగుబ్బలయుబ్బుఁ దెల్పఁ బ
త్కంజయుగంబు లుర్వి సమతం దులకించి విలాస మొంచఁ బు
ష్పాంజలు లిచ్చి యాడిరి మృగాయతనేత్రలు పెక్కుభంగులన్. 138

సీ. అభినయంబులుకోపు లరుదైనతీరుపుల్, వెలయఁగాఁబదచారివిధ మొకర్తు
లాగుమైసిరియుఁ బల్లటియుఁగత్రియు జెళ్కు,విలసిల్లు జక్కిణివిధ మొకర్తు
బురకఁడు చంక బంగరుబుట్టి తగుజాతి, వినికిగాఁ గొరవంజివిధ మొకర్తు
తీవిఁ దాళము లుగ్గడింపుచోఁ దీరుచోఁ వింతగాఁ బేరణివిధ మొకర్తు

తే. నలరి వినిపింపఁ బతి మెచ్చ నంత నేడ్వు
రిరువు రెనమండ్రుఁ బదియాఱుగురును మువ్వ
దిద్దఱుఱువదినలువురు హెచ్చుగాఁగ, బంతులై వంతు లూని యయ్యింతు లెల్ల.

సీ. అన్యోన్యహస్తదండావృత్తు లెసఁగ నొం, డొరులసామ్ముఖ్యంబులొందియొంది
యీవలావల వచ్చి యితరేతరము దొల్త, నిలిచిన నెలవుల నిలిచి నిలిచి

కంకణమంజీర। కాంచికల్ మ్రోయ, సవ్యాపసవ్యస్ఫూర్తి । చూపి చూపి
తాళవాద్యరవానుకూలంబుగా మంద, ద్రుతమృదుగతులను । దిరిగి తిరిగి
తే. యనుపమరసోదయంబున । నభినయాత్తి,చిత్రవర్తనభంగులఁ । జెలఁగి చెలఁగి
విడివడినమన్మథోన్మద। ద్విరదము లన, సఖులు హాల్లీసకము సల్ప । సంతసిల్లి.
తే. వారివారిక ళాగార। వంబు లెల్ల, ధరణిజకుఁ దెల్పుచును దార। తమ్ము మెచ్చఁగి
వలయుమణిభూషణాదులు। వారికొసఁగి, కొలువుసాలించి రఘువీర। కుంజరుండు.
తే. ఇతినియిరుపార్శ్వముల నింక । నిరవుకొనెడి
యమితకరదీపికాద్యుతుల్ । తిమిర మడఁప
నేలతానన్న పోలిక। హేళిగ్రుంకఁ, జరమసంధ్యాక్రియలు దీర్చి। జనవిభుండు. 142
సీ. కుంభస్థలోజ్జృంభి। కుంకుమారుణదీప్తి, చరమసంధ్యారాగ। సామ్య మూన
నింగితో నొఱయును। త్తుంగాంగకముడాలు, బలుచీఁకటులజోకఁ । బరిఢవిల్ల
భూరిపుష్కరసము। ద్భూతశీకరపాళి, తారాగణశ్రీలఁ । జేరఁ బిల్వ
దంతద్వయాత్యంత। ధవళకాంతిసమృద్ధి, వికచకైరవిణితో । వియ్య మంద
తే. సమయసముచితమహితచి। హ్నములఁ బూని
యమరుశత్రుంజయముతోడ । ననుజమంత్రి [వెడలి.
బంధుసామంతు లుపవన। ప్రాంతమునకు, వచ్చుట యెఱింగి స్త్రీయుక్తి। వనము

సీతారాము లుద్యానవనంబుననుండి యయోధ్యఁ బ్రవేశించుట.

సీ. నలువంకలను నిండి । నవనభోమణికాంతి, నడలేక దివ్వటీ । లెసక మొసఁగఁ
బటహగోముఖశంఖ। పణవాదిబహువాద్య,రవములు రోదోంత। రముల నెఱయ
సకియలు గొల్వఁ బచ్చలపల్లకీ నెక్కి, పంటదొయ్యాలిపట్టి । వెంట రాఁగ
నెలవంకవలె వంక । నొలసి వింజామరల్, వేవేలగొడుగులు । వేడ్క నెఱప
తే. భద్రకరి నెక్కి శ్రీరామ। భద్రమూర్తి, కోటిచంద్రులకళ లెల్లఁ । గొల్లలాడి
తమ్ము లార్యులు భటులు బాం। ధవులు హితులుఁ
జేరి కొలువంగఁ బురిఁ బ్రవే। శించె నపుడు. 144
చ. పలుమఱుఁ జూచుచుండియును । భానుకులేంద్రునిరూపసంపదల్
తెలియఁగఁ జూచుచోఁ దనివి । దీరక పౌరవధూటు లిండ్లలోఁ
గలపను లన్నియున్ విడిచి । కాంచనసౌధము లెక్కి తళ్కుఁజె
క్కులఁ జెఱుచెమ్మటల్ తొఁరఁగఁ । గోరిక మీఱఁగఁ జూచి రవ్విభున్. 145
ఉ. కోమలి యొర్తు మారువిరి। గోలల నేలెడువాలుఁజూపులన్
రామునిఁ జూడఁగాఁ బరిస। రంబున నున్నలతాంగి యయ్యయో
యేమె వధూటి నీవు నెన । రించుక యెంచవు వాఁడిచూపులం
గోమలదేహుఁ డైనరఘు। కుంజరుఁ జూతు రటే యనన్ రహిన్. 146
తే. రాజసముమీఱఁజను దెంచి। రాముఁజూచి, సాత్త్వికమునీవుపూనిన। చంద మేమి

తామసము సేయ కది దెల్పు భామ యనుచుఁ
ప్రౌఢసఖి యొర్తు దనచెలిఁ బరిహసించె. 147
ఉ. జాతినపువ్వుదండ జడఁ జక్కఁగఁ జుట్టక కొంత పాణిపం
కేరుహసీమఁ బూనుకొని శ్రీరఘురాముని జూచె ముత్తెపున్
సోరణగండ్ల నొర్తు నినుఁ జూచిన నన్ను మరుండు నొంచెఁ ద
త్క్రూరసుమాంబకంబు లివిగో నని చూపఁగఁ దెచ్చెనో యనన్. 148
చ. ఒకరమణీశిరోమణి కుచోపరిసీమ వెలుంగు కెంపురా
చికిలి మెఱుంగుతాళి రఘుశేఖరురూపము గానుపించ ను
త్సుకమతి సారె గుబ్బచనుదోయిని జేర్చుచు నుండి యొద్దిబా
లికనుఁ జెక్కులం బ్రతిఫలించినరాముని జూచె జంకెనన్. 149
చ. చెలువ యొకర్తు బోటి తనసిబ్బెపుగుబ్బలఁ బత్త్రభంగముల్
వలనుగ వ్రాయుచుండి యిదె వచ్చె రఘూద్వహుఁ డన్న భ్రాంతిమైఁ
బలుమఱు రామనామములె బంతులుగా లిఖియించ నగ్గతిన్
వెలువడెఁ బేరు నీది యని వీథిని భర్తకుఁ దెల్పెనో యనన్. 150
తే. అతివయొక్కతె యుత్తుంగహర్మ్యమెక్కి, రామచంద్రునిశృంగారరససుధాప్ర
వాహ మీక్షాపరంపరవలనఁ గ్రోలి, తెప్పలార్పక యచ్చరయొప్పు దాల్చె.
ఉ. అందఱు లీలఁ జూడ నొకయంగన తాను వచ్చి రాజనం
క్రందనునంద మంతయు నెగాదిగఁ గన్గొని చొక్కి యట్టియా
నందమె యింద ఱొందెదరు నావలెనే యని యీసుఁ జెందె భూ
నందని కెట్టు లుండు నిఁక నాథుని నందఱుఁ జూచి చొక్కనన్. 152
వ. అవ్విధంబున. 153
సీ. రాకాసుధాకరశ్రీకి గీ మగుమోము, కళ లుట్టిపడ సారెఁ గాంచి కాంచి
యాజానులంబిబాహార్గళంబులు ప్రేమ, నిగిడి తీఁగలు సాఁగఁబొగడి పొగడి
కర్ణాంతదీర్ఘదృక్కంజాతయుగలౌల్య, మిచ్చనిచ్చలు హెచ్చ మెచ్చి మెచ్చి
బలుతల్పు నగునురస్స్థలముపై విఱివియా, తమినిల్పి యేమేమొ తలఁచి తలఁచి
తే. మెఱుఁగునీలంపుఁజామనమేనిచాయఁ గనివిమోహాతమంబులో మునిఁగి మునిఁగి
కోమలులు లాజాతతోత్ఫుల్లకుసుమరాజి, సేస లొలుకంగ మొగసాల చేరి విభుఁడు
క. వేదండము డిగ భరతుఁడు, కైదండ యొసంగెఁ బాదకమలంబులకుం
బాదుకలు దొడిగె లక్ష్మణుఁ, డాదట జలజాక్షు లిచ్చి రారతులు దగన్.
శా. శత్రుఘ్నుం డతిభక్తిఁ బాద్య మొసఁగెన్ సౌమిత్రి పార్శ్వంబునన్
ఛత్త్రగ్రాహకుఁడై వసింప జగతీజామాత సంప్రీతుఁడై
మిత్త్రామాత్యసుహృద్భటాదికుల నెమ్మిన్ వీళ్లకుం బుచ్చి భూ
పుత్త్రీరత్నవిచిత్రసౌధమునకుం బోయెన్ సహాస్థంబుగన్. 156

తే. పోయి యట వింత యగా నొకభూరిచంద్ర
కాంతగృహమున సౌదర్యగణము నర్మ
సఖులుఁ గొలువంగ నొకజాము సరసగోష్ఠి
నెలమివసియించి మఱి వారి నిండ్లకనిచి. 157

వ. అయ్యుదాత్తగుణోత్తరుండు జానకీమత్తహంసగమనారిరంసాపరాయత్తచిత్తంబునఁ దత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించి కిలికించితవతీసముచితకరాబ్జరారజ్యల్లామజ్జకవ్యజనోజ్ఝాతశీతలవాతలహరీనివారితఘర్మవారి యై యఘారితకస్తూరికాసారకర్పూరశకలసముదయోదయభాస్కరప్రముఖప్రశస్తవస్తువ్రాలం గ్రమ్ముకొని ఘుమ్మనుతమ్ములంపుఁ గమ్మతావులకనుంగు లగునంగరాగవాసనల జాసినకైశికప్రసవమాలికాపరిమళంబులకు నిండుకొనుగండుతేఁటులపేటుల నీటు గనుమేటినీలంపురాలనిగనిగల నెగడుచికిలిబోవలక్రేవలవ్రేలుజాళువాపంజరంబులచిలుకపలుకులకు మాఱుపలుకుగోరువంకలవంకఁ జెలరేఁగి కవకవలు గొణఁగుచుఁ గెరలుబకదారులయారజంపుటెలుంగుల నెఱుంగనీక మఱుఁగుచేయు మెఱుంగుఁ గెంపురాపొరణగంటిచిఱుత తెమ్మరసోఁకునం దమంత మొరయువిపంచికలతానప్రపంచంబునం బ్రాణంబులు వచ్చెనో యన మెచ్చునుప్పొణిముత్తియంపుగ్రచ్చుటోవరులఁ గ్రచ్చుకొని మచ్చికంటులు కీలెఱింగి జంత్రంబులు గదలించినం దనకు వీచోపులు వీచుకుందనంపుఁ గీలుబొమ్మలయెమ్మెల కినుమ్మగుచుఁ జూడఁజూడ వేడుకయగుచు నెగడుమైఁడిమేడ యెక్కి యక్కడ. 158

సీ. రతిఁ జొక్కి కేళినీరమణిగుబ్బలమీఁద, వ్రాలినవలరాచవానిసొగసు
కినిసి కీల్జడను గొట్టిసరోహిణికి మ్రొక్కి, మమతఁ జూపెడి చందమామవలపు
పౌరుషంబున మించి పౌలోమి నెదనుంచి, యలరెడువేల్పురాయనివిలాస
మధరంబు గ్రోలనిమ్మని రంభచుబుకంబుఁ, బట్టి వేఁడుధనేంద్రుపట్టిహొయలు
తే. కలయ వ్రాసినకళుకుగోడలమెఱుంగు
మేలుముత్యంపుఁదలుపులఁ బూలచందు
వాతెగలు ధూపధూమంబువలపు లుదిరి, గిండ్లు మొదలుగఁ గలకేళిగృహ[మునందు.

సీ. కడవన్నెబొమ్మచెక్కడపుఁ జొక్కపుఁ గోళ్లు, పగడంపునికరంపుఁ బట్టియలును
సరిలేనిమంచిగుజ్జరినేఁతపట్టెయుఁ, బఱపైనరాయంచతొగలపఱుపు
నరవిరివిరవాదివిరులఁ బూన్చినపాన్పు, పైఁ బఱచిన పలిపంపువలువ
కొమరొందు నేకరంగుమెఱుంగుతలగడల్, బలితంపుబురుకకాల్పట్టె బటువు
తే. లమరుమగరాలపనిచప్పరము మెఱుంగు
చాయబురుసాతెరయు రహించంగ మించు
పట్టెమంచంబుపై రామభద్రుఁ డున్న, యవసరంబున జనకకన్యాలలామ.
చ. తిలకపురంగుతో నలకదీప్తులు నెన్నుదుటన్ నటింపఁగాఁ

గలపపుఁదావి నల్లడల గమ్మనఁగన్ సరిగంచుచెల్వగు
చ్చెల లపరంజిమెట్టియలు జీరఁగ నందెలు మ్రోయ సోయగం
బొలుకఁగ వచ్చె నత్తఱి రఘూత్తముచిత్తము తత్తఱింపఁగన్. 161
క. వచ్చి కపురంపుబాగా, లిచ్చి పిదప మడుపు లొసఁగి యింపగు సేవల్
మచ్చిక నొనర్పఁ జెలువుం, డచ్చెలువం గలసి మెలసి యానందించెన్. 162
వ. మఱియును. 163
సీ. బంధచాతుర్యసంబంధముల్ పణముగా, ద్యూతకేళీప్రౌఢి దొరసి దొరసి
కలరవాదులకల్మి కనుటకు ఫలముగాఁ, గడలేనివేడ్కలఁ గలసి కలసి
యలరుపుక్కిటివిడియంబు లుంకువులుగా, నధరామృతరసంబు లాని యాని
పరిరంభచుంబనస్ఫురణ లేకములుగా, సొలపుతోఁ గళ లంటి చొక్కి చొక్కి
తే. సొగసుఁజూపుల నొండొరుఁ జూచి చూచి
మెలపు లొలయంగఁ జతురిమల్ మెచ్చి మెచ్చి (గతుల.
పులక లెసఁగంగ మణితమింపున వినివిని, సతియుఁ బతియుఁ జెలంగిరి స్వైర
చ. వలపులరాజువేడబమొ వారలయద్భుతమోహభారమో
తెలియదు నిచ్చలుం దనివి దీరనిముచ్చట లోసరింత లే
కలరెడికౌఁగిలింత లెడ లన్నది విన్నది లేనికూర్మిలుం
గలఁకలు గానికూటములుఁ గల్గి రమించిరి మించి రిర్వురున్. 165
సీ. మరునిసమ్మోహనమంత్రాక్షరములొండొ, రులనొండొరులు పల్కుపల్కులెల్ల
నించువిల్తుఁడుప్రయోగించువాల్తూపులు, సొలసియొండొరుఁజూచుచూపులెల్ల
నతనుకళారహస్యంబులయిక్కలు, సొగసి యొండొరు లంటుచోటులెల్ల
రతిమనోహరుమనోరమఖేలనము లొండొ, రులు మేకొని తలంచుతలఁపులెల్ల
తే. వారిచొక్కులు టెక్కులు వారివగలు, వారివన్నెలు చిన్నెలు వారిసటలు
వారిహరువులు మురువులు వారికళలు, వారివలపులు సొలపులు వశమె పొగడ.
వ. మఱియును. 167
సీ. నెరసిననుదిటిముంగురులుచక్కఁగదువ్వి, ప్రియముతోఁగీల్కొప్పుఁబెట్టునేర్పు
పన్నీట నెమ్మోము ప్రక్షాళన మొనర్చి, తీరుగాఁ దిలకంబు దిద్దుసొగసు
చిఱుచెమ్మటలు గ్రమ్మ మెఱుఁగులేఁజెక్కుల, వలనుగా మకరికల్ వ్రాయుహొయలు
సరులు చిక్కులు దీర్చి జవ్వాజి కస్తూరి, కలుకుగుబ్బలఁ బూయుకోడెతనము
తే. హెచ్చి మగఁటిమిఁ జూపుచో నొచ్చెనేమొ
యొత్తుదునె యంచు నంఘ్రిఁ గే లుంచునెనరు
వెలఁది కొమ్మని పుక్కిటివీడె మిచ్చు, బాళి జవరాలిఁ గరఁగింప భర్త యలరె.
సీ. గళరవంబులు నేర్చికలరవంబులువల్క, సిగ్గుతో నెద మోముఁ జేర్చు హొయలు
చరణాలాక్షముఖాంబుజమునఁగన్గొనినవ్వ, చనుమించుటద్దంబుఁ జూపుసొగసు

కొసరుమాటలను జైకొన్నచిన్నగఁజింపఁ, గనుకత్తో నుదిరి జంకించునిగిలు
దొడ నుంచి యంఘ్రి లొత్తుచుఁ జన్నుదోయిఁ గ,
న్నులఁ జేర్చుకొని బాళి నలరుమమత [చుఁ జనుచు
తే. తమకమున మించి యేమేమి తప్పు లాచ,రించితినొ యన్నియును క్షమియిం
వినయమునఁ జంద్రముఖి మ్రొక్కి వేఁడుభక్తి
నృపతిచిత్తంబు గరఁగించె నిమిషమునను. 169
చ. చతురత వింతబంధముల సారెకుఁ గల్పన సేయుచుం బునా
రతులఁ బెనంగుచున్ రతులరాయడి పోలి నఖచ్ఛిదారద
క్షతములఁ గ్రమ్మఱన్ మెలపు గాంచుచుఁ గంతుఁడు పూనుసూత్రపుం
బ్రతిమలపోలికం దనర రాత్రి క్షణం బయి తోఁచె వారికిన్. 170
క. ఈలీల రేలు భూమిజ, నేలుచుఁ బగ లెల్ల భూమి నేలుచు ధర్మ
శ్రీలోలుండై యేక,స్త్రీలోలుం డనఁగఁ బతి ప్రసిద్ధి వహించెన్. 171
వ. మఱియును. 172
సీ. ఘనలతాసుమధూళిఁ గడియు తేఁటుల కేళిఁ, దనరు కేళాకూళిదరులయందు
శారికాపికకీరసల్లాపములు మీఱు, వల నొప్పు శృంగారవనములందుఁ
దెఱగంటిచెలిమంది నెఱచిత్తరులఁ జెంది, రహిఁ జెందు మణిమందిరములయందుఁ
దపనీయరుచిబాలతపనాంశువుల నేలఁ, జాలులీలాశైలసమితియందు
తే. నందమగుచందురాతిన్నెలందుఁ జంద్ర,శాలలందును దూఁగుటుయ్యాలలందు
మహితనయహిత యగుమహీదుహితఁ గూడి
యహరహంబును విహరించె మిహిరకులుఁడు. 173
క. శ్వశ్రూజనగురుభూసుర, శుశ్రూషాస్నిగ్ధగతుల శుద్ధవ్రతబ
ద్ధశ్రద్ధలఁ బరిజనవృ,ద్ధశ్రితరక్షణల సీత దగఁ బతి యలరన్. 174
సీ. స్నానసంధ్యాహోమదానాదికృత్యంబు, లర్హకాలములందె యాచరించి
యంబరాభరణమాల్యానులేపనముల, సమయోచితస్ఫూర్తి సంగ్రహించి
భోజనపానతాంబూలాదికములు దే,హానుగుణమ్ముగా నవధరించి
వ్యసనంబులందుఁ గేవలసక్తిఁ జెందక, నవియును దగురీతి ననుసరించి
తే. జాతిచేష్టాగుణేంగితరీతు లెఱిఁగి, సీత నేలుచుఁ బ్రజల రక్షించుచును స
హోదరులఁ బ్రోచుచును దల్లు లుత్సహింప
వసుధఁ బాలించె రఘువంశవల్లభుండు. 175
క. పదివేలకోట్లయేఁడులు, వదలక ధర రాముఁ డేలవలె నని ప్రజ లె
ల్లఁ దలంప సీతఁ గూడుక,పదివేలేఁడులు సుఖించె బహుసౌఖ్యములన్. 176
చ. జనపతి యిట్లు సీతయెలజవ్వన మంతయుఁ గొల్లలాడుచున్
దినములు గొన్ని దాఁటఁగ రతిప్రియుఁ డస్త్రము తూణి మాటఁగా

ననితరగర్భచిహ్న మచలాత్మజ దాలిచె రాజవరాళితో
ననిశముఁ గూడి తొల్లి యచలాత్మజ గర్భముఁ దాల్చుకైవడిన్. 177

సీతాదేవి గర్భంబు దాల్చుట.

సీ. కమ్మలమగరాలకాంతి గ్రమ్మెనో నాఁగఁ, దళుకు లేఁజెక్కులఁ దెలుపు మించెఁ
బూసినకస్తూరి పొలుపుమించెనో నాఁగ, గలికిచూచుకములు నలుపుమించె
రతికాంతుఁగృశమా తెరజంగు దెల్పెనో నాఁగఁ, నలినీలవేణి దేహముగృశించె
వ్రేలునీలపుఁ జాళిదాలు ముంచెనో నాఁగఁ, గరిమాననూఁగారు గారుకొనియె
తే. బడలిక జనించె నూర్పుసందడి రహించె
నడుము గనిపించె మిగుల నెన్నడలు గాంచెఁ
జడిమ ప్రాపించెఁ జిట్టుముల్ సంభవించె, దౌహృదము జానకీదేవి దాల్చునపుడు.
తే. ఇటులు గర్భిణియైనపూర్ణేందుబింబ,ముఖి యొకానొకనాఁ డాత్మసఖులు వింత
వగలఁ గైసేయ నప్సరోవనితఁ బోలి
హెచ్చి రహిఁ గాంతుచెంతకు వచ్చుటయును. 179
శా. ఆలోకించి దరస్మితం బెసయ రామాధీశుఁ డుప్పొంగి య
చ్చాలాలిం దొడమీఁద నుంచుకొని మించుం జెక్కులేఁ జెమ్మటల్
పాళిం బల్మఱు గోట మీటుచుఁ గుచోపర్యుల్లసత్తారహా
రాళుల్ చిక్కులు దీర్చుచుం బలికెఁ గాంతాకర్ణనాకాంక్షి యై. 180
మ. దరహాసద్యుతు లెప్పుడుం దొరయుటం దత్కాంతు లిం పొందెనో
వరవీటీగతచంద్రఖండరుచిపై వ్యాపించెనో చంద్రకాం
తరమం గెల్చినకీర్తి నిల్చెనో యనం దళ్కొందె నీచెక్కులం
దరుణీ పాండిమ తారహారముకురోదార ప్రభల్ మీఱఁగన్. 181
మ. స్తనశృంగారరసంబు చూచుకసముద్యన్నీలిమం గానిపిం
చి నవీనం బగుపూఁతకస్తురిరుచిం జెల్వొంది పై నిండి జా
ఱినతద్ధారయొ నాఁగఁ దాన్కొని మిటారించెన్ భవద్రోమరా
జి నిరూఢాంగకదీప్తిఁ దోఁచు జనయా సిద్ధం బనం జూపఱుల్. 182
క. గడుసువలిగబ్బిగుబ్బల, బెడిదపుభారమున జడిసి వేదతనముతో
నడఁకెడి నీనడుమున కి,య్యెడ గర్భసమృద్ధి యభయ మిచ్చెఁ గద చెలీ. 183
క. సోముని గెల్చిన నీసగు,మోము ధరాదేవి మెచ్చి ముద్దిడుకొనెనో
కామిని యది కాదేనియు, నీమొగమున మంటివాని యేమిటికొదవెన్. 184
చ. జడగతిఁ బాదముల్ గసిసెఁ జాడ్పున వాలుమిటారిచూపులన్
బడలిక మబ్బు పైకొనినఁ బాగున మోమునఁ బాండురద్యుతుల్
సుడిసిసలీల మంటిచవి చొక్కు రసజ్ఞ వహించినట్టు నీ
యెడఁద మటేమియైన యొకయిచ్ఛ జనించినఁ దెల్పవే చెలీ. 185

క. పత్నీ కుల మలర నంత,స్వత్నీ యయినచిన్నె లెఱిఁగి వాంఛిత మేమో
నూత్నముగ నడిగి మగఁ డడి, యత్నంబునఁ జేయఁబలయు నతివరో యనుచున్.
ఉ. మాటలఁ దాటకాంతకుఁడు మాటికిఁ దేనియ లొల్కు వేడ్కనం
బాటలగంధి సిగ్గు ప్రతిభాషితచాతురి సడ్డగింపఁగా
గాటపుఁగాంక్ష యస్తఱివుకత్తె మదిం ద్వరసేయ నల్లనన్
మీటిన మ్రోయువీణవలె మించునెలుంగున భర్తతో ననున్. 187

సీతాదేవి యరణ్యంబున మునిపత్నులతోఁ మెలఁగఁ గోరుట.

శా. సారంగీశిశుకోటిదప్పి పులి దీర్పన్ సింహపోతశ్రమం
బార్పన్ దంతికరాంబువుల్ నిగుడఁ జేయన్ మించుభాగీరథీ
తీరారణ్యములన్ వసించుమునిపత్నీశ్రేణితోడన్ ఫలా
హారంబుల్ గొని యొక్కనాఁడు మెలఁగం బ్రాణేశ వాంఛించెదన్. 188
ఉ. నా విని సమ్మతించి రఘునాయకుఁ డాసతి నాదరింపుచున్
నీవు దలంచినట్ల తరుణీమణి రేపటిరేపటంతటం
బావనగాంగభూములకుఁ బంపెద నంచు మెఱుంగుఁజెక్కిలిం
బావహిలంగ ముద్దుగొని యాయమ లోపలి కన్పి పిమ్మటన్. 189
సీ. అడపంబుచోఁటవాఁ డడఁబాయ కెడనెడ, మడిచిన తెలనాకుమడుపు లొసఁగ
జీరాడుదుప్పటి చెఱఁగు చేఁబూని వెం, బడి గిండిఁ గొనివచ్చుబుడుతఁ డొదుఁగ
ద్వారపాలకులు తత్తఱముతో వడి లేచి, ముకుళితహస్తులై మ్రొక్కులిడఁగఁ
బనులసందడి నెదుర్పడినదాసీదాస,జనములు జడిసి పార్శ్వముల కొదుఁగఁ
తే. గటికవారును దగునూడిగములవార,లవసరంబున నియ్యోగు లాడ నాడఁ
బొడగని యథోచితాకృతుల్ పొరసి కొలువ
మధ్యకక్ష్యాంతరము చేరి మనుజవిభుఁడు. 190
తే. లలితనవరత్నపీఠ మలంకరించి, మంత్రిబంధుహితాప్తసామంతవరులు
భద్రమధుమత్తకాశ్యపప్రముఖనర్మ
సఖులు గొలువంగఁ గొలువుండి సంతసమున. 191
సీ. శ్రుతులు శాస్త్రంబులు స్మృతులావరించి వి,ద్వజ్జనుల్ సేయువాదములు వినుచుఁ
బ్రాఘోక్త లలరఁ బౌరాణికుల్ వినిపించు, వివిధపుణ్యార్థవితతి వినుచుఁ
నవరసాలంకారనైపుణంబుల మహా,కథకులు గణియించుకథలు వినుచు
జాతీయ మేర్పడ సరసభంగులఁ బరి,హాసకుల్ దెలుపు హాస్యములు వినుచుఁ
ఆ. గొంతప్రొద్దుఁబుచ్చుకొని కొలిచినవారి, నెల్లఁబనిచి వలయుహితులు గొల్వఁ
జగినరీతిఁ గొంత దడవుండి హితగోష్ఠి, భద్రుఁ జూచి రామభద్రుఁ డనియె.
ఉ. వింతలు భూమి నేమయిన వింటివె పౌరులు నన్నుఁ గూర్చి నిం
దంతురొ యెంతురో తెలిసితే జననీగురుసోదరాదులే

కాంతమునందు నే ననుచు నాడుదురో విసరుండు వ్రాలు వి
న్నంతయు నీవు దాఁపక యథార్థముగా వివరింపు నావుడున్. 193
మ. కరముల్ మోడ్చి విసీతి భద్రుఁ డనియెం గాకుత్స్థవంశేంద్ర స
చ్చరితంబుల్ పదివేలనోళ్లఁ బ్రజ లెంచన్ విందు నే నెందులన్
గురునాజ్ఞన్ వని సంచరించి లవణాకూపారముం గట్టి యా
సురులం గొట్టినచర్య లెంచ కివి యొచ్చో నైన నిందింతురే. 194
చ. నరులకు శక్యమే యని మొనన్ ఖరదూషణముఖ్యరాక్షసే
శ్వరుల జయింప వాలి నడఁపం గపివర్యులచేఁ బనుల్ గొనం
బరుషశరాగ్రబిందువుగ బల్కడలిన్ ఘటియింప నీతఁడా
హరియొ హరుండొ యంచు జను లాడఁగ విందు నరేంద్ర నావుడున్. 195
చ. ఎలనగ వంకురింప ధరణీశుఁడు గ్రమ్మఱఁ బల్కె భద్ర నీ
పలు కిది నిక్కమా నయినఁ బౌరులు భూమిజనుల్ శుభాశుభో
క్తుల వచియించుచోట నను గూరిచి జానకిఁ గూర్చి నిందలం
బలుకక పోవ రత్తెఱఁ గబద్ధము లాడక తెల్పుమీ యనన్. 196

భద్రుండు పౌరు లాడు నిందావాక్యముల రామభద్రునకుఁ దెలుపుట.

శా. ఆభద్రుండు వినమ్రుఁడై పలికె దేవా నీవు పల్మాఱు న
న్నీభంగిన్ నిజ మేమి దెల్పు మనినన్ హీనాత్మకుల్ పల్కుప
ల్కేభావ్యం బని విన్నవింతు నది మీ కేలా విన్న మూర్ఖులై
యేభూపాలుర మెచ్చి రీనరులు పీ రేపాటి పాటింపఁగన్. 197
సీ. కరుణగల్గినరాజకంఠీరవునిఁ గన్న, మెత్తనివాఁ డంచు మెచ్చ రతని
దురుసుదండనలతో ధర యేలుదొరఁ గన్న, హింసాపరుం డని యెంచ రతని
ధైర్యసంపన్నుఁ డౌ ధరణీశ్వరునిఁ గన్నఁ, గఠినచిత్తుం డని కదియ రతని
సుజనులఁ బ్రోచు భూభుజునిఁగన్నను బక్షపాతియం చలఁతిఁగాఁ జూతు రతని
ఆ. నేవివేకవంతు లే మెఱుంగుదు రట్టి, యెఱుక లేని జనుల సరకు సేసి
మొఱకుపలుకు వి నెడికొఱకు మేకొనఁగ దేవరకుఁ దగునె యాజివరకుమార.
క. ఐన జను లాడుకొనియెడి, నానోక్తులు వినఁ దలంచి నన్నడిగినయీ
యానకు వెఱచి గణించెద, భానుకులాధీశ వినుము పౌరులపలుకుల్. 199
సీ. ఏకళంకము లేనియిక్ష్వాకుకులమున, సంభవించియు రామచంద్రుఁ డకట
తొడమీఁద నిడుకొని దోషాచరాగ్రణి, యెత్తుక చని లంక నేఁడుగాల
ముంచినయిల్లాలి నించుక కొంచక, మరలఁ దాఁ గొనివచ్చి మరులు హెచ్చి
యెబ్బెఱికము లేక యేలుచు నున్నాఁడు, చెఱకువిల్కానికిఁ జిక్కినాఁడు
తే. పగతు రేకాంతలను జెఱఁబట్టికొన్న, బలిమి విడిపించుకొని తెచ్చి కలియవచ్చుఁ
బ్రజకు రాజానుమతె మెధర్మంబుగాదె, యనుచుగుమిగూడి పలికెద రవనిజనులు.

చ. విని విని నేను వేసరితి । వీథుల వీథుల నిట్టిమాటలే
యనుకొనువార లూరఁ దఱ । చజ్జలనోరులు మూయవచ్చునే
యినకులనాథ వారి నిఁక । నే మనఁగూడు నటంచుఁ దెల్పినన్
విని శితశూలముల్ చెవుల । వ్రేసినలాగయి జాలిఁ జెందుచున్. 201

ఆ. అధిపుఁ డొద్ద నున్న । యాప్తులఁ గనుఁగొని, యీవిధంబుమీరు । నెఱిఁగియుండు
దురె యటన్న వారు । శిరములు వంచుచు, స్వామియేమిదెలుపు । వార మనిరి.

చ. ఎడఁద గలంగ రాముఁ డొక । యించుక సేపు మఱేమిమాటయున్
నొడువక మౌన మూని వెత । నూల్కొన నివ్వెఱఁ గంది యంత న
క్కడఁ గలయాప్తులం బనిచి । కంచుకి నొక్కనిఁ జేరఁ బిల్చి యి
క్కడకు మదీయసోదరుల । గ్రక్కునఁ దోడ్కొని రమ్ము పొ మ్మనన్. 203

తే. వాఁడునతిశీఘ్రచారియై । వారివారి, గృహములకుఁబోయిరామభూ । మీశ్వరాజ్ఞ
యెఱుక చేసినభరతాదు । లిపుడుపిల్చు, టేమొ యనియాతురంబున । నేఁగుదెంచి.

సీ. ఉస్సని నిగిడించు । నూర్పుల బలువేఁడి, నించి కెమ్మోవి వా । డించువాని
నడఁగక యడరెడు । నశ్రుధారల నడ్డగించి తెప్పల నప్ప । ళించువాని
నాశ్చర్యరసమగ్న । మగుమానసంబుతో, నుడుక చేష్టలు దక్కి । యున్నవాని
వెలువెలనై చాల । వెడనవ్వు వహియించి, మురిపెంబు దఱిఁగిన । మోమువాని
తే. దైన్య మాకార మయినచం । దమున నున్న
వానిఁ దమయన్నఁ గనుగొని । వారు వెఱఁగు
పడి భయంపడి తొక్కట । కటకటఁ, బడి దిగుల్పడి వడఁకుచు । భక్తిఁ జేరి.

ఉ. ఏమిటి కింతవంత వహి । యించినవాఁడొ నృపాలుఁ డీవిధం
బేమియొ యెవ్వ రేమి గణి । యించిరొ యీవెత యెట్లు దీఱునో
స్వామి కటంచుఁ జింతిలుచు । సాఁగిలి మ్రొక్కినకూర్మితమ్ములన్
రాముఁడు ప్రేమ మీఱఁగఁ గ । రంబుల గ్రుచ్చి కవుంగిలించుచున్. 206

తే. చెంత నందఱ నిడుకొని । చేరఁ దేసి,కన్నులను గ్రమ్ముకన్నీరు । కరతలమున
నప్పళించుచుగాద్గద్య । మడఁచియెప్ప, తెలుఁగునూల్కొల్పువారల । కిట్టులనియె.

రామభద్రుండు దెల్పిన పౌరవాక్యంబులఁదమ్ముల కెఱిఁగించుట.

మ. అనుజత్వోచితవృత్తిఁ బూనియును నా । యర్థంబుఁ బ్రాణంబు నా
యనుఁగుంజుట్టము లాప్తులున్ సఖులు మీ । రై రాజ్యధౌరేయుఁ గా
నను మీరే యొనరించి రొల్లు రటు గా । నంబూనఁ బో నెద్దియై
ననుమీతో నన కిప్పు డజ్ఞులనుని । న్దావాక్యముల్ వింటిరే. 208

క. అనిన నిది యేమి నిందయొ, మనకులపతి యెన్నఁ డిట్టి । మాటాడఁడు తెం
పుననని యెండొరుమొగములు,గనుచున్ దిగులొంది వినఁగఁ । గాకుత్స్థుఁడనున్.

ఛ. చెఱఁగొని పోయి యాత్మపురిఁ । జేర్చి దశాననుఁ డాస రేఁగి కీ

డ్పఱిచినసీతఁ దెచ్చుకొని భావజుత్రిక్కులకొగ్గి యెగ్గు సి
గ్గెఱుఁగక కూడినానకులేశ్వరుఁ డిక్కటఁకట త్రిధర్మముల్
మఱచెనో యంచు నన్నుఁ బ్రజ మాటికి దూఱెడి నేమి దెల్పుదున్. 210

చ. పరుఁ డిపుడే వధూటిఁ జెఱపట్టిన వాని వధించి సాధ్వి యీ
తరుణి యటంచుఁ జేకొనుట ధర్మువుగా వగ నెంచె రాఘవే
శ్వరుఁ డిక నేల శంక యని దుర్జను లాడెడిమాట లమ్ములై
యురువడి గుండెలో మెఱముచున్నవి సోదరులార యియ్యెడన్. 211

వ. అని తన్ను నుద్దేశించి బుద్ధి లేనిజను లాడుకొనుసుద్దులు గొన్ని తద్దయువగపుతో నొద్దనున్న తమ్ముల కెఱింగించి యద్దశరథుని పెద్దకొడుకు తుందుడుకు మెండుకొన వెండియు లక్ష్మణుం గనుంగొని యిట్లనియె. 212

మ. అవుఁగా లక్ష్మణ మున్నెఱుంగవె సమస్తాదిత్యులున్ రుద్రులున్
భవనీరేజభవాదులున్ మునులు దిక్పాలు ర్విలోకింపఁగా
నవనీకన్యక నేను నొల్లక మహాగ్రాగ్నిం బ్రవేశింపు మ
న్నవిధంబున్ సతి వహ్నిఁ జొచ్చుట రహిం ద్రైలోక్యమున్ మెచ్చుటల్.

ఉ. అప్పుడు వచ్చి వహ్ని తనయాకృతితో ధరణీజఁ దెచ్చి యీ
యొప్పులకుప్ప సాధ్వి సుగుణోన్నత నేసకలాంతరాత్మనై
యెప్పుడుఁ గాంతు నొచ్చె మొకయింతయు లేదని యప్పగింపఁడే
యప్పలుకుల్ నిజంబు లని యాడక యచ్చటివేల్పు లందఱున్. 214

చ. అని మొనఁ బంక్తికంఠుఁ డనుమాడిన మేలు దలంచి యిచ్చకం
బునకు ధరాజ మంచి దని బొంకిరొ వేల్పులు సీతభావ మేఁ
గనియును మూఢు లిట్టు లనఁగాఁ గల రంచుఁ దలంచి కాదె య
య్యనలము మండఁ జేసి చొరు మంటిని దానిని నెంచ రైరిగా. 215

ఉ. పామరు లాడుమాట నొకపాటిగ నెంచి వితాకుఁ జెందఁగా
నేమిటి కంచు మీరు వచియించిన నేజను లైనఁ దిట్టఁగా
భూమిని నిందఁ జెంది మృతిఁ బొందినయయ్యపకీర్తిభాజనుం
డామిహిరేందుతారముగ నాపదఁ బొందును రౌరవాదులన్. 216

క. వివృతస్వర్గద్వారం, బవరజమణులార పుణ్యయశ మందులకై
సువివేకు లుత్సహింపుదు, రవివేకులు గాంతు సేతు రపయశమునకున్. 217

క. క్షితిమీఁద బ్రతికియుండియు, మృతిఁ బొందినవారు నిందలెనసినవారల్
మృతిఁ బొందియు బ్రతికినఘను, లతినిర్మలకీర్తిదేహు లవరజులారా. 218

క. కాన నడి కోడి ప్రాణము, లైనను బ్రాణముల కెల్లఁ బ్రాణములను మి
మ్మైనను ద్యజింతు ననఁగా, జానకి నెడఁబాయు టెంత చర్చింపంగన్. 219

ఉ. దీనత పాయ నెల్లనడి దీఱఁగ నే నిఁక జానకీసతిం

గానలఁ ద్రోయఁబంచుట సుఖం బని యెంచితి మంచి దైనఁ గీ
డైనను మంచి దంచు వినుఁ డడ్డము లాడితి రేని మీకు నా
యాన సుఁడీ యటంచు విభుఁ డాడినఁ గొందల మంది రందఱున్. 220

క. జనవిభుఁ డంతట లక్ష్మణుఁ, గనుఁగొని మీవదినె నన్ను గాంగతటతపో
వనులు గన వేట్క పుట్టెడి, నని వేఁడిన దట్టుగాన నదియె నెపమునన్. 221

శా. పల్మాటల్ దలపెట్ట కర్కుఁ డుదయింపన్ రేపె యాలోకనిం
దల్ మానంగ సుమంత్రచోదితరథాధ్యాసీనఁ గావించి వ
న్యల్ మోదంబునఁ జూడ రమ్మనుచుఁ గాన్తన్ నీవు గొంపోయి యా
వాల్మీకుల్ వసియించునాశ్రమముచేర్వన్ డించిరమ్మా వెసన్. 222

తే. ఇంతిపై నింతమూర్ఖత్వ మేల యనకు, మవనిజకు నాకుఁ దీఱెఋణానుబంధ
మదియు కాదేని జను లిట్టు లాడుకొందు
రయ్య యిఁక నేల పలుమాట లాడుకొనఁగ. 223

క. అని యానతిచ్చి భరతా,ద్యనుజుల గృహములకుఁ బనుప నానతముఖు లై
కనుఁగవల నశ్రు లొలుకఁగ, జని రధిపుఁడు విన్ననగుచు సదనముఁ జేరెన్.

తే. చేరి యవ్వారి యగుబాష్పవారిధార, లరుణరుచికన్నుఁదామరలాని నిదుర
మాన్ప రేమెల్ల వెతఁజెందె మనుజనాథుఁ,డలఁత నటులనె వేగించి రనుజులెల్ల.

క. లోకాపవాదమున నా,త్మైకన్యఁ ద్యజింప నెంచఁగానో యేమో
యాకొంతచనినరాతిరి, కాకుత్స్థున కొక్కబ్రహ్మకల్పం బయ్యెన్. 226

ఉ. జానకి నిందఁ జేసిన ప్రజన్ బలుకాఁకల ముంప రోషర
క్తాననుఁ డై వెలింగె నన నబ్జసఖుం డరుణారుణాంశుసం
తానముతోఁ గనంబడినఁ దత్సమయోచితకృత్యముల్ వెసం
దా నొనరించి లక్ష్మణుఁడు ధైర్యముఁ బూని సుమంత్రుతో ననున్. 227

ఉ. శ్రీరఘువంశవారినిధిశీతలధాముఁడు రాముఁ డంపఁగాఁ
గోరిక గాంగతీరవనకోటులు జానకి చూడఁ బోయెడిం
దేరు సుమంత్ర శీఘ్రమునఁ దె మ్మని పల్కి రథం బతండు సిం
గారము చేసి యశ్వములఁ గట్టి రయంబునఁ దెచ్చి నిల్పినన్. 228

శా. ఆసౌమిత్రి దృఢాత్ముఁ డౌట వగ దైన్యంబున్ ముఖాబ్జంబునన్
వీసం బంతయుఁ దోఁప నీక తెగువన్ వే వచ్చి సద్భక్తి సీ
తాసీమంతినికిన్ వినమ్రుఁ డయి మాతా గాంగతీరాశ్రమే
తపౌసక్తిన్ నిను నందుఁ దోడుకొని పొ మ్మంచున్ విభుం డంపినన్. 229

క. వచ్చితి రథంబు దెచ్చితి, విచ్చేయు మటన్న సీత వేడుక పడుచుం
బొచ్చెంబులేనికృప సెలవిచ్చెనె పతి యనఘ పోదమే వనములకున్. 230

ఆ. అనిన నేమి యెఱుఁగ కదక్కటా యీముగ్ధ,యనదఁ జేసి యొంటి నడవిఁ ద్రోచి

బేమి కతంబునన్ ఖగమృగేతర మర్త్య జనుల్ చరింపఁగా
నేముని యోర్వలేక శపియించె వచింపుఁ డటన్న నమ్ముని
గ్రామణి పల్కెఁ దామరసగర్భవధూపదనూపురార్భటిన్. 311

అగస్త్యుఁడు రాఘవునకు దండకారణ్యవృత్తాంతముఁ జెప్పుట.

క. మనువంశరాజశేఖర, మను వనుదార తొల్లి గగనమణికులమణి యై
మను నతనికి నిక్ష్వాకుఁడు మనుజస్తుతుఁ డుద్భవించె మహనీయరుచిన్. 312

శా. ఆయిక్ష్వాకుఁడు శైశవంబున సమస్తామ్నాయశాస్త్రార్థధా
రేయుం డై శ్రుతు లన్నియుం గని ధనుర్విద్యాదిమాద్యత్కళా
వైయాత్యంబును బూని శౌర్యమహిమన్ వర్ధిల్లి సామ్రాజ్యర
క్షాయత్తాత్మునిఁ జేసి తండ్రి మిగులన్ హర్షంబుతో నిట్లనున్. 313

చ. చదివితి వెల్ల వేదములు శాస్త్రములున్ స్మృతు లభ్యసించి త
భ్యుదయకరంబు లై జగతి నొప్పినయాగమముల్ పఠించి తే
కద తొలి ధర్మ ముత్తమముగాఁ గను మర్థము మధ్యమంబుగా
మదిని దలంపు కామ మధమంబుగఁ జూడుము పుత్త్ర యెప్పుడున్. 314

క. అది యేమి యంటివేనియు, మొదటను ధర్మంబు లేక మొనయదు ద్రవ్యం
బది లేక కాదు తలఁచిన, యది యట్ల గావునను ధర్మ మధికం బంటిన్. 315

ఉ. ధర్మమునం బ్రజాహితము దార్కొను వేల్పులు మెత్తు రార్యులుం
గూర్మి వహింతు రర్థమును గూర్పక యే యభివృద్ధిఁ బొందు దు
ష్కర్ములు భీతిఁ జెందుదురు శత్రు లడంగుదు రిష్టసిద్ధి యా
నిర్మలకీర్తియున్ ధరణి నిల్చు దివంబును గల్గుఁ బుత్త్రకా. 316

చ. పరహిత మాచరించుటయె భవ్యతపం బని రాదిసంయముల్
పరులకుఁ గీడు సేయు టొకపాప మటంచు వచింప నేల యి
ప్పరమహితోక్తిఁ బట్టి పరబాధ గదా యని మానరాదు భూ
వరులకుఁ బాపకర్ము లగువారల దండన సేయఁగాఁ దగున్. 317

క. దండింపఁ దగనిసుజనుల, దండించిన దండమునకుఁ దగుదుర్జనులన్
దండింపకున్న ధరణీ,మండలపతి నరకకూపమగ్నుఁడు గాఁడే. 318

చ. ఎడపక దండనీతి వహియించియె కీర్తియు స్వర్గమున్ నృపుల్
వడయుదు రాదిరాజనయపద్ధతు లట్టివి గావె యగ్గతిన్
నడపుము సౌఖ్య మొందెదవు నందన యంచు ననేకనీతు ల
క్కొడుకున కానతిచ్చి నయకోవిదుఁ డాయన యేఁగెఁ గానకున్. 319

చ. మనుసుతుఁడుం దదుక్త మగుమార్గమునం బ్రజ నెల్లఁ బ్రోచుచుం
దనమతి పుత్త్రకాంతులకుఁ దావల మాటయు దానధర్మముల్
మునుకొని యాచరించి మఖముల్ సతతంబును సంఘటించి యం

దునఁ గనియెం గుమారకుల నూర్జిత బాంధవు లుత్సహింపఁగన్. 320

తే. వారి కెల్లను గడగొట్టువాఁడు దండుఁ, డనెడుదుర్మార్గుఁ డన్నలయటులఁగాక
శ్రుతులు చదువక సాధుసంగతుల మనక, హితులమాటలు వినక యథేచ్ఛ [మెలఁగు.

వ. మఱియును.

సీ. వీథిలోఁ బాడగన్నవృద్ధుల నరికట్టి, వెకలి యై పలుమాఱు వెక్కిరించు
నాడఁబోయిన చోటఁ దోడిబాలురఁబట్టి, మూర్ఖుఁడై యంగముల్ మఱియఁగొట్టుఁ
జదువరా యేల దాక్షిణ్య మూనెడ వన్న, కన్నతల్లిని బిట్టు కడఁగి దిట్టు
నూరివారిండ్లలో నున్నవస్తువు లెత్తి, బలియుఁడై యెందైనఁ బాఱవైచు
తే. నార్యులుపురోహితులునన్నలరుగు దేర, నూరక యెబిట్టబిగుసుక కూరుచుండు
సహజధార్త్యముఁ బూని శైశవమునందె
తండ్రి వెతఁ జెంద దండుఁ డుద్దండుఁ డగుచు. 323

ఉ. బాలకుఁ డింత లే దనుచుఁ బక్షముతో నొకకొన్నినాళ్లు భూ
పాలకుఁ డోర్చి వాని యెలప్రాయమునందలిచిన్నెలుం బర
స్త్రీలకుఁగా మెలంగుటలు శిష్టుల నెంచక నింద సేయుదు
శ్శీలములుం గనుంగొని యిసీ యని రోసె మనంబులోపలన్. 324

ఉ. రోసి ప్రధానులుం బుధవరుల్ దనధర్మమనీష మెచ్చఁగా
నాసుతు నీసుతో నినకులాధిపుఁ డాతఁడు వచ్చి వింధ్యసం
వాసము నీకు మే లచట వర్తిలు పొమ్మని దూరదేశగుం
జేసెఁ గుమారుఁ డంచు నృపశేఖరు లోర్వరు మేర మీఱినన్. 325

మ. మధుమత్తుం డగుదండుఁ డిట్లు గురుఁ డంపన్ వింధ్యశైలంబునన్
మధుమంతం బనుపట్టణం బొకటి నిర్మాణంబు గావించి యం
దధికైశ్వర్యసమేధమానుఁ డయి శుక్రాచార్యు లాచార్యవృ
త్తి ధరింపన్ ధర యేలె వర్షశతముల్ దేవాహితుల్ దోడుగన్. 326

చ. అతఁ డొకచైత్రమాసమున హర్షముతోఁ జని భార్గవాశ్రమ
క్షితి నొకచోఁ గనుంగొనియెఁ జిత్తజనూతనరాజ్యలక్ష్మికిం
బ్రతి యగుదాని లేఁగొమరుఁబ్రాయమునం జెలు వొందుదాని నే
కతమున నున్నదాని నొకకామిని మత్తమరాళగామినిన్. 327

చ. కనుఁగొని మావిలేఁజిగురుఁగైదువుజోదు పదైదుమాఱు లే
సిన ననువాఁడితూపు లెదఁజిక్కిన స్రుక్కి యతండు చేరి యో
వనితరో యొంటి నేటి కిటువచ్చితి వెవ్వరిదాన వేమి నీ
యనుపమనామ మేను శరణాగతుఁడన్ వినిపింపవే యనన్. 328

చ. కరము భయంబుఁ బొంది యలకన్నియ యిట్లను నోయి రాజ నీ
గురుఁ డన మించు శుక్రు తొలికూఁతుర నయ్యనఘుండు కూర్మి న

న్నరజ యటంచుఁ బిల్చు నతఁ డంపఁగఁ దాపసనిష్ఠ నివ్వనాం
తరమున నున్నదానఁ దగు ధర్మము దప్పఁ దలంప నేటికిన్. 329

చ. అన విని దండుఁ డిట్లనియె నంగన భార్గవి వైన నేమి నీ
ఘనకటిసీమ నీయసదుకౌనును నీబిగిచన్నుదోయి నీ
కనుఁగవబెళ్కులుం గనినఁ గాముఁడు తాళఁగ నీఁడు కాఁగి లి
మ్మనుచుఁ బయంటఁ బట్టిన భయంపడి యమ్మదిరాక్షి క్రమ్మఱన్. 330

ఉ. అక్కట ధర్మమే గురునియాత్మజఁ బట్టి రమింప నెంచ నీ
కెక్కడఁ బుట్టె నీమమత యిప్పని శుక్రుఁడు విన్న సైఁచునే
నిక్కము మోహ మున్న నతనిం గని వేఁడి పరిగ్రహింపు మీ
కక్కసపుందనంబు లొఱ గా దని సారెకు బుద్ధి చెప్పినన్. 331

చ. వినక యతండు గిన్క నిక వెన్క భృగూద్వహుఁ డేమి పల్కినన్
వినియెదఁ గాక యిప్డలివేణిరో మారునిబారి కోర్వ రా
దనుచు బలాత్కృతిం గడిసి యగ్గురుపుత్త్రిని బట్టి కూడె నే
మని వినిపించువాఁడ మదనార్తులు మీఁదటిహాని యెంతురే. 332

క. ఆక్రోశింపఁగ నిటువలె, శుక్రాత్మజ బలిమిఁ బట్టి సురతవిలాసో
పక్రమముఁ జూపి యాపా,పక్రీడాపరుఁడు సనియెఁ బట్టణమునకున్. 333

చ. అరజయు నానతాస్య యయి యశ్రుజలావృతనేత్ర యై కుచో
పరిపరిషిక్తఘర్మ యయి పాణినిరుద్ధకపోల యై నఖాం
కురమృదితాంగి యై నిటలకుంచితకుంతల యై మనోవ్యథం
గరము దలంకు చున్నయెడఁ గావ్యుఁడు వచ్చి సవిస్మయాత్ముఁ డై. 334

ఉ. కూఁతుర యేల యింత వెతఁ గుందెద వెవ్వరు నిన్నుఁ దిట్టి రీ
లేఁతశరీర మిట్లు బడలింపుదురే యనఁ దండ్రిపాదముల్
నాతి నిజాశ్రులం గడిగి నాయమానము వీటిఁబుచ్చి యీ
కోఁతలు సేసె దండుఁ డని రోదనమాతుర యై యొనర్పఁగన్. 335

చ. ఉడుగక యెల్లలోకములు నొక్కట మ్రింగెడురుద్రుపోలికన్
బడిబడిఁ గోప ముప్పతిలఁ బండులు దీడుచు శుక్రుఁ డుగ్రుఁ డై
చిడిముడిపాటుతో నెదుటిశిష్యులఁ గన్గొని వింటిరే భయం
పడక మదీయపుత్త్రిఁ గని బల్మి రమించిన క్రించుచెయ్దముల్. 336

ఉ. మంటకుఁ జేరి కామిడుతమాడ్కి నశింపక మత్కుమారి మే
నంటియు నింటి కేఁగి చద లంటినదుర్మతి సేనతోడఁ గ్రిం
దంటఁగ మంటివాన గురియం గల దేడుదినంబు లింక నే
మంటినొ యంచు నెంచవల దప్పుడె యప్పురి నేలపాలుగన్. 337

ఉ. మామకశాపయుక్తి మఘమంతము నాలుగుదిక్కులందు నూ

ఖామడదాఁక నున్నవన మంతయు నిర్జన మై చటంచు న
య్యామివరుండు పల్కె నది యాదిగ నేఁడువిసంబు లింద్రుఁ డా
సీమను మంటివాన గురిసెన్ నశియించెను జంతుసంతతుల్. 338

అగస్త్యుడు రామునకు జనస్థానవృత్తాంతము చెప్పుట.

తే. అప్పురంబు రజోవృష్టి నడఁగి యడవి
యగుట నది దండకారణ్య మనఁగఁ బరఁగెఁ
గావ్యునిమహోగ్రశాపంబుకతన నాఁట
నుండియును బ్రాణిశూన్య మై యుండు నధిప. 339

ఉ. తాను గురూక్తి నయ్యరజ దారుణ మైనతపం బొనర్చె న
క్కాననమధ్యసీమ మును గల్గ రజోమయవృష్టి కోర్చి యా
మ్మానినిఁ జేరి రల్ల మధుమంతముపౌరులు దానిచే జన
స్థాన మనంగ నన్నెలవు ధాత్రిఁ బ్రసిద్ధి వహించె రాఘవా. 340

మ. అరజాసంగతయోజనాయతసరఃప్రాంతంబుఁ బ్రాపించువా
రు రజోవృష్టికిఁ దప్పిపోదు రనె శుక్రుం డాదటం గొంద ఱా
సరసీతీరముకానలన్ బ్రదికి స్వేచ్ఛం బోయి రించుక్ ఖరా
సురవిధ్వంసి కగస్త్యమౌని తెలిపెన్ శ్రోత్రంబు లింపొందఁగన్. 341

క. తెలిపినకథ విని రఘుపతి, కలశజునిం బెక్కుగతుల గణుయించుచు సొం
పలరఁ దథావిధభాషణముల నా నిశి గడపె సంతసంబొప్ప ద్దుపచయించెన్. 342

ఆ. ప్రొద్దు పుట్టినపుడె మిడమిటెఁ డతిభక్తి, నప్పు డాచరింప సగ్రహ్మ మైన
కృత్య మెల్లఁ దీర్చి యేతెంచి యమ్మహా, ఋషికి నతి యొనర్చి యిట్టులనియె.

చ. ధరఁగల తీర్థకోటులకుఁ దానక మై విలసిల్లుమీపదాం
బురుహము లాశ్రయించితి మిము గని కొల్చితి మాటలాడితిం
బొరసితి మీయనుగ్రహము పుణ్యుఁడ నైతి ననుజ్ఞ యిచ్చినం
బురి కికఁ బోయి వచ్చెదఁ దపోధనశేఖర యంచుఁ బల్కినన్. 344

మ. పరితోషించి యగస్త్యుఁ డిట్లనియె నో భక్తానవాంభోజభా
స్కర సాధారణధారుణీంద్రువలె నజ్ఞత్వంబు పైఁ బూని యి
క్కరణిన్ నన్ను నుతింప నేమిటికి సాక్షాత్కారకం బైనయ
క్షరతత్త్వం బవు నీవు నిన్నుఁ దెలియంగా శక్తులే మాదృశుల్. 345

సీ. మొదట నెవ్వనిపాదమునఁ బుట్టి నదులలో, ఘనకీర్తి గాంచె గంగాస్రవంతి
మునిముఖ్యు లెవ్వనిమూర్తిఁ గానఁగలేక, తపియింపుదురుమహాతపముఁ బూని
యెవ్వానివాక్యంబు లీరేడుజగముల, శిక్షించు గౌరవశ్రీ వహించి
మహిమ నెవ్వనియనుగ్రహము కించిద్జ్ఞుల, సర్వజ్ఞులుగఁ జేసి సవదరించు

తే. నట్టిహరి వైననీకు నర్ఘ్యం బొసంగి, కన్ను లలరంగఁ జూచితిఁ గాంతుదీరఁ

బలుకులును వింటి మీకృపఁ బడయఁ గంటి
నద్య ధన్యోస్మి యనుకొంటి నాత్మయందు. 346
సీ. నియతి రామాయంచు నీనామము జపించు, భాగ్యశాలికి వేదపాఠ మేల
నిను నొక్కపరయైనఁ గనుఁగొన్న సుజ్ఞాన, నిధికి బ్రహ్మజ్ఞాననిష్ఠ లేల
నీభక్తి యొనరించు నిపుణుఁ జేరి భజించు, స్థిరబుద్ధికిఁ దపంబు సేయ నేల
నీకటాక్షము దారి నిమిషమాత్రము చేరి, చెలఁగు మేటికిఁ దీర్థసేవ యేల
తే. నీవినుతి సేయువానికి సక్కవముగఁ, జింత సేయంగ నణిమాదిసిద్ధు లేల
జానకీనాథ మీపాదజలము గ్రోలు, ఘనగుణాబ్ధికి దేవత్వకాంక్ష యేల. 347

శ్రీరాముఁ డగస్త్యుని వీడ్కొని యయోధ్యకు వచ్చుట.

ఉ. దృష్టిపథంబునం బడిన దేవవిరోధుల నైనఁ బిమ్మటన్
శిష్టులు చేరుతావునను జేర్చు దయాబ్ధివి గాన నీవు నా
యిష్టికి వచ్చి నేను ఘటియించు సపర్యలు మెచ్చినావు నీ
తుష్టియ సర్వలోకముల తుష్టి రఘూద్వహ పోయి రమ్మికన్. 348
మ. అని గంభీరవచోనిగుంభనల వింధ్యారాతి కీర్తించి పం
చిన నద్భోటితపస్విచంద్రుల శుభాశీర్వాదముల్ గాంచి వీ
డ్కొని కౌబేరవిమాన మెక్కి సచివుల్ గొల్వంగ మధ్యందినం
బునకుం రాముఁ డయోధ్యఁ జేరఁ జనియెం బూర్ణానురాగంబునన్. 349
తే. చేరఁ జని డిండిమధ్వనుల్ చెలఁగఁ బెద్ద, నగరి మొగసాలకడ విమానంబుడిగ్గి
దానివీడ్కొను నంతలోఁ దమ్ము లెఱిఁగి, యెగుదెంచి పదంబుల కెఱఁగుటయును.
చ. ఇరువుర లేవనెత్తి ప్రియ మేర్పడఁ గౌఁగిటఁ జేర్చి రాఘవే
శ్వరుఁ డనుజన్ములార మిము వంటి గుణాఢ్యులు గల్గఁగాఁ జుఁడీ
మరణము మాని బ్రాహ్మణకుమారుఁడు ప్రాణము లొందె నావెతల్
దొరఁగె నటంచు వారలను దోడ్కొని లోపలి కేఁగి యచ్చటన్. 351
చ. జననులఁ గాంచి మ్రొక్కి యరుసంబున వార లొసంగు దీవనల్
గొని సమయోచితం బగుటఁ గోరిక మీఱఁగ మజ్జనంబు భో
జనము నొనర్చి యొక్కమణిసౌధతలంబున విశ్రమించి య
జనపతి చెంత నున్న యనుజన్ముల నిర్వురఁ జూచి యిట్లనున్. 352
చ. వదలక మీసహాయతఁ బ్రవర్తిలి బల్మి వహించి యజ్వ న
య్యెద నను వాంఛ పుట్టె నమరేంద్రుఁడు చంద్రుఁడు మున్ను కామిత
ప్రద మని రాజసూయమఖరాజ మొనర్చిరి తన్మఖంబు సే
యుదునొ తదన్యమైన మఖ మొక్కటి సేయుదునో గణింపుఁడా. 353
క. మీరెయ్యది దెలిపిన నది, గౌరవమున నాచరింపఁ గలవాఁడ హిత
ప్రారంభులార యనురఘు, వీరునకు భరతుఁ డనియె వినయం బెనయన్. 354

మ. ధర యాధారము సర్వభూతములకున్ ధాత్రీశ యీభూమి కా
దరువై యుండెడి వారె మీరు సురసంతానంబు వాణీమనో
హరుచే రక్షిత మాగతిన్ జనసమూహం బెల్ల యుష్మత్కృపా
స్ఫురణన్ వర్ధిలు సట్ప్రాణులు శుభంబుల్ వాయరే యందునన్. 355

సీ. అమరనాథుఁడు తొల్లి యాయాగ మొనరింప, నుగ్రదేవాసురయుద్ధ మయ్యె
మనహరిశ్చంద్రుఁ డామఖము మున్ను ఘటింప, రణములోఁ బొలిసిరి రాజులెల్లఁ
గలువలరాయఁ డాక్రతువు పూర్వమునందు, సవరింప నక్షత్రసమర మొదవె
నబ్ధీంద్రుఁ డాది నయ్యజ్ఞంబు గావింప, భూరియాదఃపాళి పోరి మడిసె
తే. నాహవకరంబు గావున నాహవంబు, తఱచుగాఁ జేయరెవ్వరు ధరణినాథ
యింతయును మీ రెఱుంగరే యిష్టగోష్ఠి, కిపుడు మముఁ జూచి యడిగితి రింతె కాక.

ఉ. అంచితధర్మతత్త్వముల కాస్పదమై చెలువొందు మిమ్ము బో
ధించఁగ నేర్తురే యొరులు దేవర యానతి యిచ్చినట్లు గా
వించ నొకింత నేర్తు మనువిన్నపమున్ విని రాజసూయ మీ
వెంచినయట్టిదా నని మహీపతి తమ్ముని మెచ్చె నెమ్మదిన్. 357

ఇంద్రుఁడు వృత్రవధవలనఁ గలిగిన బ్రహ్మహత్య నశ్వమేధము చేఁ బాసికొన్న కథ.

క. సౌమిత్రి యపుడు రామ,స్వామికి హస్తములు మొగిచి జనవర సవన
ప్రేమము జనించెనేనియు, మీమది నిడరాదె యశ్వమేధ మొనర్పన్. 358

మ. సకలాభీష్టఫలైకసాధనము దుష్టబ్రహ్మహత్యాదిపా
తకవిధ్వంసకకారణంబు హయమేధం బమ్మఖం బాచరిం
చి కదా యింద్రుడు బ్రహ్మహత్య యెడఁబాసెం దొల్లి తత్పూర్వపు
ణ్యకథాసంశ్రవణంబు సేయఁ దగు నంచా లక్ష్మణుం డిట్లనున్. 359

ఉ. వృత్రుఁడు భాస్కరోపమసమిద్ధమహోద్ధతవిద్విషన్మహా
వృత్రుఁడు బ్రహ్మవర్చసపవిత్రుఁడు నాఁ దగు నొక్క దేవతా
పుత్త్రుఁడు యోజనాయతసముద్ధతగాత్రుఁ డతండు మున్ బహి
శ్శత్రులతోడ నాత్మగతశత్రుల గెల్చి జగంబు లేలఁగన్. 360

చ. పలుమఱు భూమి దున్నకయె పండు నభస్స్థలి భూజనావళుల్
వలసినవస్తువుల్ గురియు వారిధి యూర్ముల రత్నమాలికా
వళి గొని బైటవైచు నవవర్షములున్ నెలమూఁడువానలున్
వెలయఁగ నెల్లచోఁ దనరు వృత్రునిధర్మము లెంచ శక్యమే. 361

ఉ. లోకము లెల్ల గెల్చి యతిలోకుఁ డనంగ నతండు మించి యుం
బాకవిరోధికిన్ భయముపాటిల శంబరుఁ డన్కుమారునిన్
స్వీకృతరాజ్యలక్ష్మి కభిషిక్తునిఁ జేసి తపం బొనర్చె ర
త్నాకరతీరధారుణి నుదంచితవైష్ణవభక్తి మీఱఁగన్. 362

ఉ. వానితపోవిజృంభణము వాసవముఖ్యులు చూచి భీతులై
దానవవైరిఁ జేరఁ జని తత్పదకంజము లాత్మమౌళిసం
ధానితరత్నదీధితులు దార్కొన వందనముల్ ఘటించి యో
దీనశరణ్య వృత్రు వగ దీర్చి జగంబుల వంత మాన్పవే. 363

చ. తపమున ముజ్జగంబులకుఁ దానె యధీశుఁడనై సుధాంధులం
గృపణులఁ జేసి దాసులుగ నేలెద నంచుఁ దలంచినాఁడు త
త్తపము ఫలించెనేని యరుదా యది యట్టులఁ గాక ముందఱం
దపము భవన్మహాతపమునన్ హరియించి విరోధిఁ ద్రుంపవే. 364

ఉ. నా విని పద్మనాభుఁ డెలనవ్వుల వేల్పులఁ జూచి పల్కె నో
దేవతలార వృత్రుని వధింపఁగ నా కుచితంబు గాదు నే
నే వర మిచ్చితిం దొలుత నింద్రశతారధరిత్రులందు మ
త్పావనతేజ ముంచెద విపక్షునిపైఁ జనుఁ డంచుఁ బంచినన్. 365

మ. అమరుల్ జిష్ణునిఁ గూడి శాత్రవుని డాయం బోవఁగా నంతలోఁ
గమలానాథుని తేజముం గనెఁ ద్రిభాగస్ఫూర్తి నం దాద్యభా
గము శక్రుండు నడిసాల్ పవిం గొదువభాగం బుర్విఁ బ్రాపించినన్
నముచిధ్వంసి వధించె దైత్యనిహతాంతశ్శత్రునిన్ వృత్రునిన్. 366

ఉ. వృత్రునిఁ జంపినప్పుడె సురేంద్రుని మేకొనె బ్రహ్మహత్య త
ద్గాత్రము కంప మొందె మది గాడ్పడియెన్ సుర లార్తిచే బహు
శ్చిత్రము లట్టులైరి వెతఁజెందిరి విప్రులు వర్షహీనతన్
ధాత్రి ప్రశస్యసస్యఫలధాత్రి యనం దగ దయ్యె నయ్యెడన్. 367

క. ఆహత్యవలనఁ గలఁగి సు,ధాహారస్వామి విగతయశుఁడై తూలఁగన్
స్వాహాధిపముఖదివిజులు, హాహాకారములతోడ హరిఁ జేరి వెసన్. 368

ఉ. ఓహరి యోకృపాజలధి యోపరమేశ్వర మీరె పంపఁగా
నా హరి వృత్రుఁ జంపఁగనె హత్య ఘటిల్లెఁ దొలంగె నాతఁడున్
గేహముఁ బాసి లోకములు కిల్బిషవృత్తిఁ గలంగె నింక మా
కేహిత మాన తిచ్చెదొ కదే యన నాయన పల్కె వారికిన్. 369

మ. హయమేధంబు మదర్పణంబుగ సురాధ్యక్షుండు గావించె నే
నియు నాశం బగు బ్రహ్మహత్య యనినన్ నిఃఖేదులై వేల్పులా
క్రియ దేవేంద్రునిఁ గానఁ బోయి మధువైరివ్యాహృతుల్ దెల్పని
శ్చయబుద్ధిన్ మునికోటిఁ గూడి యతఁ డాజన్మం బొనర్చెన్ రహిన్. 370

క. సవనంబు చేసి వాసవుఁ, డవభృథ మొనరించునంత నలహత్యయు ఘో
రవికారాకారముతో, దివిజేంద్రునితనువు దొరఁగి దివిజుల కనియెన్. 371

తే. ఈబిడౌజునితనువున నిప్పటివలె, విశ్రమింపఁగఁ గూడదు వేల్పులార

యెందువసియింతునింక నాకు కిరవుఁజూపుఁ, డనిస నాదిత్యులాబ్రహ్మహత్యఁ జూచి.
క. పాపముల కెల్ల బలువగు, పాపంబవు నీవు నిన్ను భరియింప నోకం
ఓపునె నాలుగుచోటులఁ, బ్రాపింపు మటంచు వారు పనిచిరి దానిన్. 373
చ. జలముల ఫేనరూపమున సాలములన్ బలుబంక చంద మై
చెలులయెడన్ రజోమహిమఁ జేకొని వర్తిలె హత్య యాంజ
స్వలల రమించుదుష్టజనసంతతిఁ జెందుట కుర్వినొక్కపాల్
నెల కొనియెన్ సురేంద్రుఁడును నెమ్మి దివంబున కేఁగి రంజిలెన్. 374
గీ. కావున నశ్వమేధ మధికంబు మఖంబులలో ననశ్వముఁ
దేవర యాచరింపుఁ డది దేవహితం బని లక్ష్మణుం డనన్
భూవరుఁ డుత్సహించి గుణ భూషణ యాయితిహాస మింపుగా
నీవలనన్ వినం గలిగె నేఁ డని ప్రస్తుతిఁ జేసి వెండియున్. 375

శ్రీరాముఁడు తమ్ములకు నిలోపాఖ్యానముఁ జెప్పుట.

చ. అనఘ తురంగమేధ మఖలాఘవినాశన మిష్టసౌఖ్యదం
బని యిపు డీవు దెల్పితి యథార్థము తొల్లి యిలాంభిధానుఁ డా
జనవరుఁ డమ్మఖంబు పురుషత్వము గ్రమ్మఱఁ జెందు కాంక్ష మై
నొనరిచి కామినీత్వ మతి యుర్వర యేలె నటంచుఁ బల్కినన్. 376
క. ఆమాటకు వెఱఁగందుచు, రామునిఁ గని తమ్ములనిరి రాజేంద్ర యిలుం
డేమిటికి మగతనము చెడి, భామినియై యుండెఁ దెలియఁ బల్కుఁ డటన్నన్. 377
క. అంభోజబంధుకులకల, శాంభోనిధిచంద్రుఁ డాదయాంబుధి పలికెన్
శంభుజటోజ్జృంభిసరి,త్సంభృతగంభీరఘోషసంగతఫణితిన్. 378
క. అనుజన్ములార యిలుఁ డను,జననాథునికథ పురాణసంహితలందున్
వినఁబడు నత్తెఱంగంతయు, వినిపించెద వినుఁడు చెవులు వేడుకఁ బొరయన్.
తే. కర్దముఁడు దివ్యతేజఃప్రఘుష్టితాఘు, కర్దముఁడునాఁగ మున్నొక ఘనతపస్వి
వెలయునతనికిబలజితాసనిలుఁడువితర, ణైలబిలుఁడొప్పనిలుఁడనునాత్మజుండు.
క. ఆయిలుఁ డఖిలకళాఢ్యా, రేయుండై చారురూపరేఖాజితరా
జేయుండై శత్రుజనా,జేయుండై భూమిలోఁ బ్రసిద్ధి వహించెన్. 381
వ. మఱియును. 382
సీ. పరమధర్మాసక్తిఁ బాటించుఁ గావున, సకలమార్గణకోటి సంచరించి
సార్వభౌమస్ఫూర్తి సుర్వీభరముఁ బూనెఁ, గావున ఘనదానకలన మించి
యంచితానంతవిద్యాశాలి గావున, నాభోగభోగాప్తినతిశయించి
జిష్ణువైభవలీలఁ జెలువందుఁ గావునఁ, బరగోత్రసంపదల్ పరిహరించి
తే. గరుడగంధర్వయక్షరాక్షసనరాధి,పతులు తనవిక్రమమునకు భయమునొంది

యగతికుల మంచు నశ్రాంత మాశ్రయింపఁ
బ్రాజ్యసామ్రాజ్య మేలె నప్పార్థివుండు. 383

కం. ఈలీల రాజ్యపాలనలోలుండై వెలసి యయ్యిలుం డొక ప్రాతః
కాలమున నిత్యవిధులను, శీలంబునఁ దీర్చి కొల్వు సింగారంబై. 384

సీ. అరినేత్రదరచిత్రకరవేత్రకరకోటి, బలసి ముందర బరాబరు లొనర్ప
శరదంబుధరకంబుశరభంబుల హసించు, జిగిమించుచామరల్ చెలులు వీవఁ
గరలోలనరపాలవరఫాలములఁ గప్పు, రములీలఁ బదనఖప్రభలు నిగుడ
స్థిరగాంగరఘురరంగదురుభంగరవభంగి, వెలయమాగధపాళి వినుతి సేయ [ఉలుప
తే. నచ్చరలచెల్వు మెచ్చని యుచ్చికంటు, లచ్చెరువు హెచ్చ దండలాస్యములు స
నన్యగంధర్వయువతిగానములు వినుచు, నిండుకొలువుండె నిలధరాఖండలుండు.

వ. అప్పుడు. 385

మ. తడవిండ్లుం గతిమేనులుం బికిలిపూదండల్ మిటారించు పెక్
విడెముల్ జేగుఱుగామముల్ బదనికల్ పెంపొందు లేఁదీఁగలుం
గడియంబుల్ పులితోలుచల్లడములుం గాసెల్ పిసాళింపఁగాఁ
దుడుముల్ గూడుక వచ్చి చెంచులు నరేంద్రుం గాంచి హర్షంబునన్. 386

చ. వెదురులముత్తెముల్ సెలలవిండ్లు జవాదిపునుంగుఁజట్టముల్
పెదపెదదంతముల్ పునుఁగుఁబిల్లులు జల్లులు జుంటితేనియల్
బదనికచాలుఁ గాఁకెనుముపాలు ననంటు లనంటుకప్రముల్
మొదలగు కానుకల్ నృపతిముందట నుంచి జొహా రొనర్చుచున్. 387

తే. పలికి రోనేలయేకిమీలకొలచుసామి, చేతఁగుత్తుకకలపెద్దచెంచువాని
యింటిచెంచెత చెలి మించుగుంటికెలని
పొలములోపలఁ జెలఁగు చెంచులము మేము. 388

సీ. తోలుపందిబలు చందములు చెందుననుఢాక, బెరయుపందుల లెక్కపెట్టరాదు
కడిఁదిగొరులమూఁక కనసి మసంగెడివేఁక, నెసఁగు సింగపుజాతి నెంచరాదు
జంటనల్ హజ్జల దంటబల్ మెకముల, బలఁగంబు మితి యేఱుపఱుపరాదు
పొలములో లేడిదూడల నేల మననీని, పులులసంఖ్య లెఱింగి పలుకరాదు
తే. కటికియేదుల నెలుఁగులఁ గాఱెనుములఁ, గత్తిపేరిమెకంబుల గణనసేయ
రాదు మాయన్న కాననరాజులయ్య, సోదె మాసాయ వేఁటాడి చూడరాదె.

తే. హానకందువమేల పైన్రాలు మొగులు, చాలు నరికట్టఁజాల్ చెంచుజవ్వనులకు
నిబ్బరపుఁదూపుతడవింటఁ బ్రబ్బఁజేసి, మబ్బుపైఁ బోఱుమెకముల గెబ్బుటెంత.

సీ. డాసి యేనుఁగులతోండపుమీఁదనుండి యు
య్యేల లూఁగు నీచిన్ని యెలుక వాఁడు
లేఁదీగఁ బులికిఁ గళ్లెముఁ బెట్టి వయ్యాళి, దోలుఁ గాఁ అడవి నీ దుండగీఁడు

కరిఁ జంపి పోవుసింహగము వెంటఁ జనిగోళ్లు, ముత్యముల్ దెచ్చు సిరమ సుదతిశిశుపు
గండభేరుండంబు రెండుతలల్ రెంటు, చేతుల విరచునచ్చిన్న వాఁడు
తే. వేడుకలఁ జేరి యఱకాల పీడఁదన్ను, నడవిపందులకోఱ లిఱుపడుచువాఁడు
తక్కునెలుఁగులగిలుఁగుల లెక్కసేయ, నేటి కేక నీవె చూచెదు వేఁటలందు.
క. తలఁకికె మెలఁగెడిమెకముల, నలుఁగులపాల్ సేసి మృగయులగు నని పొగడం
బులుఁగులవేఁటలు గని మెప్పులుగులకఁగ మరిలుఁ జనుచు బోయలు దెలుపన్.

ఇట్లు సపరివారంబుగా వేఁటకుఁ బోవుట.

మ. మృగయాక్రీడనతత్పరత్వమున ధాత్రీనాయకుం డెక్కరా
తగణంబుల్ బహుమానరీతి ముదమందం జేసి యవ్వేఁట మా
ట గిరిప్రాఙ్ఘటి రాణ వెల్ల విసఁ జాటం బంచి చాలించి యో
లగ మభ్యంతర మొంది యర్హవిధు లెల్లం దీర్చి శీఘ్రంబునన్. 393
సీ. సగఁబాలుకపురవాసనలమించుకురంగ, నాభిఁ దీర్చినగీఱునామ మమర
విరిసరుల్ పైపై నిమెఱయఁగట్టినబురు, సాసిమాల్ చెఱఁగులంసమునఁబొదలఁ
దావికుంకుమపుగందపుఁబూఁతి దగుపేరు, రంబున రత్నహారములు వెలయ
నునుపాలకాయయొంటులనంటు తెలిచాయ, లోలసిచెక్కులను వెన్నెలలుగాయ
తే. జిలుగుచెంగావిదట్టిపైఁ జెక్కికొన్న, వంకి దులకించఁ బసిఁడిదువ్వలుప వల్లె
వాటు నెఱనీటు గులుకఁ బావాలుమెట్టి, రాజదేవేంద్రుఁడంతఃపురంబు వెడలె.
వ. అప్పుడు. 395
సీ. వినుకెంపు నడకెంపు నునుకెంపు పల్లంబుఁ, దీపించు పచ్చరా దృష్టిదంష
కెఘనునీలంపుసింగంపుఁ జలాడంబు, పండువైడూర్యంబు నిండువాగె
నిగిరంపుఁ బగడంపు జిగిదొట్టు ఘొగిమట్టు, రంగారు మనరిణిసింగిణీలు
గోమేధికంబులఁ గొమరొందుకళ్లెంబు, వజ్రాలమేలంకెనిన్నియలును
తే. గ్రొత్తము త్తెంపుఁ దెఱలఁ జక్కఁ గత్తుజాన
మరుమరకతాళి మెఱుఁగొందు తరకసములుఁ [నొక్కసాది.
బసిఁడితఱటును గలిగి సొం పెసక మెసఁగు, నుత్తమాశ్వంబుఁ గొని తెచ్చె
క. తెచ్చిన తేజికి వలగొని, వచ్చి తగన్ మ్రొక్కి యెక్కి హాగ గొని యహహా
మెచ్చరికె సామి యనురవ, మెచ్చఁగఁ గంచుకులు వెంట నేతేరంగన్. 397
క. జోడనలు నిబ్బరంబులు, వేడెంబులు మెఱయ రాజు వేడుకతో డగ్
గోడా దుమికింపఁగ జత, గూడిరి దొర లెల్లభటులగుమి వెనుకొనియెన్.
ఉ. మట్టికులాయులున్ బిగువుమాటలుఁ గుంకుమతావిగందపుం
బట్టెలుఁ జల్లడంబులును బంగరుకాసెలయొరఁ జెక్కికొ
న్నట్టిబెడంగుచాయపిడియంబులుఁ దళ్కులదుప్పటుల్ దగం
జట్టపురాకుమారకులు సొంపున నేఁగిరి రాజుముందరన్. 399

ఉ. గాటపుబోనులుం జిగురుఁగండెలు సివ్వఁగిబండ్లు వాగురా
కోటులుఁ జిక్కముల్ దెఱలు గుంతములుం వడవిండ్లుఁ దూపులన్
మీటగునీమముల్ మణులు మేలిమి మూలికల్ గెలూని యా
ఖేటకు లాన్నృపాలకుని క్రేవల నేఁగిరి కేవలత్వరన్. 400
తే. కణుఁజు సాళువమును జలకట్టె లగుడు, జాలి డేగయు మొదలైన మేలిడేగ
తెగలఁ దగ నేర్పరించి యుత్తముల నుంచి
కదలె నృపువెంబడిన యూడిగములగములు. 401
ఉ. చోరులగుండెలన్ దిగులుకొనుల్ కిటికోటులపాలిమృత్యువుల్
క్రూరమృగోత్తమాంగములఁ గూల్చెడి పెన్పిడుగుల్ గభీరభాం
కారనినాదముల్ ప్రళయకాలసదృఙ్మృగయాప్రధానముల్
భైరవవాహముల్ భటులపజ్జల నేఁగె మహాజవప్రౌఢతిన్. 402
సీ. ఎదిరించు సింగంబు బెదరించి వడిమించి, సటలను య్యేలలూఁగుభటుఁడ నేను
గవినున్న పులిఁ గన్న గదిసి గద్దించి గొబ్బున నీడ్చి తేనోపుబంట నేను
గరమూఁదిపైఁ జివుక్కన నెక్కి కరికుంభ, మగలించుపంతసాహసుఁడ నేను
శరభంబు కాళ్లుకొంచక పట్టి నేలతోఁ, గొట్టఁజాలినమహోగ్రుఁడను నేను
తే. గడిఁది కిటికోటిపాలిటిపిడుగు నేను, సకలమృగములనడఁచు నంతకుఁడ నేను
దేవయిఁక మమ్ముఁ బెలిసెదవేవయనుచు, వేఁటగాండ్రాడుమాటలు వేడ్కవినుచు.
వ. చనిచని. 404
మహాస్రగ్ధర. కనియెన్ భూపాలలోకాగ్రణి తనయెదురన్ గాఢవల్మీకనిచ్ఛే
దనమాద్యద్భల్లహస్తస్థలగతఫణిరత్నస్ఫురత్పన్నగౌఘో
కనజాతాలాతశంకాకలితగమనభాగ్గంధకుంభిచ్ఛటాభా
వనభీతక్షుద్రనానాధ్వగమృగనినదవ్యాకులం బైనకానన్. 450
మ. కని యకాననదేశమున్ సుభటసంఘాతంబుతోఁ జొచ్చి య
ల్లన నానామృగసంఘముల్ మెలఁగుపట్లం బోగు వారించి చు
ట్టును ధానుష్కులు గుంతధారు లగుబంటుల్ నిల్వ నేమించి శం
ఖనినాదంబులు దుందుభిస్వనము ఢక్కానాదముల్ మించఁగన్. 406
తే. కలయఁ జోపులు వెట్టింపఁ గరియుఁ గిరియుఁ
గాసరముఁ గేసరియు దుప్పి కడిఁది యెలుఁగుఁ [నదరి బెదరి.
బులియుమొదలగుమెకములు గలఁక దోలుకఁ, జెదరి నలుదిక్కులకుఁ బాఱె
వ. మఱియును. 408
సీ. అగ్నియంత్రములు పెల్లాకాశ మవియింప, భయమందినెలవులఁబాయునవియుఁ
బటహశంఖధ్వనుల్ బ్రహ్మాండ మగలింప, నులికి సల్లిక్కుల …
భటులకోలాహలాకర్ణనంబు …

ధానుష్క-శింజినీధ్వానముల్ చెవిఁ బ్రాఁకి, నులికిపాటున నిద్ర లుడుగునవియు
తే. నగుచుఁ బఱచు మృగంబులఁ దాఁగి మూఁగి
యడరి వెన్నాడి మున్నాడి యాక్రమించి
విక్రమించిరి ముంచిరి విశిఖవృష్టి, విభుఁడు గడియింపఁ బెక్కండ్రు వేఁటకాండ్రు.

చ. విలయఘనాఘనంబు లట పిస్సలి డిగ్గెనో యంధకాసురుం
డిల జనియించి క్రమ్మఱ ననేకశరీరము లెత్తెనో విషా
నలము మహేశ్వరుం డుమిసినం బలురూపులఁ జెందెనో యనన్
వెలసినసూకరప్రతతి వెల్వడె దిక్కుల నిక్క నిండఁగన్. 410

ఉ. అప్పుడు చెంచులున్ సుభటులు న్లడ్డముఫ్రాఁ... లకోరికోలలం
గప్పఁగ నంతకంటె మును గల్గఁ బయిం బడెఁ జాగిలంబులుం
జెప్పెడిదేమి కోలములు చేకొని శస్త్రచయంబు లీఁటెలుం
గుప్పలుగాఁ బడన్ విఱుచుఁ గోఱలఁ జిమ్ముచు జాగిలంబులున్. 411

ఉ. సారెకుఁ బాలచేరు బలు జాగిలముల్ గబళింపఁ యీడ్వఁగా
నీరస మొప్పఁ దారసిలి యీఁటెల వీరభటాళి నొంచఁగాఁ
దారక కొప్పరింపుచును దంష్ట్రల నిప్పక లుప్పతిల్లఁగాఁ
బోరుకడిందిపంది నొక బోయ పిడెంబునఁ గ్రుమ్మెఁ గూలఁగన్. 412

చ. ఇరవులు వాసి తారసిలు నిన్నిటి కిందఱ మేఁగి యొక్కడొ
క్కరుఁ డొకపందిఁ జూపి యిదె కైకొనువారము సామి చూడు హే
చ్చరిక యటంచుఁ బల్కి పరుషధ్వని నొంటరికాండ్రనేకసూ
కరముల గుప్పగుప్ప మనఁగాఁ బడఁ గ్రుమ్మిరి కుంతపంక్తులన్. 413

చ. తెలివగ వెండిగుండ్లవలెఁ దేజము మీఱిన భైరవాశ్వపం
క్తులు పదివ్వైదు లొక్కమొగిఁ దూఱినఁ గోలలఁ జీల్చి వైచుచుం
బెళపెళ బల్లెముల్ విఱిచి భిల్లులు తల్లడమంది నుద్ధతిన్
వలలను ద్రెంచి తేజిపయి వచ్చు కిరిన్ దొగ నొంచెఁ దూపునన్. 414

చ. గిరిగుహనుండి యొక్కహరి కేవల రాజుహయంబు మించినన్
హరి యనుపేర నేను జెలువం దగఁ నీవును బూనినావె నా
స్థిర మగుపేరటన్న పగచేఁ బలెఁ బై కెరుదేర భర్తయున్
శర మొకటేయఁ ద్రెళ్లెక వేసన్ నిగుడన్ నఱకెం గటారునన్. 415

చ. అలయక లేడిదూడగుమి నాఁగెడు కోల్పులులన్ వధించుచుం
తుల వెఱపించు సింగములఁ ద్రుంచుఁ దదార్తికరోగ్ర శౌర్యముల్
గల శరభాళి నొంచు గమకంబున వానిఁ గలంచు జంట పెం
దలలకడిందిజంతువుల ధర్మరతిం బతి చించు నొక్కటన్. 416

క. కిరి కరి హరి శరభాదుల, హరియింపుచు సుభటు లలర నట్టిపనులకుం

జోరలేని పిఱికి యయ్యలు, చరియింతురు శశకములకు । జంబుకములకున్. 417

క. ఒకతూపున బహుమెకముల, నొకమెకము ననేకసాయకోత్కరముల నొ
క్కొకచో నడుచుచు రాజన్యకులాగ్రణి యపుడు వేఁటకేళిఁ జేసె యథేచ్ఛన్.

క. కడువడిఁ బఱచెడు మెకమును, జెడుమెకముం బడుమెకంబుఁ । జేష్టుడుమెకముం
బడలుమెక మడలుమెకమును, నెడయుమెకం బయ్యె నటవికనిలుని భటులచేన్.

ఉ. కంపలు గుండెలుం । బొదలు । గాటపుఁ జేవ్రుపులు నెత్తు రేకమై
నిండె నరణ్య మంత మృగనిర్హరణోద్ధతి మాని యుండియుం
వెండియు భూవరుం డనుప । వేఁటకు మీఁ టగు డేగ వేటయుం
గొండొకసేపు చూచి తగుకోరిక లిచ్చెఁ బుళిందకోటికిన్. 420

ఇలుఁడు కైలాసప్రాంతవనంబుఁ జొచ్చి సపరివారుండై స్త్రీత్వము నొందుట.

వ. ఇవ్విధంబున మృగయావినోదంబునం దనివిఁ జెంది పంది కుందేలు కదళీ
మృగంబు మొదలగు మెకంబుల పలలంబు వంచికొనుటకుం దమలోఁ దమరు
పలుచందంబుల సంపాదించి యొండుపుళిందబృందంబు లందిలకించి కించిద్దరహాసకంద
ళితవదనారవిందుండై యన్నరేంద్రసంక్రందనుండు కొండొకవిశ్రమించుతలం
పున నపరిమితచమూసమూహసమన్వితంబుగా నక్కాఱడవి గడచి యక్కడకుఁ
జక్కనియుత్తరపుదిక్కునఁ బెక్కునిండుచందురుల పండువెన్నెల లొక్కటమెం
డుకొన్న చెన్నునఁ గన్నులపండువై యుండువెండికొండదండకుం బోయి కొండలఁ
జెండుమన్నీని చేతిచికిలిఖండాచాయలఁ శ్రేణిసేయుశరవణంబు విలోకించి త్రిలో
కమోహనం బగునవ్వనంబు దరియం జొచ్చి యచ్చట. 421

సీ. తనకీర్తివిలసనత్వము లేనగవునందుఁ, దనచంద్రసౌమ్య మాననమునందుఁ
దనఖడ్గవిభవమంతయుఁ గీలుజడయందుఁ, దనప్రతాపము సుధాధరమునందుఁ
దనకువలయహితత్వము నేత్రములయందుఁ, దనగబ్బితన మురస్థలమునందుఁ
దనధర్మసురుచిరత్వము కన్నుబొమలందుఁ, దనకాంచనసమృద్ధి తనువునందుఁ

తే. దనగభీరత నాభిప్రదేశంబునందుఁ, దనమనోవిస్తృతి నితంబతలమునందు
వెలయ నిలుఁ డంతలోఁ దాఁటవిలుతుచెలువ
భంగిఁ దులకించు నొకమోహనాంగి యయ్యె. 422

వ. ఇత్తెఱంగున. 423

ఉ. కోడెమిటారిగబ్బిచనుగుబ్బల నుబ్బు మనిండు ప్రాయపుం
జేడియ యై యతం డరుదుఁ జెంది యమాత్యసుహృద్భటాదులం
జూడఁగ నందఱుం దనకు జోడుగఁ గైకొని రాఁడుపోఁడుముల్
గోడిగచంద మొందె నలఘోటకరత్నముఁ బత్త్రణంబునన్. 424

క. అన్నుతనంబు వహించిన, తన్నుం దనవారిఁ జూచి తద్దయు వగతోఁ
నున్నంత నటపుఁ గొందఱు, గన్నియ లేతెంచి కరము కనికర మమరన్. 425

తే. పలికిరోవెత్తి యిఁకనేల ♦ పరితపింప, గిరిజతోఁ గూడి శివుఁ డీడఁ ♦ గ్రీడసేయ
వచ్చినాఁడింతలోనిందుఁ ♦ జొచ్చుపురుషుఁ, డింతియాఁగాకయని శాప ♦ మిచ్చినాఁడు.

చ. నగజకుఁ బ్రీతిగా నిజగ ♦ ణంబులతోఁ దరుణేందుమౌళియుఁ
మగువతనంబుఁ బూనికొని ♦ నాఁడటు గావునఁ జూడు మివ్వని
ఖగమృగపన్నగంబులు న ♦ గంబులు మున్నుగ స్త్రీలవై ఖరిం
దగినవి యీశ్వరాజ్ఞ జవ ♦ దాఁటఁగ నెవ్వరికైన శక్యమే. 427

శా. ఏసర్వేశ్వరునాజ్ఞ యాదలల బ్ర ♦ హ్మేంద్రాదికుల్ పూనికొం
డ్రాసర్వేశ్వరుఁ డాకుమారగురుఁ డా ♦ ర్యార్ధేందుకోటీరుఁ డు
ల్లాసం బొప్ప వసించినాఁ డదిగొ బా ♦ లా పాణిభృచ్చామర
వ్యాసంగానిలలోలకుంతలచయుం ♦ డై గామ్ము ప్రార్థింపఁగన్. 428

క. అని రుద్రకన్య లెఱిఁగిం, చినఁ బడతుక ♦ యైనరాజ ♦ శేఖరుఁ డొలమిం
దనవారుఁ దాను గ్రక్కునఁ, జని గిరిజాసహితుఁ ♦ డైన ♦ శంభునిఁ గాంచెన్. 429

తే. కాంచి బిగిచన్ను లిల మోవఁ ♦ గాంచనాద్రి
ధనునిపాదాబ్జములకు వం ♦ దన మొనర్చి
యంజలి ఘటించి యభినతు ♦ లాచరించి
వినయ మెనయంగ నిట్లని ♦ విన్నవించె. 430

చ. పరమదయానిధాన శివ ♦ పశ్యలలాట సహస్రకోటిభా
స్కరనిభ తేజ మీ రిడిన ♦ శాప మెఱుంగక వచ్చి యీవనాం
తరమున సేనతోడ వని ♦ తాత్వముఁ జెందితి నివ్వికారముఁ
భరణము సేయఁ జాల నిఁకఁ ♦ బౌరుషముం గృపసేయవే యనన్. 431

చ. కలకల నవ్వి శంభుఁ డనుఁ ♦ గర్దమనందన యొడుచందముఁ
దలఁగఁగఁ జేయు టొక్కటియు ♦ తక్క మఱొక్కవరం బొసంగెద
వలసిన దేమి చెల్పు మని ♦ సం బరమేశ్వర యన్యకాంతయుఁ
వలయునె యంచు నయ్యిల శి ♦ వానతిచెంగటి కేఁగి నీనతిన్. 432

చ. కళుకు మెఱుంగుఁ జెక్కులను ♦ గాటుకకన్నుల నీరు జాఱఁగా
నలఁత జనించు నూర్పు సెగ ♦ లాని ముఖాబ్జము వాడుదేఱఁగా
నలుఁదపిఱుందుభారమున ♦ వారనితొక్కటపాటు మీఱఁగా
నిలపయిఁ జాఁగి మ్రొక్కి యిల ♦ యీశ్వరి నిట్లని యెంచె ధీనతన్. 433

దండకము. శ్రీమద్రమాభద్రమాతంగయానామణీముఖ్యనానామరగ్రామణీ కామినీకల్పితానల్పకల్ప ప్రసూనాదిపూజాతిరాజత్పదాంభోజ గీర్వ్యన్నఖశ్రేణికాసాంద్ర చంద్రాతపశ్రీసముత్ఫుల్లభక్తిప్రియశ్రేణినేత్రోత్పలా ఖండితాశ్వద్విపద్దాన వైరాద్యత్ఫలాయుత్పలామిత్రమిత్రాగ్నిహోత్రాఖ్యనేత్రత్రయాలోకలోకైక నిర్మాతృతానేతృతాజేతృతాకీర్ణచాతుర్యపారీణఖేలావతీచారులావణ్యలీలావతీ దేవ

తిర్యఙ్మనుష్యాదిక ప్రాణిబాహ్యాంతరవ్యాప్తిసుప్త్యాద్యవస్థాతిగజ్ఞప్తిరూపానురూప క్రియాకారణాకార రేఖావిలోకాతిలోక ప్రమోదాబ్ధినిర్మగ్నఘాలేక్షణాపద్మగర్భాండకోట్యర్బుదాయత్తసంరక్షణా సూక్ష్మవీక్షాతితీక్షాపరాక్షీణ హృద్గ్రంథినిర్గ్రంథనాత్మానుసంధానసంబంధభృన్మూలబంధానుభూతిప్రభూతాత్మసాక్షాత్మక శ్లాఘ్యనిష్ఠైకసంధాయినీ బంధురాష్టాంగయోగాంచితధ్యాయినీ కాయజాఖర్వగర్వాపహారవ్రతాచారచంచత్తపఃకర్మసంచారిణీ బాలచంద్రైక రేఖాసముద్ధారిణీధారుణీతోయ తేజోమరుద్వ్యోమతన్మాత్రతత్త్వాదృశప్రాణనాదేంద్రియస్థానషట్చక్రనాడీ విశేషాకృతీ హృద్యవీణానువాద్యాది విద్యాకృతీప్రకృతుల్ నిన్ను సర్వేశ్వరీ మూలశక్తింబరంజ్యోతి నాద్యంతశూన్యం ద్వయీరూపిణింగాంచి భావించఁగాలేక దాక్షాయణీదేవి వంచున్ హిమక్షోణిభృత్పుత్రి పంచున్ విలోకింతు రస్మదృశాజ్ఞత్వ మాత్మన్ క్షమింపంగ భేదంబు మాన్పంగ నీకే తగుం దండ్రికంటెం బ్రజాకోటిపైఁ ఎల్లికిం గూర్మి బాహుళ్య మోతల్లి యేఁ దల్లి యేస్నానమేదాన మేయోగ మేయాగ మెచ్చోటఁ గావించినా నినుం జూడఁగాఁ గల్గె బ్రహ్మామరేంద్రాది బృందారకేంద్రస్ఫురద్భర్మకోటీరకోటీతటీగత్నవిభ్రాజమానప్రభారాజినీరాజితం బైన నీయంఘ్రియుగ్మంబు సేవించితిం బూర్వజన్మార్జితాశేషదోషంబు నీసత్కటాక్షంబునం బాసె నేనిన్ను వీక్షించి తిం కేమి కాంక్షింపఁగానున్నదై నన్ మనశ్చంచలత్వంబునన్ వేఁడెదన్ వ్రీడకుం దోషనీ దైనయీయాంతరూపంబుఁ బ్రాపించి యుష్మత్కృపాభావితప్రాజ్యసామ్రాజ్యముం బాసి గాసిల్లఁ గానోప నాపూర్వపాపంబు మన్నించి నన్నున్ భవత్కింకరశ్రేణితోఁ గూర్చి రక్షింపు మోనాతి యేరీతిఁ జింతించినన్ విశ్వలోకప్రపంచంబు నీచేత నీచేతనాచేతనశ్రేణి నేలాగు గావించ నూహించి తాలాగునన్ నీకసాధ్యంబు లేమున్న వైపన్నగవ్యూహసమ్రాడ్తులాకోటభృద్దేహినీ విశ్వసంమోహినీ స్వాధపాథోధిరాడంతరానంత రత్నాంతరీపస్థిరామధ్యమాణిక్యకుదంబాటవీవాటక్షోటద్రుమూలస్థలీదివ్యచింతామణీభద్రపీఠాగ్రసంవాసినీవాసవాద్యష్టదిక్పాలకానీకయక్షగంధర్వగుహ్యానిలవ్యాళవస్వప్సరస్సిద్ధసాధ్యాది దివ్యస్తవాకర్ణనారోధనగ్లోత్పలామోదలోభభ్రమద్భృంగకోజ్జృంభితశ్రీనఖత్పార్శ్వభాస్వద్వయస్యామణీచామరవ్రాతజాతానిలాధూతనీలాలకస్నిగ్ధముగ్ధేందులీలాలసత్ఫాలకస్తూరికాచిత్రకోద్భాసినీసంతతోల్లాసినీ గౌరిమాహేశ్వరీశాశ్వతైశ్వర్యలక్ష్మీకరీ శాంకరీ కాళి కంకాళనాళీకధారావళీభీతభర్గాశ్రితస్వీయవక్షోరుహాక్షోణిభృద్దుర్గదుర్గామహాదేవి దేవీమతల్లీశ్రితార్తిచ్ఛటాభల్లభిల్లీ ననుం గన్నతల్లీనమత్కల్పవల్లీ నమస్తే నమస్తే నమః.

క. అని కొనియాడిన గిరిజా, వనజానన సంతసించి శ్రీవల్లభుమదిలో

నెన రొలయుఁ దెలిపియయ్యెలఁ, గనుఁగొని యిట్లనియెఁ గరుణాకరుఁడు లోకసంగన్.

క. నగపాలు శంకరుండును, నగపాలే నగుట నీకు నగ మియ్యఁడగున్
మగువయయి కొన్ని నాళ్లున్, మగతనమునఁ గొన్ని నాళ్లు మనుమింక మీఁదన్.

వ. అని పలికి యప్పరమేశ్వరి యిట్లనియె. 437

{ పార్వతీదేవి యిలునకు నొకమాసము మగతనము నొకమాసము మగువతనంబును గలుగునట్లు కరుణించుట }

ఉ. ఎన్నిదినంబు లింతితన మీవు వహించి చరింతు వుర్వి నన్నిదినంబు లుండుము నృపాకృతి నెప్పటిపౌరుషంబుతో
నున్నపు డింతి వై మెలఁగి యుండుము కామిని వై నవేళ ము
న్నున్న నృపత్వమున్ మఱచియుండుము రెంటను సౌఖ్య మబ్బెడున్. 438

చ. ఎలదు విచార మన్నను భవానికి నయ్యిల మ్రొక్కి క్రమ్మఱం
బలికె మహాప్రసాద మనపాయదయానిధి నీయనుజ్ఞచే
నలయక యొక్కమాసము నృపాకృతిఁ జెందుచు నొక్కమాస ము
చ్చ్వెలితన మొందుచుం గ్రమణ సేసెదఁ గాలము పంపవే యనున్. 439

క. మంచిది యటువలె నౌఁ బొ, మ్మంచును బొమ్మంచుఁ మువిహాసనాంచితగిరముల్
మించఁగ గిరిసుత పంచినఁ, జంచలలోచనలు గొల్వఁ జన నిల యానుచున్.

పంచచామరము. ఇలాసుతాధినాథుఁ డాన తిచ్చినన్ సవిస్మయా
త్ములై సహోదరుల్ నరేంద్ర తొంటిరూపు వాసి య
య్యెలుండు గాంత యై మఱెక్క డెక్కడన్ మెలంగ నే
స్థలంబులం జెలంగెఁ దద్విధంబు దెల్పవే యనన్. 441

ఉ. తమ్ములఁ జూచి రామవసుధాపతి యిట్లను నట్లు గౌరిచే
సమ్మతిమై వరంబు గొని సర్వసుహృద్భటమంత్రివుంగవుల్
గొమ్మలపోఁడుముల్ దొరసి కొల్వఁగ వాహనకోటి నొక్కపా
ర్శ్వమ్మునడించి యయ్యిల ప్రసన్న మతిన్ విహరించెఁ గానలన్. 442

సీ. తిరుగునొక్కొకచోటఁ జరణాబ్జములుసోఁక, మహియెల్ల మెట్టదామరలుగాఁగఁ
బలుకు నొక్కొకచోటఁ బలుకుచక్కెరలకై, కిలికిరాంచిలుకలకలఁగ ములయఁ
జూచునొక్కొకచోటఁ జూపులు పొదలపై, నెలసి తేఁటులబాటునిను మడింప
నవ్వు నొక్కొకచోట నవ్వు వెన్నెలలచే, వనములో నెల్లఁ గ్రొన్ననలుమించఁ

తే. జొక్కముగఁ బాటఁబాడు నొక్కొక్క చోట
డగరకోయిల లెల్లఁ జుట్టుక మరయ
సొలసి యొక్కొకచోనిల్చు సొగసుమేని, కమ్మతావులు దిశలెల్ల గమ్ము మనఁగ.

వ. ఇవ్విధంబునఁ బ్రథమమాసంబున నసమానవిలాసంబుల మించు నమ్మించుఁ
బోఁడి త్రిలోకకామినీకామనీయకంబులకు నాస్పదం బై సానుమత్సాను

భాగంబుల సానఁ దీరినమానికంబువలె డంబుగని ఘనతరవనౌఘమేఘమాలిక యందుఁ దులకించుతొలుకరిమించుమించుల వహించి మహితనికుంజపుంజమ్ములచేరువం జారుమల్లికామతల్లికాసముల్లాసంబు లెల్లఁ గొల్లలాడి కళంకు లేనికొలంకులకెలంకులఁ బంకజప్రభవునివారువంబుగారవంబున సౌరువడసి విడిసినచోట విడియక నిలిచినచోట నిలువక చూచినచోటఁ జూడక కోడెప్రాయంబుతోడిచేడియలఁ గూడుకొని వేడుకతోఁ బెక్కుజాడలఁ గ్రీడించుచు నొక్కనాఁడు చొక్కపుఁగొండకుఁ జక్కనిదక్షిణంబునఁ జుక్కలరాజుచక్కని కొడుకు తపంబు సేయు పెక్కుతరులతాదులఁ బెం పెక్కు నొక్క యక్కజపు వనంబు గని తఱియం జొచ్చి యచ్చట. 444

క. విహరించుచు విరిపూఁబా, వి హరించుచు గాడ్పు మెలఁగ విలసిల్లుచు స
మ్మహిళామణి సహచరబహుళ,మహిళటులం గూడి గహనమధ్యమునందున్.

చ. గగనముతోడ రాయునొక గట్టుఁ గనుంగొని హొన్నుఛాయలన్
దగు నొకదివ్యచంపకవనంబునఁ గంకణపద్మరేఖలం
దగి కమలాకరత్వము యథార్థభావమునం బొసంగఁ జె
న్నులు గులు కొక్కదీర్ఘిక కనుంగొని తజ్జలమధ్యమంబునన్. 446

ఇలను బుధుఁడు వరించుట.

క. మరునిన్ వేలుపురాచకొ,మరునిన్ నగుసొగసు మించ మహిమ రయింపన్
దురుసుతప మూని తగుచం, దురుసుతు బుధుఁ జూచి యిల మనోజాతురయై.

చ. ఎగుభుజముల్ వెడందయుర మిందుని గిందుని మించ నీనినె
మ్మొగ మపరంజిడాల్ తలిరుమోవియుఁ జేరల మీఱుకన్నులున్
జిగి గలపెందొడల్ గలిగి చెల్వు వహించినయాతఁ డీడ బె
ట్టుగుతప మూనినాఁడు చెలులార కనుంగొనుఁ డంచుఁ దెల్పుచున్. 448

క. వికచారవిందబృంద, ప్రకటతరామోదభరితసాటీరమరు
న్నికరచలాచలనీలా,లకలు సకులు గొల్వ నక్కొలఁకు సేరి వెసన్. 449

తే. కలికిరాయంచవలె సోయగంబునడలు, గులుక నక్కల్కి చెంగావికోకవదలి
చలువపావడతోఁ జొచ్చెఁ గొలఁకు నెలకు, మారుపై మారుఁడనుచుకటారిఁ బోలి.

వ. అప్పుడు. 451

చ. హాళహాళి సేయుచున్ జలరుహంబులు గోయుచు మీఁద వ్రేయుచున్
నిలు మని హెచ్చరించుచును నీళ్లను ముంచుచు నుత్సహించుచుం
బులుఁగులఁ దోలుచుం గలువపువ్వుల వ్రాలుచుఁ దావి గ్రోలుచున్
వెలఁదుక లొండొరుల్ గొలన వేడుకఁ గూడుక క్రీడ సేయఁగన్. 452

శా. తత్కాంతాకుచశైలఘట్టనసముద్యత్తుంగభంగైకరం
గత్కంజాతసమంజసభ్రమరఝంకారానుకారిస్ఫుర

ఫూత్కారాన్వితవారివారణకరా÷ఘాతారికోయష్టికా
ద్యూత్కంఠార్భటి వీనులం బడిన నెం÷తో సౌమ్యుఁ డుద్భ్రాంతుఁడై. 453

తే. తపము సాలించివారిలోఁ÷దళుకువాలుఁ, గన్నులనువాలుగన్నుల÷చెన్ను వెలయు
నన్నెలఁతచిన్నిప్రాయంపు÷చిన్నెలెల్లఁ, జోద్యపడ తెప్పవేయక ÷ చూచె నంత.

తే. మోదమున నైదుతూపుల÷వాదుసాహు, తమ్మిదోదుమ్మిఁ గొందిపెం÷దమ్ముగ్రమ్మి
క్రమ్ముకొని దొమ్మి సేసిన ÷ సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డిట్లను ÷ నమ్మనమున.

ఉ. ఎక్కడనుండి వచ్చె నొకో ÷ యిచ్చెలి యెవ్వనిముద్దుగుమ్మయో
యెక్కడిసోయగం బిది సు÷రేంద్రునికొల్వు మెఱుంగుఁబోండ్ల కీ
చక్కఁదనంబు లున్నవె బి÷సప్రసవప్రభవుండు వింతగా
నిక్కలకంఠకంఠి సృజి÷యింపఁగ నెట్టితపం బొనర్చెనో. 456

మ. చిగురాకుంజిగి నేలుఁ గేలుకవడాల్ ÷ చెందమ్మిచందంబునన్
సొగసొందున్ మొగ మిందుకాంత్రరుచి మిం÷చున్ మించుచెక్కుల్ జగా
పగడంబుం బగడంబుగన్ బెదవి మేల్ ÷ పాలిండ్లు హొన్నాగిం డ్లసుం
దగురా యీమృగరాజమధ్యసరిచా÷నం గాన నే నెక్కడన్. 457

చ. పలుమఱుఁ గప్పువెన్నెలలు ÷ బారలఁ గొల్వఁగ నచ్చు నచ్చపుం
దెలిజిగిచెక్కుటద్దముల ÷ నీడలు సూపఁగ వచ్చుఁ గాంచనా
చలయుగి గల్గినం గలికి÷చన్గవతో సరితూఁగవచ్చు ని
చ్చెలినడుమే యలంతి యని ÷ సింగము గెల్వఁగ వచ్చు భావుగ.

ఉ. కొంకక గుబ్బచన్నులను ÷ గుంకుమపంక మలంది చెక్కులన్
సంకుమదంబుఁ బూసి నెఱి÷జాణతనంబున జాతికస్తురిం
బొంకము మీఱఁగా నుదుట ÷ బొట్టిడి పువ్వులచెయ్యఁ జేర్చి మీ
నాంకునికేళి నేలి జవ÷రాలికి బాళి ఘటింతు నెన్నఁడో. 459

ఉ. ఏల తపంబులున్ వ్రతము ÷ లీలలితాంగిని గూడి యుండినం
జాలదె యంచు నక్కలఁకుఁ ÷ జయ్యన వెల్వడి పర్ణశాలకున్
బాళి దలిర్ప నేఁగి ముని÷బాలురచే బుధుఁ డయ్యిలాఖ్యనీ
లాలకయాళులన్ నలుగు ÷ రైదుగురిం బిలిపించి యిట్లనున్. 460

చ. అలికులవేణులార యిపు ÷ డబ్జవనంబునఁ దమ్మితూపులన్
వెలఁదిని వ్రేయుచున్ వలచే÷విన్ ధరియించిన నల్లగల్వపై
నొలసిన తేఁటిఝుంకృతుల ÷ కుల్కుచుఁ గల్కుచుఁ గేళి సల్పునా
నలినదళాక్షి కెవ్వఁ డధి÷నాథుఁ డ దెవ్వతె దెల్పగే యనన్. 461

క. నెలతనయునిపదముల క,న్నెలఁతలు నతు లాచరించి ÷ నిలిచి యనఘ యా
చ్చెలి మాకెల్ల నధీశ్వరి, యళి చేరని పువ్వువంటి÷దని తెల్పుటయున్. 462

క. తనయోగదృష్టిఁ గర్దమ, తనయోదంతంబు తుద మొ÷దలు నేర్పడఁ గ

గ్గొని నేర్పడరం బుధుఁడ,వ్వనితల నీక్షించి పలికె వారనికరుణన్. 463
చ. సరసిజనేత్రలార శివకేశ ప్తవనంబున మీరు స్త్రీత్వముం
బొరసితి రింక మీజననకముల్ ఫలియింపఁగ నాయనుజ్ఞఁ గిం
పురుషులభార్యలై సుఖముఁ బొందుఁడు వారల నే సృజించి యు
ద్ధర మును నిల్పినాఁడ నని తత్క్షణ మందఱ వీడుకొల్పినన్. 464
క. ఇల యొక్కతె దక్కఁగ నిల,చెలు లందఱు నతనియాజ్ఞచేఁ గింపురుషా
వలిఁ గలసి వెలసి రొంటిగ, నిలిచినయిలఁ జేరి బుధుఁ డనియె ననురక్తిన్. 466
చ. సరసమరాళసంగతిఁ బొసంగనిపద్మినిఁ బోలి కోకిల
స్ఫురణము లేనిమామిడిని బోలి మదభ్రమరాభియోగముం
బొరయనిపుష్పమంజరినిబోలి వృథా వసియింప నేల నన్
వరునిఁగ నింకఁ జేకొని భవంబు ఫలింప సుఖింపవే చెలీ. 466
ఉ. ఎవ్వఁడొ పేఁ డటంచు నను నిచ్చఁ దలంపకు మిందుపుత్త్రుఁడన్
జవ్వని నే బుధుండ నినుఁ జక్కఁ గనుంగొని నంతనుండియుం
బువ్విలుకాఁడు నాహృదయమున్ నొగిలింపుచు నున్నవాఁడు నీ
నవ్వుమొగంబు నామొగమునం గదియింపవె యాదరింపవే. 467
చ. ఇగురులవంటినీయడుగు లిక్కడికర్కశభూమి సోఁకినన్
నొగిలెనొ యంచు నామనసు నొప్పి వహించిన దింతమక్కువం
దగిలిన నన్నుఁ బాసి చన ధర్మవు గా దిఁక లెస్స చూడవే
మగువ యటంచు నాతఁ డనుమాటకు మోమ మర వంచి సిగ్గునన్. 468
చ. ఎలనగ వంకురింప నలయిందునిభానన పల్కె స్వామి నీ
పలు కొనరించు టెంతయును భాగ్యము గాదె సుఖింపుఁ డిచ్చకు
న్వలసినయట్టు లేమిటికి న న్నడుగం బతి వీవు భార్య నే
నెలమి నొనర్చె మన్మథుఁడె యిద్దఱకుం దగులాట మియ్యెడన్. 469
క. అనుమాటలు చెవి నాటిన, ననుమానము మాని సౌమ్యుఁ డలరుచు నవుడ
య్యనుమానమధ్యఁ జేకొని,యెను మానసభవునిపంత మీడేరంగన్. 470
వ. ఈవిధంబున నలభావజునిభావ భావంబు లలర నయ్యలరుఁబోఁడిం బరిగ్రహించి
మించుపూవుతావుల గుబాళించుతనపర్ణశాల ప్రవేశించె నప్పుడు. 471
తే. అయ్యలరుఁబోఁడి సిగ్గరి యయ్యు నిచ్చఁ, బచ్చవింటిదునేదారి హెచ్చరింప
బతికివిడెమిచ్చియడుగులు బత్తినొత్త,బాళిగనుపించఁదమి హెచ్చి పలికెబుధుఁడు.
సీ. కలికి కప్పురపుబాగా లొసంగినయట్ల, వేడుకతో ముచ్చటాడితేని
మగువ యీ తెలియాకుమడుపు లిచ్చినయట్ల, యెలమిఁ జెక్కిలిగీఱనిచ్చితేని
చెలి పాదములఁ గేలుఁ జిగురు లుంచినయట్ల, చిగురువాతెఱ దయసేసితేని
కొమ్మ వీజనము చేకొనివిసరిన యట్ల,కమ్మయూర్పులయుఁ బైఁ గ్రమ్మితేని

తే. వెలఁది తగుసేవ నీవు గావించినటులఁ, గోర్కి మీఱంగ నన్నేలుకొంటివేని
నేల యాలస్య మీవేళఁ దాళనీఁడు, విరులవిల్కాఁడు కాఁగి లీవె లతాంగి. 473
చ. అని మృదులోక్తులం దిడి నిజాంఘ్రిసరోజము లొత్తుచున్న చ
క్కని చెలి మీఁదికిం దిగిచి గ్రక్కున నక్కున నుంచినంతఁ బ్రి
క్కనఁ దనయంత వీడె సతికంచుక మిద్ధరగాత్రసీమలన్
మునుకొని యెన్ మరుం డిడినముల్కులొ నాఁ బులకాంకురావళుల్. 574
చ. చనుఁగవ పేరిహేమకలశద్వయి దాఁచినచో వడంకుచున్
మినుకుఁగడాని చెక్కులను మీటఁగఁ బూనెదుచోఁ జెమర్చుచున్
మొనసికటీసువర్ణధర ముట్టినచోఁ బులకల్ వహించుచున్
వనజదళాక్షిఁ గూడునెడ వల్లభు కేల్ నగెఁ దస్కరాకృతిన్. 475
ఉ. అంటినఁ గందునో యనక యంగము నిర్దయవృత్తి మీఱఁ గాఁ
గింటికిఁ దార్చి నుజ్జగునొ కెంజిగురొత్తెది నాని మోవిఁ బ
ల్గంటు లొనర్చి చన్గవ నలంగునొ నాక నఖాళిఁ జేర్చి వా
ల్గంటి రమించె నాథుఁడు స్వకార్యపరుల్ మగవార లెంచఁగన్. 476
సీ. నునుఁజెమ్మటలఁ గరంగినయంగరాగకుం, కుమరక్తియెఱమట్టి కొమరుగాఁగ
నిర్దయాశ్లేషసన్నిహితాంగములఁ జెలం, గుట భుజాభుజిఁ బెనంగుటలుగాఁగ
నన్యోన్యదంతాచలాక్రాంతరవముఖో, ద్ధతు లొడుగఱచుచందములుగాఁగ
గల్లస్థలచపేటగాఢవక్షోఘట్ట, నాదులు ముష్టిప్రహతులు గాఁగ
తే. జంకెనలు వాడిచూపులు బింకములు గ, ళారవములు బైకొనుసంభ్రములుల్ల
సములు నగవులుఁ దెగువలు సమముగాఁగ
మల్లయుద్ధంబుఁ బోలె దంపతులరతము.
చ. ఇటువలె నయ్యిలం గలసి యిందుకుమారుఁడు చంద్రకాంతసం
ఘటితలసద్వితర్దికల గ్రావగుహాకుహరంబులన్ నగ
స్తటములఁ జల్వచప్పరపుఁజాయల మవ్వపుఁబువ్వుఁదోఁటలం
బటుతరమంజుకుంజగృహభాగములన్ విహరించుచున్నెడన్. 478
క. కళలు గలవానికొడుకుం, గలసినయయ్యిలకు నొక్కకళ నైన చనన్
న్నెల యతఁడు గళవళింపఁగఁ, బొలఁతితనముమాని యంతఁ బురుషుం డయ్యెన్.

ఇల బుధునివలనఁ బురూరవసుం డనుకుమారుం గనుట.

చ. ఇలుఁ డిటులన్ నిజాకృతి వహించి మహేశ్వరునాజ్ఞ బోటి నై
మెలఁగుట లచ్చటన్ బుధురమించుట మాస మతిక్రమించుటల్
దెలియక మున్ను వేఁట చనుదెంచుట లెంచుచు సేన నవ్వన
స్థలి వెదకం దొడంగె గిరిజాసతిమాటకుఁ దప్పు గల్గునే. 480
క. వన మెల్ల వెదకి యచ్చటఁ, దనసేనం గాన కతఁడు తమహతహతోడం

జనువెంచి సరసిమధ్యంబున నుగ్రతపం బొనర్చె బుధుం బొడఁగాంచెన్. 481
చ. పొడగని యమ్మహామహునిపొంతకుఁ బోయి నమస్కరించి యో
యుడుపతిపుత్త్ర బాహ్లి యను నొప్పెడు ప్రోలికి నేను రాజ ని
య్యడవికి వేఁటవచ్చితి భటాదులఁ గూడుక వార లెల్ల నె
క్కడఁ జనిరో నను విడిచి కాన నన బుధుఁ డిట్లనుం గృపన్. 482
మ. వసుధాధీశ్వర నీభటుల్ పటుశిలావర్షంబుచేఁ గొందఱు
గ్రసమీరోద్ధతిఁ గొందఱుం జెడసి రింకన్ వారికై కుంది పా
లసునిం బోలకు కందమూలఫలముల్ భక్షించి యీయాశ్రమం
బు సమస్తార్తిహరంబు నిల్వు మిచటన్ మోదంబుతో నావుడున్. 483
శా. ఆబాహ్లీకుఁడు సమ్మతించి యను నయ్యా మంత్రిసామంతనా
నాబంధుప్రకరంబు లెల్ల వనిలో నం ద్రెళ్ల నేకాకినై
నేఁ బో నొల్ల పురంబుఁ జేర నిచటన్ నీపాదముల్ గొల్చుచున్
మీబోధల్ వినుచుం గ్రమింతు దినముల్ మీ రిప్పు డన్నట్టులన్. 484
క. విశదయశోమృతనిధికిన్, శశిబిందువుగాఁగఁ జెలఁగు సత్పుత్రుఁ డిపు డా
శశిబిందుఁడు భూభర మన,దృశగతి భరియించుఁ గాక యిఁక నని పలికెన్.
క. అలరాజతనయుఁ డలరుచు, నిలరాజ యటైన మంచి దేడ దిచటన్
నిలువుము నీకు శుభంబులు, గలిగెడి నని తెలుప నతఁడు కైకొని నిలిచెన్.
క. అన్నెల గడచినఁ గ్రమ్మఱఁ, గ్రొన్నెల నగునుదురు గలుగుకోమలి యయ్యెన్
వెన్నెలగీముకుమారుఁడు, గన్నులలరఁ జూచి దానిఁ గలసి సుఖించెన్. 487
క. మగువ యయి వలఁచి యుండున్, మగవాఁడై కొలిచియుండు మదనుని బావన్
మగతనము మగువతనమును, జగతీనాయకుఁడు దనకు సఫలతఁ జెందన్.
తే. మగువ యై యున్న నెలయెల్ల మమతఁ జూచి
చాల ననురక్తుఁ డై యుండుఁ జంద్రజుండు
మగతనముగన్న నెలయెల్ల మాన మూని
తా నతివిరక్తుఁ డై ఘోరతపము సేయు. 489
క. విరహాగ్ని మాన్చుకొనఁ జను,నరణిఁ దరుణిఁ బాసినపుడు కాసారజలాం
తరమగ్నుం డగునానం,దరసాంబుధి మగ్నుఁ డగునతఁడు చెలిఁ గన్నన్. 490
క. నెలపట్టి యిటుల నలరఁగ, నిల యై యొక నెలయు మరలఁ నిలుఁడై నెలయున్
మెలఁగుచుఁ గ్రమమునఁ దొమ్మిది,నెలలునసఁ బురూరవుం గనియె నది యంతన్.
తే. ఆపురూరవుఁ బోషింపుఁ డనుచు నాత్మ,గురున కొప్పించె బుధుఁ డాతఁడు గురుసుధార
సంబు ద్రావించి పెంచె వాత్సల్యముంచి, యంచితకళాప్రపంచజ్ఞుఁ డయ్యె శిశువు.
ఉ. అంతట నింతియా టుడిగి యయ్యిలుఁ డెప్పటిలీలఁ గొల్వఁగా
నెంతయుఁ గూర్మిపుట్టి బుధుఁ డీతనిదుర్దశ మాను నిప్పు డం

చాంతరవై రిహాంత లగుకన త్రిభృగుచ్యవనాదిమానులన్
శాంతులఁ బిల్వఁగాఁ జనిచి చారుసపర్య లొనర్చి యిట్లనున్. 493

ఇలుఁ డశ్వమేధము చేసి శివునియనుగ్రహమునఁ దన స్త్రీత్వంబు తొలఁగించుకొనుట.

క. ఈయిలునియంగనాత్వముఁ, బాయంగాఁ జేయుటకు నుపాయం బేమో
మీయందఱు నాలోచన, సేయం దగు ననిన వారు చింతించునెడన్. 494

చ. క్రతుపులహాదియుక్తుఁ డయి కర్దము డచ్చటి కేఁగుదెంచి య
య్యతులును సౌమ్యుఁడుం జలుపుసర్చనలన్ ముదమంది పుత్త్రి నా
నతుఁ గని యాదరించి కరుణానిధి యాశివుఁగూర్చి విశ్వవ
ర్ణిత మగునశ్వమేధ మొనరింపక యిద్దురవస్థ దీఱునే. 495

క. మఱుమాయ యొఁడుతన మొక్కటియు నడఁచుపని యదెంతగల దతనికతం
డెఱువలె వలసిన నటువలె, ఘటియింపం గలఁ డటంచుఁ గర్దముఁడనినన్. 496

తే. అందఱును సమ్మతించి శివార్పణముగ, నశ్వమేధంబు సేయించి రతనిచేత
యాగపరిపూర్ణకాలంబునందు మునుల,కిందుధరుఁడు ప్రసన్నుఁడై యిట్టు [లనియె.

ఉ. మీ రొనరించినట్టిహయమేధము మెచ్చితి మానులార మీ
కోరినయట్ల యయ్యిలునకుం బురుషత్వము శాశ్వతంబుగాఁ
గూరిమి నిచ్చితిన్ మఱియుఁ గోరిక లున్న వె తెల్పుఁ డన్న న
క్కాకుణికాగ్రగణ్యునకుఁ గర్దమముఖ్యులు మ్రొక్కి వేడుకన్. 498

క. వేదాంతములకుఁ దోఁపని, నీదివ్యపదాంబుజములు నే మిప్పుడు స్వా
మీ దర్శించితి మింతియ, కాదే మామనసులందుఁ గలకోరికయున్. 499

క. నారీత్వము లే కెప్పటి,పౌరుషమున బ్రతుకు మనుచుఁ బలికితిరి గదా
యీరాజు నదియె యంచలు, కోరిక యనిసొగడ శివుఁ డగోచరుఁ డయ్యెన్.

క. ముని లరిగి రంత నిలుఁడు బు,ధునివీడ్కొని యతనిపుత్త్రిఁ దోడ్కొనిజనకుం
డనుమతి సేయఁ బ్రతిష్ఠా, నగరమ్మున నిలిచి భూజనంబులఁ బ్రోచెన్. 501

తే. అతనివెనుకఁ బురూరవుం డప్పురమున
నధివిభుం డయ్యె నటుగాన నశ్వమేధ
యాగ మఖిలార్థసాధకం బనుజులార
యని రఘుస్వామి మఱియు ని ట్లనుచుఁ బలికె. 502

క. భూనుత మైనయిలోపా, ఖ్యానం బిది వినిన జనుల కఘనాశన మహా
నానార్థంబులుఁ జేకుఱు, మానితముగ నశ్వమేధమఖఫల మొదవున్. 503

ఉ. సారసగేహినీసుదృఢసారసనప్రవిమోక్షణక్రియా
సార సముజ్జ్వలస్మితరసా రసవన్మధురాధరామృతా
సార సదానురాగ ఘనసారసదాశివహారసారకా
సారసఖద్వ్యశోప్రజవిసారసదృఙ్ఞయనామనోహరా. 504

క. అబ్జారిబంధునయన జ,యాబ్జారిగదాసి ధనురుఽదగ్రశయాబ్జా
కుబ్జాతరుణీరమణ క,కుబ్జాతగజోపమారిఽకుంభీంద్రహరీ. 505

కవిరాజవిరాజితము. ఘనతరకారణ ఽ కల్మషకారణ ఽ కాయనికారణ ఽ కర్మపరా
సనకసనందన ఽ శక్తిజనందన ఽ సాధ్వభినందన ఽ సక్తమనా
జనిపవినోదన ఽ శక్త్యపనోదన ఽ చారువినోదన ఽ సర్వహరా
వినతసుదర్శన ఽ విస్మృతదర్శన ఽ విస్ఫుటదర్శన ఽ వేద్యపదా. 506

గద్యము. ఇది శ్రీమదనగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధానవద్య కవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణవితీర్ణివైభవాధఃకృతరాజరాజరాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధరధరాధిపసభాంతరస్తవనీయనయకళాయుగంధర బంధుర మనీషావిశేషమంథానవసుంధరాధర శోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటి వంశపయఃపారావారపరిపూర్ణరాకాసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞానవిభవవిజితసనందన విష్ణుమాయావిలాసాభిధానయక్షగాననిర్మాణప్రవీణతానిధానపాపరాజప్రధానప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబునందు సప్తమాశ్వాసము.





శ్రీ

రామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదుత్తరరామాయణము.

## అష్టమాశ్వాసము.

---



కాంతాధామ సుధాం

తాకాంతాప్రేమ రవిసుతాద్యృక్షప్లవల

వ్యాకీర్ణాతిశ్యామల

తాకలితసుధామ లక్షణాద్యభిరామా. 1

తే. అవధరింపుము రామచంద్రావనీంద్ర
చంద్రుఁ డీరీతిఁ దెల్పిన సత్కథ విని
యనుజమణు లిర్వు రద్భుతాయత్తచిత్తు
లగుచు నానంద మొంది రయ్యవసరమున. 2

రాముఁ డశ్వమేధయాగము సేయుట.

చ. మనుకులరాజశేఖరుఁ డమందగుణాంబుధి రాముఁ డంతయుం
ఘనహయమేధయాగకుతుకంబు మనంబున మించ లక్ష్మణుం
గనుగొని వత్స నీవు చని కశ్యపకుత్సవసిష్ఠకణ్వము
ఖ్యనిఖిలసంయమీశ్వరుల గ్రక్కునఁ దోడ్కొని రమ్ము నావుడున్. 3

ఉ. ఆలవణారియన్న పతియానతి యాదలఁ దాల్చి చెచ్చెరం
గాలవకౌశికాత్రిభృగుకణ్వపరాశరవామదేవజా
బాలివసిష్ఠకశ్యపవిభాండకముఖ్యుల వేదశాస్త్రముల్
చాల నెఱుంగు బ్రహ్మమునులం దోడి తెచ్చె వినీతి పెంపుగన్. 4

ఉ. అంతకు మున్నె నిండుకొలువై భరతాదులు గొల్వ నున్నభూ
కాంతుఁడు వారిరాక విని కాంచనపీఠిక డిగ్గి నిర్మల
స్వాంతముతో నెదుర్కొని సువర్ణకిరీటరుచుల్ దదీయపా
దాంతికభూమి ముంచుకొన నందఱకుం బ్రణమిల్లి వేడుకన్. 5

తే. వినయమునఁ దోడి తెచ్చి వేర్వేఱ సముచి, తాసనంబుల నునిచి హస్తాంబుజములు

మొగిచి తనచూపుఁ దేఁటు లక్ష్మనులవదన
పద్మములయందు నిగిడించి పలికె విభుఁడు. 6

చ. అనితరపుణ్యులార భువనాంచిత మాహయమేధ మేను మీ
యనుమతిఁ జేయువాఁడ నని యాత్మఁ దలంచితి మీర లమ్మఖం
బునకు ననుజ్ఞ యిం డనిన బోరన నమ్మును లెల్లఁ బల్కి రో
జనవర యజ్ఞగంబులకు సమ్మత మాక్రతు వాచరింపవే. [జెంది

తే. అన్యథాభావ మొందునే యధిప నీయ, మోఘసంకల్పమున కన్న ముదముఁ
మ్రోల నిలుచున్న లక్ష్మణు మోముఁ జూచి, పలికె నమ్మేటి గంభీర భాషణముల.

చ. హవనముఁ జూడఁగా రవిసుతాంగదవాయుజనీలజాంబవ
ద్గవయగవాక్షధూమ్రనలతారసుషేణసువేగవేగద
ర్శివినతగంధమాదనదరీముఖమైందసుబాహుకేసరి
ద్వివిదగజప్రజంఘముఖవీరకపీంద్రులఁ బిల్వ సంపుమా. 9

మ. అనలాద్యన్వితు సద్విభీషణుని లంకాధ్యక్షుఁ దెప్పింపు చ
య్యనఁ బిల్పింపుము కేకయాధిప విదేహక్ష్మాధినాథ ప్రవ
ర్ధనముఖ్యప్రియబాంధులన్ హితసుహృత్సందోహముం గూడి ర
మ్మనుచున్ లేఖలు పంపుమీ యఖిలదేశాధీశరింఛోళికిన్. 10

శా. నానాదేశనివాసులైన ద్విజులన్ నానానదీతీరవ
న్యానిత్యాశ్రయు లౌ మహర్షులను మింటన్ మించు సప్తర్షులన్
నానాదేవధరస్థలాంతరములన్ నల్లొందు దేవర్షులన్
నానాదిక్కుల నున్న బ్రహ్మఋషుల న్రప్పింపుమా గ్రక్కునన్. 11

తే. బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మఁ బోలు, బ్రహ్మవర్చస మింపొందఁ బ్రహ్మపరత
బ్రహ్మలోకంబున వసించు బ్రహ్మమునుల, ననఘ ప్రార్థించి పిలిపింపు యాగమునకు.

క. కవిగాయక పరిహాసక, వివిధస్తుతిపాఠకులను వీణావాద్య
ప్రవణుల నర్తకవాంశిక, నివహము రప్పింపు యజ్ఞనిలయంబునకున్. 13

సీ. నైమిశారణ్యపుణ్యక్షేత్రమున మించు, గోమతీనదీతీరభూమియందుఁ
జాల్పు వెలుపును శాస్త్రరీతి నెఱుంగు, చతురశిల్పాచార్యజనులచేత
మఖమండపంబు నిర్మాణంబు సేయింపు, మమ్మఖశాలకు నన్నియెడల
బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రప్రముఖులు నిల్వఁ దగురచ్చకొట్టములను

తే. బొక్కసపుటిండ్లు సుగ్రాసముల నెలవులుఁ, బాకశాలలు మఠము లనేకభోజ
నార్హశాలలు పటకుటీరాపణములు, గరిరథతురంగశాలలు గట్టఁ బనుపు. 14

ఆ. చలువచప్పరములుఁ జలివిందరులు నెడ, నెడలఁ గలుగఁ జేయు మెప్పటికిని
విపణివీథులందు వివిధవస్తువు లమ్మ, కొనుఁ దటంచు వైశ్యజనుల కనుము.

సీ. సనగలు గోదుమల్ మినుములు దిలలు ముద్గములు మున్నగు గలాయధాన్య

ప్రాంతముఁ జేరి యందు భగవత్తాపసుల నధ్వరసాధన క్రియా
వంతులఁ గూర్మిఁ జూచి తగవచ్చె ఖరి నంపఁ నాదరింపుచున్. 25

శా. నానాభూములనుండి వచ్చిన నరేంద్రశ్రేణులన్ బంధులన్
భానుప్రోద్భవునిన్ విభీషణుని దత్త్వార్హవస్తులం బ్రాంచిత
స్థానాభ్యంతరసీములందు విడియింపం బంచె శత్రుఘ్నునిన్
శ్రీ నిండార నృపాలుఁ డట్లు విడియించెన్ వారి నమ్మేటియున్. 26

వ. మఱియును. 27

సీ. బ్రాహ్మణక్షత్రియప్రముఖులఁ బూజించు, పట్ల నేమఱకుండుమీ భరత యనుచుఁ
గెలఁకులనుండి రాఁబలయు యాగార్హవస్తువు లంది యిమ్ము శత్రుఘ్న యనుచు
నడుగువారలకు లేదనక యిష్టపదార్థ, రాసు లిమ్మా కపిరాజ యనుచుఁ
గ్రతువిఘ్నకరులకుఁ జొరఁ జిక్క కుండు, తఱ మొనర్పుము విభీషణ యటంచుఁ
తే. గొదవ పడినవి వేవేగఁ గొంచువచ్చి, నియతి నెఱవేర్చు భారంబు సేసినను మ్మ
నాయు నందనయనుచు భూపరుఁడు వారి, వారి నియమించె నుచితసంప్రవర్తనముల.

ఉ. మించినవేడ్క నట్లు నియమించి నృపాలుఁడు కాంచనేష్టకో
దంచితభూస్థలంబు ఖదిరాదికయూపయుతంబు రుక్మప
త్రాంచలపక్షిరాజచయనాఢ్యము సోమఖవాటముం బ్రవే
శించెఁ బులస్త్యకశ్యపవసిష్ఠభృగుప్రముఖార్యసమ్మతిన్. 29

తే. ఇవ్విధమునఁ బ్రవేశించి యెల్లజగము, లెల్ల రక్షింప దీక్షవహించినట్టి
యాసదీక్షావిచక్షణుఁ డపుడు యజ్ఞ, దీక్షవహియించె సకలదిదృక్షులలర. 30

సీ. స్థండిలస్థితయూపసమ్యక్పశుప్రోక్ష, ణాక్షీణతంత్రయుగ్యాజకంబు
హోతృహస్తధవిత్రజాతవాతప్రజ్వ, లితకీలికీలికావృతసభంబు
పరమాన్నపృషదాజ్యచరువపామిక్షాది, హోమజస్వాహారవోల్లసితముఁ
దత్తత్క్రియాహృష్టతరసభాస్తారకో, క్తముహుర్ముహుశ్శిరఃకంపనంబుఁ
తే. జంచదుద్గాతృసామగానాంచితంబు, విశ్రుతాధ్వర్యుఋగ్యజుర్వేదమంత్ర
నికర మకలుషమహావిదగ్ధనిర్జరప్ర, సారితిక రాజ్జ మగుచు నాజన్న మమరె. 31

చ. భరతునిచే ధరామరులుఁ బార్థివముఖ్యులు నన్నపానవి
స్ఫురణలఁ దృప్తులై ముదముఁ బొందిరి బ్రహ్మబుభుక్షుల్ విభీషణా
చరితసపర్యలం గడుఁ బ్రసన్నతఁ జెందిరి యాచకుల్ విభా
కరసుతుఁ డిచ్చునర్థములఁ గాంక్షలు దీరి సుఖించి రయ్యెడన్. 32

చ. ఎడపక యేఁడుగాల మిటు లేఁగఁగ లక్ష్మణుఁ డంతలోన నా
త్తడిఁ గొని తెచ్చినన్ నృపతి తద్దయు వేడుక యాగకృత్యముల్
నడపుచునుండె విప్రులు దినంబును భోజనదక్షిణాదులం
గడుముదమంది రందఱును గాంక్షితముల్ గని తన్మఖంబునన్. 33

చ. వలసినవారికిన్ వలయువస్తువు లన్నియు నిత్తురే కదా
నలినహితాత్మజాదికపినాయకు లొల్లక యున్నవారికిన్
బలిమిని బిల్చి భోజ్యములు భక్ష్యములున్ ఘనరత్నభూషణా
వళులును గంధమాల్యములు వారిక నిత్తురు సర్వకాలమున్. 34

చ. వలసినభోజనాభరణవస్త్రధనాదులఁ జెంది తృప్తులై
పలుమఱుఁ జాలుఁ జాలు నని పల్కెడువారలె కాని మాకుఁ గా
వలయు నొసంగు మం చనెడువారల మందునకైన గాన మా
స్థలమున జానకీవిభునిజన్మము వైభవ మెంచ శక్యమే. 35

తే. అర్థులెల్లఁ గృతార్థులై రందువలన, వ్యర్థులైరన్న చాతలు వసుధలోన
లేమి కెచ్చోట వసియింపఁగ మిలేక, తజ్జనులనామములయం దొకతావుఁ గొనియె.

చ. మలినులు లేరు లేరు కృశమానశరీరులు లేరు పేద ల
న్నలవున నున్నయంతటను మణిమయభూషణభూషితుల్ సము
జ్జ్వలకనకాంబరుల్ మలయజస్రగవారితగంధగంధిలా
ఖిలదిశు లంచితార్థజితకిన్నరనాయకు లెంచి చూడఁగన్. 37

ఉ. ఆమఖవైభవంబునకు నద్భుత మంది మహాత్ము లెంచి నా
రా మును బ్రహ్మ చేసినమహాధ్వరముల్ మఘవంతుయజ్ఞముల్
సోమునియాగముం దపనసూనుహవం బుధధీశుహోమ మీ
రామునియశ్వమేధమఖరాజముతోఁ బ్రతిసేయ వచ్చునే. 38

సీ. ఖర్వమహాఖర్వకైలాసములు కుప్ప, వేసినచో నెంత యెత్తు యగును
శతకోటికాంచనాచలములబంగారు, గూడఁబెట్టిన నింతపైఁడి యగును
యర్బుదాయుతరోహిణాద్రిమణుల్ ప్రోగు, నర్చిన నిన్నిరత్నంబు లగును
యమితకల్పమహీరుహము లొక్కెడిక్కున, నిలిచి యిచ్చిననిన్ని వలువ లగునె

తే. నూఱులక్షలుకామధేనువులుగూడి, యన్నియును బెట్టికొసఁగిననిన్నిసముచి
తాంచితపదార్థనిచయంబు లవునె సవన, మిట్టు లొనరించి గొల్లెమెవ్వరైన.

తే. అవనిజామాతృతాప్రేమసర్కరకులుని, కాత్మగతిబీజనిచయంబులన్ని యనుమ
ఖార్థమర్పింపఁదొడఁగెనోయనఁగ నక్షయంబులైనవి వివిధధాన్యంబు లిచట.

క. ధనసామగ్రియు నానా, జనసామగ్రియును రామజనవిభునకుఁ గ
ల్గినకతన నీమహోత్సవ, మొనరించెం గాక లేక యొరులకు వశమే 41

మ. అని సభ్యుల్ గొనియాడఁగా రఘుకులాధ్యక్షుండు సంవత్సరం
బును బూర్ణంబుగ సాంగదక్షిణలచేఁ బొల్పొంద యాగంబు సే
యునెడం దన్మఖవైభవంబు గనఁగా నూహించి వాల్మీకి శి
ష్యనికాయంబుఁ బ్రశిష్యసంఘము భజింపన్ వచ్చె నచ్చోటికిన్. 42

క. వచ్చిన యమ్మునిచంద్రుని, హెచ్చినరహి నెదురుకొని నరేశ్వరుఁ డర్ఘ్యం

బిచ్చి సపర్యల నాతని, యిచ్చ యలరఁ గుశల మడిగి యి ట్లని పలి
చ. వరమునిచంద్ర మీ రిటకు వచ్చుట నామఖముల్ ఫలించె మీ
చరణయుగంబు సోఁకి క్రతుశాల పవిత్రతఁ జెందె మామకా
ధ్వరవిధిపూర్ణ మాదనుక వచ్చినయమ్మునులట్ల మీరు నిం
దిరవుగ నిల్వుఁ డంచు విడియించెఁ దదర్హగృహాంతరంబునన్. 44

కుశలవులు వాల్మీకియాజ్ఞచే రామునికడ కేతెంచి రామాయణము గానము సేయుట.

చ. ప్రశమనశీలుఁ డమ్మునియు భక్తిమెయిం దను వేఁడుకొన్నయ
ద్దశరథరాముమాట జవదాఁటక తత్క్రతుదర్శనక్రియా
వశుఁడయి యందు నిల్చి పటువైణికతాఢ్యుల నాత్మశిష్యులం
గుశలవులన్ మనోజనలకూబరతుల్యులఁ జూచి యి ట్లనున్. 45
చ. ప్రవణత మీఱ మీరు కవ పాయక రామకథాప్రపంచ మీ
యవనిపుకొల్వుకూటమున నధ్వరశాలల మాను లున్నచో
ట్ల విపణివీథులన్ వనములన్ బహురాజసభాంతరంబులం
గవిజనసన్నిధిం జదువఁగా వలయున్ జను లందఱున్ వినన్. 46
చ. స్వరములుఁ దాళముల్ లయలు సారపుమీటుకోలంబు లేర్పడం
జిరముగ మీకు నారదుఁడు సేసినశిక్ష ఫలింప నింక మీ
రిరువురు వీణె లూని దిన మిర్వదిసర్గలలెక్క రాఘవే
శ్వరుసభఁ బాడుఁ డవ్విభునిచారుచరిత్రము సభ్యు లౌ ననన్. 47
మ. ఫలమూలాశనులై ధనేచ్ఛ వహియింపం బోక రామాయణం
బెలమిన్ రేపటినుండియున్ దొరఁకొనుం డెవ్వారు మీ రంచుఁ గే
వలమైత్రిన్ రఘుభర్త మి మ్మడిగినన్ వాల్మీకిమౌనీంద్రుశి
ష్యుల మంచున్ వచియింపుఁ డవ్విభుఁ దలంపుం డాత్మలోఁ దండ్రిగన్. 48
ఆ. ఏల యంటిరేని నిలఁజేనిఁ బ్రజ కెల్లఁ, దండ్రిగాఁ దలంపఁ దగవు గానఁ
దెలిపినాఁడ నటులఁ దలఁపు డవ్విభు నంచు, నానతిచ్చె నమ్మహర్షివిభుఁడు.
ఉ. ఆయతి యానతిచ్చినక్రియన్ జగతీసతిముద్దుమన్మలా
రేయిఁ గ్రమించి వేగుటయు రేపటికృత్యము లెల్లఁ దీర్చి వీ
ణాయుతపాణులై మునిగణంబులసన్నిధి రాజులొద్ద దే
వాయతనంబులన్ విపణులందును గావ్యము పాడుచున్ రహిన్. 50
చ. సమయముఁ జూచి యొక్కదివసంబున రామునియజ్ఞశాల క
క్కొమరులు పోయి యందుఁ గవఁ గూడి విపంచిక లూని తాన మా
నములును రాగముల్ వినవినం జెలువై చెవు లాన నందఱుం
బ్రమదపయోధిలో మునుఁగఁ బాడిరి రామచరిత్ర మింపుగన్. [బాసి
సీ. శ్రుతులు బెరయుట స్వరములచొప్పు విడక, చాలశుద్ధతఁ గనుట దోషములఁ

ఘనవిధముగా నషట్కంబుఁ గలసి మెలసి, యక్కవలవారిగానంబు సొక్కె సర్వ్య.

చ. మదిఁ గన వారిగానమహిమం బది యెట్టిదొ వార్థు లెల్ల నొ
క్కెడ వెసనె నిల్చినట్టు లివుఁ గాంచినయట్టిసభాస్థలంబునం
బెదవిఁ గదల్చి పల్కఁ డొకఁ డెద్దయుఁ బెద్దయు సద్దుమాన్చుచుం
గదలక చిత్రరూపములకైవడి నుండిరి పాటచొక్కునన్. 53

చ. కొలువున నున్న రాజవరకోటులదివ్యమణీవిభూషణా
వళులుఁ గరంగి నీరయి ప్రవాహగతిం బ్రవహించె నన్నచో
నలలితజానకీతనయసారసుధారసచారుగానభం
గులకుఁ గరంగు టెంత యతికోమలసభ్యజనాంతరంగముల్. 54

మ. పదసందర్భము లర్థకల్పనలు శబ్దస్ఫూర్తు లుత్ప్రేక్షసం
పు దలిర్పన్ ముని యాచరించిన జగత్పూజ్యాదికావ్యంబులో
మొదటం జెప్పిన కొన్నిశ్లోకములు సమ్మోదంబుతో నాలకిం
చి నరేంద్రాన్వయభర్త యక్కొమరులం జేసన్న వారింపుచున్. 55

మ. సమయార్హంబగు హోమకృత్యములు నిష్ఠం దీర్చి రమ్యప్రదే
శమునం గొల్వయి కూరుచుండె మును లాచార్యుల్ మహాశ్రోత్రి లా
గమతంత్రజ్ఞులు శాస్త్రవేత్తలు కవుల్ గాణల్ పురాణజ్ఞు లా
ప్తమణుల్ మంత్రులుఁ దమ్ము లాశ్రితులు భూపాలు ర్హితుల్ గొల్వఁగన్. 56

క. కొలువుండి యక్కుమారులఁ, బిలిపించి సమీపభూమిఁ బ్రీతి వసింపన్
సెలవిచ్చినఁ బ్రతిబింబయుగళమ్ముల్ వలె నున్న వారిఁ గనుఁగొని సభ్యుల్. 57

ఉ. ఈముఖకాంతు లీనగవు లీకనుదామర లీయెలుంగు లీ
చామనచాయ లీయెగుభుజంబులపొంకము లీయురంబు లీ
కోమలమూర్తు లీవచనగుంభనలున్ గనుఁగొన్న గట్టిగా
రామునిలీల మించి రభిరామశరీరులు వీర లెవ్వరో. 58

ఉ. హారకిరీటకుండలభుజాంగదవస్త్రసుగంధమాల్యముల్
వీరు ధరింప కీజటిలవేషము లేటికిఁ దాల్చిరో శుభా
కారవిలాససంపదలఁ గంతుజయంతుల ధిక్కరించినా
రేఋషిపుత్రులో ఋషుల కెక్కడి వీమహనీయరూపముల్. 59

చ. అని తమలోనఁ దాము ప్రజ లాడెడిసుద్దులసద్దు నొక్కఁ బ
ట్ట నెగసె నంత లక్ష్మణుఁ డడంచెఁ గరాంబుజసంజ్ఞ నప్పు డా
జ్జనకకుమారికాత్మజులు సారెలు చక్కఁగఁ బెట్టి మేళవిం
చినకవవీణియల్ మొరయఁ జేయుచుఁ బాడిరి రంగురక్తులన్. 60

క. నారదనిగదితసంక్షేపారూఢప్రథమసర్గయాదిగ నాఁ డిం
పారఁగ నిరువదిసర్గలు, వారలు వినిపించి రచటివారలు మెచ్చన్. 61

చ. స్వరము లయారె మేలు శ్రుతి గ్రామగురె మూర్ఛనకంపితంబు బా
పురె బళిరయ్య డాల్ నెఱసెఁ బ్రా నెఱమీటులు కులంబులాయి య
ద్దిరస్ఫురితంబు లమ్మ యని తేనియలొల్కెడివారిసాట లా
వరణము మీఱఁగా వినికిముదం బొదవం బతి మెచ్చె నెమ్మదిన్. 62

క. ఈలీల మెచ్చి పతి పది, వేలవరా లిమ్ము భరత వీరికి మఱియుం
లోలత నడిగిన వన్నియు, వాలాయ మొసంగు మనిన వారలు నగుచున్. 63

చ. కరములు మోడ్చి యోనృపశిఖామణి కానలఁ దాపసస్థితిం
బరఁగుచుఁ గందమూలములు భక్షణసేయుచు నుండు మాకు దే
వర యిపు డొసఁగిచ్చినసువర్ణము లేమిటి కేల యస్వా
స్థ్యరతి యటన్న లేనగవుతోఁ బతి వారలఁ జూచి క్రమ్మఱన్. 64

చ. అనియె గుణాఢ్యులార నిజ మౌ నవి యీకృతి యెవ్వ రాచరిం
చినయది యేప్రమాణమునఁ జెల్వగు నెవ్వని దీచరిత్ర మిం
పుల కభిధాన మే మెలమితో నిది యెవ్వరివంక నేర్చినా
రనిన వినీతులై కుశలవాహ్వయు లిట్లని రమ్మహాత్మతోన్. 65

సీ. ఇనవంశశేఖర యీకావ్యమణి విని,ర్మించినసుకవి వాల్మీకిమౌని
రామాయణం బనునామంబు దీనికిఁ, గావించె నది భవత్కథయ సుమ్ము
విను మిరువదినాల్గువేలగ్రంథం బిది, యేనూఱుసర్గలనింపు గులుకుఁ
బట్టాభిషేచనపర్యంతికథ లాఱు, కాండంబుల రచించెఁ గడపటికథ
తే. నవల నుత్తరకాండంబునం దమర్చె, నమ్మహామౌని యతని దయానిరూఢి
నేము నేర్చితి మిది విన నిచ్చ గల్గె, నేని వినఁ దగు దినమును నిర్విధమున.

వ. అని మఱియు నిట్లనిరి. 67

క. ఇమ్మఖనిష్ఠలు దీర్చిన, పిమ్మట నొకకొంతసేపు ప్రియమున నీకా
వ్యమ్ము విన వలయు మాగీ, తమ్ములు సాఫల్య మొంద ధరణీశ యనన్. 68

ఆ. సమ్మతించి రామజనపతి బహుమతి వెలయ వారిఁ బనిచి ద్విజపురోహి
తార్యబంధుసహితుఁడై యాగమండపా, భ్యంతరమున నుండె నర్హావిధుల.

చ. దినదిన మిట్లు వచ్చి జగతీసతిమన్నలు పువ్వుఁదేనె వం
చినగతిఁ గప్రపుంబరజము చిందినకైవడి జాజిపొట్లముల్
మునుకొని విచ్చినట్టు లతిమోహనగానకళానిరూఢి స
య్యనకులు మ్రోల సచ్చరిత మింపెసఁగన్ వినిపింపుచున్నెడన్. 70

చ. జనవరుఁ డంత నొక్కదివసంబున వారితనూవిలాసముల్
గనుఁగొని జానకీరమణికై వడి నున్నవి వీరిరూపు ల
వ్వనజదళాక్షికిం మును గవల్ జనియించి రటంచు వింటి న
త్తనయులె యీశుభాకృతులు తక్కిన నీచెలువంబు లుండునే. 71

గోమతీజలంబులఁ బ్రాతఃకరణీయంబు లొనర్చి యర్చిష్మదాదిదేవతార్చనంబు
లాచరించి సముచితప్రకారంబున బహిర్మండపంబు ప్రవేశించి భరతాది
సోదరులును సుగ్రీవాదివానరులును విభీషణాదిరాక్షసులును విదేహరాజకేక
యరాజప్రముఖబాంధవులును బ్రవర్ధనాదిమిత్రులును సుమంత్రాదిమంత్రిజనం
బులును మధుమద్విజయభద్రాదినర్మసఖులును బరివేష్టించి కొలువ నిండుకొలు
వుండి పృథివీసుతాకథితావితథశపథవచోవిధాశ్రవణకుతూహలంబునం బఱతెం
చిన వసిష్ఠ వామదేవ దేవల పులహ పులస్త్య కశ్యపాగస్త్యవిశ్వామిత్ర రుచి
కాగ్నిమిత్ర మైత్రేయ భృగు చ్యవన పరాశ రాత్రేయ కాత్యాయన గౌతమ
శ్వేత శాతాతప సుతపో వరతంతు భరద్వాజ వాలఖిల్య మౌద్గల్య మాండవ్య
విభాండక మార్కండేయ కౌండిన్య కణ్వ ప్రస్కణ్వ దేవశ్రవస ఋశ్యశృంగ
మతంగ మంకణాంగిరస శతానంద సుందసాల జాబాలి గాలవ పైల పౌల
స్త్య దుర్వాసః పర్వత నారద దళాద పిప్పలాదప్రముఖమహర్షులకుఁ బ్రత్యు
త్థానాదు లొనరించి యుచితాసనంబుల నుండ నియమించి పాంచాల మాళవ
గౌళ చోళ మళయాళ మగధ మత్స్యమద్రద్రవిడ విదర్భ శక సింధు గాంధార
సౌవీర కేరళ కాశ్మీర చేదిప్రముఖనిఖిలదేశాధినాథుల సపరివారంబుగాఁ దగు
చోట్లం గూర్చుండ నియోగించి బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులుఁ దక్కినపౌర
జానపదాదిప్రకృతిజనంబులు నానాదిగంతరాగత విద్వత్కవినటగాయక
పరిహాసక ముఖ యాచకనివహంబులు నలుదిక్కులం గ్రిక్కిఱిసి నివసింప
నిలింపవిభువైభవంబునం బొంపిరిపోవుచుఁ బ్రాచేతసాగమనంబుఁ బ్రతీ
క్షింపుచున్నయెడ నక్కడ వాల్మీకిమౌనీంద్రుండు దొలినాఁడె నిజాశ్రమంబు
న నున్న జనకనందననుం దాను విడిసిన గోమతీతటాశ్రమంబునకుఁ బిలిపిం
చినవాఁడు గావున నద్దేవి నవలోకించి తల్లీ భవద్వల్లభుఁ డగు రఘువంశవల్ల
భుండు నీ యుల్లంబు తెల్లంబుగాఁ దెలిసియుఁ బ్రల్లదంబులు పలికిన క్షుల్లకజ
నంబులు విశ్వసింప విశ్వవర్ణిత బ్రహ్మర్షీశ్వరసభామధ్యంబున నీచేత శపథంబు
లాడింపఁ దలంచి నిన్ను వెంటఁబెట్టుకొని రమ్మని నన్నుం బనిచినవాఁ డతని
వచనం బలంఘనీయం బదిగాక నినువంటిపతివ్రతలకుఁ బతియనుమతిం బ్రవ
ర్తించుట స్వభావసిద్ధముగదా యని తెలిపిన నప్పల్లవపాణి ప్రాణేశ్వరసందర్శ
నంబు నేటికయిన నీనెపంబునం గలిగెఁగదా యనుమోదంబును దనపట్టంపు
దేవిపై నిట్టి పట్టిసంశయంబులుపుట్టిన నప్పట్టబద్ధుండు రచ్చంబెట్ట నెట్టు దలం
చెనోయను ఖేదంబును మనంబునం బెనంగొనఁ గనుంగొనలం బాటిల్లు కాటుక
కన్నీరు తెప్పలతుద నప్పళింపుచు నప్పరమతపస్విదిక్కు చూడ్కులు నిగిడించి
మహాత్మ యెట్టిపుట్టువునఁ బుట్టిన నెంతవానిచేఁ బట్టిన నెట్టి యిల్లుమెట్టిన నా
డిడినోములు నోచిన ననువంటి మచ్చెకంటికిఁ దత్ఫలం బనుభవింపక పోవ

చ్చునే రచ్చలోకివచ్చి బోసయిచ్చిపొమ్మని పుడమిఱేఁడు నోఁడివినమాట జవదాఁ
టఁగూడునే మంచిది తామసించనేల విజయంబు చేయుం డని తెగువ దోఁపం
బలికి కమలసంభవుని వెనుకొను కమలామహాదేవిచందంబున డెందంబునం బా
యని శోకాంధకారంబు వెనుక వేసికొనె నన నపరభాగంబునఁ గినుపట్టుకీలు
గంటుతో భుజపత్త్రవల్కలోత్తరీయంబున నాచ్ఛాదించిన ఘనస్తనకనకకలశ
యుగళంబుతోఁ బ్రపదంబులపై దిగజాఱం గట్టిన నలిసంపునారచీరలతో
బహుకాలపరిగత రఘువల్లభాయల్లకభరంబునం గ్రుశియించిన మోహానాం
గంబుతో నిటలతటంబున నెఱసినచికురనికరంబుతోఁ గపోలముకురంబు
లపై దిగజాఱు నయనఖంజనాంజనసమంజసాశ్రుజలధారాప్రవాహంబుతో
నప్పటప్పటికి నిగిడించు నిట్టూర్పుసెగలం బొగిలినచిగురుమోవితోఁ జిన్నఁ
బోయిన చిన్నారిముద్దుమొగంబుతో నాద్యంతంబులఁ దాను బడినయలజడి
తలంపునఁ బుట్టు నివ్వెఱపాటునం జేడ్పడుచిత్తంబుతో మహాసభామధ్యంబున
నెట్టుకొనినిలిచి నిర్లజ్జనై యెట్లు మాటలాడుదునను భయంబునం బొడముస్వేద
కంపంబులతో నిన్నియగచాట్లకు లోనయ్యుఁ దనవలఁ బ్రాణంబుపై నాసం
బూనిన మానవతులు గలరే యను తలంపునం బొదుకొను దీనభావంబుతో
గడగడవడంకు నెన్నడుముతో నెడనెడం దడఁబడునడుగుఁదామరలతోఁ దల్లీ
నీ కడుపునం బుట్టి యిట్టియిట్టున కొడిగట్టితిం గదా యను నిట్టలంపుపగపునం
బుడమిపై నెలకొల్పుచూడ్కులతో దైవంబు నలువురిలోఁ దిన్నఁ దలవంచి
కొనం జేసెఁగదా యను విన్నఁదనంబున వంచినశిరంబుతోఁ గరకమలంబులు
ముకుళించుకొని యవ్వాల్గంటిమిన్న పంటవలంతియల్లుఁడు కొలువున్న బహి
ర్మండపంబునకు వాల్మీకివెంట నరుగుదెంచునప్పు డయ్యుప్పొంగులకుప్పం దప్పక
చూచి కన్నులం జిప్పిలుశోకబాష్పధారలతో నయ్యయోతల్లీ ! మహాభద్రునంతటి
పట్టభద్రునిం జెట్టపట్టిననిన్నువంటిసౌభాగ్యవతికి నట్టడవుల నెట్టుకొని నారచీరలు
గట్టుకొని యిట్టియగచాట్లకు లోఁబడవలసెఁగా యనువారును నీయుత్తమురాలి
గుణవిశేషంబు లెఱింగియుఁ బతంగకులపుంగవుం డంతరంగంబునఁ గరుణ దొలంగి
యడవులం ద్రోచి యెంత సాహసంబు చేసెఁ జూచితిరే యనువారును నవం
విభుండు లోకాపవాదభయంబునఁ గళత్త్రాభిమానంబు విడుచుట యొప్పుగాదతనీ
మాట జవదాఁటక యిప్పరమపావని తపోవనంబులు గాసి గాసి కోర్చి ప్రాణం
బులు భరించుట దొడ్డనువారును నసువు లుడుగి వసుమతీపతిఁ బ్రజాపరంపర
లచేత మాటలం బెట్టుట పాటిగాదని గాక లేకున్న నీ లోకమాత కాకుత్స్థు
నెడఁబాసి ప్రాణంబు లాశించునే యనువారును నేకపత్నీవ్రతుం డగు రఘు
నాథుని ధైర్యస్థైర్యంబులు సీతాసతి పాతివ్రత్యసత్యంబులు నింతటియొప్పునే యను

వారు నై బహువిధంబులం బలుకునానాజనంబుల కోలాహలంబులునలుదిక్కు లంబిక్కటిల్లి చతుస్సముద్రఘోషంబు లొక్కదిక్కునఁ గ్రిక్కిరిసినట్లు పెక్కు సంత యొక్కటియైన తెఱంగున బహుళకోలాహలంబులకొల్లలువునఁగలిగియుండె నప్పుడు సీతాశపథసంశ్రవణతత్పరత్వంబునఁ బితామహుండు మహేంద్రశమన వరుణ కుబేరాదిలోకపాలక వసురుద్రాదిత్య మరుత్తుషితామరగరుడగంధర్వ సిద్ధసాధ్యయక్షకిన్నరకింపురుష నభశ్చరభాస్వర మహారాజిక ప్రముఖనిఖిలబర్హిర్ముఖసమన్వితుం డై వచ్చి దివ్యమణిరమణీయవిమానకోటులతోఁ జదలెల్ల నలంకరింప నయ్యెడ బృందారకబృందమందారమాలికాగంధసంబంధమంథరగంధవహుం డప్పరిషత్తుపై నొలసె నీలాగున భూలోకంబునం గలిగినసకల జనసమూహంబులు దిగువ నుండి కనుంగొన దేవలోకంబునం గలిగినసకల దేవతాగణంబులు దివినుండి కనుంగొన సీతాంగనాసహితంబుగా నమ్మహాసభామండపంబు దఱియం జొచ్చి రఘువీరునిపురోభాగంబున నిలిచి వాల్మీకిమహర్షిశేఖరుం డచ్చటిప్రజలకలకలంబులు చేసన్న నివారించి యాసన్నులై దివి నున్నదేవతలును సభ నున్నసమస్తజనంబులును నాకర్ణింపఁ బ్రావృడంభోదగంభీరఘోషంబున ని ట్లనియె. 81

భూపుత్రి నిష్కల్మష యని వాల్మీకి సభాసదులు విన రామునితోఁ జెప్పుట.

మ. దిననాథాన్వయ యీధరాతనయపాతివ్రత్యముల్ సత్యముం
గనియున్ నీవు జనాపవాదగతశంకన్ నిందఁచూలాలిఁ గా
ననసీమన్ దిగఁ ద్రోయఁ బంచుటయు దైన్యం బొంది యస్మద్వనం
బునకున్ వచ్చి కుశున్ లవుం గనియె నీపుణ్యుల్ భవత్పుత్త్రకుల్. 82

చ. విలసితధర్మచారిణి వివేకవతీమణి సీత సుస్వభా
వులు యమలార్భకుల్ సుశీలకవుల్ గ్రహియింపుము వీరి ముఫ్ఫురన్
వల దనుమాన మొందఁ నిటువంటిమహాసభఁ జేరి కల్ల లేఁ
బలుకుదునయ్య బొంకినఁ దపంబు ఫలించునటయ్య మానికిన్. 83

చ. బుధనుతుఁ డౌ ప్రచేతసునిపుత్త్రుఁడ నై శ్రుతు లెల్ల నేర్చి నే
నధికతపోవిభూతిఁ జెలువంది యసత్యము లాడ నేర్తునే
యధిప మనోవచఃక్రియల నన్య మెఱుంగదు సీత క్షీరవా
రిధిసుతకున్ హిమాచలవరేణ్యాజకుం బ్రతి సద్గుణోన్నతిన్. 84

ఉ. చారుపతివ్రతాత్వమున జానకి పెద్ద క్షమాసమున్నతిన్
ధారుణి పెద్ద ధైర్యసముదగ్రత మేరువు పెద్ద తప్పు లే
దారసినాఁడ సీతహృదయంబు వియన్మరుదగ్నితోయము
సారసవైరిభాస్కరులు సర్వసుపర్వులు సాక్షిగా నృపా. 85

ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం

జేసిననాతపంబు రహిఁ జెందక నిష్ఫల మా జనంబు వి
శ్వాసము నొందఁజేయుటకు స్వాంతము గల్గిన మీరు కోరిన
ట్టీసభవార లెల్ల విన నియ్యమయున్ శపథంబు వల్కెడిన్. 86

మ. అని వాల్మీకిమహామునీంద్రుఁ డపు డయ్యాస్థాన మెల్లం గలం
గ నితాంతస్థిరబుద్ధి నిట్లు వలుకం గాకుత్స్థరాణ్మౌళి చ
య్యన బద్ధాంజలియై వచించె ననఘా సీత లోకైకపా
వని యంచున్ మును లంకలోనఁ దెలిసెన్ వహ్నిప్రవేశంబునన్. 87

చ. తెలిసియు లోకు లాడునది దీర్పఁగఁ గూడమి నింత సేసితిం
గల దపరాధ మోర్వఁ డలుకన్ వల దిక్కువ లస్మదీయపు
త్త్రు లగుదు రీపె సాధ్వి యగు రూఢిగ నింకొకసారి సీత యిం
దలిప్రజ లౌ ననంగ శపథం బొనరించినఁ జాల మే లగున్. 88

వ. అని మఱియు నిట్లనియె. 89

ఆ. అనఘ మీరు పలుకు నంతకంటెను సీత, యాఁ శపథ మెంతయైన నిట్టి
ప్రజల కావె పలుకు పలుకునఁ గాని ప్ర,త్యయము పుట్టదనుచు నధిపుఁ డనిన.

భూమిదేవి సీతాదేవిం గైసేసి రసాతలంబునకుఁ గొనిపోవుట.

ఉ. ఆరఘువీరుమాటలకు నద్భుత మందిరి తత్సభాసదుల్
వారిజసంభవాదిసురవర్యులు మే లని మెచ్చి రచ్చటన్
సారసుమావళుల్ గురిసెఁ జల్లనివాసన లుల్లసిల్లఁగా
నారెకు గంధసారగిరిసారసమీరము వీచెఁ బైపయిన్. 91

ఉ. అప్పుడు సీత రామునిపదాంబుజముల్ హృదయాంబుజంబునం
దప్పక నిల్పి ధీరత నుదఙ్ముఖ యై తలవాంచి ధాత్రిపై
నొప్పు నిజావలోకనము లుంచి కరాంబుజముల్ మొగిడ్చి తా
నెప్పటిలుంగుతో సభికు లెల్లను విస్మయ మంద నిట్లనున్. 92

శా. రామస్వామిపదాంబుజంబు లెద నారాధింతు నేనిన్ సదా
రామాజ్ఞం జరియింతు నేనిఁ దగుజాగ్రత్స్వప్నసుప్త్యాదులన్
రాముం దప్పనిదాన నౌటయు యథార్థం బేని నాతల్లి యో
భూమీ యీయెడఁ ద్రోవఁ జూపి ననుఁ గొంపోవమ్మ నీలోనికిన్. 93

వ. అని శతానందపురందరాదిబృందారకసందోహంబునకు నానందంబును సనకసనందనాదికర్మబృందారకులకుం బరమాద్భుతంబును నర వానర నిశాచర ప్రముఖ నిఖిలజనంబులకు శోకదైన్యంబులు నుప్పతిలం బలికిన యచ్చిలుకలకొలికిపలుకులతోడనె శతకోటిశతకోటిఘోషంబు ననుకరించి సంవర్తసమయసముదితజలధరసంఘసంఘర్షణోజ్జాతనిర్ఘాతజాతస్ఫీతనినాదంబు ననుసరించి ప్రళయవేలాభయంకరఫణీశ్వరాభ్రంకషదంష్ట్రాంకురఘోరముఖసహస్రమోము

చ్యమానవిస్ఫురత్కీలికీలికాజాలకస్ఫులింగస్ఫుటాభీలరవానుకూలవిశాలభూత్కారవిరావంబు నధిగమించి యనల్పకల్పాంతకాలకంఠకాలదిక్కూలముద్భ్రజఝంకాఢమఢమత్కారంబునకు సహకారంబై బ్రహ్మాండకరండఖండనోద్దండతాఖండతరావరణవరుణాలయోత్తుంగజంఘాలతరంగసంఘాతఘుమఘుమార్భటిం బ్రతిఘటించి తత్సభామధ్యరత్నగర్భాగర్భంబున నుండి యొక్క దీర్ఘనిర్ఘోషం బావిర్భవించె నప్పు డంహస్సదనహిరణ్యరక్షస్సంహారరంహస్సమారంభవిజృంభమాణవీరనృసింహసంభవావసరవిస్ఫుటత్సభాస్తంభగంభీరనిస్వనంబులకుం దోఁబుట్టువులగుపటపటార్భటులు సంఘటిల్ల నిలిచినతెట్లతవలె నిలుచున్నపుడమిపట్టికట్టెదుటఁ బుడమి బిట్టువిసి పటిల్లునం బగిలిన యప్పట్టున మహాభీలం బగునొక్క మహాబిలంబు గనుపట్టె నట్టిబిలంబులోనుండి కుండలిమండలేశ్వరకులదంష్ట్రాపటలచటులప్రభలకై వడిభోగవతీసరిత్తరంగమాలికలవలెఁ దత్తటినీతటనికటస్థితహాటకేశ్వరకరోరకంఠకాలకూటకాంతులవలెఁ దత్సహచరపారిషదచ్ఛటాజటారుణరుచులవలె బహిర్గతాంతరపయోధిబాడబజ్వాలికలవలెఁ గోమలశ్యామలదూర్వాదళాఖర్వరోచులవలె వజ్రమౌక్తికనీలప్రవాళపద్మరాగమరకతప్రముఖనిఖిలమణిగణమసృణఘృణివిసరంబులు వెల్లివిరిసి యచ్చటివారికన్నులకు మిఱుమిట్లుగొలిపించె నంత ననంతవాసుకితక్షకకర్కోటకజనమేజయప్రముఖమహాభుజంగపుంగవు లభంగతరాభోగభోగచిరత్నరత్నఖచితకిరీటకుండలహారకేయూరకంకణాదివివిధభూషణభూషితులై కాంచనవేత్రధారులగు నపరిమితనాగకుమారులతోఁ గానిపించి యద్దేవికిం బ్రణమిల్లి యనేకరీతులం బూజించి రయ్యెదంచితాకృతులదివ్యస్త్రమాల్యానులేపనోల్లాసితవాసనావిశేషంబులాగుబ్బగానమ్మంటపం బెల్ల ఘుమ్మ్మనం గ్రమ్ముకొనె నయ్యెడ విను కెంపు(నును కెంపుసొంపులతో నెదురుపడఁగల విడికెంపులపడగలఁ జెలువగుచిలువరాచకొడుకులచేత నొక్కరత్నసింహాసనంబుఁ బట్టించుకొని భూదేవి నాగకన్యకాకమ్రకరాంభోజరాజద్ధవళచామరమరుచ్చలాచలనీలాలకజాలకంబులలికఫలకస్థలనిమ్నలకస్తూరికాతిలకంబుతోఁ జెలికారంబుసలుపఁ జలువవెన్నెలలసొలపుఁ దెలుపుమవ్వంపుఁజిఱునవ్వులతెలుపు రదనకుందకోరకబృందములతోఁ బొం దొనర్ప రతిదర్పకమణిదర్పణప్రభల నెక్కనక్కంబు లాడుచొక్కపుఁజెక్కులపైఁ జఖుకొత్తుక్రొత్తముత్యాలకమ్మలడాలు విద్దెంబుసూప విద్యాధరకుమారికాపఠితగద్యపద్యాకర్ణనానురోధకర్ణోత్పలామోదసమ్మోదసంచరచ్చంచరీకచంచత్తారఝుంకారంబులుమీఱమేరుమందరశిఖరోపరిస్ఫురితతారకావారకంబుడంబునంబొదలుచుఁగుచోపరిదేశంబున హీరహారంబులు వెలుంగ మెఱుఁగుతీఁగలతోనొప్పుగులుకు కప్పుమొగులతెఱంగునందుఱంగలించుబంగరువిరులసరులసిరులతో గొప్పకీల్కొప్పమీటారించమించులజిగిందులకించుమంచిబురుసాచీరసరిగంచులకించుకించుకమించునించుకళు

కుహూరొంగిలుకు మెట్టియలరవళి నవలంబించుపదకంజరంజత్కాంజరాగమణిపుంజపిం
జరితమంజీరసంజాతశింజాధ్వనులు నిజాగమనంబుసఖ్యులకెఱింగింపఁ గించిదవల
గ్నలగ్నకాంచనకాంచికాసంకలితమణిసంకీర్ణ కింకిణీరవంబులు పాణికంకణక్రేం
కారంబులకు లంకెపాటు పాటింప సాటిలేని శృంగారవిలాసచాతురితోఁ గూఁతు
నకు సాక్షాత్కరించి చేరవచ్చి మచ్చికహెచ్చి కౌఁగిలించి సేమంబడిగి క
న్నీరు మున్నీరుగా వగచుచున్న యప్పుత్త్రినను నయించుచుఁ దల్లీ యేల చింతి
ల్లెద వెవ్వారికి దైవగతిం దప్పించ వచ్చునే యూఱడిల్లు మని యనిమిషకన్యకా
కరకీలితకనకకలశవిలసితభోగవతీసలిలంబుల ముఖ ప్రక్షాళనంబుఁ గావించి
కస్తూరిబొట్టుపెట్టి కొప్పు చక్కఁగ సవరించి మందారకుసుమమాలికలు దుఱిమి
దివ్యాంబరాభరణాదుల నలంకరించి ఘనసారగంధసారకాశ్మీరకస్తూరికాదిపరిమ
ళంబుల నలంది సిద్ధభామినీసమర్పితకర్పూరనీరాజనాదుల విరాజమానయగున
మ్మానవతి నసమానమణిపీఠంబుపై నుంచుకొని నలుగడలముంచుకొని గంధర్వ
చారణ యక్ష కిన్నర పన్నగ బాలిక లడపంబు సురఁటి గిండి కాళాంజి మొదల
యినవి ధరియించి యూడిగంబులు ఘటింప నచ్చరలు నటింప నింద్రాదిదేవతలు
మందారకుసుమంబులుగురియింపశంఖమర్దళపణవగోముఖఢక్కాహుడుక్కాది
దివ్యవాద్య ఘోషంబులు మించ భుజంగపుంగవులు బంగరుబెత్తంబు లూనిబ
రాబరు లొనరింప రసాతలంబునకుఁ గొంపోయె నమ్మహాప్రభావంబునకు నద్భు
తంబు నొందుచు బ్రహ్మాదిదేవత లందఱుం దమలోఁ దమరు జగతీనందనపాతివ్ర
త్యసత్యధర్మంబుల నభినందించు నెలుంగులు నంతరంగంబుగలంగి సీతాంగనఁ గూ
ర్చి విలపించు సభాసదుల యాక్రందనధ్వనులు సేకీభవించి భూనభోంతరంబు లా
వరించె నమ్మహాకలకలంబున నేలంబడి పొరలి పొరలి యేడ్చువారు నయ్యయో
శ్రీరామభద్రునియర్ధాంగలక్ష్మి నేటితో మాస్వామి నెడఁబాసి పోయితే యని
బిట్టుగాఁ బ్రలాపించువారు నేమియు ననలేక శోకవ్యాకులితేంద్రియులై మూ
ర్ఛల మునుఁగువారును నీలోకాపవాదం బింత చేసెఁగదా యనువారును నిట్టి
మహాత్మురాలి నట్లాడిన యీలోకుల కొకసత్యం బున్నదే యనువారును సక్క
టా తల్లిలేనిబిడ్డ లైతిరే యున్నలారా యని కుశలవులఁ జూచి చూచి వగచువా
రును నవనీకన్యక వచ్చి నిలచినచోటుఁ గాంచి పలికినపలుకులు వర్ణించి పోయిన
పోక దలంచి పలికినదే పలుకుచుఁ బలుమాఱుఁ బరితపించువారును నిదిగోఁ గన్ను
లఁ గట్టినట్లున్నయది యజ్జగన్మాత నేరీతి మఱనవచ్చు ననువారును నందఱచే
మాటలఁబడి విసివి వేసరి యీసరసిజాక్షి లోకనిందఁ బాపికొని కారణజన్మ
రాలు గావున మహనీయపదంబునకుఁ జనియెఁ దత్ప్రభావం బెవ్వరికైనఁ దెలి
య శక్యంబే యనువారును నింతయద్భుతం బెక్కడఁ గని విని యెఱుంగ మను
వారును నొడలలు వంచి యవిచ్ఛిన్నాశ్రుజలధారాపూరితనేత్రులై వెక్కసం

బుగా వెక్కి వెక్కి యేడ్చు భరత లక్ష్మణ శత్రుఘ్న సుగ్రీవాంగద హనుమత్సు
షేణ నల నీల జాంబవ ద్విభీషణ విదేహ కేకయరాజప్రముఖులం జూచి వగపు
లుక్రొత్తలై చిత్తంబు లుత్తలంబు లొంద నందంద దల్లడించువారును నధో
ముఖులై చేష్టలు దక్కి చేడ్పడి యున్నయన్నరేంద్రచంద్రునిం జూచి పుర
పురం బొక్కువారును సంతాపంబుల స్రుక్కువారును దాలిమి దక్కువారు నై
వెక్కచందంబుల నందఱుం దురుటిల్ల నయ్యాస్థానంబు శోకదైన్యనిదానంబై
యుండె నయ్యవసరంబున. 94

సీతాదేవి రసాతలంబున కరుగుటకు రాముఁడు చింతించుట.

మ. జనకక్ష్మావరకన్య యిట్లరుగ విశ్వం బంతయుఁ శూన్యమై
తనకుం దోఁచిన దీనభావ మడరన్ ధైర్యంబు పోనాడి లో
చనపంకేజము లశ్రుధార మునుఁగన్ క్ష్మాభర్త హా జానకీ
యనుచున్ మూర్ఛిలి క్రమ్మఱం దెలిసి శోకాక్రాంతుఁడై యిట్లనున్. 95

మ. జననిందం బడ లేక నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గానసం
బునఁ ద్రోయించినతప్పు చాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రం
చునిచందంబున రచ్చఁ బెట్టితి నటంచున్ డాఁగి పోనేల సొం
పున నేఁ డింకొకసారి నీనగుమొగంబుం జూపవే జానకీ. 96

మ. అకటా నీవు పతివ్రతామణివి నాయం దెంతయుం గూర్మిఁ బా
యక వర్తింతు వటంచు నమ్మితిఁ గదే యహ్హం బె నీ వున్నచో
టికి నన్నుం గొనిపోక నిర్దయత నొంటిన్ డించి పోవం దలం
పక నానేరము లిందు వచ్చి నిలవే మాటాడవే కోమలీ. 97

మ. సదనంబుం బెడఁబాసి నీవు బహువర్షంబుల్ వనక్షోణిఁ జెం
ది దురంతవ్యథ లొంద నిన్ను ననురక్తిం గూడి వర్తింపఁగా
నిది మేలైనయుపాయ మంచు శపథం బేఁ గోరితిం గాని నీ
హృదయం బించు కెఱింగినం దలఁతు నే యీమాట ప్రాణేశ్వరీ. 98

చ. అడరెడుచిచ్చుఁ జొచ్చుతఱి నాదట నూరక చూచునాఁటిని
ల్కడయును గానఁ ద్రోచి చిరకాలము దాళినబెట్టిదంబు నా
యెడఁ గని వంతలన్ విసివి యీతని కెక్కడిమోహ మంచు ని
ప్పుడమి నడంగి మాయ మయి పోయితి వేమొ పతివ్రతామణీ. 99

ఉ. కన్నుల సారెకుం దొరఁగుకజ్జలసమ్మిళితాశ్రుధారతో
విన్నఁదనంబుతో మిగుల వెచ్చనియూర్పుల వాడుమోవితోఁ
జిన్నిమొగంబు వంచి బలుసిగ్గునఁ గేల్గవ మోడ్చి యిందు ని
ల్చున్ననినుం దలంచుకొన నూహ గలంగెఁ గదే వధూమణీ. 100

చ. అనితరవామలూరుజవనాంతరవాసముఁ జెందినావు నీ
వెనసినప్రేమ నట్ గదిసె దెప్పటికైనను గూడి యుందు వం
చును నొకయాసఁ బట్టుకొని సుక్కక పెక్కుదినంబు లోర్చితిన్
నను దిగనాడి యిట్లు చనినట్ వెత నెట్టు భరింతుఁ బ్రాణముల్. 101

ఉ. ఎక్కడి కిప్పు డేఁగితివొ యెక్కడ దీనతఁ బాసి నిల్చినా
వెక్కడఁ బోయె నాఁటిమరు లెంతకృపారహితాత్మురాల వై
తెక్కడఁ జొత్తు నేది తెరు వెక్కరణిం గ్రమియింతుఁ గాల మిం
కెక్కడ నున్నదాన వని యే వెదకింపుదుఁ బంకజాననా. 102

సీ. దర్పించి పరమేశుధన్వంబు విఱుచుట, నీనిమిత్తమె కదే నీలవేణి
యెలమితోఁ గపిరాజుచెలిమి పాటించుట, నీకోసమె కదే నీరజాక్షి
విబుధేంద్రసుతుఁ బొంచి వ్రేసి నిర్జించుట, నీకొఱకే కదే నిర్మలాంగి
క్రోధించి సాగరక్షోభంబు సేయుట, నీపనికే కదే యోపురంధ్రి
తే. బ్రహ్మకులజునిఁ బౌలస్త్యపతి గెలుచుట, నిన్నుఁ గైకొంటకే కదవన్నెలాఁడి
యకటయివియెల్ల నెంచకయొకటిరెండు,తప్పులకునన్ను నెడఁబాయఁదగునెనీకు.

సీ. పడఁతి నీకటిసీమ యడుగుఁ బట్టుటఁ జేసి, నేల గ్రుంగినయట్లు నేఁడుదోఁచెఁ
జెలువ నీలేఁగౌను బిలము దూఱుటఁ జేసి, నింగి గూలినభంగి నేఁడుదోఁచె
నతివ నీముఖచంద్రుఁ డస్తమించుటఁ జేసి, నిఖిలంబు తిమిరమై నేఁడుదోఁచె
సకియ నీకాంచనాంగక మడంగుటఁ జేసి, నిబిడదారిద్ర్యంబు నేఁడుదోఁచె
తే. భామినీమణి నీపొందులేమిఁ జేసి
యలఁతి మజ్జన్మ మిఁక వ్యర్థ మనుచుఁ దోఁచె
జలజముఖి నీవు వెడఁబాసి చనుటఁ జేసి
యిదిగొ నిన్నియుఁ గొదవలై యిపుడు దోఁచె. 104

క. నీగౌరవంబు నీయను,రాగము నీమైత్రి నీసరసభావంబుల్
నీగరువతనము నీదయ, నీగుణముల్ మఱవవచ్చునే యెన్నఁటికిన్. 105

ఉ. నామన సార యెంతకఠినంబొ తలోదరి నీవు సత్యభా
షామహిమోన్నతిన్ మహి యొసంగిన త్రోవ నహీంద్రకన్యకా
చామరచంచలచ్చికురజాలక వై చనఁ జూచి వ్రస్సిపో
దేమియుఁ గాదు రాతివలెనే చెలు వొందెడుఁ జూడు మియ్యెడన్. 106

మ. అని సీతాసతి నాత్మ నుంచి తొలిమోహం బెంచి శోకించి య
య్యినవంశాగ్రణి భూమి వచ్చి విభవం బేపార నయ్యంతిఁ దో
డ్కొని పాతాళబిలంబుఁ జొచ్చిన తెఱంగుల్ బుద్ధి నూహించి మిం
చినక్రోధంబున సభ్యులం గని వచించెన్ కార్ముకాబ్దధ్వనిన్. 107

రాముఁడు భూమిపై బాణము ప్రయోగింపఁ బూనుట.

ఉ. కంటిరె సభ్యులార జనకక్షితిభుకన్యక వేఁడుకొన్నచోఁ
బంటువలంతి వచ్చి ప్రియభావముతో వెత దీర్చి పోక తాఁ
గంటున నన్నుఁ గింతయును గైకొన కల్పునిఁగాఁ దలంచి వా
ల్గంటి నలంకరించుకొని గ్రక్కునఁ దోకొని చన్నచందముల్. 108

ఉ. బాలిశులీల నేను వెతఁబా లయి దీనత గాసిలంగ నా
పాలిటిభాగ్యలక్ష్మి నను బాయనిజానకిఁ గొంచుఁ బోయె ని
న్నేలపడంతిదుండగ మకనీతియుఁ జూచితిరే కదా యిఁకం
దాలిమిఁ బూని యత్తయని దండనసేయక తాళి వచ్చునే. 109

చ. లవణపయోధిఖేయ మగులంకకుఁ బోయి దశాస్యముఖ్యులన్
బవరములో జయించి మును భామను దెచ్చిన నా కసాధ్యమే
తివిరి ధరిత్రి గొన్నసుదతిన్ మరలించుట చూడుఁ డిందఱున్
భువనము లెల్ల భీతిలఁగ భూరిశరాహతి భూమి వ్రచ్చెదన్. 110

చ. దురుసున నామదిం గినుక దోఁపక మున్దర సీతఁ దెచ్చి యి
ద్ధరణి యొసంగినన్ బ్రతుకుఁ దక్కిన మామకచాపముక్తని
ష్ఠురవిశిఖప్రతానములఁ జూర్ణముఁ జేసి యజాండ మెల్ల నా
వరణపయోధిలోఁ గలిపి వైచెద నొక్కక్షణంబులోపలన్. 111

వ. అనిహిరణ్యగర్భస్వర్భువనాధినాథప్రముఖహావిర్భుజులకుగర్భనిర్భేదంబుగాఁబలి
కినతనపలుకుల కళుకులేక నిరాకులస్థితిం బ్రవర్తిల్లుధాత్రిమీఁదం బుట్టినబెట్టి
దంపురోషంబునఁ బెదవు లదర నిడుదకన్నుఁగ్రేవల బెడిదంపుమిడుఁగుఱులు
చెదరఁ దటతటం గటతటంబులు చలింప ముకుపుటంబులఁ బ్రకటతరోచ్ఛ్వ
సనంబు విజృంభింప నిటలతటంబున నతివికటభ్రుకుటి ఘటిల్ల రదనపటలంబునం
బటబటార్భటు లుప్పతిల్లఁ బరుషరుషారసోన్ముఖం బై ముఖంబు జేవురింప నెమ్మే
నం జిఱుచెమ్మటల తెమ్మ లావరింపఁ బంచభూతవిలయసమయసముద్దండతాండ
వక్రీడాప్రచండచండీశ్వరవిశ్వభయంకరకరణపారదృశ్వశశ్వద్వీరరసోల్లాసంబు
నకు నావాసం బొనంగి వాసవాదిపురప్రాసాదవిలాసనిరాసక్రియాసముల్లసత్పు
రత్రయహరణకారణరణారంభశుంభచ్ఛంభు శరశరాసనవినిర్ముక్తముక్తాశ్రయ
విశిఖానివార్యకార్యంబుతో సాహచర్యంబు వాటించియవార్యధైర్యధుర్యతా
దక్షదక్షమఖవిఘాతప్రభూతసముద్రేకతాత్కుద్ర రౌద్రనిర్నిద్రవీరభద్రప్రభా
వం బావహించి భావభవాఖర్వగర్వసర్వస్వోన్మూలనఖేలనఫాలనయనవిశాల
ఫాలస్థలకీలికీలికాభీలప్రళయకాలప్రద్యోతమానద్వాదశ ద్వాదశాత్మమండలా
ప్రతీపప్రతాపరీతిఁ బ్రదీపించి యపారపారావారవారిపూరాపహారక్రీడా
ఘోకమానబడబానల శిఖాప్రకరతీవ్రరౌష్ణ్యంబు నధిగమించి యనవధికసకల

భువనాక్రమణప్రవర్తనాతివర్తులావర్తసంవర్తసముయాంభోనిధానగాంభీర్యంబునం బొలుపు మీఱి భూరివిశ్వంభరాభారభరణప్రవణఫణికులేశ్వరముఖసాహస్రజంజన్యమానపవమానసఖసముజ్జ్ఞాతిసంకర్షణమూర్తిబింకంబునభయంకరుండై సకలప్రపంచంబు నొక్కట నుక్కడంచి దిగ మ్రింగ నప్పళించువిలయకాలమృత్యువుమహోద్ధత్యంబునం బొంపిరివోవుచునఖిలజగమ్ములం గ్రమ్ముకొని దుమ్ముసేయ నుద్యోగించు ప్రళయకాలఝంఝానిలసమీరంబుతీరునబలిమిం జెలువారి యెవ్వారికిం దేఱి చూడరాక కోపంబు రూపంబు గైకొన్నకోపున నహంకరించి హుంకారంబు నివ్వటిల్ల నవ్వీరాధివీరుండుక్రూరనిరీక్షణంబుల నిప్పులు కుప్పలువడ నప్పుడమినట్టె యవలోకించి కించిజ్జ్ఞవై జడమతి నన్నుం గొంచెగా నింగాం దలంచి సీతం జూడం బోవం దెరువైన నొసంగ వైతివిగదా మంచిది యీక్షణంబున నిన్ను నిర్భేదించి నీగర్భంబుననున్నయతలవితలాదిసప్తపాతాళలోకంబులు చీకాకు గావించి నీవు ధరించినసరిత్సముద్రగిరిపురగ్రామవసకాననాదులతోడ నీయందుం గలనిఖిలజంతువుల నిర్మూలించినిన్నుభరించినకులపర్వతదిగ్గజభుజగవరాహకూర్మాదుల నింతలింతలు తునుకలుగా నొనరించి నేఁటితో నీయేడులోకంబులు నీఱు గావించెదం దాళుమని చెంత నున్నలక్ష్మణుచేతిశరాసనంబు నొడిసి పుచ్చుకొని మచ్చరంబు హెచ్చ నచ్చాపంబు మిక్కుటంపుటుక్కున నెక్కు వెట్టి బెట్టుగా నారి నారించిన సైరించరాని తద్దీర్ఘనిర్ఘోషంబున బీటలు వాఱి దిక్కులు వ్రక్కలయ్యెం జుక్కలు నేలపాలయ్యె సముద్రంబులు పంకిలంబు లయ్యెం బర్వతంబు లొడ్డగెడవు లయ్యె నాదిశేషుం డవశుండయ్యె నజాండభాండంబు పగిలిన ట్లయ్యె దిక్పాలురు దిగులుం జెందిరి దేవతలు నెగులుం బొందిరి కిన్నరులు ఖిన్నత వహించిరి కింపురుషులు కంపించిరి సిద్ధులు చేడ్పాటునొందిరి విద్యాధరులు వికలతం గుందిరి గరుడులుగాందిశీకత వహించిరి గంధర్వులు కళవళించిరి తుషితులు దుఃఖించిరి భాస్వరులు పరితపించిరి యక్షులు దొలంగిరి రాక్షసులు కలంగిరి నరులు మూర్ఛిల్లిరి వానరులు తల్లడిల్లిరి పసువు లడలిరి మహారాజికులు బడలి రనిలులు చెదరి రూర్ధ్వలోకంబుల నుగ్రాంధకారంబులు నిండుకొనియె నట్టిసమయంబునం బ్రత్యాలీఢపాదుం డై కాకుత్స్థుండు చండకోదండంబునం గాండప్రకాండంబులువాడిగి భూమండలంబున నేయం దొడంగుకడంకి నొత్తింగి యుత్సాహంబు దఱింగి గడగడ వడంకుచు వెడవెడం గొంకుచుం బంకజాసనుం డరుగుదెంచి యయ్యురుగుణాఢ్యుని హస్తంబులు పట్టుకొని యఖిలదేవర్షిబ్రహ్మర్షిగణసమన్వితుం డై యిట్లని యభినుతింపం దొడంగె. 112

బ్రహ్మాదిదేవతలు శ్రీరాముని స్తుతించుట.

చ. జయజయ సాధురక్షణ విచారవిచక్షణ సారసేక్షణా

జయజయ సర్వకారణ నిశాచరదారణకృష్ణపహారణా
జయజయ సత్యభావన సుజన్యశుభావన లోకపావనా
జయజయ మంజుభాషణ లసత్కులభూషణ వార్ధిశోషణా. 113

సీ. తనవిల్లువిఱిచినట్లనె రథంబును ద్రుంచఁ, గడఁగెఁగాయనుచుశంకరుఁడువగచెఁ
దనమేఖలాలీలఁ దాల్చుభామారత్న, మడఁగుచున్నదె యంచునబ్ధి గలఁగె
నిజధరాధరసంజ్ఞనేఁటితో నష్టము, య్యెడినో యంచుఁ జలించెబుడమిదాల్పు
లిఁక నేమిగావింతుమెందుఁజొత్తు మటంచు, ఫణిఘోణికూర్మముల్ పరితపించె
తే. నొకధరాదేవితోఁబోనెసకలలోక, ములకుఁజెడుకాలమొదవెనంచళుకుఁజెంది
రెల్లలోకులు నీచేత విల్లుపూని, ధాత్రిఁ గనుఁగొన్నమాత్ర సీతాకళత్ర. 114

ఉ. భూజలవహ్నివాయునభముల్ మహదాదులు సృష్టిఁ జేసి నీ
వే జగదంతరాత్మవయి యింతకు నాథ్యతఁ జెంది నాభిపం
కేజమునందు నన్నుఁ గలిగించితి పెంచితి వీప్రపంచమున్
రాజవె నీవు మమ్మరయురాజవు గాక త్రిలోకవందితా. 115

ఉ. కారణయుక్తి నీవలనఁ గల్గినలోకము లీవె త్రుంచ నె
వ్వారము గా దటం చనెడువా రిది యెవ్వరి దిట్టిధాత్రిపై
మేరమె యింతకోపము శమించుము గాచుము యోగిమానసా
గారవిభాసిదీపరుచి గాంచి వెలింగెడి నీస్వభావమున్. 116

శా. సత్తామాత్రుఁడ వై ప్రపంచకలనాసాక్షిత్వధుర్యుండ వై
చిత్తాదీంద్రియబోధరూపకుఁడ వై చిచ్ఛక్తియుక్తుండ వై
తత్త్వాద్యుక్తిగుణాత్మకత్వమున నోతత్సృష్టిగమ్యాత్మయా
యత్తానంతవిలాసముల్ గనినని న్నాత్మన్ విలోకింపవే. 117

వ. అని పలికి మఱియు ని ట్లనియె. 118

సీ. కల్పక్షయమున నేకం బైనజలధిపైఁ, బవళించి జగదిచ్ఛ యవధరించి
హృదయాబ్జమునన న్నుసృజియించినిర్గమిం, చుటకుఁబొందమ్మిపొక్కిటఘటించి
బయలు దేఱినచోఁ దపంబు సేయుమటంచు, నాకాశమూర్తివై యపుడుపల్కి
తపమునిష్ఠకు మెచ్చితగ నంచ వై వచ్చి, తెలివి నంతయు నుపదేశ మిచ్చి
తే. వెనుక వైకుంఠ మనుపేర వినుతికెక్కు, భువనరాజంబులో శేషభోగితల్ప
శాయి వై తోఁచి నను జగత్సర్గమునకు, నియ్యకొలిపిననాతండ్రి వీవెకావె.

మ. శిఖవిద్యాబలశౌర్యపణ్యకృషిసంసేవాదులం గూడి నీ
ముఖబాహూరుపదంబులం గ్రమమునం బుట్టెం జతుర్వర్ణముల్
నిఖిలాశల్ జనియించె నీచెవుల నీనేత్రంబులన్ గల్గి రిం
దుఖరాంశుల్ జగదంతరాత్ముఁడవు నిన్నున్ శక్యమే యెంచఁగన్. 120

మ. జనముల్ విభ్రమ మొందఁ బ్రాకృతునియోజన్ దైన్యశోకప్రధల్

చనునే యిట్లు వహింపఁ జాలు విడు మిచ్ఛాపంబు భూదేవి చే
సినత ప్పేమి త్వదాజ్ఞఁ గాదె తెరు విచ్చెన్ సీత నిత్యానపా
యిని నిన్నుం బెడఁబాసి యెం దరిగెఁ దండ్రీ బుద్ధి నూహింపుమా. 121

ఉ. నీకథ లాదినుండియును నే ర్పలరన్ రచియించినాఁడు వా
ల్మీకిమహర్షి యక్కడవ లెన్న వినం దగు నందునన్ మనో
వ్యాకులతాస్థితుల్ దొలఁగు నంతియ కాదు భవిష్యదర్థమున్
నీ కెఱుఁగంగ వచ్చు నది నేనును వింటి మునీంద్రకోటితోన్. 122

శా. సారప్రజ్ఞ ఘటించు శ్రోత్రతల కభీష్టంబుల్ ప్రసాదించు భా
గీరథ్యాపగఁ బోలి పంక మడఁచున్ గీర్వాణినీపాదమం
జీరస్ఫారమృదుధ్వనిం జెవులకుం జేకూర్చు నుల్లాస మీ
శ్రీరామాయణ మాదికావ్యము సుమీ సీతామనోవల్లభా. 123

క. తత్తఱ మొందక యిత్తఱి, నుత్తరకాండంబు విన్న నుత్తల మడఁగుం
జిత్తము ప్రసన్న మగు నని, యత్తామరచూలి పలుక నౌఁ గా కనుచున్.

తే. కోప ముపసంహరించి కాకుత్స్థమాళి
యనుజుచేతికి శరశరాసనము లొసఁగ
నలరి యవ్విభు వీడ్కొని యజుఁడు సురలు
మునులుఁ గొలువంగఁ దనలోకమునకుఁ జనియె. 125

క. ఆసమయంబునఁ గాంస్యము, గీసినగతి నతులవల్లకీతతు లొక్కై
మ్రోసినగతి నెలుఁగడర, న్నభసతికడనుండి యొక్కనుడివినఁబడియెన్. 126

శా. రామాధీశ్వర చింత యేమిటికి శ్రీరామాశిరోరత్నమే
భూమిన్ సీత యనన్ జనించి హరి వైపా లొప్పొందునిన్ గూడి నీ
వైముఖ్యంబు తుదిన్ సహింపక బుధుల్ వర్ణింప నాత్మీయ మహా
ధామంబున్ దొరసెం ద్వదాగమన మాహాత్మ్యం గోరుచుం బ్రేముడిన్. 127

చ. క్రియయును మేధయున్ ధృతియుఁ గీర్తియు శక్తియు హ్రీయు శాంతియున్
దయయును దుష్టి పుష్టియును దథ్యము సీతయె చుమ్ము తన్మనో
దయితుఁడ వైననీవె పరదైవము విర్వురు మీరు తల్లిదం
డ్రియు నయి లోకరక్ష యొనరింపుచు నుండుదు రెల్లకాలమున్. 128

శా. ఏసీమంతినిపాదశోణరుచి దేవేంద్రాదిదిక్పాలకాం
తాసీమంతములందుఁ జెందిరముచందం బొందు నేదేవిపీ
యూసమ్యగ్ద్యుతిలేశ మర్థిజనదౌర్గత్యంబు మాయించు నా
శ్రీ సీతాసతిలీల నిన్ను భజియించెన్ రామ కొన్నాళ్లిలన్. 129

ఉ. సీతఁ దలంచి యింక వెతఁ జెందకు శ్రీరఘురామ యామెపై
నానత మైననీకరుణ యంతయు నిక్కపలందు నిల్పు మ

జ్ఞాతభవ్యోపదిష్ట మగుపద్ధతి నుత్తరకాండ మంతయుం
బ్రీతి దలిర్ప వీరు వినిపించ రహిన్ విను మంచుఁ దెల్పినన్. 130

రాముం డశ్వమేధయాగంబు పరిసమాప్తి నొందించుట.

ఉ. ఆపలుకుల్ చెవిం బడినయంత నొకించుక ధైర్య మూని యా
క్ష్మాపతి వామలూరుభవుఁ గన్గొని మానుడువుల్ వినంగ ని
త్తాపసు లీనృపాలకులుఁ దద్దయుఁ గోరుచునున్నవా రిఁక
నేఁపటనుండియుం బ్రియము నివ్వటిలం జదివింపుఁ డవ్వలన్. 131

క. అని పలికి సకలజనముల, ననిచిన నెయ్యమున ననిచి నందనులను దో
డ్కొని మఖశాలకుఁ జనియెన్, మనుకులమణియంత గగనమణియుం గ్రుంకెన్.

ఉ. ఆనిశ యెల్ల జానకిగుణాతిశయంబులె చింతసేయుచున్
మానవభర్త నిద్ర యనుమాట యెఱుంగకయుండి వేగినన్
స్నానము సంధ్యయుం జపము జన్నపునేమములున్ ఘటించి యా
స్థానముఁ జేరి బ్రహ్మఋషిసంఘముతో వసియించి యచ్చటన్. 133

తే. సుతులఁ గనుఁగొన్న వల్లకీశ్రుతులు బెరయ
శ్రుతుల కింపని యతులు భూపతులు మెచ్చఁ [నయ్యె.
గతిపయదినంబు లుత్తరకాండకథలు, వారు తుదముట్టఁ జదివి రధ్వరము

ఉ. ఆతఱి ఋత్విగావలికి నంచితదక్షిణ లిచ్చి యర్థిసం
ఘాతము కోరినట్లు కుతుకంబున నీవు లొసంగి ధారుణీ
నేతల దానవేంద్రరజనీచరముఖ్యుల భూషణాదులం
బ్రీతులఁ జేసి వీడుకొలిపెం బతి యందఱ నర్హరీతులన్. 135

తే. ఇటులఁ గృతకృత్యుఁ డై రాఘవేశ్వరుండు
ధరణికన్యావియోగాగ్నితప్తహృదయుఁ [కరిగి యచట..
డగుచు ననుజులుఁ దనుజులు నాప్తులార్యు, లాశ్రితులు గొల్వఁగ నయోధ్య

మ. నయమార్గంబున రాజ్య మేలె నవనీనాథుండు దేవద్విజ
ప్రియకార్యంబు లొనర్చుచున్ జగతిపైఁ బెక్కగ్రహారంబు లు
చ్ఛ్రయసంపన్నతఁ గల్గఁ జేయుచు దురాచారస్థులం బాపుచున్
దయ నర్థార్థులకోర్కు లిచ్చుచు ననాథశ్రేణి రక్షింపుచున్. వ. మఱియును.

సీ. అమితదక్షిణలతో నయుతాశ్వమేధముల్, గొనకొని యొనరించెఁ గొన్ని నాళ్లు
శిష్టులౌ ననఁగ నగ్నిష్టోమయజ్ఞముల్, గురునిష్ఠ యొనరించెఁ గొన్ని నాళ్లు
భూరిదానముల విప్రులు తృప్తి గన నైక, గోమేధము లొనర్చెఁ గొన్ని నాళ్లు
జేజేలలరఁ బెక్కు వాజపేయములు మిక్కుటపుఁ, గల్మి నొనర్చెఁ గొన్ని నాళ్లు

తే. లెడ తెగని యాహుతులను వహ్ని నజస్రి, యడరనతిరాత్రపౌండరీకాదియాగ
కోటులఘటించెఁ బటుబుద్ధిఁ గొన్ని నాళ్లు, హేమసీతాసమేతుఁడై యినకులుండు.

చ. పొలుపలి సీతవంటిసతి § పోయినపిమ్మట నింక నొక్క తెఱ
 వలయున పెండ్లియాడ నని § వారని నెంజిలి నెవ్వ రెన్నిభం
 గుల వివరించినన్ వినక § క్షోణిజఁ బోలినపైఁడిబొమ్మ ని
 శ్చలమతిఁ జెంత నుంచుకొని § క్ష్మాపతి సేసె ననేకయాగముల్. 140

వ. తత్కాలంబున. 141

సీ. అవని వసుంధరాఖ్యకుఁ దగె నడలేని, హేమరాసులకాంతి § నెసకమెసఁగి
 వనధి రత్నాకరత్వము యథార్థముఁ జేసె, బలుతరఁగల రత్న § పంక్తు లూని
 యభ్రనామము వ్యోమ § మనురూపముగఁ దాల్చె, జనులుగోరినవస్తు § సమితిఁ గురిసి
 ధర్మాభిధాన మంతకుఁడు నిక్క మొనర్చె, ముదుసళ్ల నైనను § గదియఁబోక
తే. వలసినపుడెల్ల వానలు § గలిగియుండెఁ, బ్రబలి రందఱుఁ బాడియుఁ § బంట లెనసి
 నెట్టుకొని కొల్చుపోఁకకుఁ § బుట్టఁడమ్మ, శ్రీరఘుస్వామిరాజ్యంబు § సేయునపుడు.

క. తరణికులాధీశ్వరునకు, భరియింపఁగ నపుడు రెండు § భారము లొదవెన్
 ధరణీభారము సీతా, తరుణీచిరవిరహభూరి § తరభారంబున్. 143

చ. మఱవఁగ నేర్చు లోకు లధ § మస్థితిఁ బల్కినయట్టినిందలున్
 మఱవఁగ నేర్చు నాశ్రితులు § మాటికిఁ జేసిన యన్నితప్పులు
 న్మఱచిన మర్త్యరాక మది § నాటినసీతవియోగదుఃఖమున్
 మఱవఁగ నేరఁ డయ్యె గుణ § నుండితుఁ డారఘువీరుఁ డయ్యెడన్. 144

సీ. విద్యావయోరూప § వినయశౌర్యాదులఁ, బ్రబలు లై కొడుకులు § భక్తిసలుప
 హృదయానుగుణముగా § నేమఱ కేవేళ, ననుజన్ము లఖిలకా § ర్యములు నడప
 సకలదేశాధినా § యకులు గింకర్వాణు, లై పదాబ్జము లెప్పు § డనుసరింప
 హితమంత్రిగురుపురో § హితబంధుసామంత. ముఖులు మనఃపూర్వ § ముగనుతింప
తే. భూమిఁ జిరకాల మేలుము § స్వామి యనుచుఁ
 బ్రజలు జేవెట్టఁ గలిమియు § బలిమి గలిగి
 యొప్పి యుండియు సీత లే § కున్న కతన
 నన్నియుఁ గొఱంత లై తోఁచె § నవనిపతికి. 145

కౌసల్యాకైకేయీసుమిత్రలు దివంబున కరుగుట.

తే. ఏకతంబున నున్నచో § నినకులుండు, భామినీమణి నూహించి § పరితపించుఁ
 గొలువులో నున్నయప్పుడు § కొడుకులఁ గని, సీతరూపంబు భావించి § చింతనొందు.

వ. తత్కాలంబున. 147

సీ. రాజ్యంబుఁ జేయుశ్రీ § రాముని విభవంబు, కన్నులు చల్లగాఁ § గాంచి యలరి
 యమితదక్షిణలతో § నాతఁ డొనర్చిన, యాగకోటులు గని § హర్ష మొంది
 యవ్వయంచు సపర్య § లాచరించు కుశాది, పౌత్రులఁ గనుఁగొని § ప్రాశిఁ జెంది
 సీత వోయినచింతఁ § జెందనీక భజించు, నూర్మిళాదులఁ జూచి § యూఱడిల్లి

తే. యెల్లబంధులఁ బోషించి యిహసుఖంబు, లెల్లఁ గని యెల్లసవతుల యుల్లమలర
నడచి నడిసన్న కౌసల్య నాథుఁ డున్న, లోకమున కేఁగెసుతు లెల్ల శోక మొంద.
వ. అప్పుడు 149
క. తల్లీ సాధ్వీలోకము, తల్లీ మముఁ బాసి పోవఁ దగునే యనుచుం
దల్లడమందుచు రఘుపతి, తల్లికిఁ బరలోకవిధులు తగ నొనరించెన్. 150
చ. పతి కడ కామె చన్న యొక పక్షములోపల నేఁగెఁ గేకయ
క్షితిపతిపుత్త్రియున్ విభుని చెల్మికి నంతటిలోఁ గ్రమంబునం
గతిపయవాసరంబులకుఁ గాంతునిఁ జేరె సుమిత్రయున్ నయ
వ్రత లయినన్ సపత్నులు పరస్పరసౌఖ్యము లోర్వ రెయ్యెడన్. వ.అప్పుడు.
క. ఆమాతలఁ గూర్చి రఘు,గ్రామణి మహీసురుల కొసఁగె రత్నాభరణ
స్తోమంబులు హేమంబులు, గ్రామంబులుఁ బారలౌకికక్రియలయెడన్. 153
చ. అతులవిభూతి మీఱఁ బితృయజ్ఞము లిట్టు లొనర్చి రామభూ
పతి యశుచిత్వముం దొరఁగి బంధుపురోహితమంత్రిసోదరా
న్వితుఁ డయి యొక్కనాఁడు మహనీయసభం గొలువున్నఁ గేకయ
క్షితివరుదూత వచ్చి నుతిఁ జేసి కరంబులు మోడ్చి యిట్లనెన్. 154
ఆ. స్వామివారికడకు మీమామ తమపురో,హితునిఁ బంపె నాతఁ డిదిగొ వచ్చు
చున్నవాఁడు నేను మున్నుగాఁ దెలుప వ, చ్చితి నటన్న నృపతిశేఖరుండు.

రామునికడకు గార్గ్యమహాముని వచ్చుట.

చ. అలరుచుఁ గేకయాధిపతి యంపినగార్గ్యునికిన్ వినీతి హె
చ్చిల నెదురేఁగి వందనముఁ జేసిన దీవన లిచ్చి యాతఁడున్
విలసితలీల మించుపది వేలహయంబుల రత్నభూషణా
వళుల ధనంబులన్ వివిధవస్తుచయంబు లొసంగెఁ గాన్కగన్. 156
ఆ. అవి పరిగ్రహించి యివి యేల తెచ్చితి, రింతవింత చేతు రేయటంచు
నతనిఁ దోడి తెచ్చి యర్ఘ్యాదు లిచ్చి య,గ్ర్యాసనమున నుంచి యధిపుఁ డనియె.
చ. లలితగుణాబ్ధి మీకుఁ గుశలంబె కదా ఘనుఁ డస్మదీయమా
తులుఁడు సుఖించునే వినయదోహలుఁ డాయనతండ్రి వైభవభ్రా
జ్వలుఁ డయి యున్నవాఁడె శుభవంతులె పుత్త్రులు గూర్మి మాపయిం
గలదె త్వదాగమంబునకుఁ గారణ మేమి గణింపవే యనన్. 158
మ. మృదువాక్కోవిదుఁ డమ్మునీంద్రుఁ డనియెన్ మీమాతులుం డయ్యుధా
జిదిలాధీశ్వరుఁ డార్యబంధుయుతుఁడై క్షేమాన నున్నాఁడు ప్రే
మ దలిర్పన్ శుభశీలురన్ మిముఁ బరామర్శింప నన్ బంపినాఁ
డది గాకిం కొకవార్త దెల్పు మనినాఁ డాలింపు ముర్వీశ్వరా. 159
శా. గంధేభప్రతిమానవిగ్రహు లుదగ్రస్యందనుల్ బాహుగ

ర్వాంధుల్ సింధుతటోభయాశ్రితులు మాయా యుద్ధబద్ధాశయుల్
గంధర్వుల్ శరచాపధారులు ప్రజం గారించుచున్నారు దు
స్సంధుల్ వారలఁ బట్టి చంపి బుధులన్ సంరక్ష సేయందగున్ 160

ఉ. ధారుణికిన్ భరం బయిన దారుణచిత్తుల సంహరించినన్
భూరియశంబు పుణ్యమును బొందెడి నేకద గల్గు రాజ్యము
ల్వారత మించు నీసుతుల లోపల నెవ్వరినైన నిర్వురన్
వారక యచ్చటన్ నిలుప వచ్చుఁ బ్రజావలి హెచ్చు నందునన్. 161

తే. అనియు నీమామ పనిచినాఁ డనిన రాముఁ, డెవ్వనికుమారులవీరు లెందఱుగల
రనినవారెల్లమూఁడుకోట్ల వనినాథ, ఖలులు శైలూషసుతులంచు గార్గ్యుఁ డనిన.

చ. విని కడు సమ్మతించి రఘువీరుఁడు గర్గ్యునిఁ జూచి పల్కె నో
మునివర యద్దురాత్ముల నమోఘశరాహతి నుక్కడంచి శౌ
ర్యనిధులఁ దక్షపుష్కరుల నాత్మతనూజుల నందు నిల్ప నా
యనుజలలాముని న్భరతు నంపెద రేపు బలాన్వితంబుగన్. 163

తే. విభవములమించుగంధర్వవిషయములకుఁ, బట్టములుగట్టఁబని చెదభరతసుతుల
నీక్షణంబువ నని వారి కిర్వురకును, జెలఁగి పట్టాభిషేకముల్ సేసె విభుఁడు.

భరతుఁడు రామాజ్ఞచే గంధర్వులమీఁదికి యుద్ధమునకుఁ బోవుట

ఉ. ఇట్టులఁ దక్షపుష్కరుల కిర్వురకున్ రఘుభర్త పట్టముల్
గట్టి వినీతుఁడౌ భరతుఁ గన్గొని గార్గ్యులఁ గొల్చి రేపె శా
పిన్నట్టల మైనబల్మిఁ బొలియింపుము వైరులఁ గట్టు మచ్చటం
బట్టణయుగ్మమందులఁ గుమారుల నిల్పుము రమ్ము నావుడున్. 165

చ. సవినయబుద్ధి నాతఁడు హసా దని యమ్మఱునాఁటివేకువన్
దివసముఖోచితక్రియలు దీర్చి కుమారులతోడ వచ్చి రా
ఘవునకు మ్రొక్కి దీవనలఁ గైకొని వీడ్కొని యంగిరస్తనూ
భవునిఁ బురస్కరించుకొని పౌరుష మొప్పఁ జనెన్ జయార్థియై. 166

వ. అప్పుడు. 167

సీ. అతిఘోరఘీంకారకృతవైరి మదవారణములైనమదవారణములు గదలె
ఘనఖురోద్ధతరజోంధకారాంధహరిసైంధవములైనబహుసైంధవములునడచెఁ
జటులకేతన కాండచలితతారామండలము లైనరథమండలములు దరలె
వీతిభాగభియాతివిదళనోద్ధతహేతి, కోటియైనపదాతికోటి వెడలె

తే. నందు భేరీధణంధణల్ గ్రందుకొనియె, శంఖభుంభుంనినాదముల్ సందుకొనియె
మురజపణవాదిఘోషముల్ ముందుకొనియె, నమితకాహళరవము మిన్నందు[కొనియె.

శా. ఈలీలన్ బహుసేనఁ గూడి భరతుం డేఁగంగ నాతోవలోఁ
గాలగ్రీవుఁ డితండె సుమ్ము మనకున్ గంధర్వమాంసాదులం

గీలాలంబులఁ దృప్తి చేయ ననుచుం గీర్తింపుచుం భూతభే
తాళక్రూరపిశాచకోటి నడచెం దండంబులై వెంబడిన్. 169

క. ఆలాగె యనుసరించె న్మృగాలవృకవ్యాఘ్రముఖమృగంబులు ఖగముల్
నేలయు నింగియు నెఱసె వి, శాలచమూకలకలము శిక్షాచార్భటులున్. 170

వ. ఇవ్విధంబున. 171

మ. నెలమీఁదం బదియేనునాళ్లకు మహానీకంబుతో నాత్మమా
తులుప్రోల్ చేరి యతండు నిల్వ రహి నందుం డాఁటికిం నిల్చి వెం
పలరంగా మఱునాఁడె కేకయులు సాహాయ్యంబు రా శాత్రవుల్
గలఁగం రామసహోదరుండు సనియెం గంధర్వదేశంబుపైన్. 172

మ. పటహధ్వానములుం భటార్భటులు నశ్వక్రోధయోఘచ్ఛటా
ఘటితేష్వాసగుణధ్వనుల్ నిజపదాగ్రక్షైభకనిర్భేదనో
ద్భటలీలం నిగుడం దదాగమనవార్తల్ విన్నవారౌట నా
క్కట గంధర్వులు వచ్చి తాఁకి రలుకం గాకుత్స్థసేనావలిన్. 173

క. కడలిం గడలి యెదుర్కొను, కడిమిం భరతేంద్రుసేన గంధర్వులపై
వడి నిగుడ బెడిదముగఁ దల, పడి పోరెడునపుడు పోరు భయదం బయ్యెన్.

క. నిలునిలుమను నెలుఁగులు తల, తలమనియెడు నెలుఁగు లుఱికితాఁకెడియెలుఁగుల్
కిలకిల నార్చు నెలుంగులు, బళిబళి యను నెలుఁగులును నభం బవియించెన్.

సీ. నడుచుచప్పుడు డాసిపొడుచు చప్పుడుఁ గేక, వ్రేయుచప్పుడు దొమ్మిసేయుచప్పు
డాఁగుచప్పుడు చెలరేఁగుచప్పుడుఁ గత్తు, లొరయుచప్పుడు నూఁకివిరియుచప్పు
డెదిరించుచప్పుడు బెదరించుచప్పుడ, గ్గించు చప్పుడు హుంకరించు చప్పు
డదలించుచప్పుడు విదళించుచప్పుడుఁ, బిలుచుచప్పుడుఁ బురికొలుపుచప్పు

తే. డుభయసేనల సమరీతి నుప్పతిల్లి
మిక్కుటపుఁగిక్కు చదలాని పిక్కటిల్ల
మనుజయోధులు శైలూషమనుజయోధు
లేడహోరాత్రములు పోరి రీరసమున. వ. మఱియును. 177

సీ. చరణాహతుల భూమి జనియించురజముచే, నిఖిలదిక్కుల నిగ్గు నించినించి
జళిపించువిచ్చుకత్తులసల్లఁ దులకించు, మించులు దివి యెల్ల ముంచిముంచి
జముఁడు బిట్టాడించుజంత్రంపుబొమ్మల, ట్లలఁతిఁ జెందక క్రుమ్ములాడి యాడి
కుసుమితాశోకాళికొమరునఁ గ్రొత్తనె, త్తుటివాఁకలను దోఁప్పఁదోఁగితోఁగి

తే. చెయ్వు లుడియంగ మూర్ఛలఁ జెంది చెంది
యలవుకలిమి నొకింతలోఁ దెలిసి తెలిసి
సింహములలీల గర్జనల్ సేసి చేసి, యుభయయోధులు పోరాడి రొక్కమొగిని.

వ. అప్పుడు. 179

తే. ఒరలుమదకరు లుర్విపైఁ బొరలుహరులు
విఱుగుతేరులు బలమేది యొఱఁగుభటులు
వ్రాలుపడగలు నెత్తుటఁ దేలుగొడుగు, లలబలములందు రెంటను గలిగియుండె.

సీ. పాలసులేకాతిప్రేగులు మాఁడియున్న ప్రేతవ్రాతములబడలికలు వాసెఁ
బ్రమదల కస్థిహారము లియ్యఁగోరిన, డాకినీతతియభీష్టములు గల్గెఁ
గీలాలనదులలోఁ గేళి సల్పఁ దలంచు, శాకినీసమితిముచ్చటలు దీరెఁ
బచ్చిపీనుఁగులకై బహుదేశ మరుపెంచి, నట్టిబేతాళులయాత్మ లలరెఁ

తే. గ్రొవ్వు మజ్జయు మెదడును గూర్చి బ్రహ్మ, రాక్షసశ్రేణులకు సమారాధనంబు
సేయ నెంచినదయ్యంపుఁ జెలులయెన్ని, కలును ఫలియించె నమ్మహాకదనమునను.

శా. ఆలోనం బగవారిఁ గన్గొఱఁగి మాయామాయుద్ధలీలారతిన్
శైలూషాత్మజు లంబరస్థు లయి మజ్జామాంసచర్మాస్థులన్
శైలాదుల్ గురియించి సేన నొగిలింపం గాంచి కల్పక్షయ
క్ష్వేలగ్రీవునికై వడిన్ భరతుఁ డక్షీణక్రుధాక్రాంతుఁడై. 182

శా. సంవర్తారుణమండలస్ఫురితతీక్ష్ణజ్యోతిరుజ్జృంభి యౌ
సంవర్తాస్త్రము వింటఁ బూన్చి జగముల్ శంకించఁగా నేసినన్
సంవర్తాశుగవేగ మొప్ప నదియున్ జ్వాలాస్ఫులింగోగ్రమై
సంవర్తాగ్నివలెన్ దహించె నపు డాశైలూషజశ్రేణులన్. 183

క. ఈరీతి మూఁడుకోట్ల మ, హారథికుల క్షణములోన నడఁగించినయా
ఘోరాస్త్రరాజ ముపసం, హారము గావించె భరతుఁ డమరులు పొగడన్.

{ భరతుండు గంధర్వులం బరిమార్చి తనకుమారు లగుతక్ష
పుష్కరులం దద్రాజ్యంబున నిలిపి యయోధ్యకు వచ్చుట. }

మ. భరతుం డీగతి నుగ్రశాత్రవతతిన్ భంజించి తద్దేశముల్
సరసప్రౌఢిమ నాక్రమించి ప్రజ రంజింపన్ సింధుభూమిన్ సము
గ్రరమావైఖరి మించ నొక్కపురమున్ గాంధారధాత్రిన్ శుభా
కరశిల్పోన్నతిఁ గాంచు నొక్కపురముం గల్పించి మోదించినన్. 185

ఆ. పొసఁగఁ దక్షశిలయుఁ బుష్కరావతియు నా, [illegible] లాదరించి స్వర్గభంగిఁ
దనరుతక్షశిలను దక్షుని బుష్కరా, వతిని బుష్కరాఖ్యసుతుని నిలిపె. 186

చ. పురముల రెంట నిక్కరణిఁ బుత్త్రకులన్ నిలిపి పొంగి నిల్చి యా
భరతుఁడు నాఁడు నాఁటి కలపట్టణముల్ ధనధాన్యవస్తుభా
స్వరములుగా ద్విజాతినృపవైశ్యభటాదినికాయవైభవా
కరములుగా రథేభతురగస్ఫురితంబులుగా నొనర్చినన్. 187

సీ. రాజతజ్యోతిర్విపరాజితస్త్రాగార, రాజితప్రాకారరాజి దనరి
చంద్రమండలతుంగచంద్రమండితశృంగ, చంద్రశాలాభంగశాలలఁ దగి

రమణీయతరవాసరమణీప్రఘూర్ణిత, రమణీస్ఫురితగోపురములు వెలసి
రాజరాజధనోత్కరరాజసంవాస, రాజమార్గములచే రహి వహించి
తే. కేళికాసారవాపికాఖేయకూపకృత్రిమకుధరోపవనదేవగేహమందు
రాధ్వజవిచిత్రకుడ్యతోరణవిశేష, భాసురశ్రీల నొప్పె నప్పట్టణములు. 188
క. అలకామరావతులక్రియ, నలరెడు నప్పట్టణముల నైదేండ్లలమిన్
నిలిచి కుమారుల వీడ్కొని, బలువేడుక రాముకడకు భరతుఁడు వచ్చెన్.
తే. వచ్చి పరమేష్ఠి సర్చించువాసవుఁడనఁ, బోలె నతఁ డన్న పాదాబ్జములకు మ్రొక్కి
యతులమణిపూజ యొనరించి యరివధంబు
మున్నుగాఁ గలకార్యముల్ విన్నవించె. 190
తే. విన్నవించినరఘురామవిభుఁడు సంతసించి తమ్ముల నిరువురఁ గాంచి యనఘు
లార మనయాత్మీయులకై నపురము, లెవ్వియనఁ గైకయీపుత్త్రుఁ డిట్టులనియె.
ఉ. అంగధరాంగనామణికి సంగడమై తగునంగదీయ మి
య్యంగదుఁ డేలు నుత్తరదిశాభరణంబనఁ జంద్రకాంతసం
జ్ఞం గర మొప్పు వోల్ తదనుజన్ముఁడు గైకొను నట్లు సేయుఁ డ
న్నం గడు సంతసిల్లి రఘునాయకుఁ డుంచితవాసరంబునన్. 192
తే. అట్ల వారికిఁ బట్టముల్ గట్టి పశ్చి, మమున నంగదు నిలుప లక్ష్మణునిబనిచెఁ
జంద్రకేతుని మల్లదేశమున నునుప, ననిచె భరతునిసమముగా బలములొసఁగి.
చ. పనిచిన వారు నవ్విభుఁడు పంచినకైవడి నందు నందు న
త్తనయుల నుంచి వారికి హితం బుపదేశ మొసంగి రాజ్యముల్
పనుపడ నొక్కవత్సరము పాయక తాము వసించి తత్తదా
ర్యనుతుల వారి వీడ్కొని నిజాగ్రజుఁ గొల్వఁగ వచ్చి రయ్యెడన్. 194
ఆ. వచ్చి కొలుచునసుజవరులతో రఘుభర్త, దనరె గార్హపత్యదక్షిణాగ్ను
లనుసరింప వెలయు నాహవనీయాగ్ని, పగిది విష్ణుమహాంశులు వెలుఁగ. 195
ఆ. ఇవ్విధమున రాముఁ డేకాదశసహస్ర, వత్సరములు పరమవైభవమున
నేల నాల్గుచెఱఁగు లేలెఁ ద్రేతాయుగం, బాదియుగములీల నతిశయిల్ల.
క. ఘనమతులు భరతలక్ష్మణు, లనవరతము రామసేవనాసక్తమతిం
దనరుచుఁ గాలము చేరువ, యని యెఱఁగియుఁ గలఁగకుండి రాననమునన్.

యముఁడు మునివేషధారియై రామునికడకు వచ్చి రహస్యంబున బ్రహ్మవాక్యంబులు దెలుపుట.

సీ. తనశోణతారకాంతరకాంతిచంచల, చంచలాంచజ్జటాచ్ఛటల నుంచి
తనచతుర్దంష్ట్రికాఘోషఘోషిల్ పరిశుద్ధ, భసితాంగరాగసంపదల నుంచి
తనకేలిదండంపుదండితనంబెల్ల, హస్తస్ఫురద్బృసీహస్తయష్టి నిలిపి
తననిండుమేనికంటెసచాయ కటిబద్ధ, సవ్యకృష్ణమృగాజినమునఁ బూన్చి
తే. శాంతభావంబు గరుణాప్రసన్నముఖము, నిర్మలోదకపూర్ణకుండికయుఁ దనర

జటిలవేషంబు ధరియించి జముఁడు వెలిహజారమున కేఁగుదెంచి లక్ష్మణునిఁ గని

ఉ. ఇచ్చటి కొక్కతాపసకులేశ్వరుఁ డంపఁగ నేను దూత నై (యె.
వచ్చితిఁ బద్మబంధుకులవర్యునిఁ గన్గొని మాటలాడఁగా
నచ్చతురాత్ముతోఁ దెలుపు మయ్య మదాగమనంబు నావుడుం
జెచ్చెర లక్ష్మణుండు నృపుఁ జేరి కరంబులు మోడ్చి యిట్లనున్. 199

చ. దినకరతీక్ష్ణతేజమున దృష్టికి వ్రేఁ గొనరించుచున్నవాఁ
డనితరధర్మమూర్తి యొకయార్యునిదూత తపస్వి దేవరం
గనుఁగొని మాటలాడుటకుఁ గా మొగసాలకు వచ్చి నిల్చినాఁ
డన విని రాముఁ డాతని రయంబునఁ దోడ్కొని రమ్ము నావుడున్. 200

చ. అతఁడును శీఘ్రయానమున నమ్మునిఁ దోకొని వచ్చునంతలోఁ
బతి యెదు రేఁగి నమ్రుఁ డయి పాద్యము మున్నుగఁ బూజ లిచ్చి యు
న్నతకనకాసనస్థితు నొనర్చి ప్రసన్నత మించి పల్కె నో
యతులవివేక యెవ్వ రిట కంపఁగ వచ్చితి వానతియ్యవే. 201

చ. మిముఁ గనుఁగొన్నయంత నలమిత్రునిఁ జూచినయట్లు మానసా
బ్జ మలరె నామ మేమి తెలుపం గదె యన్న నతం డనుఙ్ రహ
స్యముగ వచింతు నిజ్జనుల నందఱఁ బంపుము రామ నీవె కా
క మఱి పరుల్ వినంగ నధికారులు గారు మదీయవాక్యముల్. 202

క. అదిగాక యిర్వురమును స్వహృదయులమై మాటలాడునెడ నిచటికి నీ
తి దొలంగి వచ్చినాతని, విదళించెద వేనిఁ గార్యవిధ మెఱిఁగింతున్. 203

చ. అన విని కొంతసేపు హృదయాబ్జమునం దలపోసి మంచిదే
యని సభ నున్నయందఱఁ బ్రియంబునఁ బంచి విభుండు లక్ష్మణుం
గనుఁగొని నీవు వాకిటనె కాచుకయుండు మి టెవ్వరైన వ
చ్చిన నిది వేళ గా దని వచింపుము పొమ్మని పల్కె నయ్యెడన్. 204

క. ఆకుహనాముని శేఖరుఁ, డేకతమున నున్నరాఘవేశ్వరుఁ గని సీ
తాకాంత బ్రహ్మ పనుపఁగ, నీకడ కేతెంచినాఁడ నే నంతకుఁడన్. 205

ఉ. ఈవు నృపాలమాత్రుఁడవె యీసచరాచరభూతకోటికిన్
దేవుఁడ వైనవిష్ణుఁడవు దేవకిరీటచిరత్నరత్నశో
భావృతపాదపద్ముఁడ వనాది వనంతుఁడ వబ్జగర్భుఁ డి
య్యావినిపింపు మన్నవిధ మంతయు నూఁకొను ముగ్గడించెదన్. 206

సీ. ఆదికాలమ్మున క్షీరాబ్ధిలోఁ జిలువమ, న్నినిపైఁ బవళించి నిదురఁ జెంది
కొన్నికల్పము లరుగుటయు మేల్కనిభవ, న్నాభిఁ బుట్టినతమ్మినను సృజించి
నీవీనులందె జన్మించిన మధుకైట, భాఖ్యులం ద్రుంచి తదస్థితతుల
ధరములు మెదడున ధాత్రియుఁ గల్పించి, లోకాధిపత్యంబు నా కొసంగి

తే. బాధలిడుదైత్యులవధింపఁ బ్రతినఁబూని, వెనుక రావణుచేనొచ్చి వేఁడుకొన్న
సురల రక్షింప దశరథసుతుఁడ వగుచు, నవతరించితి వని నొంచి తనురవరుని.
తే. మొదటఁ బలికిన చందానఁ బదునొకండు, వేలయేం డ్లుర్వి యేలితి వేలయింకఁ
దామసము సేయ రమ్మాత్మధామమునకు, నిలుము రాజ్యేచ్ఛగలిగిన నేల నధిప.
చ. అని పరమేష్ఠి దెల్పు మనె నంచుఁ బకేతవిభుండు పల్కినన్
విని చిఱునవ్వు నవ్వి రఘువీరుఁడు వారిజసంభవుండు ప
ల్కినదె హితోక్తి గావలయుఁ గృత్యము లన్నియు నయ్యె నిష్యెషం
బను లిఁక లేవు వచ్చెదఁ బ్రభావనిధీ యని పల్కు చున్నెడన్. 209

దుర్వాసుఁడు క్షుత్పీడితుండై రామునికడకు వచ్చుట.

సీ. అనసూయగర్భశుక్తిని రూపుఁగని యేమ,హర్షి ముక్తాగ్రగణ్యత వహించె
నత్రిసంయమితపోధాత్రీరుహామున కే,యతివరేణ్యుఁడు ఫలాకృతి రహించె
నింద్రు రాజ్యవిభూతి నేమౌని శాపాఖ్య,రావలివాయువై యబ్ధిఁ గలిపె
రుద్రునియత్యుగ్రరోషాగ్ని యేమునీశ్వరునిచందమున గోచరతఁ జెందె
తే. నట్టిదుర్వాసుఁ డవ్వేళ నరుగుదెంచి, మొసలవసించురాముత మ్మునిఁ గనుఁగొని
యధిపుతోఁ దెల్పు మారాక యనిన నతఁడు
నెంతయు వినీతుఁడై మ్రొక్కి యిట్టు లనియె. 210

మ. జటిలాగ్రేసర వేళ గాదు రఘువంశస్వామి యేకాంతలం
పటచేతోగతి నున్నవాఁడు క్షమియింపం జెల్లు నొక్కింతసే
పటకున్ నాకును బోవరా దనిన రోషాగ్నిజ్వలజ్జ్వాలికా
చటులక్రూరకటాక్షుఁడై యతఁ డనున్ సౌమిత్రితోఁ గ్రమ్మఱన్. 211

చ. నను నిలుపన్ బితామహజనార్దనశంభులకైన శక్తి లే
దనఁగ నొకండు శక్తుఁడె నృపాగ్రణి కీవు మదాగమంబు దె
ల్పనిపని నిక్కమేని హితబాంధవమంత్రులతో ధనంబుతోఁ
దనయులతో మిముం గినిసి దగ్ధులుగా శపియింతు నావుడున్. 212

తే. గడగడ వడంకి పెక్కండ్రు మడియుకంటెఁ నరయనొక్కనిచావు మేలనితలంచి
రాఘవునిఁ జేరి మ్రొక్కి దుర్వాసుఁ డిపుడు
దేవ యరుదెంచినాఁ డంచుఁ దెల్పుటయును. 213

ఉ. వాసరరాజవంశమణి వాసరరాట్సుతు వీడుకొల్పి దు
ర్వాసునిఁ జేరఁ బోయి యభివందనముల్ ఘటియించి యేల వి
చ్చేసితి రేమిపూజనలు సేయుదు నాన్నుడు వేయిదేండ్లు నేఁ
జేసినబత్తపంబునఁ గృశించితి నాఁకలి దీర్చవే యనన్. 214

చ. వడియము లొల్పుఁబప్పుఁ గలవంటకముల్ వరుగుల్ ఫలాదులుం
బడిదము లప్పముల్ వడలు పాయసముల్ కలమాన్న మాజ్య మ

ప్పడములుఁ గూరలుం బెరుగుఁ § బచ్చడు లాదిగ నించి భోజనం
బిడిన నతండు మెచ్చుచు య§థేష్టముగా భుజియించి పోయినన్. 215

క. కీనాశునిసమ్ముఖమునఁ, దా నూనినప్రతిన దలఁచి § దశరథసూనుం
డాననము వంచి ధైర్యవిహీనుండై దీనవృత్తి § నిట్లని వగచెన్. 216

లక్ష్మణుండు రామపరిత్యక్తుండై సరయూనదిం గ్రుంకి దివంబున కరుగుట.

చ. కటకట యేల యిచ్చటికిఁ § గాలుఁడు వచ్చె మహాప్రతిజ్ఞ యే
మిటికి నొనర్చితిన్ సుజన§మిత్రుని నాసహజన్ముఁ బాసి నే
నెటువలె నిల్తు నెట్లు వచి§యింపుదు నివ్విడమాట యెవ్వరుం
గటకిమనంబుతోడ నవ§కార్యము లిట్టివి యాచరింతురే. 217

సీ. స్వచ్ఛందనాంగనా§సౌఖ్యముల్ వర్జించి, నాతోడఁ దొల్లి కా§నలకు వచ్చె
నెడపక పదునాలు§గేండ్లు నిద్రాహార,ములు మాని నాకు సే§వలు ఘటించె
సీతఁ బాసినవంతఁ § జెందనియ్యక ధైర్య, మొదవ మాటాడి స§న్నుపచరించె
రణరంగమున మద§ర్థమ్ముగా నతికాయ, శక్రజిత్ప్రముఖుల § సంహరించె
తే. హృదయ మెఱిఁగి ప్రవర్తించె § నిన్నినాళ్లు,నిట్టిహితునిట్టివిశ్వాసి§నిట్టియాప్తు
నిట్టితమ్మునిఁ బ్రతినకై § యెట్లునొంతు, నేమిసేయుదుఁ దుది దైవ§మెంత చేసె.

వ. అని శోకబాష్పాకులితనేత్రుండై యద్దశరథపుత్త్రుండు పెక్కుభంగులం బనవి పనవి కన్నీరు కరతలంబునం దుడుచుకొని యెట్టకేలకు నెప్పటియెలుంగు నూల్కొల్పి చెంగట నున్నయనుంగుఁదమ్మునిం గనుంగొని యిట్లనియె. 219

చ. అలుక వహించి యత్రికొడు § కాఁకటిపెల్లున రేఁగి యందఱం
బొలియఁగఁ దిట్టి పోయినను § బోదుము నెమ్మది నాత్మహానికి
న్దలఁకక యేల వచ్చితివి § నాయెడకున్ సడి కోర్చి నిన్ను ని
ర్మలు నెడఁబాసి నొంటి నిఁకఁ § బ్రాణము లెట్లు భరింతుఁ దమ్ముఁడా. 220

క. ప్రతిన యొనర్చిననెపమున, మృతిఁబొందం జేయు ననుచు § నేమాయి ననున్
సతతంబు నమ్మి కొలిచితి, వతులగుణాభరణ లక్ష్మణా యని వగవన్. 221

ఉ. ఆరఘువీరుఁ జూచి విన§యంబున లక్ష్మణుఁ డిట్లనున్ ననుం
గూరిచి చింతసేయకుము § కోవిదు లాపదలం గలంగ రె
వ్వారికిఁ గాలముం గడవ § వచ్చునె మీరు ప్రతిజ్ఞఁ దప్పినన్
ధారుణి గ్రుంగదే స్వకుల§ధర్మము మానుదురే నరాధిపుల్. 222

చ. ఎలమి వహించి నన్నుఁ ద్యజి§యింపక యుండితిరేనిఁ బల్కులం
గలయు నసత్య మందులకుఁ § గారణ మేఁ గన నన్నుఁ జెందుఁ ద
త్ఫల మటు గాకయుండ నర§పాలక నన్నుఁ దొఱంగి సత్యమున్
విలసితకీర్తియున్ నిలుప§వే యన రాముఁడు ఖేద మందుచున్. 223

క. కులగురుఁడైనవసిష్ఠుని, నలఘుమతుల మంత్రివరుల § నార్యుల హితులం

బిలిపించి జముని రాక మొదలుకొని సకలంబు దెలిపెఁ దత్సభ్యులకున్. 224

చ. తెలిపి వినీతు సోదరుఁ బ్రతిజ్ఞ యటంచుఁ ద్యజింపఁ గూడునే
తలఁకెడిఁ జిత్త మెయ్యది హితం బెఱిఁగింపుఁడు మీర లిందఱుం
గలఫల మన్న నొండొరుమొగంబులు చూచుచుఁ దేర్చి యెద్దియుం
బలుకఁగ నేర కూరక సభాసదు లున్న వసిష్ఠుఁ డిట్లనున్. 225

చ. ప్రతిన యటంచు లక్ష్మణునిఁ బాయుట యెట్లన నేల రామ నీ
ప్రతిన దొలంగినం బలు కబద్ధ మనంబడు నయ్యసత్యతన్
హత మగు ధర్మ మానుకృత మంతముగా జగముల్ నశించు లో
కతతులు పెక్కునాశ మగుకంటె సహోదరుఁ డొక్కఁ డెక్కుడే. 226

చ. సకల మనిత్య మెప్పటికి సత్యము నిత్యము సత్యసంధులై
ప్రకటయశోవిభూతి మనరా మనరాజు లసత్య మాడ నో
పక కద నిన్నుఁ గానలకుఁ బంచె భవజ్జనకుం డెఱుంగవే
యకుటిలసత్యసంపద జనాధిప కీర్తి వహింపు నావుడున్. 227

క. ఆమాటలు విని సభ్య, స్తోమము విధి చెట్ట యనుచు దూఱఁగ రామ
స్వామి కడుఁ దెగువ చేకొని, సౌమిత్రిం జూచి ధైర్యసంపద ననియెన్. 228

చ. ఎడపక యెంతతప్పు ఘటియించినచో నినువంటితమ్ముని౦
గడఁగి వధింపఁ జాల నధికప్రతిభాన్వితులైనవారికి
న్విడుచుట చంపుటొక్కగతి నిన్నుఁ ద్యజించితి నీకు నిచ్చయా
నెడ కిఁక నేఁగు మన్న నతఁ డెంతయు శోకవిషాదమూర్తియై. 229

చ. అడలుచు నన్నపాదముల కప్పుడు సాఁగిలి మ్రొక్కి యాప్యుల
క్కడిజనముల్ విభుండుఁ దనుఁ గన్గొని యశ్రులు నించఁ గొల్వు వె
ల్వడి సరయూతరంగిణి కవార్యధృతిం జని క్రుంకి యోగ మ
య్యెడ ధరియించి యాత్మఁ దనయెప్పటిరూపు దలంచునంతలోన్. 230

చ. ఎలమిఁ బ్రసూనవృష్టి గురియింపుచు నింద్రుఁడు వచ్చి శంఖకా
హళములు మ్రోయ రంభ మొదలైనచెలుల్ నటియింప సమ్మహో
జ్జ్వలనిధి మేనితోడఁ ద్రిదివంబునకుం గొనిపోయె వేడ్క నం
దలిబుధు లార వచ్చె హరినాలవపా లని ప్రస్తుతింపఁగన్. 231

తే. దివమునకు నిట్లు లక్ష్మణదేవుఁ డరిగి, యచట దివిజులచేఁ బూజలంది కోటి
భానుబింబప్రభాభాసమానుఁ డగుచు, నిత్యముక్తాశ్రయంబైన నెలవుఁ జేరె.

శా. అంత వసిష్ఠముఖ్యు లగునార్యులఁ గన్గొని రాముఁ డిట్లనున్
వింతగఁ దోఁచుచున్నయది విశ్వము లక్ష్మణుఁ బాసి నిల్వలే
నింతటనుండియున్ భరతు నిప్పుర మేలెడునట్లు సేసి లో
కాంతరగామి యైనభరతానుజునిం దిలకింప నేఁగెదన్. 233

చ. అన విని భీతుఁడై భరతుఁ డన్నకుఁ జాఁగిలి మ్రొక్కి పల్కె నో
యినకులనాథ యీధరణి యేటికి నింద్రపదాధిపత్య మి
చ్చిన మిముఁ బాసి నే క్షణముసే పయినన్ వసియింపఁజాల మీ
కనిశము సేవఁ జేయుటయె యంచితరాజ్యము వేయు నేటికిన్. 234

క. నరవర కోసలదేశము, పరిపాలన సేయఁ గుశునిఁ బట్టము గట్టుం
డురుకృప నుత్తరకోసల,ధరణికిఁ బతిఁ జేయుఁ డతనితమ్ముని ననఁగన్. 235

చ. అనియె వసిష్ఠుఁ డో రఘుకులాధిప మీపలు కాలకించి యీ
జను లెడఁబాయలేనివెత జాలి నహించిరి వీరిఁ దేర్పఁగాఁ
జను నన రామచంద్రుఁడు ప్రసన్నత నాప్రజఁ జూచి మీరు కో
రినపని యేమి దెల్పుఁ డొనరించెద నెట్టిది యైన నావుడున్. 236

ఉ. పౌరులు మంత్రులున్ భటులు బంధులుఁ బ్రాంజలు లూని నిల్చి యో
కారుణికాగ్రగణ్య కలకాలముఁ బ్రోచి మముం ద్యజించి పో
మేరయె పుత్త్రపౌత్త్రసఖమిత్త్రసహోదరగేహినీసుహృ
ద్వారముతో మిముం గొలిచి వచ్చెద మెక్కడఁ జన్న నావుడున్. 237

క. ఎలనగ వోలయ రఘూద్వహుఁ, డల మనుజులమనవివినిశ్చితాంతునిపలుకుల్
దలఁచుకొని మంచి దనియెం, గలవె సమర్థుల కసాధ్యకార్యము లెందున్.

రాముండు కుశలవులకుఁ బట్టము గట్టుట.

క. కోసలకన్యాసుతుఁ డిటు, లాసించినయట్టి ప్రజల నలరించి కృపం
గోసలదేశమునకుఁ బతిఁ, జేసెఁ గుశు విపక్షకరటిఘటాంకుశునిన్. 239

క. లవు నంఘ్రిద్యుతిజితప, ల్లవు నంగవిలాసవిభవలజ్జితరతిప
ల్లవు నుత్తరకోసలమున, కవనీశ్వరుఁ డధిపుఁ జేసె నార్యులు మెచ్చన్. 240

ఆ. ఇటుల దొరలఁ జేసి యిద్దఱు సుతులకుఁ, బ్రేమ నిచ్చినట్టిభూములందు
రావణాహితుఁడు కుశావతి యనుప్రోలు, శ్రావితాఖ్యపురము సంఘటించె. 241

ఉత్సాహ. దేవతాసరిత్సరోజదేదివన్మరాళసం
భావితాభ్రవిభ్రమభ్రమస్ఫురత్సురేశ్వర
గ్రావబద్ధగోపురప్రకాశముల్ కుశావతీ
శ్రావితాభిధానసత్పురంబు లొప్పె నెంతయున్. 242

చ. పురయుగ మిట్లొనర్చి యటఁ బుత్త్రులఁ బంపెడువేళ రాఘవుం
డిరువురకున్ సమానముగ నిచ్చె రథేభభటాశ్వపంక్తులం
గరుణఁ గనుంగొనన్ జనకకన్యఁ దలంచి కవుంగిలించి త
చ్ఛిరములు మూర్కొనెన్ నయవిశేషము లెల్లఁ దలంచి ప్రేముడిన్. 243

చ. ఇనకులభర్తచేఁ దనయు లిట్లుపలాలితులై తదంఘ్రియు
గ్మనఖవిభల్ స్వఫాలఫలకప్రలసద్ఘనసారరేఖలం

జెనకెఁగ మ్రొక్కి దీవనలు గైకొని వీడ్కొని బాష్పపూర్ణలో
చను లయి పోయి రవ్విభుఁ డొకసంగిన చోట్లకు సైన్యసంగతిన్. 244

శత్రుఘ్నుఁడు తనకుమారులకుఁ బట్టముఁగట్టి రాముని కడకు వచ్చుట.

తే. అంత శత్రుఘ్నుఁ డొడికెరీమ్మని నృపాలుఁ, డాప్తుఁ డగుదూత నొక్కని కనుప వేగి
రమునఁ జని వాఁడు మూఁడహోరాత్రములకు
నధిక సౌభాగ్యమధుర యామధురఁ జేరి. 245

మ. అలశత్రుఘ్నునిఁ గాంచి లక్ష్మణుని కార్యాణంబు పౌరశ్రితా
దులు దామం బతిఁ గొల్చి పోవుటకు నుద్యోగించు టంత్రీయపు
త్త్రులకున్ గోసలభూము లిచ్చి జననాథుం డూర్ధ్వలోకోన్ముఖా
కలితప్రజ్ఞ వహించి యున్కి మొదలౌ కార్యస్థితుల్ దెల్పినన్. 246

క. విని కలఁగియుఁ గలఁగక యా, జ్జననాథసుతుండు ధైర్యసంపన్నతఁ గాం
చనుఁ డనుపురోహితునిఁ బుర,జనములఁ బిలిపించి ప్రియము మెకసఁగ నిట్లనియెన్.

తే. అన్న నెడఁబాసి లక్ష్మణుం డడురపురికి, నేఁగెనఁట యెల్లప్రజలతో నింక విభుఁడు
వెడల నున్నాఁ డటఁట యయోధ్య విడిచి యయ్యె
నంట విలోకించితిరె కాల మొదుగుల వచ్చె. 248

ఉ. రామవిభుండు లేని యమరావతినైన క్షణంబు నిల్వ నీ
యీమధురాపురంబునకు నింక సుబాహు మదగ్రపుత్త్రునిన్
స్వామిగఁ జేసి యుంచి విదిశాపురరాజ్యము శత్రుఘాతికిం
బ్రేమ నొసంగి పోయెదను మీర లనుజ్ఞ నొసంగుఁ డియ్యెడన్. 249

క. అని పలికి వారియనుమతిఁ, గొని యాయాపురములకును గొడుకుల నభిషే
చన మొనరిచి చెలికిసగముగ, ఘనబలముల బంచియొసఁగి గమనోన్ముఖుఁ డై.

క. సుతదారాదుల వీడ్కొని, యతఁ డతిధైర్యమున నొంటి నరదమునన్ శ్రీ
పతిసంప్రేషితదూతా,న్వితుఁ డయి సాకేతమునకు నేతెంచి వెసన్. 251

శా. సందర్శించె మహాసభాంతరమునన్ శత్రుఘ్నుఁ డుద్యత్సదా
నందున్ భూరికుశాసనస్థితు మునీంద్రశ్రేణిసంభాషితున్
సందీప్తానలతేజు శాంతినిరతున్ క్షౌమాంబరోద్ధారు స్వ
చ్ఛందుం జంద్రనిభాననున్ ఘనసదృక్షశ్యామునిన్ రామునిన్. 452

క. సందర్శించి ప్రియంబున, వందన మొనరించి స్వామివారియనుజ్ఞన్
నందనులఁ దగినభూముల,యందు నిలిపి వచ్చినాఁడ నకలంకమతిన్. 253

చ. పలుకులు వేయు నేల మిముఁ బాసి యిఁకన్ క్షణమైన నిట్టిభూ
స్థలమున నిల్వఁ జాల నిది సత్యము నేనును గొల్చి వచ్చెదన్
వల దని యాన తియ్యకుఁడు త్వాదృశు లెయ్యెడ సమ్మియున్నవా
రల విడ రంచు వేఁడుకొన రమ్మనె నాతని రాముఁ డాదృతిన్. 254

వ. తత్కాలంబున.

చ. నరపతియూర్ధ్వలోకగమనంబు చరుల్ వినిపింప ఋక్షవా
నరులు నిశాచరుల్ విని స్వనాథులఁ గూడి యయోధ్య కేఁగుదెం
చిరి వినయంబు మించ రఘుశేఖరుఁ గాంచి ప్రణామముల్ ఘటిం
చిరి కరముల్ మొగిడ్చిరి వచించిరి యి ట్లని యంద ఱొక్కటన్. 256

క. ధరణీనాయక మే మిం,దఱముగ మిముఁ గొల్చి వచ్చుతలఁపున నిటుసం
బఱతెంచితి మెడపక మము, గురుకృప నీక వెంటఁబెట్టుకొని పోఁ దగున్.

చ. అనునెడ భానుసూతి వినయంబున రాముని జేరి మ్రొక్కి యో
మనుకులనాథ దేవవిభుమన్నని వానరరాజ్యపట్టభ
ద్రునిఁగ నొనర్చి మీచరణతోయరుహంబులు గొల్వ వచ్చితిఁ
నను విడనాడి పోవకుఁ డనంబతి సమ్మత మొందె నెమ్మదిన్. 258

క. ఫాలన్యస్తాంజలి యై, యాలోన విభీషణుండు నంతకు రాఁగా
నాలోకించి రఘూద్వహుఁ, డేలా యీతలఁపు రాక్షసేశ్వర నీకున్. 259

చ. ధరణి చరాచరావళులు దాలిచి యుండెడునంతకాలముం
బరమవినీతి లంక పరిపాలన సేయు మిదేల యంచు ను
త్తరములు వల్కి రాకుమ సదా చరియింపుము ధర్మపద్ధతిఁ
నిరతిశయప్రభావమున నెయ్యము మర్వకు మంచుఁ బల్కినన్. 260

క. రామాజ్ఞకు వెఱచి యతం, డేమియు నన నేరకుండె నినకులుఁ డంతః
సామీరిమోముఁ జూచి సు,ధామధురవచోనిరూఢి తగ ని ట్లనియెన్. 261

శా. ఏతన్మాత్రుఁడవే విభాకరకృపాపీయూషసమాసాదిత
శ్రోత్రస్తూత్తరహస్యరాశివి భవిష్యద్ధాత వధ్యాత్మవి
ద్యాతాత్పర్యనిరూఢబుద్ధివి విశుద్ధబ్రహ్మచర్యవ్రతో
ద్ధూతాంభశ్చరకేతనుండ వఖిలస్తుత్యప్రభావోదయా. 262

క. మత్కీర్తిచంద్రికలు యా,వత్కాలము కువలయమున వన్నియఁ గనుఁ దా
వత్కాలముఁ గపిచంద్ర భ,వత్కాయం బమృతగతి ధృతంబుగ నిల్చున్.

క. నామాటలు నిక్కన మగు, నీమదికోర్కియు ఫలించు నిత్యుఁడ వగు మిం
కేమియుఁ బలుకకు మని రఘు,రాముఁడు సామీరి నని కరం బనురక్తిన్. 264

తే. బ్రహ్మసుతుఋక్షకులసార్వభౌముఁ జూచి, నీవు చిరకాలజీవివి నిర్మలుఁడవు
కలఁగ కెప్పటివలెభూమినిలువుమనివ,చించి మైందద్వివిదులవీక్షించి విభుఁడు.

చ. బలు వగువేడ్క మీ రమృతపానముఁ జేసినవారు గావునం
గలుగదు మీకు హాని చిరకాలము వర్తిలుఁ డుర్వి నంచుఁ బెం
పలరఁగఁ బల్కి తక్కిన వనాటుల నాబడి నేఁగుదెంచు చిం
తిలక తలంచినట్లు యని తేటపడఁ వివరించె నయ్యెడన్. 266

క. ఆరఘురామునిమాటలఁ, బౌరులు బాంధవులుఁ గవులు బహుజానపదుల్
గోరికఁ బెండ్లికిఁ బోయెదు, వారివలెం జెలఁగి రుత్సవంబులు వెలయన్. 267

సీ. చూడ వచ్చినమహీసురులకుఁ దమయింత్రు, వేడ్కతోఁ జూఱలు విడుచువారు
దిక్కులనుండి యేతెంచినయతిథుల, కెల్ల పదార్థంబు లిచ్చువారు
ధరణి దాఁపుటయును ధర్మమంచు ధనంబు, చెలఁగి నిక్షేపముల్ సేయువారు
కళ్యాణ మిఁక నింతకంటె నెట్టిది యని, సకలోత్సవంబులు సలుపువారు

తే. బంధములు దీఱె మనతపఃఫలము లొదవె
నెప్పు డిఁక వేగుఁ బతివెంట నెపుడు ప్రోదు
మంచు నలరేయి యుగముగా నెంచువారు, నైరి సాకేతమున నున్న యఖిలజనులు.

మ. మఱునాఁ డంత వసిష్ఠుఁ జూచి రఘురామస్వామి పల్కెన్ మునీ
శ్వర నేఁడే పరమేష్ఠివీడు దిలకింపన్ వేడ్క వాటిల్లెడిన్
బరిపాటిన్ నెఱవేర్పఁ దంచితమహాప్రస్థానకర్మంబు ముం
దర సాగింపుఁడు యాగవహ్నులన నాతం డట్ల గావించినన్. 269

సీ. పండువెన్నెలడాలు పైటవేయఁగఁ జాలు, ప్రవిమలక్షౌమాంబరములు గట్టి
గరుడపచ్చలయేపు పరిహసింపఁగనోపు, దర్భాంకురములు హస్తములఁ దాల్చి
హరినీలములరంగు నపహరింపఁ బోడఁగు, ఘనకేశబంధంబు వెనుకఁ జేర్చి
తమ్మిఱేకులడాక తలఁగఁ జేయు విలోకనములు స్వనాసికాగ్రమున నుంచి

తే. శాంతలక్ష్మి వసించు కంజాత మనఁగ
మొగము దులకింపఁ బటువకాసముద్ర మించ
నవికారంబు లేక యయ్యినకులేంద్రుఁ, డల్లనల్లన నాత్మగృహంబు వెడలె.

శ్రీరాముఁడు తమ్ములతోడను పౌరులతోడను సరయూనదిఁ బ్రవేశించుట.

వ. అప్పు డప్పరమకృపాళుని దాపలిభాగంబునం గరపద్మంబులు ముకుళించుకొని పురలక్ష్మి యనుసరించె దక్షిణభాగంబున హ్రీ యనునా యజాతి సాకారంబు ధరియించి దాక్షిణ్యకారుణ్యధైర్యగాంభీర్యస్థైర్యచాతుర్యాదివివిధగుణంబులతో ననుగమించె సుందరవిజయవినయధర్మసత్యక్షమాశమదమౌదార్యవివేకవిశేషంబులతో నుద్యోగంబు గమనించె వెనుక ననేకశస్త్రాస్త్రనివహంబులు పురుషవిగ్రహంబులు ధరియించి తనుం గొలువఁ బురుషాకారంబుతోఁ గార్ముకం బనుసరించె ఋగ్యజుస్సామాదివేదంబులు బ్రాహ్మణరూపంబులతో నగ్రభాగంబున నరుగుచుండెఁ దన్మధ్యంబున సావిత్రీమహాదేవి స్త్రీరూపధారిణి యై సప్తవ్యాహృతులతోఁ బ్రణవంబుతో ఛందోఋషిన్యాసదేవతాబీజశక్తికీలకప్రముఖమంత్రాంగంబులతో సమితమంత్రతంత్రయంత్రసమూహంబుతో ద్వాత్రింశదుపనిషత్సమేత యై నడచెఁ దద్దేవిపిఱుంద స్మృతిశాస్త్రపురాణేతిహాసంబులు పౌరుషవిలాసంబులు వహియించి యనుగమించె సముచితస్థేమంబున

జనురఘురాము నవలోకింపుచు దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి శేఖరు లప్సరస్సిద్ధసాధ్య విద్యాధరప్రముఖనిఖిలదేవవస్యులు నలుదిక్కులం గ్రిక్కిఱిసి సమ్మర్దంబుగాఁ బఱతెంచిరి దాసదాసీజనంబులతోఁ బుత్త్రమిత్త్రకళత్త్రంబులతో నాప్తసఖిబంధుసోదరముఖ్యులతో నయోధ్యలోఁ గలసకలజనంబులు చుట్టుపట్లపల్లెపట్టులఁ గలప్రజలు జానపదులు మొదలుగా నొక్కండును జిక్కక యొక్కమొత్తంబై నడతెంచిరి యంతఃపురస్త్రీజనంబులు వృద్ధులు పశ్వాదులు పరివేష్టింప భరతశత్రుఘ్నులు సదారబాంధవులై ససుమంత్రాద్యమాత్యులతో సామంతులతో సుభటపుంగవులతో హితసహితులై యహితభీకరుం డగునగ్గుణాకరు ననుసరించిరి సాగ్నిహోత్రులై నానాగ్రహారవిశిష్టాగ్రవర్ణులు కుటుంబసమన్వితంబుగా సవత్సకంబు లగుగోధనంబుల మున్నిడుకొని వెంబడిం జనిరి సుగ్రీవ సుషేణ గంధమాదన పనస గజ గవయ గవాక్ష శతబలి నల నీల వినత కేసరి గ్రథన దధిముఖ ధూమ్రవేగ సువేగ తార కుముద ప్రజంఘ ప్రముఖ మహావలీముఖులు ఋక్షవానరసేనాసమేతులై పరమహర్షంబునం గదలిరి వాంశిక వైణిక మార్దళిక మౌరజిక ఢాక్కిక వైతాళిక వంది మాగధ ప్రముఖులు కవి నటగాయకులు భద్రమధుమత్తకాశ్యపప్రముఖ నర్మసఖులుగణకాబ్జముఖులు నిఖిలకర్మంబులు దిగంద్రోచి నిష్కల్మషభావంబున రామగుణకీర్తనంబులు సేయుచు నతని వెనుకొనిరి విద్వత్పురోహిత వేదాంతి తార్కిక వైయాకరణ ప్రముఖులు జన్మబంధంబులు దీఱె నని సబంధులై సింధుబంధనస్నేహానుబంధనంబున వెంబడిం గొలిచి పోయిరి యదృశ్యభూతంబులు నదృశ్యనగరవాసులు నతిసూక్ష్మశరీరులు నతిస్థూలశరీరులు నరుదెంచిరి పశుపక్షిమృగక్రిమికీటకాదులు శైలవృక్షలతాగుల్మాదు లుపాధిరహితసదాభిలాషంబున నయ్యఘశోషణు నాశ్రయించె నివ్విధంబున నఖిలచరాచరంబు లొక్కదిక్కై నడచు నవ్వేటిమహాఘోషంబు ప్రళయసముద్రఘోషంబు ననుసరించె భేరీపణవశంఖాదివాద్యఘోషంబు లజాండగర్భనిర్భేదనం బాచరించె నించుకయుఁ జలింపక కొంచక నిహసుఖంబులు దలంచక దుఃఖించక యేకచిత్తులై యజ్జనులందఱుఁ బెండ్లికిం బోవుచందంబున రఘునందనుపదారవిందంబులు సేవించుచుం బోయి రవ్వింతఁ జూడ వచ్చినవివిధరాష్ట్రనివాసులు దమకు నిది యేత్రోవ గాక యింతకంటె నేమివిశేషంబులున్నవి యని కృతనిశ్చయులై వెంబడించి రిట్లు రఘువీరుండు డాపుడదూరంబు మందగమనంబున నతిక్రమించి పశ్చిమవాహిని యైనసరయూనదీతీరంబు చేరంబోయె నయ్యవసరంబున. 271

ఉ. అన్నదికిన్ మహార్తమున నంబుజగర్భుఁడు లోకపాలకుల్
కిన్నరయక్షకింపురుషఖేచరులున్ వసురుద్రసంఘముల్
పన్నగు లాదితేయులును బ్రహ్మఋషుల్ గొలువన్ మణిప్రభా

చ్ఛన్నవిమానకోటులు దిశల్ వెలుఁగం జనుదెంచె వేడుకన్. 272

శా. ధింధింధి మ్మని మ్రోయు మద్దెలలతో § దేవాధిరాడ్భేరికా
ధంధంధ్వానము లాకసం బొరసె సంకీర్ణంబై సంరావసం
బంధంబుల్ దగ నాడి రచ్చరలు సమ్యగ్గీతముల్ పాడి ర
గ్గంధస్ఫూర్తి జడి వట్టి బెట్టు గురిసెం § గల్పప్రసూనచ్ఛటల్. 273

క. సరసీజాక్షుఁడు రాముఁడు, సరయూనదిఁ జొచ్చె నపుడు § సహజన్ములతోఁ
జరణాంభోజము లచ్చటి,యరుణాంభోజములు వియ్యమందుచు నలరన్. 274

ఉ. ఆరఘువీరశేఖరుముఖాబ్జమునందు నిజావలోకనో
దారమిళిందబృందములు § దార్కొనఁ జేసి విధాత భారతీ
చారుముఖీపదాంబురుహసంగతహంసరవానుసారిమం
జీరఝుళంఝుళధ్వనివిశేషముతో దివి నుండి యిట్లనున్. 275

క. శ్రీరామచంద్ర జగదా,ధారా దివ్యావతార § దాసశరణ్యా
కారుణ్యసార రవికుల,హారా భవ్యప్రచార § యఖిలస్తవ్యా. 276

ఉ. ఈయఖిలప్రపంచమున § కీవు విభుండవు నీవు వాచ్య మా
మాయ నెఱుంగ మాతరమె § మానుషవేషము మాని యాదినా
రాయణమూర్తివై యనుచరావలి గొల్వ ఖగేంద్రు నెక్కి వి
చ్చేయుము కాలయాపనము § సేయఁగ నేల మహాత్మ యిచ్చటన్. 277

ఉ. అవ్యయ మప్రతర్క్య మఖిలాశ్రయ మక్షయ మాద్య మార్యసం
స్తవ్య మనం దనర్చుపరతత్త్వము నీ వయి సృష్టిసాధన
ద్రవ్యగుణాత్మకత్వమునఁ § బాలుతు వేతనువైనఁ బ్రాపు ను
ద్దివ్యశరీర మందఱకు § దేవ కనుంగొన వేడ్క యయ్యెడిన్. 278

క. శ్రీరామ సీత యనఁ జను, శ్రీరామ భవత్పదంబుఁ § జేరి మునుపుగా
నీరాకఁ గోరుచున్నది, కోరిక యును గూర్పవయ్య § గొబ్బున ననుచున్. 279

క. వనజాసనుండు దెలిపిన, విని రాముఁడు సంతసించి § విశ్వజగన్మో
హనలీలావిలసితమగు, తనదివ్యశరీర మాత్మఁ దలఁచినయంతన్. 280

సీ. శతకోటిభాస్కరద్యుతుల మిట్టరించు, ఘనకిరీటము ముఖముఁ § గానిపించె
శేషభోగీశ్వరశ్రీల రాజిల్లు నా, జానులంబి చతుర్భుజములు దనరె
నసురులకు సురత్వ మొసఁగించుశంఖచక్ర, గదాసిశార్ఙ్గముల్ కడు సహింపఁగ
గౌస్తుభశ్రీవత్సకమనీయమై జయంతికలతో వక్షంబు § దేజరిల్లె
తే. ధాతఁగాంచినపొక్కిటితమ్మి వెలసెఁ, గటితటంబునఁ దులకించెఁ గనకపటము
పొలిచె నఖిలాంగములదివ్యభూషణంబు,లఖిలలోకంబు లవ్వేళ సురుచుఁజెందె.

సీ. మకరకుండలవజ్రమహనీయధళధళల్, చికిలి లేనగవుతోఁ § జెలిమి సలుప
మకుటపంకజరాగమణిరుచుల్ వినువీథిఁ, గపటసంధ్యారాగకాంతిఁ జెనుప

శార్ఙ్గగారుడాశ్వచ్ఛాయ లెదవేల్పులు, వైజయంతీతోడ వాసులాడఁ
గరలగ్నశంఖచక్రశ్రీలు శతకోటి, చంద్రసూర్యులు జోకఁ జేకఁ జేయఁ
తే. గటితటాబద్ధకనకాంశుకము మెఱుంగు, లసమయతటిల్లతలసొంపు సలలనింప
గరుడవాహనమెక్కి లోకములు పొడగ, రాముఁడవ్వేళ వైకుంఠధాముఁడయ్యె.
సీ. మొసలివాయొంట్లు కెంపులకెంపు దృక్కోణ, సంరక్తరుచులతో సంధిచేయ
లలితాలకస్థలాలకలితాలకశ్రీలు, ముకుటనీలములతో ముచ్చటాడఁ
గీర్తితేజములఁ జిక్కినచంద్రరవు లట్లు, శంఖచక్రములు హస్తములవెలయ
వక్షస్స్థితేందిరావక్షోజకస్తూరి, చెలువున శ్రీవత్సచిహ్న మమరఁ
తే. గోటి దశకోటి శతకోటి కోటికోటి, భానుబింబంబు లాకార మూనినట్లు
దుర్నిరీక్ష్యప్రకాశుఁడై తోఁచె నిదిగొ, విష్ణుఁడని యెంచి రచ్చోటివిబుధవరులు.
మ. అప్పు డబ్జాసనలోకపాలవసురుద్రాదిత్యు లయ్యందిరా
ధిపులోకైకమనోహరాంచితమహాదివ్యాంగసౌభాగ్య మ
చ్చపుభక్తిం దిలకింపుచుం బహునమస్కారంబు లర్పించి ఫా
లపరీతాంజలులై నుతించి రనరాళప్రౌఢవాగ్వైఖరిన్. 284
తే. ఎడతెగక మ్రోసెను భేరులేకధాటి, గాఁ గురిసె దివ్యసుమములొక్క మొగిఁ బాడి
రఖిలగంధర్వు లుడుగక యాడి రప్సరోజనము లాఖగేంద్రధ్వజు నెదుట.
తే. భరతశత్రుఘ్ను లవ్వేళ బ్రహ్మమొదలు, గాఁ గలసమస్తదేవతల్ గనుఁగొనంగ
నద్భుతాఖండతేజోమహాత్ములగుచుఁ, గలసి రద్దేవుదివ్యవిగ్రహమునందు.
తే. అమలసరయూజలముల దేహంబు విడిచి, భానునందనుఁ డర్కబింబమునఁ గలసె
ననలుఁ బ్రాపించె నీలుండు నవ్విధమున, ననువరశిల్పిలో నలుఁ డైక్యమొందె.
క. ఏయేవేల్పులయంశము, లేయేకపు లూని పుట్టి రిలలోపల ము
న్నాయావేల్పులఁ గలసిరి, యాయాకపియూథనాథు లాహరియాజ్ఞన్. 288
తే. యక్షకిన్నరగరుడగుహ్యకవియచ్చ, రాదిదేవాంశములఁ బుట్టినట్టిఋక్ష
వానరనిశాచరాదు లవ్వారి నంగ, కములు వర్జించి వారిలోఁ గలసి రపుడు.
మ. గరుడారోహకుఁడైనవిష్ణు నెదుటం గన్గొంచు నానాజనుల్
సరయూతోయములన్ విముక్తతనులై సాంద్రవిజ్యోతిరు
ద్ధురులై దివ్యవిమానరాజములయందుం బుత్త్రపౌత్త్రాప్తసో
దరకాంతాదులతో వసించి తగి రంతన్ దేవతామూర్తులై. 290
క. పక్షిపశుక్రిమికీటక, వృక్షలతాగుల్మశైలవితతులు సరయూ
నిక్షిప్తమూర్తులై యపు, డక్షయదేవత్వ మెనసి యలరె హరికృపన్. 291
మ. సరసీజోదరుఁ డంత బ్రహ్మఁ గని భాషానాథ యీప్రాణు లం
దఱు భూలోకముఁ బాసి నిత్యపదచింతం జేసి నావెంట వ
చ్చిరి వీ రెల్లను మాకుఁ బ్రాణములుగాఁ జింతించి సౌఖ్యప్రదో

పరిలోకంబుల నిల్పు మంచుఁ గరుణాసంపూర్ణుఁడై సత్కృపన్. 292

మ. అమరజ్యేష్ఠుఁడు తత్పశుప్రముఖతిర్యగ్జంతుసంఘంబులో
నమరత్వంబు వహించి యున్నజనులన్ హర్షంబునన్ సత్యలో
కము చెంతన్ బహుభోగభాగ్యములచేఁ గన్పట్టుసంతానలో
కములన్ నిల్పె ముకుందుకూర్మికి శిరఃకంపంబు గావింపుచున్. 293

క. పవనసుతాంగదమైంద, ద్వివిదవిభీషణులు ఋక్షవిభుఁడున్ భువిలో
నివసించిరి తక్కువా, రవనీశ్వరుఁ గొలిచి చనిరి హర్షముతోడన్. 294

తే. నృపుఁడు సరయువునకు వచ్చినపుడు ఋక్ష
వానరులలీల వచ్చినవార లెల్ల
నవ్విభుఁడు విష్ణుమూర్తియై యాత్మపురికి
నరుగునెడ వెల్పులై పోయి రద్భుతముగ. 295

చ. ఇటువలె నమ్మి యున్నప్రజ లెల్లను సద్గతు లిచ్చి బ్రహ్మధూ
ర్జటిబలభిత్కృశానుయమరాక్షసపాశిమరుద్ధనేశులో
క్కటి నిరువంకలం గొలువ గారుడపర్ణసువర్ణదీధితి
చ్ఛటలఖిలాశలన్ దొరయఁ జక్రి స్వధామపథానువర్తియై. 296

## శ్రీరాముఁడు వైకుంఠధామంబునకు వేంచేయుట.

వ. వేంచేయునప్పు డుప్పరం బొరయుచప్పుడులతో నెడ మీఁక సందర్శించుతిలంపులఁ బైపైఁ బడి క్రందుసేయుబృందారకాదులసందడి జడియక కనకమణివిచిత్రవేత్రపాణియై సూత్రవతీకళత్రుండు ముందర బరాబరు లొనర్చునెడ నుప్పతిల్లుహుంకృతుల నలంకరించుపరిసరస్థలానుచరచామరకరామరకిశోరికాస్యరత్నసంకలితకంకణక్రేంకృతులకు శ్రుతులగుతదీయకబరీభరనిబిడీకృతకుసుమమాలికావాసనోన్ముఖముఖరభ్రమరపాళికాఝంకృతుల కెళకునింద్రపురస్కృతైరావణదంతావళరాజంబు ఘీంకృతుల నానరించుపౌరభేరీభూరిభాంకృతుల నప్పళించుచునున్న సువర్ణపర్ణఝంకృతుల ననుసరించు నందసునందకుముదకుముదాక్షపుష్పదంతచండప్రచండప్రముఖపార్శ్వచరహుంకృతులు నిఖిలదిగ్భాగంబులు నాక్రమించె నివ్విధంబున నవ్విహంగవాహనుండు భువర్లోకనివాసుల నుతులు దీర్చ దర్శనం బొసంగుచు సువర్లోకసుందరుల యభినందనంబు లంగీకరింపుచు మహర్లోకలోకుల నమో నారాయణాయేతి వాక్యంబు లాకర్ణింపుచు జనర్లోకజనంబుల పూజనంబుల నలరుచుఁ దపోలోకతపోధనుల సేవాంజలుల గ్రహించుచు సత్యలోకసంచారుల లోకస్తోత్ర మోనారాయణాయేతిమంత్రోచ్చారణపూర్వకంబుగా సమర్పించినసత్యపాద్యాదులం జేకొనుచు సంతానలోకజను లొసరించుసంతాననకుసుమవర్షంబుల హర్షంబు నొందుచు గోలోకనివాసులు [illegible] నుక లంగీకరింపుచు ధ్రువాదిపరమభాగవత జేగీయమానుండును దేవర్షిబ్ర

హర్షి సహగమ్యమానుండును సఖండశతకోటిమార్తాండమండలద్యోతమానుం
డును ననేకదివ్యాభరణమణిప్రభాశోభమానుండును నై యుదక్ప్రథంబునం
చని జని శరచ్చంద్రచంద్రికాస్నిగ్ధదుగ్ధజలధిసమావేష్టన శ్వేతద్యుతి ప్రద్యోతిత
శ్వేతాంతరీప ప్రదీపితజ్వలనజ్వాలికాసమానభాసమానహిరణ్యాధరణ్యాంతరంబు
దఱియం జొచ్చి తన్మధ్యంబునం బునర్జననకారణలింగశరీరనికారణవిధానంబు
శరాభిధానంబును స్నాతజనజరామరణత్యుత్పిసాసాధ్యసాధివిరామప్రభావం
బును నమృతప్రభావంబును సదాసదాశ్రయతాతిశయంబును బుష్కరాహ్వ
యంబును యథార్థంబు గావించుసుధామధురశిశిరలఘుతరసలలితసలిలంబుల
డంబు గని సకలసత్త్వమహనీయంబయ్యుం దనసయసౌగంధికగంధసంబంధబం
ధురపుష్పంధయగరుత్ప్రచయతమఃపరిచయంబు గలిగి యభంగతరంగరంగ
త్కమలకుడుంగసంగచక్రాంగచక్రవళశుకపికవిశేషణోజ్ఞాతి వాతవేగసమంతతటి
పరిపాతితరజోవికాసనంబునందనరియు విరజానామంబునం బ్రకాశించుసలిలలా
మంబుచే నావృతంబై యూర్ధ్వముఖానంతఫణాక్రాంతబహిర్దిశాగసగగనాని
తాంతధవళవపుర్విభావిశేషసూచకనిష్కలుషపురుషోపలస్ఫటికప్రకల్పితశిల్పక
ల్పనాకల్పవిశాలసాలజాలాచ్ఛాదితరచ్ఛవిచ్ఛటాతిపాండురితబ్రహ్మాండకరండంబును
నభోమండలార్ణవశైవలాయమానశక్రనీలశిలాశకలసంఘసంఘటితోత్తుంగగోపు
రనీలరుచిరరుచిసమాయాతతమోవ్యాపృతతదగ్రసంస్థాపితశాతకుంభకుంభాభిన
వదివాకరబింబనికరాలోకలోకాలోకావలోకనవిస్మయరసావేశకారణంబునుసా
ర్వకాలపల్లవిత పుష్పిత ఫలిత సల్లలితవివిధవిద్రుమకుంజమంజుపవనభవనోపవ
నచారణసంతతాత్మనారాయణనామస్మరణక్రీడాపరాయణ కలకంఠ నీలకంఠ
శుకముఖనిఖిలఖగజాతచేతనానూతనప్రవాళదళవ్యూహావాహవాహబింబికాకల
మోహకారివిద్రుమద్రుమలతాసితపట్టాంబరవితానపద్మరాగకపోతపాలికాభిరామం
బును గోమలదూర్వాదళశ్యామలప్రకాశామలగారుత్మతరత్నయూథసముత్సే
ధసౌధశిఖరాభ్రంకషగరుడకేతనద్యోతమాన శ్వేతపటపటలద్యుతివ్యంజిత త్రి
భువనాక్రమణోపక్రమవిక్రమ త్రివిక్రమోర్ధ్వప్రసారితచరణనఖశిఖాము
ఖనిర్గళితావరణపయోధిపయోధారాప్రవాహంబును గేళికాచకోరపాళికాజ్యో
త్స్నాయమానమానితజ్యోతిరుత్కటస్ఫటికదృషత్ప్రకటితప్రతికుడ్యభాగచిత్రి
తనిజదశావతారకథాసూత్రచిత్రసందర్శనానందసరసలోకలోకమిథస్సంభాషణా
విధాధికనిరవధిక వివిధవీథికాశతసహస్రసందానిత మందారమాలికాకలితవన
మాలికాఘుమఘుమాయమానంబును నవరత్నఘటితకిరీటమకరకుండలాం
గదకంకణాంగుళీయక కౌస్తుభహార శ్రీవత్స వైజయంతీ వనమాలికా
కనక కౌశేయ చతుర్భుజ శంఖ చక్ర కౌమోదకీ శార్ఙ్గ నందకాద్యక్షీణ
లక్షణలక్షిత సురూప సరూప ధారావహోహ నాగ్రారోహిణాచలలసమాన

విమానశతకోటికోటిసంకీర్ణకింకిణీకిణకిణారవాపూరితదశదిశావకాశంబును నై దూ
ర్యవిరచితక్రీడాచలరాడధిత్యకాచరన్నీలకచామణిముఖచంద్రసేవాసమాగతతా
రకావారకభ్రమాకరముక్తాఫలవిలసితోపకారికానికాయప్రకాశమానప్రసూ
నసరధ్వజచ్ఛత్రచామరచిత్రాంబరముకురాద్యలంకారదరీదృశ్యమానంబును గో
మేధికరత్నఖచితానేకమండపాంగణమహనీయమాణిక్యమయరంగవల్లికామతల్లి
కాంశువల్లికావేల్లితంబును బుష్యరాగమణివిభాసురప్రాసాద సమాసాదితజాత
రూపవాతాయనరంధ్రాంతికనిస్తంద్రచంద్రకాంత కాంత వేదికాంతరకాంతాకాం
తవిలోచనేందీవరదళార్చితపథిగతాగతభాగవతపదాంబుజంబును ఘనసారగంధ
సారకాశ్మీరకస్తూరికాదిపరిమళనిత్యనివాసంబును నై కర్బురాలోకదూరంబు
గాకుండియుఁ గర్బురాలోకదూరం బయి బహువిధరత్నకర్బురకాంతులం
దేజరిల్లి చిత్రభానుసంభావితంబు గాకుండియుఁ జిత్రభానుసంభావితం బయి
యనంతమణివిలాసాస్పదంబు గాకుండియు ననంతమణివిలాసాస్పదం బయి
స్వస్ఫురితప్రకాశాన్వితంబు గాకుండియు స్వస్ఫురితప్రకాశాన్వితంబై చంద్రవిభ
వాశ్రయంబు గాకుండియుఁ జంద్రవిభవాశ్రయం బయి ప్రకృతిగోచరంబు గా
కుండియుఁ బ్రకృతిగోచరం బయి కరంబు రాణించుశ్రీవైకుంఠనగరంబు చేరం
బోయి త్రయస్త్రింశత్కోటిపురద్వారపాలకులు సాలోక్య సామీప్య సారూప్య
వంతు లగుపరమభాగవతులు నఖిలప్రపంచమోహనశృంగారవతు లగుయువతు
లు ననేకవిమానకాంతులు దిక్కులం బిక్కటిల్లదివ్యగంధమాల్యాంబరాభరణవి
భాసమానమూర్తు లై యాడుచుం బాడుచు నపరిమితవాద్యవిశేషంబులు బో
రుకలంగ నెదుర్కొని పుష్పాంజలు లిచ్చువారును నానందనర్తనంబు లొనర్చు
వారును నారాయణవిష్ణుకృష్ణగోవిందముకుందాదిదివ్య నామంబు లుగ్గడించి సం
కీర్తనంబు సలుపువారును గోటికందర్పసౌందర్యసుధారసంబు నేత్రాంబుజంబు
లఁ బానంబుఁ జేసి రోమాంచకంచుకితాంగు లగువారును నాలవట్టంబు లుభ
యచామరంబులు ముత్యాలగొడుగులు గరుడటెక్కెంబులు గనకవేత్రంబులు
బంగారుసురటులు సౌవర్ణతాళవృంతంబులు నమృతపూర్ణహైమకలశంబులు మొ
దలయినవి ధరియించి వివిధకైంకర్యపరాయణత్వంబున నగ్రభాగంబున నడచు
వారును నై సందడించు వైకుంఠనివాసులతో ముప్పదిమూఁడుకోట్లు దేవతల
తో బ్రహ్మరుద్రాదిలోకాధికారులతోఁ బురప్రవేశంబు గావించి యెడనెడ వై
ష్ణవీరత్నంబులు కర్పూరనీరాజనంబులు ముత్యాలసేసలు సమర్పింపఁ గోటలు
గోపురంబులుఁ గొలువుకూటంబులు రత్న మండపంబులుఁ జలువచప్పరంబులు
రాజమార్గంబులుఁ గృతకాచలంబులుఁ గనకసౌధంబులుఁ దోరణస్తంభంబులుం
జూచుచు సకలవిశేషంబుల నొప్పు నప్పురంబునట్టనడుమ నిట్టలంపుఁబులునిండి
చట్టులం గట్టినయభ్యంతరవప్రగోపురద్వారంబునం గట్టికుందనంపుఁజెట్టుపలం

గనుపట్టుపిట్టపహ్లుమాయి తేజి డిగ్గె నయ్యవసరంబున. 297
సీ. వలపటనుండి చామరపాచమానులదునే, దాఁకి నెయ్యమునఁ గ్రొంపడయొసఁగెఁ
గళుకువజ్రంపుఁ జెక్కడపుమేల్పావలై, ఫణిలోకవిభుఁడు శ్రీపదము లానెఁ
జారుముక్తామయచ్ఛత్రంబు ధరియించి, యెడఁబాయకసునందుఁడనుసరించెఁ
గడవన్నెతళుకుకుబంగరువీజనముఁ బూని, విసరుచు ఖగరాజు వెంబడించెఁ
తే. గమ్మబాగాలొసఁగునూడిగము వహించెఁ, బుష్పదంతుండు సేనానిభూరివేత్ర
పాణియైయగ్రమునబరాబరు లొనర్చె, హరినిజాభ్యంతరముఁ జేరునవసరమున.
సీ. బలువేల్పురా ప్రతిమలచెక్కడపుగండ, పెండెంబు డాకాలఁ బెరిమెఁ జూపఁ
గటిబద్ధకనకాంశుకంబుపై మణులయ, డ్డిగలయొడ్డాణంబు జిగి దలిర్పఁ
దళుకుఁగుంకుమపుగందపుఁబూఁత నెఱపుచు, నురమునఁగౌస్తుభం బొప్పుగులుక
నాజానులంబిబాహాచతుష్టయమునఁ, బంచాయుధస్ఫూర్తి పరిఢవిల్ల
తే. మకరకుండలవజ్రసంపదలతోడ, ముకురతులితకపోలముల్ ముచ్చటాడ
స్వర్ణకోటీరరుచిరత్నవలభు లొలయ, నవ్విభుఁడు సేరె మొదటికక్ష్యాంతరంబు.
సీ. ఫలములఁగాంక్ష నిల్పక నిజాంఘ్రులు గొల్చి, తపములు సేసినధన్యమతులు
నారాయణసమర్పణం బంచు వివిధయ, జ్ఞంబు లొనర్చినశాంతినిధులు
గోవిందనృహరిముకుందమాధవ యంచుఁ, దనుసంస్మరించినదాంతియుతులు
దీర్ఘయాత్రలు పోయి దివ్యదేశంబులఁ, దనువుల విడిచినధైర్యపరులు
తే. వేయి తులసీదళము లెంచి వేయిపేళ్ల, దినమును స్వకీయపూజసల్పినకృతార్థు
లచటనుండి క్రియాశక్తి ననుసరించి, యెదురుకొని యర్చలిచ్చనిచ్చనలరి.
మ. ధవునిన్ సాధ్వి భజించుపోల్కిఁ దనరున్ దాసత్వముం జెంద భ
క్తివిశేషంబునఁ గొల్చుసాత్త్వికులు వర్తింపంగ తా వైనరెం
డవకక్ష్యాంతరమున్ రమాధిపుఁడు వేడ్కన్ డాసి తద్భక్తపుం
గవు లిచ్ఛాహ్వయశక్తితో నొసఁగుసత్కారంబులం బ్రీతుఁడై. 301
మ. వనజాక్షుం డఖిలాత్మకత్వమున సర్వవ్యాపి యై యుండ నా
యన గాకున్న దొకండు లే దనువిశిష్టాద్వైతిసంఘంబు వా
యని యమ్మూఁడవకక్ష్యఁ జేరి కమలాధ్యక్షుండు చిచ్ఛక్తితోఁ
దనరున్ వారు సపర్య లియ్యఁ గొని మోదం బొప్పఁగా నావలన్. 302
మ. చని పూర్వం బవధూతచర్యల యదృచ్ఛాలాభసంతుష్టులై
తనురక్షాదికకృత్యముల్ దొఱఁగి కాంతాద్రవ్యకాంక్షావివ
ర్జను లౌనిత్యవిరక్తు లున్నచతురచ్ఛద్వారముం జేరి యు
ద్వినయాఢ్యుల్ విమలాభియుక్తిఁ దను సేవింపం బ్రహర్షింపుచున్. 303
చ. ఇరువదినాల్గుతత్త్వముల నేర్పడఁ గన్గొని వాని కవ్వలం

బరఁగెడి పంచవింశకుని భావన సేయుచుఁ జిన్వివేకవి
స్ఫురణల మించుసాంఖ్యులకుఁ జో టగునైదవవాకిటన్ దయా
కరుఁ డతఁ డొంగె హ్రీ యనెడికామినిచే వివిధోపచారముల్. 304

మ. సరసీజాక్షునిఁగాఁ జతుర్భుజునిఁగా సౌవర్ణకౌశేయుఁగాఁ
బరమానందునిఁగాఁ బ్రసన్నముఖుఁగాఁ బ్రాదేశమాత్రాంగుఁగా
నిరతంబుం దనుఁ జింత చేసినసుధీనిర్ద్వోషరత్నాళి కా
కర మానాఁటిచోటఁ దుష్టివలనం గాంచెన్ విభుం దర్పనల్. 305

సీ. నానావిధానూననాడికాశోధనా, భ్యంతరాంగకశుద్ధు లాచరించి
దేశకాలితోపదేశపద్ధతి యమ,నియమాదియోగాతిశయము లెనసి
పరఁగుప్రాణాయామభావాఖ్యమున సుషు,మ్నాగర్భమునను బ్రాణములు నేర్చి
కుండలి మేల్కొల్పి మండుజాఠరశిఖి,జ్వాల సుధాధారఁ జల్లచేసి

తే. యూర్ధ్వముఖషట్పయోజనాళోపరిప్ర, భాసురసహస్రదళపద్మవాసిహంస
సంగతి రహించుహఠయోగిజనులు పుష్టిఁ,గలసి సేవింప సప్తమస్థలము చాఁటి.

క. ఆనందకరుఁ డాద్యజ,నానందకరుండు వారిజాక్షుఁడు బ్రహ్మా
శానామరేంద్రవిష్వ,క్సేనాదులఁ గూడి యవలికిం జనువేళన్. 307

సీ. కొల్లాటమండలోత్ఫుల్లచంద్రికలతోఁ, విహరింప నేర్చినవిమలనుతులు
రవిశశాంకాగ్రజాగ్రత్తారకజ్యోతు, లోకటిగాఁ దిలకింప నోపుధన్యు
లాసందతానాహతానూనగానంబు, చవి యెఱింగినమహాసౌఖ్యనిధులు
శాంభవీముద్రాశ్వసంరూఢు లై వట్టి,బయలు ప్రాఁకఁగఁ జాలుబ్రహ్మవిదులు

తే. జననమరణార్తిముఖసమిత్సమితి యనుభ, వాగ్ని వేల్చినఘనయజ్వలనఁ దనర్చు
రాజయోగాహ్వయప్రాజ్యరాజ్యకర్త,లష్టమద్వారగతు లొటహారిని గాంచి.

క. సనకసనందనముఖు లగు, నసఘులతో నెదురుకొని ప్రియంబునఁ బూజిం
చిన నలరుచు శ్రీధరుఁ డ,జ్జనముల వీడుకొని యవలఁ జనుసమయమునన్.

సీ. గిలుకుమెట్టియలమ్రోఁతల కంతికాంగుళీ,భూషణార్భటి ప్రియంబులు గణింప
మంజీరసంజాతసింజారవములకు, రాయంచరవళి ప్రత్యాకు దెలుపఁ
గాంచిఘంటాఘణంఘణలకుఁ గరలస, త్కంకణధ్వనులు కైదండ యొసఁగఁ
గర్ణోత్పలాళిఝంకారంబునకుఁ గచో, ద్దేశికేకిరుతంబు తెరవు సూప

తే. సూత్రవతియాదిగాఁ గలవేత్రవతులు,నలుగడల నిండు సందడిదొలఁగఁ ద్రోయ
నిరుగడల ధారుణీనీళ లేఁగుదేర,నిందిరాదేవి గోవిందు నెదురుకొనియె. 310

చ. ఎదురుగ వచ్చి యచ్చెలువ యిం పగు వాలు మెఱుంగుఁజూపులన్
మొదట నివాళి యిచ్చి ప్రియమున్ భయమున్ వినయంబు నెమ్మనిన్
గుదిగొని పిమ్మటన్ యువతికోటులతోఁ దపనీయపాత్రికా
సదమలరత్నదీపికల శౌరికి నారతు లెత్తి వేడుకన్. 311

ఉ. ఆరతు లెత్తువేళ జవరాలిముఖాబ్జము తేటఁ జూచు నొ
య్యారపుఁజూపుఁ జూచు బిగియారుచనుంగవఁ జూచు మేనిసిం
గారముఁ జూచుఁ జెక్కులప్రకాశముఁ జూచు ముకుందుఁ డెంతయున్
గౌరవ మొప్ప నెన్నఁడును గాననివస్తువు గన్నకైవడిన్. 312

శా. ఆలో భూమి ధరించె వీజనము నీలాబ్జాక్షి కర్పూరతాం
బూలం బర్పణసేయునూడిగములం బొల్పొందె శ్రీదేవియుం
గైలా గిచ్చె ననేక వార్షికవియోగప్రాజ్యచింతాభర
వ్యాలోలత్వముఁ బాసి కేశవుఁడు హర్షాంభోధి నోలాడఁగన్. 313

మ. కమలాకామినిపాణిపంకజము సోఁకన్ మై గగుర్పార న
క్కమలాక్షుం డనిశంబు సాత్త్వికమునం గన్పట్టియున్ సర్వలో
కమునన్ సాత్త్విక మూనెఁ బక్షివరవిష్వక్సేనశేషాదికుల్
తమశృంగారకళావిశేషములు సందర్శించి హర్షింపఁగన్. 314

శా. ఈలా గిందిరఁ గూడి మందరధరుం డిర్వంకలన్ వైష్ణవీ
జాలంబుల్ వివిధోపచారము లొనర్పం జొచ్చె జంభద్విష
న్నీలాంభోరుహరాగవజ్రముఖమాణిక్యోరుశిల్పాంచిత
స్థూలస్తంభకవాటకోటిఁ జెలువౌ శుంభన్నిజాస్థానమున్. 315

## పరమపదవర్ణనము.

వ. అది మఱియు ననంతదివ్యరత్నసమాజతేజఃపుంజంబున కాస్పదం బయి య పరిమితవిచిత్రచిత్రాంబరసువర్ణవర్ణపట్టాంశుక ప్రతానంబులం గట్టినమేలుకట్లచె న్నునం గన్నులకు మిఱుమిట్లు గొల్పుచు నలుదిక్కులం బిక్కటిల్లుహరిచందన మందారకల్పకసంతానపారిజాతప్రసూనవాసనల కాస్పదం బయినయత్యున్నత స్ఫటిక మయమహాస్తంభకోటుల నీటుల దీటులేక యనేకబ్రహ్మాండసహస్రం బులం గలప్రాణులెల్ల నొక్కపరి పఱతెంచి నిల్చిన నొక్కయంకణంబునకుం జాల దనం జాలుచాలువు గలిగి యగణేయదృగంబుజంబులు గలనిజనాథుని వలె నలఘుతరవజ్రజాలకరచితజాలక రంధ్రనికాయంబుల నవలోకనీయం బై కమనీయమాక్తికమయప్రాలంబమాలికాపరంపరల పెంపున నిం పొనర్చుచు దర్పణంబుల ఱెక్కనఁ దళుక్కన మెఱయుకాంతిమచ్చంద్రకాంతకాంతకు డ్యాంతరంబుల నెంతయు వింతయై చింతామణిగణనిబద్ధవిశాలవితర్ది కానికరం బులం గరంబు రాణించి కెంపుటిటికగములం గట్టినయిట్టలంపుమెట్టులం గనుపట్టి నుపమాధికగోమేధికతోరణప్రాంచితపుష్యరాగవిటంక భాగభాగపరభాగవిభా భాగపరభాగతతుల నతులంబై స్వయంప్రకాశం బై నిత్యముక్తాశ్రయం బై త్రైకాలికసత్యం బై స్వతస్సిద్ధం బై ముముక్షుజనాపేక్షణీయం బై శుద్ధసత్త్వా నందకరంబు గావున నానందమణిమండపం బనఁ బ్రసిద్ధం బై నసభామండపం

బుం బ్రవేశించి యందు శేషాత్మకంబై చెలువొందున శేషవిశేషంబున్నచిత్రితభద్రా సనంబు వై వసియించి శ్రీదేవినురంబున నుంచుకొని భూనీళల నిరుపార్శ్వంబుల నిడుకొని యనంతగరుడవిష్వక్సేనాదినిత్యులతో శంఖచక్రగదా శార్ఙ్గనందకాభి రాములు నీలమేఘశ్యాములు విగతమోహులు నాజానులంబిచతుర్బాహులుఁ గౌస్తుభ హార కేయూర మకర కుండలాది దివ్యభూషణధారులుఁ గనకాంబరధా రులు వైజయంతీవనమాలికావక్షులుఁ బుండరీకాక్షులు గుడాకేశులు నభంగుర ప్రకాశులు నగుసారూప్యధారులు దాను జూపినపశ్వరూపంబువలె గణియింప నలవిగాక డాపలిపార్శ్వంబున నిలిచి సేవాంజలులు దాల్చిగొలువుసేయఁ బాం చజన్యంబుఁ బోలుకంఠంబులుఁ జక్రంబుఁ బోలుకటిమండలంబులు శార్ఙ్గం బుఁ బోలుకనుబొమలు నందకంబుఁ బోలుకీలుజడలుఁ గౌస్తుభంబుఁ బోలుకె మ్మోవులు శ్రీవత్సరుచులం బోలుముంగురులు నాభిపద్మంబుఁ బోలుసుద్దుమొ గంబులుఁ గనకాంబరద్యుతులం బోలునెమ్మేనిచాయలు నీలాభిరామంబు లగు నూఁగారులు మీనాకారంబులగుబెళుకువాలుఁజూపులుగమఠరూపసరూపంబు లగుప్రపదంబులుం గలవన్నెలాఁడులు చిన్నారికెంగేలుఁజిగురులం గనకకలశం బులుఁ గాళంజికలుఁ గుంచెలు సురఁటులు నాలవట్టంబులు నుభయచామరంబు లు మణిముకురంబులుఁ బరిమళకరండంబులు జిలుఁగుపావడలుఁ గర్పూరతాం బూలపేటికలుఁ గమ్మపూబంతులుఁ గాంచనవేత్రంబులు మున్నైనవి ధరియించి వెక్కువగలనూడిగంబు లొనరింప సనకసనందనాదులు బాల్యంబు వహియించి తాల్యంబు లేనిభక్తియోగంబునఁ జెంతనుండి కన్నుల ముదశ్రుపూరంబులొలుక నానందనాట్యం బొనరింప శతానందుండు పులస్త్య పులహ ప్రముఖ నవబ్రహ్మ లతో వలవంక నిలిచి సేవింప నేకాదశరుద్రులుఁ బ్రమథగణంబులు గణేశ్వరగు హచండీశ్వరాదులుఁ దన్నుం బరివేష్టింప నష్టమూర్తిగోమాంచకంచుకితమూర్తి యై సహజస్నేహంబున ననువర్తింప నిలింపపాలకుం డఖిలలోకపాలకులతో ముప్పదిమూఁడుకోట్లదేవత లొక్కచక్కిం బిక్కటిల్ల నిటలఘటితాంజలి యై భజియింపఁ జిత్రరథహాహాహూహూ ప్రముఖగంధర్వులతోఁ దుంబురునారదా దులు పరివాదినులు మొరయించుచు నింపుగా నిజబిరుదాంకితగీతంబులు విని పింప ననుకంపాయతకటాక్షంబు లభిలషించి నలువదినాలుగుకోట్లమహర్షు లుపనిషత్పరంపర లుగ్గడింపుచు నొక్కచక్కన నెలకొని యభినందింప రంభో ర్వశీమేనకాదిచతుష్షష్టికోట్యప్సరఃపాటలాధర లాటలం బాటలం బాటవంబు నెఱపుచు ముందట నటింప నభంగురప్రభావంబున నీరజాక్షుండు లేరి శతసహస్ర మార్తాండమండలప్రకాశంబు లొక్కరాశి యైనట్లు ప్రచండతేజోవిశేషంబున దుర్నిరీక్షణుం డయి కోటిపుంప్రేక్షుకోదండుల చక్కఁదనంబు లొక్కటైయైనట్లు సకలలోకాశ్చర్యకరసౌందర్యలీలావిలాసవిభవమావిర్భావహేతు దివ్యమంగళ

విగ్రహంబుచేనక్షీణకేయుండియు సప్తవ్యాహృతిగాయత్రియగు గాయత్రిసీసుం తెపదాంతి ముక్తామణికాంతుల నిజసాదనఖచంద్రిక లోలయుం జేయుచుండు బురుషాకారంబులు వహించి కొలిచి యున్న ఋగ్యజుస్సాదుల నాదరింపుచు సరూపంబులయి కొలుచుస్మృతిశాస్త్రపురాణేతిహాస ప్రముఖవిద్యల సప్రేమం బుగా నవలోకింపుచు మేను లూనినయజ్ఞాదిక్రియాకలాపంబుల సత్వజ్ఞానవై రాగ్యంబులం దగురీతి గారవింపుచు సర్వనియంతృత్వ సర్వభోక్తృత్వ సర్వక ర్తృత్వ సర్వపాలకత్వ సర్వజ్ఞత్వాది సర్వశక్తియుక్తుం డగు యఖండిత ప్రభా వంబున నిండుకొలు వుండె నయ్యవసరంబున. 316

శా. శుక్నంభేదకతత్సభాస్థితబుధస్తోమంబు క్రందుల్ల వి
ష్వక్సేనుండు గరాబ్జసంజ్ఞలను మాన్పన్ శౌరినెమ్మోమునన్
దృక్సంఘం బిడి హస్తముల్ మొగిచి గౌరీభర్త సల్కన్ శిరో
భాక్సర్వధునీఘనుంఘునురవప్రత్యగ్రవాగ్గుంభనన్. 317

శివుఁడు విష్ణువును స్తుతించుట.

శా. శ్రీమంతంబు సనాతనంబు దితిభూజిద్బాణబాణాసనో
ద్దామం బాశ్రితరక్షణక్షమము సీతాలక్ష్మణోపేత మా
ర్యామోదప్రద మాంజనేయహిత ముద్యత్తారకం బా భవ
ద్రామాకారము నామనోంబుజమునన్ ధ్యానింతు నశ్రాంతమున్. 318

శా. విశ్వాసంబున నార్తి మాన్పుఁ డని యాదేవుల్ నిమున్ వేఁడినన్
విశ్వామిత్రవిలుంఠనంబునకు నావిర్భావముం జెంది యా
విశ్వామిత్రహితంబు ముందుగ నకీర్ణంబు జేసి యొక్కొందు మీ
శశ్వచ్చిత్రచరిత్రముల్ దలఁతు నశ్రాంతంబు స్వాంతంబునన్. 319

శా. ఆదిత్యేందువహుతాశనప్రముఖదీవ్యత్కాంతిమచ్ఛ్రేణి స
చ్ఛేదంపంగఁ దరంబు గాక దరముం జేకూర్చునగ్గౌతమ
స్త్రీదోషాంధతమిస్రముల్ క్షణములో ఛేదించి వెల్గొందుమీ
పాదాంభోజనఖాంశువుల్ నిటలముం బ్రాపింపఁగా మ్రొక్కెదన్. 320

శా. ధర్మారంభనిరూఢులై జనపతుల్ దార్కొందు రెందేనియున్
శర్మంబుల్ ధరణీసుతాపరిణయేచ్ఛన్ మీరు మున్నద్ధతిన్
ధర్మచ్ఛేదన మాచరించినవిచిత్రం బెంత వర్ణించెదన్
ధర్మాధ్యక్ష దిగీశరక్షణమహోదార ప్రభావోదయా. 321

మ. వితతప్రౌఢిమ జామదగ్న్యు మది నావేశించి దుష్టక్షమా
పతులం దక్కక వెక్కుమార్లడఁచి భూభారంబు వారించి త
ద్గత తేజంబు శరాసనంబు గొని మీకొంగ గ్రక్కునం గొన్న మీ
యతిగాంభీర్యపరాక్రమాదిగుణమాహాత్మ్యంబు లూహించెదన్. 322

క. గురువులకు నాదికారణ, గురుఁడని ప్రఖ్యాతి గనియు గురునాజ్ఞ సనాం
తరమునఁ గాంతాసంగతిఁ, జరియించిన మీచరిత్ర శక్యమె పొగడన్. 323

సీ. అఖిలలోకములకు నభయప్రదాతవై, యలరియు మనులకు నభయ మొసఁగి
పుణ్యజనప్రీతిఁ బోరసియు ఖరదూష, ణాదిపుణ్యజనుల హతులఁ జేసి
యమృతంబుగొనుపక్షి నాదినేలియుఁగాన, నమృతంబుగొనుపక్షి నాదరించి
యాదిత్యజాతకార్యముఁ బూని యుండియు, నాదిత్యజాతకార్యము వహించి

తే. వాలి నని నొంచి వనచరావళులమన్చి, వనధి బంధించి దానవేశ్వరు జయించి
సీతఁ బ్రాపించి పురిఁ బ్రవేశించి మించి, ధరణి యేలినమిముఁ గొల్తుఁ బరమపురుష.

క. అని కొనియాడిన శంభునిఁ, గనుఁగొని దరహాసవదనకమలుం డై య
వ్వనజదళేక్షణుఁ డిటు లను, ఘనవర్షాంభోదనాదగంభీరోక్తిన్. 325

మ. గిరిజాధీశ్వర నీవు నీయజుఁడు నీగీర్వాణరాజాదిది
గ్వరులీకిన్నరయక్షఖేచరమరుద్గంధర్వముఖ్యుల్ వనే
చరరూపంబులు దాల్చి శత్రుహతికిన్ సాహాయ్యముం జెందుటన్
సురవిద్వేషణుఁ డీల్గెఁ దాపసమనఃక్షోభంబు దీఱెన్ భువిన్. 326

తే. శిష్టజనరక్షణము దుష్టశిక్షణంబు, నవని నొనరించుకొఱకు నే నవతరించి
మత్కథాగాంగలహరికా మహిమ జనుల, పాపజంబాల మడఁగింతు ఫాలనయన.

శా. శ్రీరామాయణముఖ్యమామకకథాశ్రేణుల్ ప్రసంగింపుచుం
బారీణత్వము మీఱఁగాఁ జదువుచుం బాటించి యాలింపుచున్
సారప్రజ్ఞ రహించుమానవులకున్ షడ్వర్గముల్ దారుఁ జే
కూరుం గోరిక లాఱు ఘోరదురితౌఘస్థుల్ మీఱు నైశ్వర్యముల్. 328

తే. అని ప్రియంబున హరునితో నానతిచ్చి, యబ్జగర్భాదిదివిజుల నాదరించి
కొంతవడికందఱనువీడుకొనికళత్ర, ములు ముగురుఁ గొల్వ హరియంతిపురము సొ

ఉ. చ్చొచ్చి మెఱుంగుకెంపునును సోరణగండ్లఁ గడానిలోవలం (చ్చె.
బచ్చలతల్పులన్ స్ఫటికబంధురకుడ్యములన్ శశాంకర
త్నోచ్చయవేదులన్ వెలయునొక్కనుహేమధ్వజావళిసౌధ మెక్కి యం
దచ్చపుఁ బువ్వుఁజప్పరపుటందములం దగుమందిరంబునన్. 330

తే. కుందనపుఁదళ్కుచప్పరకోళ్లఁ గుల్కు, మేలిసకినలమంచంబు మీఁద నీవి
మ్రానిపూఁబాన్పు జిగిఁ మించు మంజుశేష
శయ్యఁ గూర్చుండె హరి రమాసహితుఁ డగుచు. 331

తే. అపుడు భూనీళలను రాగ మతిశయిల్ల, సురఁటి యడపంబు గొనికొల్వఁ జూచి వెన్నుఁ
డింతి డెందంబెఱిఁగి నవ్వి యిరుకరములఁ, బట్టి వారలఁ గూర్చుండఁ బెట్టుకొనియె.

ప్రణయకలహాది వర్ణనము.

తే. రాజకీర్ఘంబు లవ్వేళ రాజవేష, ధారి యై యున్న దానున్న మేన లెన్న

నంకగతయైన శ్రీదేవి నాదరించ, కపుడు గోవిందుఁ డొకలేని యలుకఁ బూని.

చ. అవు నవు మంచిదాన నతివా నిను నేమన వచ్చు నొంటిగా
నవని ననుం ద్యజించి సభయంబు దపు డిద్దర ద్రోవ యియ్యఁగా
నవమతిఁ జేసి వచ్చితివి యాకటకుందన మాత్మ నెంచిన
న్దివిరి కనుంగొనం దగునె నీమొగ మింకఁ దలోదరీమణీ. 334

తే. అనుచు శ్రీలక్ష్మితోఁ బల్కి యవనిదిక్కు, మాఱుమొగమైన నే నేమి నేరమాచ
రించితినొ యంచు ధరణి ప్రార్థింపనీవె, కానె తోడ్తెచ్చితని చక్రధరుఁడు పల్కె.

వ. అప్పుడు. 336

మ. కరపద్మంబులు మోడ్చి పద్మ యను నోకంజాక్ష నామీఁద నే
తిరుగం దప్పు ఘటింప మీ రనిన వాదింపంగ నే నేర్తునే
నరు లేమో యొకనిందఁ బెట్టి రని కాంతారంబునం ద్రోయఁ బం
పరె వేయేం డ్లెడఁబాసి గాసిలనె మీపాదంబు లూహింపుచున్. 337

క. నను మును గలుగఁగ నిచటికిఁ, బనుచుతలంపునను గాదె ప్రత్యయ మిమ్మం
చనుట మిమ్ముఁ గానకుండం, గొని తెచ్చెనె ధరణి యేల కోపింపంగన్. 338

చ. గతజలసేతుబంధము లిఁకం బని యేమని యెన్ని కార్యముల్
మతిని సహించి యున్న నను మాటికి నిచ్చట సేర మెన్న వ
చ్చితిరె యటంచు మోమువలఁ జేసిన ప్రేయసిఁ జూచి శౌరి న
వ్వితి క్షమియింపవే యనుచు వేమఱుఁ గౌఁగిటఁ గ్రుచ్చె మచ్చికన్. 339

చ. ఉరమున నిట్లు శ్రీరమణి నుంచుక భూవనితాంసపీఠి శ్రీ
కర మిడి నీళ వెందొడలఁ గమ్రకరాబ్జము సాఁచి కేళినీ
శ్వరశతకోటిరూపవిభవం బెసఁగన్ ఫణిరాట్ఫణాళిపై
నొరగి ప్రహృష్ట మొంపె హరి యుజ్జ్వలసౌఖ్యరసైకలోలుఁడై. 340

తే. ఇటువలె నిసర్గవైభవం బెసక మెసఁగ, శ్రీధరానీళలను గూడి శేషగరుడ
ముఖ్యదాసులఁ బ్రోచుచు ముదముఁ జెందె, నఖిలరక్షాచణుండు నారాయణుండు.

పఠనశ్రవణాది ఫలము.

తే. ఈమహాకావ్య మతిభక్తి నెవ్వఁడు విను, నతఁ డిహంబున సకలసౌఖ్యములఁ జెంది
తనివి గని యంతఁ బునరాగమనవిరహిత, శాశ్వతబ్రహ్మలోకనివాస మొందు.

సీ. ఇది త్రిలోకస్తవ్య మిది విబుధశ్రావ్య, మిది దివ్య మిది భవ్య మిది యఘవ్య
మక్షరసంభావ్య మాదికావ్యం బిది, ద్విజుఁడు పఠింప వాగ్విదుఁ డనఁదగు
క్షత్రియుండు పఠింప సర్వంసహాభర్త, యగు వైశ్యుఁడు పఠింప నమితపణ్య
ఫలశాలి యౌ శూద్రకులజుఁడు పఠియింప, వంశంబులో వాసి వన్నె గాంచు.

తే. నఖిలవేదంబులు పఠింపనగుఫలంబు, నఖిలదానంబు లొనరింపనగుఫలంబు
నఖిలతీర్థంబులను గ్రుంకనగుఫలంబు, నొదవు నిక్కథ నొక్కింత చదివినంత

క. ప్రత్యక్షంబున నానా,హత్యలు నశియించుఁ గీర్తి [illegible]
బ్రత్యక్షం బగు మోక్షము, సత్యం బీరామచరితఁ జదువుజనులకున్. 344

క. ఎందాఁకఁ జెలఁగు వేదము, లెందాఁకన్ దివిఁ జరింతు రిందుఁడు సూర్యుం
డెందాఁకఁ గులగిరులు దగు, నందాఁకం బొసఁగు నిమ్మహాకావ్య మిలన్.

శా. వైదర్భీకుచపత్త్రభంగరచనావైయాత్యసత్యారతా
హ్లాదా జాంబవతీకపోలముకురవ్యాప్రాంచన్ముఖా మిత్రవిం
దాదంతచ్ఛదచుంబనాభిరత భద్రావ్యాత్తలోలా సుదం
తాదృక్పోహన భానుజాంకతలసుప్తా లక్షణాశ్లేషణా. 346

క. శ్రీవత్సగోత్రశుభకర, శ్రీవత్స శ్రితలోదరవికౌస్తుభ సు
శ్రీవత్సరవిసహస్ర, శ్రీవత్సప్రముఖదనుజశిఖరిబలారీ. 347

మా. సరసిజదళనేత్రా చారుసౌవర్ణనేత్రా, గరుడజవనపత్త్రా కాలభిత్కాంకపత్త్రా
చరణవినతమిత్త్రా శాత్రవధ్వాంతమిత్త్రా, కరధృతఘనగోత్రా కంజవిద్వేషగోత్రా.

గద్యము. ఇది శ్రీమదసగోపాలకృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాసపన్న్య
కవిత్వవిద్యావధానాధునాతనభోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణవితీర్ణివైభ
వాధఃకృతరాజరాజరాజయోగసామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధరధరాధిపసభాం
తరస్తవనీయనయకళాయుగంధర బంధురమనీషావిశేషమంథానవసుంధరాధర
శోధితాగణితగణితశాస్త్రరత్నాకర వినయాదిగుణరత్నాకర కంకంటి వంశ
పయఃపారావారపరిపూర్ణరాకాసుధాకరాప్పయామాత్యసంక్రందననందనవిజ్ఞా
నవిభవవిజితసనందన విష్ణుమాయావిలాసాభిధానయక్షగాననిర్మాణప్రవీణతా
నిధానపాపరాజప్రధానప్రణీతం బైన శ్రీమదుత్తరరామాయణం బను మహా
కావ్యంబునందు సర్వంబును నష్టమాశ్వాసము.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రస్వామినే నమః

ఉత్తరరామాయణము సమాప్తము.



Printed at the Aananda Press, Madras.